మేధాదక్షిణామూర్తయేనమః.

# శ్రీ శంకరవిజయము

(మాధవీయమగు "సంక్షేపశంకరవిజయము"న కాంధ్రీకరణము)

ఇది

భమిడిపాటి వేంకటసుబ్రహ్మణ్యశర్మ

పరిణీతము.

—:•:—

బందరు

నేషనల్ ముద్రణాలయమునందు ముద్రితము.

1931

# విజ్ఞప్తి

శ్లో॥ ఓంనమః ప్రణవార్థాయ। శుద్ధజ్ఞానైకమూర్తయే।
నిర్మలాయ ప్రసన్నాయ। దక్షిణామూర్తయేనమః॥

శ్లో॥ మూకంకరోతి వాచాలం। పంగుంలంఘయతేగిరిం।
యత్కృపా తమహంవందే। శంకరాచార్య సద్గురుం॥

శ్లో॥ నారాయణ సమారంభాం। శంకరాచార్య మధ్యమాం।
అస్మదాచార్యపర్యంతాం। వందేగురు పరంపరాం॥

గుణక్షీర గ్రహణచణులగు సుమనఃపరమ హంసలారా!

మాచల్లపల్లి సంస్థాన విద్వద్వతంసులై యుండి యిప్పుడు కీర్తిశేషులయిన సర్వజ్ఞమూర్తులును మహాతపోనిధులునగు బ్రహ్మశ్రీ అద్దేపల్లి సోమనాథశాస్త్రులవారు మాధవీయమగు శంకరవిజయము నందెక్కుడభిమానము కలిగి యున్నద్దాని నిజాశ్రితులచేఁ బఠింపఁజేయుచుండుటఁ బ్రథమమున నదిచూడనాకవకాశముకలిగె. ఆ కోశము సంపాదించి యందలి విషయములు సంగ్రహించిన కొంత కాలమునకు శ్రీ సద్గురువరభూరికరుణాప్రసారమున దానినాంధ్రీకరించు సాహసమొందుదయించె. రసాలంకృతి నియమాదివిరహితమైయును శివగురుస్తవము వాఙ్మనఃకర్మంబులఁ బూతంబులఁ జేసి నన్నుఁ గృతార్థుం జేయునను నమ్మికతో సాక్షాచ్ఛంకరులై యగు శ్రీ జగద్గురువర్యుల సచ్చరిత్రమును శ్రీప్రసన్నేశ్వర ప్రేరణమున వ్రాయఁబూనిన నన్నుఁ దత్కృపాప్లవమూరు వత్సరములకు నాపూనిక సందర్భపుటొడ్డునఁ జేర్చెను.

నాకు లజ్జాభయంబులు నొంతు. నేనిదివ్రాయుతతి నేరికైనంజూపిన నేమగునోయను లజ్జయును నేమందురోయను భయం

గిన ధార్మికాగ్రణుల కెంతయుఁ గృతజ్ఞతా పూర్వకాభివందనము లర్పించువాఁడను. మఱియునుమునుముందుగనె గ్రంథమూల్యము నొసంగి ముద్రాలయాధికారులవలని జాలమెల్లనోర్చి వేచియున్న మిన్నల క్షమయుం బ్రశంసార్హము.

ఈ గ్రంథమునలోపము లింకేవియున్న నవి శ్రీవిద్యారణ్య గురు వరేణ్య గ్రంథస్థములని కాని యింకన్యములని కాని కోవిదులెం చక యజ్ఞుఁడనగు నావిగనెభావించి నన్ను మన్నించెదరు గావుత. ప్రామాదికములగు దోసఁగుల నేరైననా కెఱుక పఱచినచో వినయ పూర్వకముగ గ్రహించి వానింబునర్ముద్రణమున సవరించికొని యట్లు తెల్పినవారియెడ నిరంతరముఁ గృతజ్ఞుఁడ నయ్యెదనని మనవి చేయుచున్నాఁడ.

చ॥ దోసఁగులుగల్గుచోఁ దొలఁగఁ ♦ ద్రోసిగొనంబులు గల్గనేనిసం।
తసమునఁ గైకొనన్బుధవ ♦ తంసములార ! మిమున్భజింతు ని
ద్దిసుమతులైనవారలకు ♦ డీటగుబాటయెకాదె? భవ్యకో
శసమితి ధాత్రినిల్చుట ల♦ సద్దయవిజ్ఞులు సూచినంగదా !॥

మోపిదేవి
కృష్ణామండలము
1 జూలై 1931 సం॥

ఇట్లు
విద్వద్విధేయుఁడు
భమిడిపాటి వేంకటసుబ్రహ్మణ్యశర్మ.
గ్రంథకర్త.



# శుద్ధపత్రము.



| పుట | పఙ్క్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 14 | వన | నను |
| 3 | 1 | యోబ్ధి | యోధి |
| 7 | 10 | నొప్ప | నొప్పు |
| 9 | 11 | ర్మవ్రత | ర్మాప్రప్త |
| 9 | 18 | గాఁగ | దాఁగ |
| 9 | 28 | న్వీతను | న్వత్రిత |
| 10 | 11 | త్రిముల్ | త్రియై |
| 10 | 18 | ణాన్యా | ణస్థా |
| 17 | 22 | దున | దుఁడ |
| 21 | 15 | ట్యాగ్రి | ట్యాగ్రి |
| 23 | 5 | నీవ | నీద |
| 28 | 26 | నసుం | నిసుం |
| 32 | 18 | ధ్యు | ధ్య |
| 38 | 4 | ఘాల | శూల |
| 38 | 7 | నొప్ప | నొప్పు |
| 42 | 4 | యుక్త | యూక్త |
| 45 | 1 | దను | దను |
| 46 | 17 | త్న్వతా | త్న్వత |
| 50 | 20 | ఛ్చఁగణ | చ్చఁగణ |
| 50 | 22 | యూలుఁ | యూలుఁ |
| 51 | 11 | నంగ | సంగ |
| 51 | 15 | మె | లా |
| 56 | 20 | విపు | లిపు |
| 65 | 22 | కధ | కథ |
| 67 | 18 | రవ | రర |
| 71 | 4 | ణ్యమై | ణ్యమా |
| 72 | 16 | రణు | రను |
| 76 | 1 | వనా | గణా |
| 76 | 18 | తాగ | తాఙ |
| 77 | 17 | దీక్షా | వీక్షా |
| 80 | 26 | నీరదా | నీరద |
| 83 | 12 | న్విత్త | న్విత్వ |
| 91 | 8 | వేశ్యాం | వేశాం |
| 95 | 2 | ఢుల్సం | ఢున్సం |
| 95 | 4 | రహిన్భ | రహోభ |
| 98 | 1 | జ్ఞాను | జ్ఞాన్య |
| 98 | 18 | శితు | శిత |
| 102 | 12 | నఘు! | నఘు |
| 104 | 24 | నొప్ప | నొప్పు |
| 108 | 10 | జన | నిజ |
| 112 | 4 | నంతు | సంతు |
| 113 | 21 | త్తమ | త్తను |
| 116 | 18 | లంగాం | లఙ్గాం |
| 116 | 19 | తర | కర |
| 117 | 5 | ల్చేదు | ల్వేదు |
| 121 | 5 | డయ్యో | డయ్యో |
| 125 | 19 | నభా | నఖా |
| 125 | 24 | చయా | యూతా |
| 129 | 2 | సరో | శిరో |
| 129 | 10 | నమ్మ | యమ్మ |
| 130 | 13 | పథి | సుధ |
| 135 | 14 | తాలా | తారా |
| 141 | 5 | బాలిత | బావిత |
| 141 | 26 | క్షుఁద్రై | క్ష్రయై |
| 144 | 1 | దనువం | దనువం |
| 144 | 16 | కళి | కఫి |

| పుట | పఙ్క్తి | తప్పు | ఒప్పు | పుట | పఙ్క్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|---|---|---|
| 145 | 24 | తిరయు | తియు | 213 | 5 | నత | సత |
| 147 | 17 | దిష్ట | దేనో | 215 | 25 | బల | బిల |
| 152 | 6 | గరంగ | గరిగ | 216 | 19 | బజపె | బజిపి |
| 153 | 11 | గ్రంబై | ర్గ్రంబై | 219 | 7 | తిగ | తిగు |
| 156 | 26 | తార | తాప | 224 | 1 | నగ | గన |
| 160 | 2 | దాల్చె | బోల్చె | 234 | 18 | ధపు | ధింపు |
| 161 | 7 | క్షీని | క్షీణిం | 234 | 27 | రొద | రొంఢ |
| 161 | 15 | యసం | యనుం | 236 | 18 | నెంద | న నెంద |
| 163 | 25 | శత | శిత | 239 | 4 | దతీ | దిపీ |
| 163 | 25 | జయ్యన | జెచ్చర | 243 | 28 | నము | ననము |
| 165 | 22 | దత్రి | రత్రి | 247 | 25 | మహా | గహా |
| 174 | 23 | జిన | జన | 250 | 6 | గానన | గాన |
| 175 | 18 | తాశయ | తాతిశయ | 256 | 7 | జాగుగా | బాగుగా |
| 175 | 18 | యంబు | యము | 257 | 15 | దేహ | గేహ |
| 175 | 25 | నుసు | నసు | 258 | 4 | జ్ఞాన | జ్ఞాత |
| 178 | 3 | దాని | భావి | 260 | 3 | దీర్ఘ | గేహ |
| 182 | 26 | జెవ్వి | జెప్పి | 263 | 23 | సందియ | సంతస |
| 183 | 15 | నూను | నూర్ధ్వ | 268 | 27 | సార | సార |
| 191 | 17 | లనె | లవె | 270 | 5 | రంభి | రంబి |
| 192 | 2 | టెష్ఠా | చెష్టా | 274 | 15 | ంబానుర | న్మద్యము |
| 195 | 25 | పార్థ | పారార్థ | 277 | 14 | శ్వ | విశ్వ |
| 197 | 18 | పర్ణం | పర్ష్ట్రం | 277 | 17 | తత్త్వం | దత్త్వం |
| 198 | 12 | ప్రిదు | ప్రిధు | 278 | 5 | రత్వ | రత |
| 199 | 9 | మన | మద | 279 | 28 | శువ | శున |
| 199 | 17 | కయ | కరయ | 280 | 28 | మాక | మాక |
| 200 | 9 | సాథు | సాధు | 283 | 2 | కగు | తగు |
| 203 | 9 | నల్ల | యల్ల | 284 | 10 | రుద్రి | రుద్రి |
| 208 | 1 | త్నించు | త్నింతు | 288 | 14 | ధరలు | ధరులు |
| 209 | 18 | తోర్థ | తోర్ధ్వ | 288 | 21 | చెడు | చెడు |
| 210 | 1 | ణుండ | ణమ | 292 | 23 | వేవేగ | వేతేగ |
| 210 | 25 | గడు | గర | 292 | 26 | నంత | సెంత |
| 211 | 17 | హిమ | హాము | 296 | 6 | పులగ | పుంగ |
| 212 | 10 | దటణ | దటుణ | 297 | 8 | నన్న | వాండె |

| పుట | పఙ్క్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 300 | 2 | కను | జగు |
| 300 | 3 | మయి | మయు |
| 304 | 22 | లక్ష్మ్ర | లక్ష |
| 322 | 1 | దండ | దంత |
| 323 | 5 | నడి | నండి |
| 324 | 21 | ముల | బలము |
| 329 | 20 | ల్కుచు | ల్కుడు |
| 335 | 24 | నవ | నావ |
| 342 | 26 | ఘూతు | విఘూతు |
| 347 | 11 | మృన్న | మూత్రన్న |
| 348 | 21 | నెపు | నెప్పు |
| 348 | 24 | నెప్పు | నొప్పు |
| 358 | 25 | వ్రితీ | ప్రితీ |
| 359 | 3 | ధృతి | ధృతిం |
| 359 | 7 | న్నె | నె |
| 362 | 14 | డండ | డంగ |
| 370 | 17 | డెంచ | డెంచి |
| 375 | 11 | దత | వద |
| 383 | 21 | దాగ్జ | వాగ్జ |
| 386 | 27 | నాద్య | నాది |
| 387 | 27 | చినరి | చినారినం |
| 389 | 9 | దేశ | వేశ |
| 389 | 11 | నొక | నొకొ |
| 390 | 12 | ప్రమ | ప్రమ |
| 391 | 6 | నంభ్రి | సంభ్రి |
| 391 | 17 | శ్రోవు | శ్రోవులు |
| 392 | 19 | భాగ | భాగ్య |
| 396 | 26 | నొ | నెంచనొ |



# ఆంధ్రీకృత శంకరవిజయమును గూర్చి

# పండితాభిప్రాయములు



40 ఏండ్లనుండి శ్రీశంకర ప్రతిష్ఠ లెన్నియో చేయించి తద్విజయధ్వజమును ధరించి యీగ్రంథపీఠికయం దెన్నఁబడియున్న

## శ్రీ శ్రీ శ్రీ బ్రహ్మానందసరస్వతీ స్వాములవారు — కాశీ.

నాదెళ్ల పురుషోత్తమశాస్త్రులు గారికి ... మీ ఆశీర్వచన పాత్రుఁడగు భమిడిపాటి వేంకట సుబ్రహ్మణ్యశర్మగారిచే రచింపబడి మీకుమారునిచే పరిశోధింపబడి శ్లాఘింపబడిన శ్రీమచ్ఛంకరవిజయ గ్రంథరాజమును పంపినందులకు నేను మిగుల సంతసించి నాశక్తికి దగినటుల నభిప్రాయము వ్రాసిపంపుచున్నాను... ఇహపరసాధనమగు గురుభక్తి నభివృద్ధినొందించుటకు అద్వైతవిశిష్టాద్వైతద్వైత మతాచార్యులు క్రమముగా నవతరించిరి. ఆంధ్రులుమాత్రము తమ మతోద్ధారకులగు శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్యులవారి దిగ్విజయ చరిత్రమును పఠించుట, తన్మూర్తిని పూజించుట, తద్వర్ధంతిని జరుపుట మాని గురుభక్తికి దూరులయిరి. ఈకొఱతను దొలగించుటకై పూర్వము కొక్కొండ వేంకటరత్నశర్మ గారు ఆంధ్రమున వచనకావ్యముగ రచియించి సంస్కృతభాషానభిజ్ఞులకు మహోపకారమును జేసిరి. ప్రకృతమున భమిడిపాటి వేంకటసుబ్రహ్మణ్యశర్మ గారు గురుభక్తితో శ్రీమచ్ఛంకర విజయమును మృదుమధుర వాగ్ఫణితముగ పద్యాత్మకముగ రచియించి ముద్రింపించిన గ్రంథమును జూచి మిగుల నానందించినవాఁడనై శ్రీమచ్ఛంకరభగవత్పాదాచార్యుల గ్రంథమున చతుర్విధ పురుషార్థసిద్ధి నొందుగాతమని యనేక నారాయణ స్మరణములను జేయుచున్నవాఁడను.

---

గ్రంథకర్తృ విద్యాగురువులు

## 2. శ్రీ కుప్పా వేంకటేశ్వరశాస్త్రులుగారు — అనంతవరము.

నేను మీగ్రామము వచ్చినప్పు డిందలి ప్రథమాశ్వాసమును సాకల్యముగా పరీక్షితిని సంప్రదాయశుద్ధమైన యాంధ్రీకరణమునకు మృదుమధురమైన గ్రంథశైలికి నానందించితి గాని కవితారచనయందు నూతనప్రయత్నముకలవాఁడవగుటచే శాస్త్రార్థ ఘట్టముల నెట్లు రచింపగలవోయని యనుకొంటిని. ఇప్పుడు కొన్ని ఘట్టముల జూచితి. సంస్కృత శంకరవిజయమున నున్న సర్వవిషయముల చక్కగ దెలిగించుచు నచ్చటచ్చట వ్యాఖ్యానమున విమర్శించిన విశేషములగూడ నీగ్రంథమున రచించుటచే నీశంకరవిజయము విద్వదామోదపాత్రమై యాంధ్రదేశమునకు మహోపకార మొనర్పగలదనుట యతిశయోక్తి కాజాలదని తలంచుచున్నాఁడను.

---

సరసచతుర్విధ కవితాసామ్రాజ్య ధురంధరులు

### 3. శ్రీ నాదెళ్ల పురుషోత్తమశాస్త్రులుగారు — మచిలీపట్టణము

ఉత్సాహము- పూర్వపుణ్యమునను గవిగఁబుట్టి మొట్టమొదటనే। సర్వపూజ్యమైన మేటి శంకరార్యచరితఁ దా। నిర్వహింప బుద్ధిపుట్టనెగ్గ నారచోద్యమా। నుర్విశుభసుఖంబులందుమంచు వంశవృద్ధితోన్॥ కం॥ ఆరంభకవనమైయును సారంబు సలక్షణతయు సాహిత్యంబు। న్నారాశుద్ధియు నోరుపు। మీఱంబనిపూర్తి సేఁత మేల్మేలననా॥ తే-గీ॥ భమిడిపాటి సుబ్రహ్మణ్య బాలకవిర। చితము శంకరవిజయ మంచిత ముచితము। తనరుఁదత్కృతి యాచంద్రతారకముగ। ననెడు నాదెళ్ల పురుషోత్తమాఖ్యుఁడాప్త॥

---

శ్రీ కింకవీంద్రఘటాపంచానన విద్వత్కవి బాలకలానిధి బాలసరస్వతీ శతావధానులు

### 4. శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రులుగారు — కడియము.

భవద్విరచిత శంకరవిజయము నక్కడక్కడఁ జదివినాఁడను. చక్కని ధారకలిగి యున్నది, ప్రథమ ప్రయత్నమైనను లాక్షణిక సమయానుసారిగా హృద్యముగా నుండుట మిక్కిలి ప్రశంసనీయము. అందు మొదట చిరంజీవి మా దక్షిణామూర్తి వ్రాసిన పీఠిక సవిమర్శముగాఁ బ్రత్యక్షర పరిశోధనముగాఁ జదివినాఁడను. గ్రంథమునందలి విశేషావిశేషములనుగూర్చి యతఁడు విస్తరించి వివరించినాఁడు. కావున నితరులద్దానిం గుఱించి వివరింపఁబనిలేదు. భగవంతుఁడు మీకిట్టి సద్గ్రంథరచనకుఁ బ్రోత్సాహకుఁడై యాయురారోగ్య భాగ్యప్రదాతయగుఁగాక

---

వైయాకరణశిరోభూషణులు, మహామహోపాధ్యాయులు

### 5. శ్రీ తాతా సుబ్బారాయశాస్త్రులుగారు — విజయనగరము.

తాము రచించిన యాంధ్రశంకరవిజయగ్రంథము ననేకభాగముల ముఖ్యముగ శాస్త్రచర్చలు కలవానిని జూచితిని. అట్టి విషయమును సంస్కృతమున రచియించుట శ్రీ మాధవాచార్యులవారికే తగియున్నది. ఆవిషయములలో దమరు సిద్ధాంతభంగము రాకుండ నాంధ్రీకరించి నందులకు మిగుల సంతసించితిని. కావ్యరూపమున శాంకరసిద్ధాంతమును వెలువరించు గ్రంథమాంధ్రమున లేదు. ఆకొఱతనుదీర్చి తమరాంధ్రభాషా సేవను జేసినందులకు గృతజ్ఞుడను. విషయ కాఠిన్యమును బట్టి కొంతవఱకు నారికేళపాకముగా నున్నను విషయపరిజ్ఞానము గలవారికి సంతోషదాయకముగా నుండునని నావిశ్వాసము. తమరీవిధముగ నింకను ఆంధ్రభాషాసేవ చేయునట్లుల భగవంతుడనుగ్రహించుగాక.

---

కుమారాభ్యుదయాంధ్ర వాల్మీకిరామాయణాద్యనేక గ్రంథకర్తలు,

### 6. శ్రీ వావిలికొలను సుబ్బారావుపంతులుగారు — చుండూరు.

తమరు నాయందలి యనుగ్రహమునఁబంపిన భవద్విరచిత శ్రీ శంకరవిజయము శిరసావహించి గ్రహించితిని. ఇట్టిగ్రంథ మాంధ్రులకత్యంతావశ్యకమై

గవర్నమెంటు గర్లుస్ హైస్కూలు పండితులు, వైయాకరణులు

## 10. శ్రీ కొత్తూరి వేంకటశాస్త్రులుగారు—మచిలీపట్టణము.

క॥ శంకరపదకమలార్చన। సంకలితా భమిడిపాటి సత్కులజాతా। వేంకట సుబ్రహ్మణ్యా। శంకరవిజయానురచన సఫలసుజన్మా॥ చ॥ పరమపవిత్రముం గలుషభంజకముం బరిశుద్ధమున్మనో। హరమును నౌచు గాంగఝరమట్టు లెసంగదు తావకాంధ్ర శం। కరవిజయాఖ్య సత్కృతిప్రగల్భ కవీశ శిరోవధార్యమై। వరఁగు భవద్యశోవిశదభానుదచంద్రికలాకలాపమై॥ ఉ॥ మూర్తినిగొన్న వేదతతిఁ బోలెడు శంకరుగాథ బుద్ధవి। స్ఫూర్తి మతంబులన్విబుధపూజ్యుఁడు మాధవునాద్యసత్కృతిం। గీర్తితకీర్తి దానిఁ దెలిఁగించిన యంశముఁ దెల్పుదక్షిణా। మూర్తి సుధీంద్రసంగ్రథితముం గన నచ్చెరువయ్యెఁ బీఠికన్॥ ఆ॥వె॥ కుందనమునఁ బొదుగ నందమౌ కురువింద। కందళంబుభంగిఁ గ్రాలుమండు। ఘనమనీషి రంజకంబైన పీఠిక। భవ్య తావక ప్రబంధమునకు॥

---

గీర్వాణాంధ్రపాఠశాలాసాహిత్యోపాధ్యాయులు, శతావధానులు

## 11. శ్రీ అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రులుగారు—కొవ్వూరు

సంస్కృతాంధ్రభాషా రచనలు జటిలముగఁగూడ శంకర విజయము తెలుఁగుసేఁత తెలుఁగువారికుపయుక్తమగుపని. మహాపురుషులగు శ్రీజగద్గురు శంకరాచార్యుల వృత్తాంత మీపాత్రమునంజేసి యాంధ్రలోకమున మిగుల వెల్లడి గాంచును. శాస్త్రీయసందర్భములతోఁ గూడిన దీనిని దెలుఁగునవ్రాసి శ్రమపడిన యీకవివర్యు లాంధ్రుల కృతజ్ఞతకుఁ బాత్రులని నాయాశయము.

---

బ్రహ్మాండపురాణాది గ్రంథకర్తలగు కావ్యస్మృతితీర్థ బిరుదాంకితులు

## 12. శ్రీ జనమంచి శేషాద్రిశర్మగారు — కడప.

తమరు దయాపూర్వకముగా నొసిపిన శ్రీశంకరవిజయమును బరమాదరమున శిరసావహించి ధన్యుఁడనైతినని తలంచుచు నాయెంచెంగిన తావులఁ బఠించితిని, బ్రహ్మశ్రీ నాదెళ్ల మేధాదక్షిణామూర్తిశాస్త్రిగారి పీఠికయుఁ బఠించితిని. బ్రహ్మశ్రీ భమిడిపాటి వేంకటసుబ్రహ్మణ్యశర్మగారు శ్రమించి యాంధ్రీకరించి రనుట నిస్సంశయము. పరివర్తనము నాయెంచెంగినంతవఱక బాగున్నది. కొన్ని తావుల మూలాగ్రమును బెంచియుఁ గొన్నితావుల సంగ్రహించియుఁ దెనిఁగించిరి ఇది సనాతనాచారము. ఏయేతావుల విస్తృతముగా వ్రాయింపవలయునో యెందెందు సంగ్రహింపవలయునో కవిహృదయమె యద్దానిని నిర్ణయించుకొనును. కవిత్వము ముద్దులు మూటగట్టుచున్నయట్లున్నయది. శైలి సులభముగానున్నది. ఎందో సమాసభూయిష్ఠముగానున్నను, ప్రాయశః సర్వజన సుబోధముగా నున్నదని నా దృఢవిశ్వాసము. ఇక్కార్యమొనర్చించి గ్రంథకర్తగారు ధన్యులైరి. ఇట్టి యుత్తమగ్రంథముల రచించుమహాభాగ్యమీ గ్రంథకర్తలకుంగల్గినది. అదియే వీరు ధన్యులని వేనోళ్లఁ జాటుచున్నది. ఇఁక నిందలి పీఠికఁగూర్చి:— బ్రహ్మశ్రీ

శాస్త్రిగారు చక్కని పీఠికవ్రాయించిరి. గ్రంథమును బలుసారులు పఠించిరి. విశేషాంశములఁ బరికించిరి. మంచిశైలితో వ్రాసిరి. శ్రీశంకర భగవత్పాదులవారింగూర్చి యనేకాంశములం దెలిపిరి, ఎల్లరు కృతార్థులు గావలయునను వీరి సంకల్పము ఫలించునదియే. మతముల సంగ్రహించి తెలుపు తావుల వీరి నిష్పక్షపాతిత్వము స్పష్టమయ్యెను. గ్రంథమునకీపీఠిక యనుకూలముగాఁ గుదిరి బంగారునకు వెలిగారమునకుఁగల సంబంధమును స్మరింపఁజేయుచున్నది. ఇంక శ్రీశంకరాచార్యుల జననకాలనిర్ణయమున ననేకసంశయము లున్నవి. వానిని పడినంతదనుక వీరు మంచిమార్గము నవలంబించిరి. అంతకంటె శ్రమంపడ వలనుపడదని నేనెఱుంగుదును. ఈగ్రంథ మాంధ్రమండలముల వ్యాపించి గురుభక్తి నెలకొల్పుఁగాక.

---

భోగీశ్వర సత్యవత్యుపాఖ్యానాద్యనేక గ్రంథకర్తలు,

## 13. శ్రీమల్లంపల్లి మల్లికార్జునారాధ్యులుగారు — పుల్లేటికుఱ్ఱు.

కం॥ వేంకటసుబ్రహ్మణ్యుల । శంకరవిజయంబు మిగుల సంతసమొసఁగెన్।
శంకరకృప నానూర్యశ । శాంకం బకళంకమగుచు నలరు జయమునన్॥
కం॥ శంకరుఁడా! కృతినాథుఁడు । శంకరవిజయంబ! కృతికి సంజ్ఞ యయమా।
శంకరవిజయంబా! భళి । వేంకటకవి పుణ్యమేమొ చెప్పఁగనవశమే?॥
తే॥గీ॥ సరసపదసద్గుణాంచిత సాధువృత్త। సకలశుభలక్షణోపేత సత్స్వభావ।
భమిడిపాటి వేంకటకవి బ్రహ్మకవిత। అరయ నెవ్వారినలరింప దవనిన హహ?
తే॥గీ॥ దక్షిణామూర్తికృపఁజూచి తగినపీఠ। మునఁబ్రతిష్ఠించె మీకవితనుఁగవీంద్ర।
కృతివిభుఁడుగూర్మి మీకుమీకృతికుమీరి। కాయురైశ్వర్యవృద్ధులనమరఁగూర్చు
శ్లో॥ అస్మాకమపియుష్మాకం। దేశికాః పురుషోత్తమాః। తత్ప్రసాద లవోభూయో భూయోభూయాదభీష్టదః॥

---

నాగరఖండాద్యనేక గ్రంథకర్తలు, అభినవసరస్వతీ పత్త్రికాధిపతులు,

## 14. శ్రీజానపాటి పట్టాభిరామశాస్త్రిలుగారు — జానపాడు.

తెనిఁగించిన మీ శంకరవిజయము మాయభినవసరస్వతీ కార్యాలయము నలంకరించినది. అత్యంతశ్రద్ధతో శ్రీమేధాదక్షిణామూర్తిశాస్త్రిగారి పీఠిక సమగ్రముగఁజదివి పదింటికి రెండుపుటలుచొప్పున గ్రంథమంతయుం జదివితిని. తర్కమీమాంసాదిశాస్త్రపరిచయముతోఁ జక్కని సాహిత్యముతో నవగాహన చేసికొనఁదగిన విద్యారణ్యకృత శంకరవిజయమును సరిగా నాంధ్రీకరించియు విజ్ఞప్తిలో మీరుచూపిన వినయమున కచ్చెరువందితిని. "నమంతి సంతస్త్రైలోక్యాదపి లబ్ధుంసమున్నతి" మను నభియుక్తోక్తి మీయెడ బాగుగాఁబట్టినది. మీగ్రంథములో నాకు దోషములై కనుపట్టినవికావు. మీగ్రంథమునకు మేధాదక్షిణామూర్తిశాస్త్రిగారి పీఠిక మఱింతవన్నెఁదెచ్చినది. శ్రీశాస్త్రిగారి పిత్ప

పాదులగు పురుషోత్తమశాస్త్రులవారి సహాయముంగూడ నేతద్గ్రంథరచనయందు
మీకుండవచ్చును. కనుకనే వారి యద్భుతోత్తరరామాయణమును బోలియు
న్నట్లు కనఁబడెడిని. వేయేల? మీగ్రంథము భాగవతాదులంబోలె సామాన్యు
లగు చదువరులకు వేగముగా సుబోధమగు నడకగలదిగానున్నను ఛందస్సాహితీ
ధురంధరుల కత్యంతామోదము గలిగించుటకు సంశయముండదని నాతలంపు.

---

మహారాజ కళాశాలాంధ్ర గీర్వాణోపాధ్యాయులు దేవవ్రతచరిత్రాది కర్తలు

## 15. శ్రీ మేడేపల్లి వేంకటరమణాచార్యులవారు — విజయనగరము.

మయాయం గ్రంథ ఆమూలాగ్రం మాతృకాం నికషేనిధాయాపాఠి.
మాతృకామనుసర త్యాంధ్రీకరణమితి మే నిశ్చయః. కవితా శైలీ సంస్కృతపద
భూయిష్ఠానిర్దుష్టాచ. విచిత్రాపిస్ఖాలిత్య గంధోకుత్రాపిన దృశ్యతే. బృహదుపాధి
పరీక్షార్థం పఠనీయేషు గ్రంథేష్వయమగ్ర్యతమ ఇతి మే మనీషా.

---

గీర్వాణాంధ్రకవివరులు బహుగ్రంథకర్తలు విమర్శకులు న్యాయవాదులు.

## 16. శ్రీ నాగపూడి కుప్పుస్వామయ్యగారు బి.ఏ.—తిరుపతి.

భవద్విరచితాంధ్ర శంకరవిజయమున నందందుఁగాంచి యంచితామోద
మానసుండనయితి. క్రైతసేఁతకిది తొల్తటి జతనంబని మీరు వ్రాసినారు
కావునఁ బ్రథమకవిత్వమే యిట్లు సొంపుగా నుండ నుత్తరకాలంబున మీరచన
లెంతటి ప్రౌఢముగానుండునో యెఱుంగరాదనితోఁచెడు. మీకవిత్వము ధారా
ళంబగు ధారాశుద్ధిగలిగి లలితప్రౌఢరచనల నొప్పారుచున్నయది. అందందు
మనోహరములగు వర్ణనలును చిత్రరచనలును గానంబడియెడు. కేవల శాస్త్ర
చర్చావిషయకములగు పట్టులును యథామూలంబుగ నాంధ్రీకరింపఁబడినవి. కవి
వతంసులగు శ్రీనాదెళ్ల మేధాదక్షిణామూర్తిశాస్త్రులుగారు వ్రాసిన పీఠిక
నిష్పక్షపాతముగాను సమంజసముగాను నున్నది. నవలలు మొదలగు పొత్తముల
మొత్తములు కుప్పలుగానుప్పతిల్లు నిక్కాలంబున నీగ్రంథము కథ్యమానవిషయ
ములంబట్టియు సురుచిరశైలింబట్టియుఁ బీఠికాకారులు నుడివినవడువున నుత్తమ
కావ్యములలో నొకటిగ నెన్నఁదగియున్నది. కవిత్వశక్తితో నీశ్వరగురుభక్తి
యొదవుట మేలిపసిండికి నెత్తావి యమరినచందమునఁ గొమరారు.

చ॥ సరసపదార్థసంగతుల సంస్కృతభాషను జెన్నుమీఱు శం। కరవిజ
యంబు ప్రౌఢతరకావ్యము దానినెఱుంగు టెంతొ దు। ష్కరమయిన న్మనోజ్ఞమగు
శైలిని బండితులాదరించున। ట్లరుదుగ దాని మీరలిటు లాంధ్రము సేఁత నుతింపఁ
గాఁదగుఁ॥ చ॥ మతిఁదలఁపంగ నబ్బురమమందముగా నొదవుం గవిత్వని। ర్మితికిది
యాదియత్నమని మీరువచించెదరట్టులైయుఁ బం। డితజనసమ్మతంబుగఁ బటిష్ఠత
మీఱఁగఁ గావ్యమున్ రచిం। చితిరి బుధుల్ మిము న్వినుతిసేయఁగఁ బోలును నాంధ్ర
వ్యుష్టలిఁ॥ శా॥ ద్వైతభ్రాంతితమః ప్రభాకరము భక్తవ్రాత మోహాపహా।

ద్వైతజ్ఞాననిధిప్రదంబు భవబంధచ్ఛేదదక్షంబరి। త్రితం బాతకహరంబు శంకరగురు ధ్యానంబు మీరెంతయుం। జేతఃప్రీతిగ వ్రాసి తత్కథలవాసిం గాంచి నారిమ్మహిన్॥
కం॥ దురితాజ్ఞానతిమిరభా। స్కరమపవర్గప్రదంబు శంకరభగవ। చ్చరణస్మరణము తద్గురు। చరితాఖ్యానంబుగూర్చు సకలశుభంబుల్॥ కం॥ శంకరమును సంస్కృతినా। శంకరమునునైన గురుని చారిత్రంబు। న్శంకరపదపంకజముల। కంకితమొనరించుటది సమంచితమకదా॥ కం॥ దిటవున శంకరవిజయముఁ। బటురచనలనుడివి భమిడిపాట్యన్వయ ధూ। ర్జటిపదభజన నిరత వేం। కటసుబ్రహ్మణ్యానామ కవి కృతియయ్యెన్॥

---

శ్రీ గౌరాంగ రామకృష్ణ పరమహంసచరిత్రాద్యనేక గ్రంథకర్తలు
17. శ్రీ కూచి నరసింహముపంతులుగారు బి.ఏ.ఎల్.టి. పిఠాపురము.

తమరు దయతోఁ బంపిన యాంధ్రీకృత శంకరవిజయమందినది. అనారోగ్యస్థితిలో నుండుటచేతఁ దమగ్రంథమచ్చటచ్చటఁ గొన్ని పద్యములుమాత్రమే చదివి చూడఁగలిగితిని. ఇది తమ ప్రథమప్రయత్నమయినను నేఁజదివిన పద్యములలోని కవితాధార చక్కఁగాను హృద్యముగానున్నది.

---

సంగీతసాహిత్య కవితాపారీణ వేదాంతభావ్యభావనా పరాయణ వాగ్గేయకారక బిరుదవిరాజితులు, శంకరకథాదిగ్రంథ రచయితలు, న్యాయవాదులు,
18. హరి నాగభూషణముగారు బి.ఏ. — మచిలీపట్టణము.

బ్రహ్మశ్రీ భమిడిపాటి వేంకటసుబ్రహ్మణ్యశర్మగారు విరచించిన శ్రీశంకరవిజయ మటనట నవలోకించితిని. ఇయ్యది మాధవాచార్య కృతమున కనువాదము. శ్రీవిద్యారణ్యాపర నామధేయులగు శ్రీమాధవాచార్యులు శ్రీశంకరాచార్యునపరావతారముగ నెఱుంగఁబడు మహామహుఁడు. ఉత్తమకావ్య నాటకాలంకార విద్యాభ్యాసకులు పఠించి యత్యుత్తమ సాహిత్యసంపద నందుటకును పౌరాణికులు పురాణంబుగఁ బఠనశ్రవణములొనర్చి కృతకృత్యులగుటకును ముముక్షువులు గురుకథాముఖంబున సమస్తవేదాంతసిద్ధాంతములఁ గరతలామలకంబులొనర్చికొని స్వస్వరూపానందావిర్భావ భాసమానులగుటకును శ్రీమాధవాచార్యులు సంస్తూయమాన శయ్యాపాకంబులతో శాస్త్రవిషయంబులను బ్రదర్శించుచు శ్రీశంకరవిజయగ్రంథమును రచించి లోకసంగ్రహ మొనర్చియుండిరి. ఇట్టిగ్రంథమాంధ్రీకరించుటయన్న సామాన్యమేధావులకగు కార్యంబుగాదు. ఇట్టిచోఁ బనిఁబూని గ్రంథమంతయు నిర్వహించుట ననేకవిధంబులఁ బ్రస్తుతిఁజేయఁదగియున్నది. సామాన్యదురవగాహంబగు నిది పరివర్తనమొందుట యాస్తికులకు మిగుల సంతోషావహమే. దీన శ్రీమజ్జగద్గురుని దివ్యచరిత్ర మందఱును బఠించి కృతార్థులుగాఁగలరు. ఈగ్రంథరచనమును గూర్చియు శైలి మున్నగువానిం గూర్చియు గ్రంథపరిశోధకులును టీకాకారచయితలు నగు బ్ర॥ నాదెళ్ల మేధాదక్షిణామూర్తిశాస్త్రిగారు విపులముగఁ జర్చించి న్యాయవిమర్శనముఁ గావించి

శ్రీకృష్ణ భారతకర్తలు, బహుప్రబంధరచయితలు కవిసార్వభౌమ బిరుదాభిరాములు.

20. శ్రీశ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిలుగారు—

రాజమహేంద్రవరము.

ఇది శ్రీవిద్యారణ్య మాధవాచార్య కృత శంకరవిజయమున కాంధ్రీకరణము. బ్ర. భమిడిపాటి వేంకటసుబ్రహ్మణ్యశర్మ ప్రణీతము, పదియాశ్వాసముల పెద్దగ్రంథము. దీనికి బ్ర. నాదెళ్ళ మేధాదక్షిణామూర్తిశాస్త్రిగారు మంచి పీఠిక వ్రాసినారు. దాన నీగ్రంథ ప్రాశస్త్యము లోకవిదితముకాఁగలదు. నేనిందక్కడక్కడఁ గొన్నికొన్ని భాగములు చదివినాఁడను. కవిత్వ మతి సులభమనికాని, అతికఠినమనికాని చెప్పుటకు వలనుపడదు. సమయోచితముగాఁ గూర్పఁబడినది. కవి వైదికసంపత్తికల పండితవంశమం దుదయించినవాఁడగుట చేతను సంస్కృతము మిక్కిలిగాఁ జదివినవాఁడగుట చేతను సంస్కృత పదములే యిందుఁ దఱచుగా వాడఁబడినవి. ఇది గుణమెకాని దోషముకాదు. నేను నా మొదటికవిత్వమం దిటులే వాడితిని. రానురాను దెలుఁగే ప్రాధాన్యము నొందె. ఇక్కవి కవిత్వము నిర్దుష్టమెకావచ్చును. ఇందెక్కడనే నొక్కొకచో నతి స్వల్పదోషములున్నను, గవిత్వము మృదుమధురముగా మనోహరముగా నున్నదని చెప్పుటకు సందేహమక్కఱలేదు. సకల జగద్గురువైన శంకరభగవత్పాదాచార్యుని చరిత్రమిట్లు రచించుటంజేసి కవిజన్మము సార్థకమైనదని నేనిట వేఱ వ్రాయనవసరములేదు. నాకు నెన్నియోనాళ్ళనుండి శంకరవిజయము వ్రాయ వలయునని సంకల్పము కలిగియున్నది. కాని సిద్ధింపలేదు. నేను రచింపకున్నను మావెలనాఁటి వైదికుఁడును, మాయాయజుశ్శాఖాన్వయ సంభవుఁడును, మాగోత్ర సంబంధియు విశేషించి మాభావుకుల (నాదెళ్ల పురుషోత్తమశాస్త్రులుగారి)ప్రియ శిష్యుఁడు నగు నావాఁడు రచించి నాఁడుకావున నిది నేను రచించినట్లే సంతసించుచు నీగ్రంథము సర్వలోక సమాదరణీయంబై విరాజిల్లుఁగావుత మని కోరుచున్నాను.

---

ఉభయభాషాకవులు, విమర్శకులు,

## 21. శ్రీరాళ్లపల్లి అనంతకృష్ణ శర్మగారు—మైసూరు.

నాదెళ్ల మేధాదక్షిణామూర్తిశాస్త్రిగారికి నమస్కారములు. నావిలంబము మన్నింపఁగోరెదను. తాము నన్ను జ్ఞప్తియుంచుకొని ప్రియముతోఁ బంపిన 'శంకర విజయము' సౌభాగ్యతయందు మాత్రమే కాక ప్రమాణమందును గొప్పది. ... చదివినంతలో శ్రీ వేంకట సుబ్రహ్మణ్యముగారికి విద్యాగోష్ఠి చాల మెండుగా నున్నది. ఆడంబరములును అవకతవకలును లేవు. ధారాళమైన నడక. సంస్కృతము నుండి ఆంధ్రీకరించుటయే చాలకఠినము. అందును మాధవాచార్యులవంటి సర్వతంత్రస్వతంత్రుల గ్రంథములను దెనిఁగింపఁజేయువేయుట చిన్నసాహసము గాదు. శ్రీశర్మగారు ఈ కార్యమును జాల సమర్థతతో ఓర్పుతో నిర్వహించినారనుటలో సందేహము లేదు. ఇంతకన్న నెక్కువమీకు మనవిచేయఁజాలను. మన్నింపవేఁడెద.

---

అవధాని శిరోమణులు, గోష్ఠీవన మాహాత్మ్యాది ప్రబంధకర్తలు తర్క వ్యాకరణాది శాస్త్రప్రవీణులు,

## 22. మధ్వశ్రీ కాశీ కృష్ణాచార్యులుగారు—గుంటూరు.

బ్రహ్మశ్రీ భమిడిపాటి వేంకట సుబ్రహ్మణ్య శర్మాంధ్రీకృతమగు "శ్రీ శంకర విజయము" నాకడకు వచ్చి బహుకాలమైనది. గ్రంథమా, నన్నూటయెనిమిది పుటలు కలది. నేనా, ప్రత్యక్షర పరిశీలనముగాఁ జదువ నభిప్రాయమును సూచించు స్వభావము కలవాఁడను గాను. నాయవకాశమా, చాల తక్కువ. అందుచే నీయుత్తరమున కింత యాలస్యము పట్టినది. గ్రంథము నిర్దుష్టముగ మృదుమధురశైలిచే నలరారుచున్నది. గురువిషయకమగుటంజేసి యుభయలోక ఫలసాధక మనక తప్పదు.

మఱియు, శ్రీమేధాదక్షిణామూర్తి విరచితమగు టీకపయి నాధారపడియుండ నీగ్రంథమునం దెవరాదరణము చూపరు ?

---



భమిడిపాటి వేంకటసుబ్రహ్మణ్య శర్మ

(శ్రీ మదాంధ్ర శంకర విజయ గ్రంథ కర్త)

# విషయ సూచిక.




విషయము. — పుటసంఖ్య

## ప్రథమాశ్వాసము.

గురు స్తుతి — 2
అవతారిక — 4
కవివంశ వృత్తాంతము — 7
షష్ఠ్యంతములు — 10
శ్రీ శంకరు దర్శింప కైలాసమునకు దేవతలేగుట — 12
శంకరుడు దేవతల కభయ మొసగుట — 14
కుమారస్వామి భట్టపాదుడై సుధన్వకడ బౌద్ధుల గెల్చుట — 16
భట్టపాదుఁడు వేదమార్గ స్థాపనకై గిరినుండి దూకుట — 17
సుధన్వుడు బౌద్ధుల ప్రేరణ నుభయవాదులబరీక్షించుట — 18
భట్టపాదు జయమునకు మెచ్చి రాజు బౌద్ధనిగ్రహ మొనర్చుట — 19

## ద్వితీయాశ్వాసము.

కాలట్యగ్రహారస్థ విద్యాధి రాజవైభవము — 21
శివగురు విద్యాభ్యాసము — 22
దేశికుండు శివగురుం గార్హస్థ్యము గొనుమనుట — 22
శివగురువు గురునితో గార్హస్థ్య మొల్లననుట — 23
తండ్రి కొమరుని బుద్ధి మరల్ప నింటికిం గొంపోవుట — 25
శివగురు వివాహ ప్రయత్నము — 26
శివగురు వివాహ మహోత్సవము — 27
శివగురుని గార్హస్థ్యము — 30
శివగురుడు సత్పుత్త్రాభావమునకుం గుందుట — 31
శివగురువు భార్యతో వృషశైలమున శివు నారాధించుట } — 32
శంకరుడు శివగురునికి స్వప్నమున వరమిచ్చుట }
సతీమణి దోహదాభివర్ణనము — 33
శ్రీ శంకర భగవత్పాదావతారము — 35
శ్రీ శంకర శైశవాభివర్ణనము — 37

## తృతీయాశ్వాసము.


మాహిష్మతీ పురవర్ణనము 42
మండన మిశ్రవృత్తము 43
ఉభయ భారతీమండన మిశ్ర పూర్వోదయము 44
మండనమిశ్ర జనకుడు కన్యావరణమునకు జని చూచుట } 46
ఉభయభారతీ జననీ జనక పర్యాలోచనము }
మండనమిశ్ర వివాహ ప్రయత్నము 49
ఉభయభారతీ మండనమిశ్ర పరిణయము 51


## చతుర్థాశ్వాసము.


శ్రీ శంకర బాల్యాభివర్ణనము. 56
శంకర పితృవియోగము 57
శ్రీ శంకరు గురు కులవాసము 60
శంకరుడు దరిద్రసతీ నిలయమునకు భిక్షకేగుట 61
ఆమలక గ్రహణానంతర లక్ష్మీ స్తవము 62
లక్ష్మీ సాక్షాత్కారము 63
శ్రీ శంకర భగవత్పాదాభి వర్ణనము 65
తన్మహిమ వివరణము 70


## పంచమాశ్వాసము.


శంకరుడు పూర్ణానది నింటిదరికి దెచ్చుట 80
కేరళప్రభుడు శ్రీశంకరు దర్శించి వినుతించుట 82
అగస్త్యాదిమునులు శ్రీశంకరు జూడవచ్చుట 85
అగస్త్యుడు శంకరావతార పూర్వోత్తరముగ్గడించుట 86
శంకరు సన్న్యాసోన్ముఖుడగుచు జననినాశ్వాసించుట 87
శంకరుడు సన్న్యసింప జనని నొడబఱచినప్రకారము 88
శంకరకృతికృష్ణ విగ్రహోద్ధరణము 91
శంకరుడాశ్రమ లాంఛితుడై గోవిందతీర్థు సన్నిధికేగుట 92
గోవిందతీర్థకృత శుశ్రూష 93
వర్షర్తువర్ణనము 98
యతిగురువానతిని గాశికేగుట 103
శ్రీవిశ్వేశ్వరస్తుతి 105
అన్నపూర్ణాస్తవము 107

బిందుమాధవాభినందనము 109
డుంఠివిఘ్నేశ్వరవినుతి 111
ఒక విప్రకుమారుడు శంకరుఁగోరి యతియగుట 113
చండాలురూపున శివుఁడు శంకరు నెదుర్కొని పరికించుట 117
ప్రత్యక్షమైన శివుని శంకరుఁడు పొగడుట 119
బ్రహ్మసూత్రభాష్యనిర్మాణమునకై శివుఁడాజ్ఞాపించుట 120
శంకరుఁడు బదరికావనమునకరిగి భాష్యాలువ్రాయుట 121
శంకరశిష్యుఁడౌ సనందనుఁడు పద్మపాదుఁడైనవిధము 123
పాశుపతమతస్థులకు వేదవిహిత సమాధానాలు చెప్పుట 124
శంకరభాష్యప్రశస్త్యాభివర్ణనము 126

## షష్ఠాశ్వసము.

వృద్ధబ్రాహ్మణుఁడయి వ్యాసుఁడు శంకరుం బరీక్షించుట 132
భాష్యపరిశీలనానంతరమున వ్యాసుఁడు శంకరుం బొగడుట 138
వ్యాసుఁడు శంకరునకింక బదారేండ్లాయువిచ్చుట 140
శంకరుఁడు కుమారిలభట్టును జయింపజనుట 141
కుమారిలుఁడను భట్టపదుఁడు తన్నుదరింపజేయ శంకరుఁగోరుట 144
భట్టపాదుఁడు శంకరునికి మండనమిశ్రు జయించు పనిగల్పించుట 149

## సప్తమాశ్వాసము.

శంకరుఁడు మండనుగెల్వ మాహిష్మతీపురి కరుగుట 151
శంకరమండన సంవాదము 154
సూర్యాస్తమయ వర్ణనము 159
ప్రభాత కాలవర్ణనము 160
సరస్వతీసాక్షిక శంకరమండనమిశ్ర వాదోపక్రమము 161
శ్రీశంకరమండనమిశ్రుల సంవాదము 164
మండనమిశ్ర పరాజయము 169
మండనమిశ్రునకు శంకరుఁడు జైమినీయేంగితము తెల్పుట 170
జైమిని ప్రసన్నుడై శంకరుపల్కులు సార్థకములనుట 173
జైమిన్యుపదేశమున శంకతీఱిమండనుఁడు శంకరు నుతించుట 174
ఉభయభారతి శంకరుతోఁ దనభావిదశ దెల్పి వాదాభిముఖియగుట 177
ఉభయభారతి శంకరుతోడి వివాదమున గళాస్థానము లడుగుట 180
శారదను శంకరుఁడు గడువడుగుట }
అమరకరాణ్మృత కళేబరమునఁజేర శంకరుఁడు పద్మపదుతో ననుట } 181

| | |
|---|---|
| పద్మపాదుడు శంకరునకు మత్స్యేంద్రయోగి కథ జెప్పుట | 182 |
| నిస్సంగునికి పాపపుణ్యములంటవని శంకరుడు తెల్పుట | 184 |
| శంకరుడు స్వశరీరమునకు శిష్యుల గాపలియుంచుట | 185 |
| శంకరుడు పరకాయప్రవేశమున నమరకరాజై వెలయుట | 186 |
| మంత్రులు మృతకళేబర మెటనున్న దహింపజేయ శాసించుట<br>శంకరుడు రాజురూపున రాణులగూడి కామశాస్త్రపారగుడౌట | 188 |
| శంకరశిష్యులు చింతించి గురుని వెదకుటకై వెడలుట | 190 |
| శంకరశిష్యులు పాటకులై రాజసభకరిగి గురుమేల్కొల్పుట | 194 |
| శంకరుడు రాజదేహమునుండి భటులు దహింపించు తన మేనజేరుట<br>శ్రీలక్ష్మీనృసింహ స్తుతి పద్యరత్నములు | 196 |
| శంకరు డగ్నినుండి వదలి మండనునింటికేగి శారదనోడించుట | 198 |
| అవతారము చాలించు శారద శృంగగిర్యాదులందు నిలుపబడుట | 199 |
| మండనుని యతింజేసి శంకరుడు సర్వసంశయములుం బాపుట | 200 |
| శంకరాచార్యుడు శ్రీశైలమున విడియుట | 205 |
| ఒక కాపాలికుడు శంకరుని శిరము దనకీయ నొప్పించుకొనుట | 206 |
| సమాధినున్న యాచార్యు శిరము ఖండింప గాపాలికుడరుగుట | 210 |
| పద్మపాదునుండి నృసింహాకృతివెడలి కాపాలికుం గడతేర్చుట | 211 |
| శంకరాచార్యకృత నృసింహస్తవము | 213 |
| నృసింహుడు శాంతింప పద్మపాదు డాచార్యునకు మ్రొక్కుట<br>సతీర్థులతో బద్మపాదుడు తన నృసింహదేవానుబంధము దెల్పుట | 215 |


## అష్టమాశ్వాసము.


| | |
|---|---|
| శంకరాచార్యుడు గోకర్ణేశుని దర్శించుట | 218 |
| ఆచార్యకృత హరిహరస్తుతి | 219 |
| శంకరుని శక్తిచే మృతబాలుడు సజీవుడగుట<br>ఆచార్యకృత మూకాంబికాస్తవము | 221 |
| ప్రభాకరుడు మూగకొడుకు నాచార్యునకుజూపి యంగలార్చుట | 224 |
| ప్రభాకరపుత్రు తత్త్వవేత్తృత బయల్పడుట | 226 |
| తత్త్వజ్ఞ హస్తామలకుతో శంకరుడు శృంగగిరిజేరుట | 228 |
| ప్రియశిష్యుడౌ నానందగిరిని శంకరుడు సర్వజ్ఞుజేయుట | 230 |
| ఆనందగిరియే తోటకాచార్యునను పేరందుట | 231 |
| శంకరభాష్యమున వార్త్తికమొకర్పు సురేశ్వరునకనుజ్ఞ | 232 |
| సురేశ్వరు నమ్మరాదని యితరశిష్యులు పట్టుపట్టుట | 233 |
| పద్మపాదుడింకొక నిబంధనము వ్రాయ ననుజ్ఞాతుడౌట | 238 |

సురేశ్వరునిచే నదిమాన్పి సతీర్థులువిశ్వసించు కోశము వ్రాయించుట 239
సురేశ్వరుడు తారచించిన నైష్కర్మ్యసిద్ధికి శాపమిడుట 240
ఆచార్యుడు సురేశుచే శ్రుతికాణ్వభాష్యవృత్తుల జేయించుట 241
ఆచార్యుడు శిష్యులందఱిచే భాష్యనిబంధనలు వ్రాయించుట 243
పద్మపాదుడు తీర్థయాత్రల కనుజ్ఞబడయుట 245
శంకరుడు యోగదృష్టిం దెలిసి మాతను సందర్శించుట 248
ఆచార్యకృతశివస్తవము 249
ఆచార్యకృతవిష్ణుస్తుతి 251
శంకరుడు తల్లికి నుత్తరక్రియలు చేయుట }
శంకరుడు స్వజనులకు శాపమిచ్చుట } 252
పద్మపాదుడు దక్షిణదేశయాత్రం గాళహస్తికేగుట 253
పద్మపదుడు మేనమామయూర విడియుట 256
బంధువులకు పద్మపదుడు ధర్మోపదేశ మొనర్చుట 258
స్వయంకృత శంకరభాష్యటీక పద్మపదుడు మామకిచ్చుట 260
పద్మపదకృతభాష్యటీక మేనమామ తనయింట దగులబెట్టుట 261
పద్మపదుడు శిష్యులకు రామేశ్వర మహిమకై రామకథచెప్పుట 262
స్వకీయగ్రంథనాశమును పద్మపదుడు వినుట }
గ్రంథపునస్సృష్టికి బూనుపద్మపదు నమ్మామ మందమతిం జేయుట } 266
కేరళగత మహానురాలయేశ్వరమున శంకరుని శిష్యులు దర్శించుట 267
పద్మపదుడు గ్రంథనాశము గురునితో జెప్పి మందమతిత్వకై వగచుట 268
తాము మున్ను విన్న తద్గ్రంథమెల్ల నాచార్యుడు చెప్పి వ్రాయించుట 270
కేరళేశ కృత నాటకత్రయము న్శంకరుడు చెప్పి వ్రాయించుట 271


## నవమాశ్వాసము.


శంకరాచార్యుడు మధ్యార్జునప్రాంత జనుల శిష్యుల జేసికొనుట 273
రామేశ్వర గత వివిధ శాక్తేయు లెల్లరు శంకర శిష్యులగుట 274
లింగధారు లాచార్యునితో వాదించుట 281
ఆచార్య బోధకని వారా మోదమున దచ్ఛిష్యులగుట 285
మఱల గొందఱు శైవులు మఱింత వాద మొనర్చుట 288
ఆచార్య కృతబోధనీ లింగధారులును దచ్ఛిష్యులగుట 294
శంకరాచార్యు లనంతశయనమున వైష్ణవుల వశపఱచికొనుట 295
పంచాయతన పూజనాచార్యు డుపదేశింప బెక్కులు చక్కబడుట 298
వైఖానసులు నాచార్య బోధవలన జక్కబడుట 304
హైరణ్యగర్భమత నిబర్హణము 309

| | |
|---|---|
| వహ్నిమత నిషూదనము | 311 |
| సౌరమత దూరీకరణము | 312 |
| శ్రీ శంకర సంయమిగణవరమానకు సశిష్యుడై పయనము | 315 |
| గాణాపత్యమత విపాటనము | 318 |
| హారిద్రా గణపతి మత నిరసనము | 320 |
| ఉచ్ఛిష్ట గణపతి మత నిరాసనము | 322 |
| నవనీత స్వర్ణ సంతాన గణపతి మతత్రయ విధమనము | 325 |
| దిగ్విజయార్థ మాచార్యుని కర్ణాటదేశ గమనోద్యమము | 326 |
| క్రకచుడను కాపాలికునితోడి వివాదము | 327 |
| చార్వాక మత ఖండనము | 332 |
| సౌగతునితోడి వాగ్వాదము | 335 |
| క్షపణకునితోడి జైనమత ఖండనము | 337 |
| శబలుండను బౌద్ధునితోడి వాదము | 339 |
| మల్లపురంబున మల్లారిభక్తుల మల్లించుట | 340 |
| మరుంధాపుర విష్వక్సేన భక్తులను సద్బోధ కావించుట | 343 |
| క్రౌంచాది మన్మథ భక్తుల బంచపూజనపరుల నొనర్చుట | 345 |
| మాగధపురమున గుబేరభక్తుల నద్వైతసక్తుల నొనర్చుట | 346 |
| ఇంద్రప్రస్థమున నింద్రమతస్థుల సత్పథస్థులఁ జేయుట | 348 |
| యమిశేఖరుడు యమప్రస్థ యమభక్తుల మరలించుట | 350 |
| నాచికేతోపాఖ్యానము | 352 |
| సంయమీంద్రుడు ప్రయాగన్వరుణ భక్తుల నద్వైతుల జేయుట | 355 |
| ఆచార్యుండు శూన్యవాదితో వాదించుట | 357 |
| లక్ష్మణుండను వరాహభక్తునికి నిదేహముక్తి గఱపుట | 358 |
| సాంఖ్యు నద్వైత మతావలంబు గావించుట | 360 |
| కాపిలాఖ్యయోగితో వాదించి క్రిమ్మఱించుట | 361 |
| పరమాణువాదులతోడి వాదము<br>యమివరుడు కాశిజేరి కర్మవాదులకు మర్మము దెల్పుట | 364 |
| చంద్రసేనా చరణుడౌ శివాభరణు నద్వయజ్ఞు జేయుట | 366 |
| అంగారకాది గ్రహార్చకుల కద్వైత బోధ నలుపుట<br>సత్యశర్మాదులను పైతృకవ్రతుల మోక్షగతుల జేయుట | 367 |
| గరుడానంత భక్తులకు సద్బోధ గావించుట | 368 |
| సిద్ధార్చనాసక్తుల మరల్చుట | 369 |
| గంధర్వార్చనపరులకు బ్రహ్మంబుం గఱపుట | 370 |
| భూతభేతాళభక్తుల బంచార్చనాసక్తుల గావించుట<br>ఆచార్యుడు పశ్చిమాంభోనిధి ప్రాంతముం జేరుట | 371 |

నీలకంఠాచార్యునితోడి ప్రౌఢవాదము 373
నీలకంఠపండితుడు సశిష్యుడై యాచార్యశిష్యుండగుట 377
ఉజ్జయినికరిగి భట్టభాస్కరకవీంద్రు నోడించుట 378
అర్హాన్మతని బర్హాణము 380
శంకరుడు హర్షాభినవగుప్తాది పండితుల జయించుట 381


## దశమాశ్వాసము.


అభినవగుప్తకృతాభిచారికమున శంకరునకు భగంధరమూనుట 385
శిష్యానీక భిషగ్వరులు శంకరునకు చికిత్స చేయుట 387
అనుపశాంతరోగుడై శంకరుడు వైద్యులనంపివేయుట 388
శంకరు పనుపున నశ్వినీదేవతలు రోగనివృత్త్యుపాయము దెల్పుట 389
పద్మపదుజపప్రభావము నభినవగుప్తమృతి-శంకరరుజానివృత్తి
శ్రీ శంకరయమికి గౌడపాద మహాయోగీంద్రు దర్శనంబగుట } 390
శంకరుడు గౌడపాదగురుని బొగడుట 391
శ్రీ గౌడపాదయమీంద్రుడు శంకరుని బ్రశంసించుట 392
శ్రీ గౌడపాదులు శంకరవిరచిత భాష్యంబుల గాంచుట 393
శ్రీ శంకరుడు శారదాపీఠమధిష్ఠింప గాశ్మీరమునకు వెడలుట 394
సర్వజ్ఞపీఠ మధిష్ఠింపబోవు శంకరు వాదులవరోధించుట
శ్రీశంకరగురుండు తన్నడిగినవారికెల్ల సమాధానము చెప్పుట } 395
విజితవాదియైన శంకరుడు శారదప్రశ్నకు సమాధానమిచ్చుట 398
శ్రీ శంకర గురుసార్వభౌముని సర్వజ్ఞ శారదాసింహాసనాధిరోహణమహోత్సవము } 399
గురుసార్వభౌముని బదరికావనప్రయాణము 401
శంకరుడు కేదారమున నుష్ణకుండ నిర్మాణమొనర్చుట 402
శ్రీ శంకర యమిసార్వభౌముబిలువ సురలువచ్చి నుతించుట 403
విష్ణ్వజాది ప్రార్థితుండై శంకరుడు కైలాసంబున జేరుట 406




శ్రీ మేధాదక్షిణామూర్తయే నమః.

# పీఠిక.

శ్లో॥ శంకారూపేణమచ్చిత్తం | పంకీకృత మభూద్యయా।
కింకరీయస్య సామాయా | శంకరాచార్య మాశ్రయే॥
శ్లో॥ అవిద్యా భానుసంతప్తో | విద్యారణ్య మహాంభకే।
యదర్కకరతప్తానా | మరణ్యం ప్రీతిదాయకమ్॥

దోషజ్ఞులకు వినతి — గుణజ్ఞులకు మనవి,

ఈ 'శంకరవిజయము' యథామతిఁ బరికించిన నన్నుఁ దత్కర్త పీఠిక వ్రాయఁగోరఁగా నల్పజ్ఞుఁడనయ్యు, జగద్గురువుల యెడ నుండవలసిన భక్తిచేతను గృతికర్తయెడఁగల సోదరాదరమునను నన్యథాకరింపనేరక, 'సంతస్సంతి పరోక్తిమాత్రక జుషః కించింతయానంతయా' యను విద్యారణ్యోక్తి సంస్మరించి యిట్లు వ్రాయఁగడంగువాఁడను.

ఉపక్రమము:—

సృష్టిలో మానవత్వమునందలి వైలక్షణ్యము పారత్రిక విచారణైక వివేక సమభిజ్ఞేయము. అందవతారత్వము విజ్ఞాన క్రియాశక్తి సంయోగలక్షితము. మానవుఁడు బుద్ధిసాధ్యముల నూహించుచుండును. అవతారపురుషుఁడు మానవ సామాన్య దురధిగమ్యములం దెలిసి యనుయాయులకుఁ బ్రాప్యములుగా నొనర్పఁగలుగును. సామాన్యజనునికి నవతారమూర్తికి నంగారమునకును రతనమునకు నుండునంతరము కలదు. వస్తుత్వమున నుభయమున కేకత్వమే. తేజముననే తారతమ్యము. కావుననే,

యద్యద్విభూతి మత్సత్త్వం | శ్రీమదూర్జిత మేవవా।
తత్తదేవావగచ్ఛత్వం | మమతేజోఽంశసంభవమ్॥

అని శ్రీకృష్ణభగవానులు వల్కిరి.

## అవతారములు:—

ఈ యవతారములు దేశకాలానుసారములగు నొక్కొక్క పరమలక్ష్యము గలిగి సముద్భూతము లగుచుండును. అందుఁ దఱచుగాఁ గాలవాహినియొక్క ప్రశాంత ప్రవాహమున కంతరాయ జనకమగు ధర్మగ్లానియొదవి యధర్మాభ్యుత్థాన మగునపుడు సంస్కరణావశ్యకత కలిగి యనేకసద్హృదయములం దేకకాలమున నుదయించిన ధర్మసంస్థాపనైక లక్ష్యంబగు నిచ్ఛాశక్తి ప్రాబల్యమునఁ గ్రియాశక్తిస్వరూపమై యేర్పడినదే యవతార మనఁబరఁగుచుండును. అదియే బ్రహ్మములు సర్వమయుఁడగు నీశ్వరు ధ్యానింప నవతరించిరనుట. అట్టివారు లోకసంగ్రహార్థ మాచరించు కర్మములు.

యద్యదాచరతి శ్రేష్ఠ । స్తత్తదేవేతరో జనః ।
సయత్ప్రమాణం కురుతే । లోక స్తదనువర్తతే ॥

యనునట్లు ప్రజాసామాన్యానుష్ఠేయము లగుచుండును. అందుఁ గొందఱి చరిత్రములం దుపదేశాంశములు పెక్కులుండును. అవి సోపపత్తికముగఁ దెలిసికొనుటయుఁ దదుద్బోధనముల సభక్తికముగ నలవఱచికొనుటయు జిజ్ఞాసువుల కవశ్యకర్తవ్యములు. అందెవ్వరి దేశమునకు సంబంధించినవి వారు ముందెఱుంగవలయుఁగదా.

## శ్రీ శంకరావతారమునకుఁ బూర్వపు దేశస్థితి:—

మన భరతఖండమున శ్రుతిస్మృతి ధర్మానుసరణము విహితమైయుండు. తదాచరణమున నొకప్పుడు కర్మభాగమునకుఁ బ్రాధాన్యమొదవె. జైమిన్యుక్త పూర్వమీమాంసోదిత క్రతువిశేషము లెల్ల ద్విజులొనర్చుచుండెడివారు. యజ్ఞములొనర్చినందువలన జీవుఁడే సోమయాజి, హృదయమే యగ్నికుండము, ధ్యానమే యగ్ని, యింద్రియసుఖములే యాజ్యము, క్రోధాదికములే యజ్ఞపశువులు నను తత్త్వజ్ఞానసిద్ధియు దానఁ జిత్తశుద్ధియుఁ బడసి తద్ద్వారమునఁ బరమగమ్యమగు మోక్షమందవలయునను జ్ఞానము క్రమక్రమముగా క్షీణించి కామ్యములు హెచ్చఁజొచ్చె. దాను

కాని యాగాదికర్మముల కతిశ్రద్ధానుగతి ప్రాప్తించె. పశు
బల్యాత్మక జీవహింసయుం బ్రబలె. కొందఱు కోమలహృదయుల
కందు వైముఖ్యమేర్పడె. ఎట్లయిన, జ్ఞానవైరాగ్యోద్ధరణావశ్య
కత గలిగె. అట్టియెడఁ గామ్యకర్మారణ్య విచ్ఛేదనమొనరించి
వైరాగ్యబీజావాపమొనర్ప గౌతమ బుద్ధుఁడు కరుణామయ స్వరూ
పుడై యవతరించెను. ఆతఁడహింసా పరమధర్మ ప్రతిష్ఠాపనముఁ
గావించువాఁడై, సంసారము దుఃఖభాజనమనియు, రాగాదికము
లుడిగిన నది యడఁగుననియు, భూతదయ, సత్యము, త్యాగము,
నిష్కామత, సాధుజీవనము, సంతృప్తి, మననము, సద్బోధ మున్న
గునవి యలవఱచికొన్న సత్ప్రవర్తకులు ద్విజులయినను నద్విజులయి
నను స్త్రీలయినను బురుషులయినను నిర్వాణము నొందఁగలరనియుఁ
దేటతెల్లముగా దేశభాషలలో నుపన్యసింపఁజేయఁజొచ్చె. శ్రోత
లకుఁ జిరాభ్యసనలభ్యమగు వేదాధ్యయనము, నధికద్రవ్య సాధ్య
మగు క్రతునిర్వహణము, మహాదేహ బాధాకరమగు తపశ్చరణము
మున్నగునవేవియు నక్కఱలేకుండ సార్వజనీనముగా సూక్ష్మమున
మోక్షమబ్బుత్రోవ కలదన్ననే యాకర్షకముగదా! ఇంకఁ బైపెచ్చు
బుద్ధుఁడు తనకుఁ దన ధర్మమునకుఁ దన సంఘమునకు శరణుఁ
జొచ్చిన 'భిక్షువు'లకు వర్షబాధలుతొలఁగ నెలవులుగా 'విహార
ము'లంగూడ నేర్పఱచినమీఁదట 'వింటికంటె గుడిపదిల' మనికొ
ననివారెవరు? ఆతఁడు దేశాటన మొనర్చుకొలఁదిఁ దత్ప్రతిబోధా
రసాస్వాదనపరులైన ప్రజ లక్షారోదకమునకు మత్స్యములట్లు
చేరుచుండెడివారు. వేనవేలుగ నాతని కనుయాయులయిరి. తన్మత
మనతికాలమున నార్యావర్తమెల్ల వ్యాపించి యనేక శతవత్సర
ములు నిరంకుశపరిపాలన మొనర్పఁజాలిన దటుండ నన్యదేశము
లకుఁగూడఁ బ్రాఁకి యనల్పవ్యాప్తిఁగాంచి యిప్పుడు మానవ
కోటిలోఁ జతుర్థాంశము నాక్రమింపఁజాలినదై యున్నది. కావుననే,
బుద్ధుఁడు పాశ్చాత్యార్వాచీన చారిత్రకులచే 'The Light of Asia'
అని పొగడ్తనొందఁగలిగె.

ఈతని మతము దయా హింసా ప్రతిపాదకమై స్థూలదృష్టిని ప్రస్తుతిపాత్రమైనను తుదకది సౌత్రాంతిక వైభాషికోదిత 'క్షణభంగవాదము'గాఁ బరిణమించి ప్రత్యభిజ్ఞాన శక్తికిని దానఁ బ్రవృత్తికిని భంగముఁ గలిగించునట్టి పునాదిలేని గోడయయి శ్రుత్యేకవేద్యమగు పరమగమ్యము నందింపఁజాలనిదయ్యె. ఇంక మహావీరాభిధానుఁడై పిదప జినుఁడనఁ బరఁగిన వేఱొకమతకర్త ననుసరించిన వారును వేదప్రామాణ్య మంగీకరింపక పరమాణు కారణవాదులై జీవుఁడు సమీచీన జ్ఞానచరితములచేఁ గర్మాష్టకబంధ విచ్ఛిత్తి నందిన నలోకాకాశముక్తి యబ్బుననిరి. కాని, వారిజీవుఁడు సావయవుఁడై నాశముగలవాఁడగుట మోక్షమందఁజాలఁడయ్యె. ఇట్టి వారు లోకాయతికులని వ్యవహరింపఁబడుచుండిరి. తత్తన్మతానుయాయులు పరలోకము కలదను 'మతి' లేక 'అస్తినాస్తిదిష్టమ్మతిః' అను పాణినీయ సూత్రము ననుసరించి 'నాస్తిక' శబ్దవాచ్యులుగాఁ బరిగణింపఁబడవలసిన వారయిరి. క్రమముగా విపరీతస్థితులును బాటిల్లనయ్యె.

బౌద్ధభిక్షువులందు నిర్వాణపారతన్త్ర్యమున సోమరితనమును గర్మత్యాగమున నిరీశ్వరత్వమును బొడకొనెను. తద్విహారములందు స్త్రీపురుషులకుండిన నిర్ణయములు నంతకంతకుఁ దొలఁగి దుర్ణయములు ప్రబలి యీ బౌద్ధమతప్రవక్తలు సంఘమునకు భారముగాఁ దోఁచిరి. పెక్కుర కేవగింపుపుట్టె. కర్మాచరణమునకు బుద్ధి మఱలె. కొందఱు పూర్వమహర్షి ప్రోక్త వివిధదర్శనరూప సూత్రానుసారముగా మతోద్ధరణము కావింపఁ దొడఁగిరి. అందెన్నికఁ గన్నవి— గౌతమ, కణాద, కపిల, పతఞ్జలి, జైమిని, బాదరాయణ ప్రోక్తములు,—న్యాయ, వైశేషిక, సాంఖ్య, యోగ, మీమాంసా, వేదాంతాభిధాన ప్రథితములు షడ్దర్శనములు. వేదప్రామాణ్య పునః ప్రతిపాదనోద్యోగులగు ప్రాజ్ఞులెల్లఁ దత్తన్మతానుసారులైరి. మఱికొందఱా వేదముననే తలకొకముక్క పట్టుకొని యొక్కొక్క నూతనమతము నుద్ధరింపఁజొచ్చిరి. దానఁ దాంత్రికములు హెచ్చె.

ఎవరిమతము వారిదయ్యె. 'శాక్తైః పాశుపతైరపిక్షపణకైః కాపాలికైర్వైష్ణవైరప్యన్యైః' అన్నట్లసంఖ్యాకములగు మతములును దత్తత్ప్రవక్తలు నేర్పడిరి.

ఇంతలోఁ బూర్వమీమాంసామతమును బునరుద్ధరించిన భట్టపాదాపర నామధేయవిజ్ఞేయుండగు కుమారిలభట్టు కార్తికేయావతారముగా నెంచఁబడినవాఁడై, తన నిరంకుశ ప్రతిభావిశేషమున ననల్పవ్యాప్తిఁగన్న బౌద్ధమతమును బూర్తిగాఖండించి, వేదచోదిత శ్రౌతస్మార్త నిత్యనైమిత్తిక కర్మాచరణంబు నుజ్జీవింపఁజేసినవాఁడయ్యె. అది కొంతవఱకు శ్రేయోదాయకమే యయినను, 'ఏవం త్రయీధర్మమను ప్రపన్నా। గతాగతం కామకామాలభన్తే' యను నట్లు ప్రజలర్థవాదానుస్మృతిఁ గర్మము లాచరించుటచేఁ జిత్తైకాగ్ర్య మొదవదయ్యె. మఱలఁ దత్త్వజ్ఞాన విరహిత శుష్కకర్మాచరణైక పరత్వమేర్పడెను. ఒకఁడేటికీలాగిన నింకొకఁడు కోటికీడ్చినన్నట్లయినది. బౌద్ధులు వైరాగ్యమనుపేరఁ గర్మసన్యాసకు దూరగులయిరి. తద్భిన్నులు కేవల కర్మానుగంతలయి జ్ఞానపక్షసుంతయుం బ్రోక్కరయిరి. మఱియు, భైరవులు, శాక్తేయులు, గాణాపత్యులు మున్నగు కొందఱియందు ఘోర దురాచారములు ప్రబలఁజొచ్చె. ఈ యీవిభిన్న మతస్థులకును లోకాయతికులకును బరస్పర సంఘర్షణము పెచ్చుపెరిఁగి లోకోపద్రవకారణము కానయ్యెను. ఎటఁజూచినను సత్యజ్ఞానము మృగ్యమై ధర్మవిప్లవ మేర్పడెను. అట్టి సందిగ్ధసమయమున, దుర్మతనిర్మూలనము కావించియు, సన్మత సామరస్యమొదవించియు, సత్యజ్ఞానము వెలయించి, శాంతినెలకొలిపి క్షీణించిన సకలధర్మములఁ బునరుజ్జీవితములఁగానర్ప దక్షుండెవ్వండయిన నవతరించుఁగాత మని లోకము వేచియున్నతరుణమున, నుత్తమజ్ఞాన వైరాగ్య ప్రతిపాదకముగ నద్వైతమత సంస్థాపనము గావింప లోకక్షేమంకరులయి శ్రీశంకరభగవత్పాదుల వారవతరించిరి.

శ్రీశంకరాచార్యులు — తచ్చరిత్రాంశములు: —

ఈ యవతారపురుషుండు,

‘ నబభూవ పురాతనేషుత । త్వదృశో నాద్యతనేషు దృశ్యతే।
భవితా కిమనాగతేషు వా । నను మేరో స్సదృశో యథాగిరిః॥

అని ప్రశంసింపఁబడిన మహానుభావుండు. తచ్చరిత్రాంశములిందు మున్ముందెఱుంగఁదగినది.

శంకరులం గూర్చి నేర్చికొనుట కాధారములు ప్రాచీన కవికర్తృకములగు ‘విజయములు’. తద్రచయితలు, వ్యాసాచలకవి, మాధవాచార్యులు, చిద్విలాసయోగి, సదానందులు, ఆనందగిరి మున్నగువారు. ఈ ప్రాచ్యవిద్వన్మణులు తదుద్బోధనక్షీర గ్రహైకదక్షులగు పరమహంసలు. కథానాయక కాలనిర్ణయాదికాంశములు వారికిఁ బ్రధానములుకావు. నవీన పాశ్చాత్యసాంప్రదాయానుయాయులగు విమర్శకులకుఁ జరిత్రాంశ గ్రహణైక పరత్వము మెండు. అట్లగుట, శంకరుల కాలముంగూర్చి గతశతాబ్దమునఁ బెక్కురు పరికించిరేకాని నిర్ధారణము కాలేదు. అయినను,

‘ నిధినాగే భవహ్న్యబ్దే । విభవే మాసిమాధవే।
శుక్లేతిథౌ దశమ్యాంతు। శంకరార్యో దయస్స్మృతః॥’

అను చాటువుంబట్టియు, నర్వాచీనభట్ట నీలకంఠ పండిత ప్రోక్త ‘శంకరమందార సౌరభ’ భాంచితమగు,

‘ ప్రాసూత తిష్య శరదామతియాతవత్యా।
మేకాదశాధికశతో నచతుస్సహస్ర్యాం॥’

అనుదానిని బట్టియుఁ బాశ్చాత్య విమర్శకులందొకఁడగు మోక్షమూలరు 788 A. D. కావలయుననెను.

శ్రీ విరూపాక్షపీఠస్థ గురుసాంప్రదాయమునందుఁ దెలియనైన కలియుగవత్సరము 3889 కిది సరియగును. మఱియు, శ్రీశంకరార్య శిష్యవరేణ్యుండగు సురేశ్వరాచార్యుండు 8 వ శతాబ్దియందుండినట్లు శ్రీశృంగగిరి మఠగురు పరంపరవలనఁ దెలియనగుటయుఁ గొంతవఱకిందులకుఁ దార్కాణ కానోపు. తజ్జన్మనక్షత్రమార్ద్రయని జ్యోతిషికసిద్ధాంతము. అట్లయిన జన్మతిథి

'దశమి' కానేరదు. 'పంచమి'యే కావలయు. ఇందులకు 'శంకర' నామముంబట్టి యక్షరసాంఖ్య సమన్వయముం జెప్పెదరు. 'కాది నవ'సంజ్ఞను, 'అంకానాం వామతో గతి' యను విధిని 'శంకర' శబ్దవాచ్యజన్మతిథి యొక వైశాఖ శు ౫ యయి తెలియును. మాధవాచార్యునకు మాత్రము.

'లగ్నే శుభే శుభయుతే సుషువే కుమారం,
జాయా సతీ శివగురోర్నిజతుంగ సంస్థే।
సూర్యే కుజే రవిసుతే చ గురౌ చ కేంద్రే॥'

యని యించుక తజ్జననకాల గ్రహస్థితికూడ వివరించిన వాఁడయ్యె. ఇట్లుండ, శ్రీమత్పరమహంస బ్రహ్మానంద సరస్వతీ స్వాములవారి ప్రేరణమున విరచింపఁబడిన 'శంకరవిజయధ్వజము' తుదిని నిడదవోలు సంస్థాన విద్వాంసులచే గుణింపఁబడినట్లున్న జాతకచక్రమొక్కండిట్లు I కానుపించు.

I

| | | | |
|---|---|---|---|
| కు | ర బు<br>శు | రా | ల<br>చ |
| గు | రాశి<br>ఈశ్వర | | |
| | | | |
| శ | కే | | |

II

| | | | |
|---|---|---|---|
| *<br>గు | ర బు<br>శు | | ల<br>చ |
| కే | రాశి<br>విభవ | | |
| *కు | | | రా |
| | | *<br>శ | |

వారిచ్చిన 1 చక్రమున (1) కుజ (2) రవిసుత—నిజతుంగ సంస్థితియు (౩) గురుకేంద్రగతియుఁ గలుగలేదు. (4) గ్రహస్ఫుటమునను సరిపడదు. (౫) ఇంక, వారొప్పించితిమన్న, 'సురగురుశశిహోరాస్వార్కి-దృష్టౌ సుధర్మే' యను వరాహమిహిరోక్తికణాద బుద్ధాదిరాజదీక్షిత పరమగుట నిటవర్తింపదు. (౬) వారుదాహరించిన 'నాభి' యోగము కన్యామిథునలగ్న జాతకులకుఁ బట్టనేరదు. శుభచంద్రసంయుక్తియుఁ గొఱవడినది. (7) 'పంచత్రింశా

బ్దతః పరంభూయా' త్రిచి ఫలితముగల 'పర్వత' యోగమును జాతకు
నికిఁ బట్టుకయ్యెనగుట సీకోటి కానేరదనవలెను.

కావ్యక II మాకోటిగా నీయఁబడినది. ఇందు మాధవోక్త
త త్త్వద్ప్రహతుంగ కేంద్రస్థిత్యాదులొప్పి, యింకను

లక్ష్మీశంఖామలోత్తమ కాహళ కేసరీగారుడ శారదా పారి
జాత వసుమతీ శుభవాసి శృంగాటక పర్వతాంతరాంశావతారా
దిక బహుళ ప్రబలయోగ కరగ్రహస్థితియు నొదవినది. దాన,
షోడశాబ్ద ప్రభృతికము నాదాన్వత్రింశత్కమునగు విద్యాప్రచా
రము, శత్రువిజయము, జితేంద్రియత, తత్త్వవేత్తృత, ధర్మకర్మ
నిష్ఠ, పీఠాధిరోహణము, శాశ్వతకీర్తి మున్నగునవి ప్రాప్తించి,
చరిత్రాంశములకు సరిపడినదైనది. ఇంత, నిదర్శైవజ్ఞులకు వదలి,
గురుపాదుల జన్మప్రదేశాదికముం గూర్చి ముచ్చటించికొందము.

శ్రీ శంకరులు జన్మించినది మళయాళదేశస్థ చూర్ణీనదీ
ప్రాంత కాలట్యగ్రహారమనియుఁ దజ్జనకుఁ డచ్చటి నంబూద్రి
బ్రాహ్మణులందు విద్యాధిరాజ బిరుద విరాజితుండగు శివగురుం
డనియుఁ దజ్జనని యార్యాంబాపర నామధేయయగు శ్రీసతియని
యు విజయములఁ జెక్కొంటఁ గలదు. ఏయానందగిరియో
యొక్కరుండుమాత్రము తద్భిన్నముగా నాతండు చిదంబరమున
నొక సన్యస్త విప్రపత్నికి నట రాజానుగ్రహమున నుదయించె
ననెను. అదినిరాధారము. ఇంక, 'మణిమంజ' ర్యాదులందు
మతవిద్వేష కారణమునఁ జేర్పఁబడిన యపవాదములును బాటింపఁ
దగినవికావు. కాని, తచ్చరిత్రమునఁ దురీయాశ్రమ స్వీకార
విషయమొక్కటి మాత్ర మిటఁ జర్చనీయము.

ఆతని సన్యాసముకలి వర్జ్యమనికొందఱును, దాంత్రికమని
మఱికొందఱును సందేహించిరి. అట్లనుటకు,

'ఊఢాయాః పునరుద్వాహం। జ్యేష్ఠాంశం గోవధంతథా।
కలౌపంచనకుర్వీత। భ్రాతృజాయాంక మండలుం॥

అను వర్జ్యపంచకము నందలి కమండలువు సన్న్యాసిపరమని
యెంచుటొక కారణము కానోపు. కాని యది మున్ను గృహ
స్థాశ్రమమునఁ బ్రవేశించుతఱి, స్నాతకకాలమున ధరించెడి వా
రన్న 'సోదక కమండలు' వని విద్వదభిప్రేతము. ఇంక, 'సన్న్యా
సంపల పైతృక' మ్మను దానికి నిర్ణయ సింధుకారుఁడు, 'యాఽపి
సన్న్యాసంపల పైతృక మితికలౌ నిషేధః, సోఽపిత్రిదండాదిపరః'
అని వివరించియున్నాఁడాయె. కావున, నది కుటీచక బహూద
కాది పరముకాని పరమహంస విషయముకాదనిస్పష్టము. మఱియు
నాతని యమిత్వము తాంత్రికము కాదనుటకు, 'శిఖాయజ్ఞోపవీతా
భ్యాంశ్రుతే ర్భారోభవిష్యతి' యను శాంకరోక్తిలోనే సూచితము.
అదియటుండఁ జిద్విలాస కృతియందు,

'సన్న్యాసిభిర్విధేయాంస్తు। విశ్వేశశ్రుతిబోధితాన్।
ఏత్వాధక్రమసన్న్యాసం। బోధయామాసతత్త్వవిత్॥'

అనుశ్లోక మాచార్యులది విధివిహితమైన వైదిక సన్న్యా
సమేయని ధృవపఱచుచున్నది.

"ఆచినోతిహిశాస్త్రాణి। హ్యాచారేస్థాపయత్యపి
స్వయమాచరతేయస్మా। త్తస్మాదాచార్యఇష్యతే॥"

యనునట్లధీతిబోధాచరణంబులచే లోకమునకుఁ దామార్గ
దర్శకుండయిన యనింద్య చరిత్రుండగుటఁ దదాచరణమునఁ గల
ధర్మసూక్ష్మముల నరసి తెలియవలయు. ఆతఁడు బ్రహ్మచర్య
మునుండియే తురీయమునఁ జేరుటయందలి ప్రాశస్త్య ముద్బో
ధింపనే తానట్లొనర్పఁ గృతనిశ్చయుండయ్యె. కాని, 'నమాతుః
పరదైవత' మ్మని నమ్మి యట్లు నెఱపువాఁడగుట, నందుల కామె
యనుజ్ఞకై వేచియుండె. ఏకపుత్రవిషయమున నామె వెంటనే
సమ్మతింపమికి వగచి, నక్రవశంగతత్వ క్లిష్టస్థితిప్రాపింపఁ జేసికొని
యైనఁ దుదకెట్లో యొడఁబఱచి యాశ్రమియై,

'వేదాంతవాక్యేషు విచారవంతః। భిక్షాన్నమాత్రేణచ తుష్టిమంతః।
అశోకవంతః కరుణైకవంతః। కౌపీనవంతః ఖలుభాగ్యవంతః॥'

అని తెల్పి తల్లిని సంతసించె. అట్లయ్యు నిజమాతృచరమస్థితి నందయ్యె యాపె కూర్ధ్వగతియొసఁగె. ఇదియెల్ల మాతృభక్తి విశేషమునకుం దార్కాణగా గ్రహింపఁదగినది. మఱియుఁ దాను 'ప్రాచీన పుణ్యజనితాత్మ విచారచిహ్న' లెన్న, గోవింద పాదులతోడి ప్రథమసంభాషణముననే,

'స్వామిన్నహం న పృథివీ న జలం న తేజో।
న స్పర్శనో న గగనం న చ తద్గుణా వా।
నాపీంద్రియాణ్యపి తు; విద్ధి తతోఽవశిష్టో।
యః కేవలోఽస్తి పరమస్స శివోఽహమస్మి॥'

యని ప్రత్యుత్తరమిడఁజాలిన సర్వజ్ఞుండయ్యు, గురూపదేశములేకుండ నాత్మవిచారము చేయఁదగదని తచ్ఛాస్త్రప కావించి గురుభక్తిపచరించె. తాను జ్ఞానియయ్యుఁ దీర్థయాత్రల సేవించి, దాన దేశాటనావశ్యకతయు, మహాస్థల సందర్శన ప్రయోజనము నుద్ఘాటించె. మఱియు, నొక్కటఁ గామతంత్రగ్రహణమొనర్పవలసిన సందర్భమొదవినప్పు డణిమాదిసిద్ధులందిన మహానుభావుండగుటను, 'వ్యథాయి దేహాంతర సంశ్రయాన్య । స్నతేస లిప్యేతహి కర్మణాఽన్యః॥' అను లోకశాస్త్ర ప్రసిద్ధనిశ్చయమునను దేహాంతరమున నట్లొనర్చుటచే, యమికముండమాలాతంత్రోదిత సదాచారత్వాదులు నిషిద్ధములని ప్రసిద్ధకావించె. ఇంక సాధనచతుష్టయ సంపత్తిగల శిష్యులకును బ్రహ్మవిద్యాధికారము కలదనుటకుఁ బ్రభాకరాది శిష్యులకుఁ దత్త్వోపదేశము కావించి యుద్ధరించె. విధ్యుక్తపరోపకారానుష్ఠానమునకై కేరళదేశీయ నిజబంధువర్గమునైనను శపించినవాఁడై దుర్జననిగ్రహము విహితధర్మముగా నుపపాదించె. ఇంక విజిగీషుతా విశేషమెల్ల దుర్మతనిర్మూలనైకధర్మ మర్మంబగు నవతారపురుష కర్మంబుగా నెఱుంగునది.

ఇట్టి 'శంకర' భగవత్పాదావతారము ఋగ్వేదోక్త 'సుహస్త'పదమున సూచితమఁట. మఱియు, స్కాంద కూర్మపురాణములందును,

'శివేమదంశేసంభూతః శ్శంకరశ్శాంకరోత్తమః।
చతుర్భిస్సహశిష్యైశ్చ కలావవతరిష్యతి॥'

మున్నగు సూక్తులు ప్రతిపాదించెననుటయు నటుండనిండు. సప్తమహాయనముననే యఖిలశ్రుతి పారంగతత్వము నొందఁజాలిన యనన్యసామాన్య వైదుషీ శేముషీ సముపేతుండై,

'సద్వాదశేవయసి తత్రిసమాధినిష్ఠైః బ్రహ్మర్షిభిశ్రుతి శిరోబహుధావిచార్య।
షడ్భిశ్చ సప్తభిరథోనవభిశ్చ భిన్నైః భవ్యం గభీరమధురం ఫణతిస్మభాష్యం॥'

అని యభివర్ణింపఁబడినరీతిని, 'విరతివనితాసంగముదితుం'డై పెక్కులద్వైత సారామృత పూరంబులగు కబ్బములుం మొదలు, గీతాసూత్రోపనిషద్భాష్యంబులును రచించిన మహానుభావుండు గదా! మఱియు నేటి ప్రయాణసౌకర్యములు లేక మతవిషయక వివాదములవలన రక్తపాతము లగుచుండిన కష్టకాలమున, నిష్ఠుర మెలసహించి, యాసేతుహిమాచలము పాదచారియై సంచరించి, వితండవాదశౌండ దుర్మతఖండనై కదీక్షుండై, సకలదిగ్దేశ విద్వద్వృషభుల డీకొని గెలుపొంది, దిగ్విజయపతాకనిలిపి షణ్మత స్థాపనాచార్యుండనఁ బ్రఖ్యాతిఁగన్న శంకరాఖ్యుండు సాక్షాచ్ఛంకర ప్రఖ్యుండుగాక వేఱొండు కానుండునే? అది యటుండనిండు. తన్మతసామరస్య విధానము వినుండు.

శాంకరమతము:—

ఆచార్యులవారిశక్తి కాపాలికాదిక సంస్కరణమునఁ గాక, న్యాయసాంఖ్య పూర్వ మీమాంసా మతఖండనములం దెక్కుడుగా వినియోగింపఁ బడవలసినదయ్యె. ఇందు న్యాయసాంఖ్యములును బదార్థవిచారణాదులందు న్యాయదర్శనముకంటెఁ గించిద్భేదము గల (చూ ౧౦ ఆ ౭౨ ప) వైశేషికమును జీవేశ్వరభేదరూప ద్వైతజ్ఞాన బోధకములు. ఎట్లనిన,

న్యాయమతము:—

ఇందుఁ దత్త్వజ్ఞానోత్పాదనమునకుఁ బ్రత్యక్షానుమానోపమాన శబ్దములు ప్రమాణములు, వీనిలో నమమానప్రమాణము

వలన నీశ్వరుఁడు నిమిత్తకారణముగాను బరమాణువు లుపాదాన కారణములుగాను నేర్పడిన దీజగత్తు. కాని 'శాస్త్రయోనిత్వాత్' అను ప్రమాణమున, బ్రహ్మ శ్రుత్యైకవేద్యమే యగుంగాని తార్కిక యుక్తి సాధ్యము కానేరదు. మఱియు, 'యతో వా ఇమాని భూతాని జాయంతే, యేన జాతాని జీవంతి, యత్ప్రయంత్యభిసంవిశంతి' యను శ్రుతిననుసరించి, 'జన్మాద్యస్య యతః' అనుట నుపాదానత్వమణువులకుఁగాక యీశ్వరునకే సిద్ధించెడిని. పైన శారీరక మీమాంసయం దణువులకుఁ గారణత్వ నిరాసమును బ్రాప్తించినదాయె.

ఇఁక సాంఖ్యము:—

ఈ మతమున, జడమగు ప్రకృతియే సర్వమూలము, విశ్వయోని, సత్త్వరజస్తమోగుణాత్మికయు స్వతంత్రియు నయి పురుష భోగార్థము బహు రూపభాగిని యగు జగన్నిధానమయి వెలయుచున్నది. ఇంక, బంధమోక్షములు లేని యాత్మప్రకృతి సంసర్గమున సుఖదుఃఖాదు లనుభవించుచున్నట్లు కాననచ్చును. ఇట్లు 'బ్రహ్మ' కంటె భిన్నమును స్వతంత్రమునగు నచేతనమొకటియు, సత్యమగు చేతనానంతరముం జెప్పినదైనది. 'ఏకమేవాఽద్వితీయం బ్రహ్మ' యను ప్రమాణమున, సృష్టికంటె ముందుండినది 'సత్' శబ్దవాచ్య మొక్కటియేయయి నేను బహుత్వావస్థ నొందుదునుగావుత మని 'యీక్షించె' ననికదా! అట్టియెడ 'ఈక్షతేర్నాశబ్దం' అనునట్లచేతనమైన దీక్షింపజాలదనుట నది జగత్కారణమున వలనుపడదయ్యె.

ఇంకఁ బూర్వమీమాంసామతము:—

ఇందు శబ్దమున నేసృష్టి. దీనినే 'కర్మ బ్రహ్మవాద' మందురు. దీన జగత్తు సత్యము, జీవులు నిత్యులునయి యనంతముగా నుందురనియు, శ్రుత్యుక్తకర్మాచరణమునఁ గలిగిన 'యపూర్వమే' జీవునికి స్వర్గదమనియుఁ జిరకాలార్జిత పుణ్యవిశేషమే ఫలదాయిని యనియు నేర్పడును. 'ఫలమత ఉపపత్తేః' అను బాదరాయణ

సూత్రమునను, 'యాంతి మద్యాజినోపిమాం' మను గీతోక్తిని బట్టియు మోక్షదాత తత్తత్స్వాహాకార గమ్య పరమపురుషుఁడు కాని యచేతనమగు 'నపూర్వము' కానేరదయ్యె.

ఇట్టి తత్తన్మత ఖండనానంతరమున,

'అలింగకమచక్రాంక । మజటాస్థ్యసురామిషమ్।
అరక్తకమనూచ్ఛిష్టమ్ । షడస్మాభిరనుష్ఠితమ్॥'

అని శైవ, వైష్ణవ, గాణాపత్య, శాక్తేయ, సౌర, కాపాలికములను నాఱుమతములందపుడుండిన పూర్వోక్త దురాచారములఁ దొలఁగించి, తత్తన్మత సామరస్య ప్రతిపాదకముగా,

'ఆదిత్య మంబికాం విష్ణుం । గణనాథం మహేశ్వరం'

అను పంచాయతనరూపసగుణ పూజావిధానముం గఱపె. దాన, నన్మృతజడదుఃఖాత్మక మాయావరణముం దరింపఁ ద్రోవఁ జూపె.

ఇంక మోక్షప్రసంగమున, గుణసంబంధాత్యంతనాశమున నగు నభోవత్థితి కణాదముక్తికాఁగా నది సానంద సంవిత్సహిత మాట గౌతమముక్తియయ్యెనని శంకరులు వల్కిరి. నైయాయికముగా నేకవింశతి దుఃఖధ్వంసనరూప నిత్య సుఖాభివ్యంజకజన్య జ్ఞానమునను మోక్షత్వాపాదనమైనది. శ్రీ భగవత్పాదమతమునను స్వస్వరూపభూత సత్యజ్ఞానమున నగు వక్ష్యమాణోపనిషత్ప్రతిపాది తాద్వైతసిద్ధాంతము పరమగమ్యముగా నిర్ధుష్టోద్బోధింపఁబడియె.

'' బ్రహ్మైకం పరమార్థసచ్చిదమలం విశ్వప్రపంచాత్మనా।
శుక్తీరూపపరాత్మనేవ బహుళజ్ఞానావృతం భాసతే।
తజ్జ్ఞానాన్నిఖిల ప్రపంచనిలయా స్వాత్మన్యవస్థాపరం।
నిర్వాణంజనిముక్త మభ్యుపగతం మానంశ్రుతేర్మస్తకం॥'

అని 'సత్యం జ్ఞాన మనంతంబ్రహ్మ' 'విజ్ఞానమానందం బ్రహ్మ' 'సర్వంఖల్విదంబ్రహ్మ' ముఖానేకశ్రుతి శిరః ప్రతిపాదిత 'బ్రహ్మమే' యజ్ఞానావృతమై ముక్తిపుఁజిప్ప రూప్యాత్మక పరస్వ

రూపము చేత వలెనే ప్రపంచముగా భాసించుచున్నదనియు నట్టి పరావరైక్యమగుదానిం దెలియుటవలన సజ్ఞానసహితముగా విశ్వమువోయినఁ దనయందా వ్యనస్థితియే మోక్షస్వరూపమనియును సిద్ధాంతీకరించిరి. ఇట్టి శ్రీ శంకర భగవత్పాదుల పరమాద్వైత సిద్ధాంతమునుగూర్చి నిష్పాక్షికబుద్ధిం బరీక్షించి మోక్షమూలం జెప్పంగఁ జాలిన మోక్షమూలరు.

'Strange as Shankara's 'Monism' may seem to us, yet,the current idea that God created the World out of nothing can, strictly speaking, mean nothing else than that nothing can ever exist by the side of God,that God out of his own energy supplied both the material and the efficient cause of the World.'

అని వివరించియున్నాఁడనుటయు, నితరపాశ్చాత్య విమర్శకాగ్రణుల యనుమోదము నిందుల కొఁడవెననుటకు,

'When I find Shankara's position not questioned by such a strict logician as schopenhaur, Shankara need fear no future.'

అను వాక్యము నుదాహరించుటయు నప్రస్తుతము కాదని వచించి యింకఁ బ్రస్తుత మూలగ్రంథవివరణమునకుం గడంగువాఁడను.

సంక్షేప శంకరవిజయము:—

ఏతన్మత ప్రవర్తకవరేణ్యు సచ్చరిత్రము వివరించిన పూర్వోక్త విజయములందెల్ల విద్యారణ్యాపర నామధేయ విజ్ఞేయ మాధవాచార్య కర్తృకమగు 'సంక్షేపశంకరవిజయము' సారవంతమును బ్రౌఢతమమునయి, రమ్యవృత్తానేక విశిష్టంబును శబ్దార్థాలంకారాది గరిష్ఠంబును రసానుగుణవర్ణనాభూయిష్ఠంబునగుతత్కృతివతంసంబన్నిటఁ బ్రశంసార్హము. ఇక్కావ్యమే వ్యాసాచలకవి ప్రోక్తమని కొందఱయభిప్రాయము. కాని సత్యమదికాదు. ఏలయనఁ, దద్గ్రంథాదిమ శ్లోకముననే, తద్రచయిత,

శ్లో॥ ప్రణమ్య పరమాత్మానం। శ్రీవిద్యాతీర్థరూపిణం।
ప్రాచీన శంకరజయే। సారస్సంగృహ్యతేస్ఫుటమ్॥

అనుటచే నిందలి 'విద్యా' శబ్ద మద్వైత రాజ్యలక్ష్మీ టీకాకారుఁడన్నట్లు, 'భారతీ' పదద్యోతకమై మాధవాచార్యుల దీక్షాగురువుల నుద్దేశించినదన్నను, లేక సరసతరముగాఁ దత్సాక్షాద్విద్యాగురువులే యగు 'విద్యాతీర్థుల' కే సంబంధించినదన్నను నిది మాధవకృతియే యనవలెఁగదా! మఱియు దీనఁ బ్రాచీనకృతి యొకఁ డుండినట్లు నీకృతి తత్సంక్షిప్తకృతి గావించినట్లును స్ఫుటముగాఁ దెలియఁగలము. తత్ప్రాచీన శంకరజయకారుఁడు 'వ్యాసాచలకవి' కానగుననుట కొక్కఁడ నాపైన వక్ష్యమాణ శ్లోకములగపడెడిని.

'వ్యాసాచల ప్రముఖపార్వక పండితత్వా।
భృత్సంభృతోచ్చతరకావ్యతరోస్సుగూఢాత్।
విద్వన్మధువ్రతసుఖోసురసానిసర్వా।
ణ్యాదాతుమర్థకుసుమాన్యహమక్షమోఽస్మి॥
యత్నాదనల్పధిషణోస్మృణినాగ్రహీతుం
శక్యంతదత్రసరసంసకలం గృహీత్వా
కాంచిన్మహేశ్వరగురుస్మృతభావమాహ
స్సంక్షేపశంకరజయప్రజనంకరోమి॥'

ఇట్లు, వ్యాసాచల కృతోచ్చతరకావ్య ప్రశంస యొనర్చినవాఁడు తద్భిన్నుఁడు కావలయుంగదా! ఇంక నిందలి సారగ్రహణ విషయము 'సురసాని సర్వాణి' 'సరసంసకల' మ్మనియుననుటలో స్ఫుటతరము నగుచున్నది. ఇట్లుండ,

"నేతాయత్రోల్లసతిభగవత్పాద సంజ్ఞో మహేశ
శ్శాంతిర్యత్రప్రకచతి రసశ్శేషవానుజ్జ్వలాద్యైః
యత్రావిద్యాక్షతిరపిఫలంతస్యకావ్యస్యకర్తా
ధన్యోవ్యాసాచలకవివరస్తత్కృతిజ్ఞాశ్చధన్యాః॥"

అను శ్లోకమందలి 'వ్యాసాచల' శబ్దమునకు ధనపతిసూరి, తానన్యోచ్చతర వ్యాసాచల కృతిజ్ఞుండయిన ధన్యత నందమింగావలయు,

"వ్యాసఇవాచలః స్థిరశ్చాసౌ కవిశ్రేష్ఠశ్చేతి వ్యాసాచల కవివరో మాధవోధన్యః"

అని మాధవపరముగ నర్థము సాధింపఁజూచె. కాని, తద్వ్యాసాచల కృతద్వాదశ సర్గాత్మక 'విజయము' జూడఁ జాలిన వారట్టి క్లిష్టసాధనములకుఁ బాల్పడరు. అది యటుండె. ఇది పేరను 'సంక్షేపవిజయ' మయ్యు షోడశసర్గాత్మకము. ఇందుఁ బూర్వ మీమాంసాప్రచారము మెండగుటయు మాధవకృతమే యగుననుటకుం దార్కాణ. కాని, వ్యాసాచలకృతి పఠితలకందలి శ్లోకము లిం దటనట యథాతథముగా గ్రహింపఁబడినట్లు మాత్రము కానుపింపనౌను. అందో, వింతలేదు. ఏలయన, నిక్కవి, 'ప్రాక్కవిహృద్యపద్యే ష్వేషాఽపి మత్పద్యనివేశభంగీ' యనియే యుపక్రమించినవాఁడయ్యె.

**మాధవాచార్యుఁడు:—**

'సంక్షేపశంకరవిజయ' కారుఁడగు సీమాధవాచార్యుండు 14వ శతాబ్దిలోనివాఁడని చారిత్రకులు కొంతవఱకు నిరూపించి యున్నారు. ఇతఁ డాంధ్రబ్రాహ్మణుఁడే యందురు. ఈతని తండ్రి మాయణుఁడు. సోదరుఁడు సాయణుఁడు. మాధవసాయణులు పుంభావసరస్వతులు. విజ్ఞాననిధులు. వీరికి క్షీరనీరన్యాయసిద్ధి. వీరి కృతులం దుభయకర్తృకములు పెక్కులు కానుపించెడిని. వీరల వేత్తృత్వము వాచాతీత మనుటకుఁ దద్విరచిత గ్రంథానేకములం గొన్నిఁటి దిఙ్మఖముగాఁ జేర్కొందుము.

వారు మనుపరాశర స్మృతి వ్యాఖ్యలు, వ్యవహారమాధవీయ కాలమాధవీయములు మున్నగు ధర్మశాస్త్ర గ్రంథములును, పురాణ సార సూతసంహితా తాత్పర్యాదులగు పౌరాణికములును, సిద్ధాంతబిందు సూర్యసిద్ధాంతటీకలు, ముహూర్తమాధవీయ ప్రముఖములు నగు జ్యోతిషకల్పములును, శ్రీవిద్యాతీర్థదీపికా విద్యారత్న సూత్రభాష్యప్రభృతిక మంత్రశాస్త్ర రహస్యసముచ్చయములును, ధాతువృత్త్యాదిశాబ్దికకోశములును, వైద్యనిదానసంహిత

యను నాయుర్వేదసారమును, జైమినీయన్యాయమాలాదినైయాయికములును, వివరణ ప్రమేయ సంగ్రహ సర్వ దర్శనసంగ్రహాది మత వివరణములును, పంచదశి, జీవన్ముక్తివివేకము, యోగవాసిష్ఠసార సంగ్రహము, అష్టోత్తర శతోపనిషద్దీపిక మున్నగు వేదాంతోద్బోధక కృతి రత్నములును, దుదకిది యది యననేల, దుర్భేద్యవిజ్ఞాన పేటికయగు వేదమునకే ప్రత్యేక వివరణరూప భాష్యములును, శతాధికముగా విరచించి మించిన సకలకలాపరిపూర్ణులగుట, నిజయశశ్చంద్రికాపూరితాశాంతులయిరి. తత్తద్గ్రంథోదిత బోధామృత వారాంనిధి వీచికాపరంపరల నవగాహ క్రీడలందేలఁ జాలిన యార్యావర్త ప్రజలు శ్రౌతస్మార్త నిత్యకర్మానుష్ఠాన యోగ్యతా వాప్తినందఁ జాలిరి. ఇట్లు నూతన వైదికయుగకర్తలయిన యీ మాధవసాయణులకుండిన లౌకికప్రజ్ఞ మఱెంత యద్భుతావహము.

ఇందు జ్యేష్ఠుండగు మాధవార్యుండు.

అగ్రత శ్చతురోవేదాః । పృష్ఠతస్సశరం ధనుః।
ఉభాభ్యాంచ సమర్థోహం । శాపాదపి శరాదపి॥

యనునట్లు, హరిహర బుక్కరాయలయొద్దఁ బ్రధానమంత్రిపదమునొంది శస్త్రవిద్యా ప్రావీణ్యము మెఱయఁ దురుష్కులతోఁ బోరి, గోవాకోట నధీనము కావించికొని, నిజబాహుబలోపార్జిత రాజ్యుండయి, విజయనగర సామ్రాజ్య సంస్థాపనముఁ గావింపఁ జాలిన వీరాగ్రగణ్యుండు. పెక్కురు విప్రోత్తముల కగ్రహారము లొసంగిన నెఱదాత. ఈతఁ డన్నిట సృష్టికిం బ్రతిసృష్టి యొనర్పఁ జాలిన శిల్పకళా వైదుష్యము కలవాఁడనుట కిప్పటికిని పెక్కులు తార్కాణములు కలవు. పరమార్థ మింకొక్కటి గమనింపఁ దగినది. ఈతఁడును బ్రహ్మచర్యముననే తురీయము గ్రహించి,

ఏకాదశాఖ్య రుద్రేతి । సంభవిష్యామ్యహంకలౌ।
పంపాక్షేత్రే సురనుతే । విద్యారణ్యేతి నామతః॥

అను నాచార్యోక్తి ననుసరించి శాంకరపీఠము నధిష్ఠించిన యవతార పురుషుఁడు. ఇట్టి యభినవ శంకరులు విరచించిన గ్రంథ రాజము.

ప్రీయాసు ద్యుతిఖండమండన కృపారూపాంతరశ్రీగురుః
శ్రీమస్త్వేష సమగ్రశాస్త్రమధురవ్యాహార సూనోత్కరః।
ప్రౌఢోయం నవకాళిదాసకవితా సంతానసంతానకో,
దద్యాదస్య సముద్యతస్సు మనసామామోద పారంపరీమ్॥

అన్నట్లునవ కాళిదాసు కవితయేయననేల, యింకేమయిననగు ననుటకబ్బురమా?

ఆంధ్రీకరణము:—

సంస్కృత వాఙ్మయ రత్నాకరము నుండి యట్టియమూల్య రత్నములం గొనితెచ్చి యాంధ్రభాషా వధూటికి సమర్పించు సుధీవరులగు ధీవరులెంతయుఁ బ్రస్తుతిపాత్రులు కదా! ఏలయన, స్వతంత్రకృతులందుఁ గవి తనకలము నిరంకుశముగా సాగింపఁగలఁడు. కాని, యొక భాషలోనుండి మఱియొక భాషలోని కితరులభావములు రసభంగము లేకుండఁ బదగుంభనము చెడకుండఁ దెచ్చుట యెట్లయినఁ గష్టతరము. అందును, నిట్టి 'నవకాళిదాస' కల్పిత ప్రౌఢకావ్యముల తెరువున కేగుటకుఁ జాలినంత సాహితీపటిమ యబ్బియుండవలయు. పూనిక మొదటినుండి తుదిదనుక నెగ్గించికోఁ జాలిన నిబ్బరమును బ్రబ్బియుండినఁగాని నెఱవేఱదు. పైన, నిందు మీమాంస విస్తరించియుండుటను, వేదాంత రహస్యములు పెక్కులుచేరిన దగుటను దత్తచ్ఛాస్త్రపరిచయము నద్వైతజిజ్ఞాసుత యునున్నఁగాని కొన్నిట సులువుగాఁ గొఱుకుపడదు. ఇందొకటి యబ్బిన వేఱొక్కటియబ్బదు. ఇంతకును,

నైవవ్యాకరణజ్ఞమేతిపితరం నభ్రాతరం తార్కికమ్।
దూరాత్సంకుచితైవగచ్ఛతి యథాఛండాల తశ్ఛాన్దసాత్।
మీమాంసానిపుణం నపుంసక ఇతిజ్ఞాత్వానిరస్యాదరాత్।
కావ్యాలంకరణజ్ఞమేవకవితా కన్యావృణీతే స్వయం॥

కలిగిన దిట్టయై యతఁడు, పురాణ ధర్మశాస్త్ర ప్రసిద్ధంబులగు పెక్కు కబ్బముల ‘సత్తింగూర్చి’ ‘తాళీదళప్రాంతమందు’ వ్రాసి, ‘ఆ। ధనమే మమ్ము నిధానమై మని చెడిందథ్యంబుగా నిత్తఱిన్॥’ అని కవిచెప్పికొనఁదగిన ప్రస్తుతసంపత్తికూడ నొసఁగినవాఁడయ్యె. తదగ్రసూనుఁడు వేంకటాచలపతిశాస్త్రి తత్తద్గ్రంథాను భవము పూర్తిగాఁ గలిగి వన్నెకెక్కిన పౌరాణికుఁడు, ధర్మశాస్త్రవేత్త, నిత్యాగ్నిహోత్రి, పరమశాంతమూర్తి. తత్సహధర్మచారిణి, గుణకదంబపిచ్చమాంబ. తద్గర్భశుక్తి ముక్తాఫలం బీకవిరత్నంబు.

ఈతఁడు స్వాధ్యాయాధ్యయనము ప్రారంభించి లేఁబ్రాయమునసే స్మార్తవిద్యను షోడశకర్మాధికారిత నందిన దటుండఁ గావ్యనాటకాలంకారాదికముల గురుముఖమున నభ్యసించి, మంచి సాహిత్య సంపదనందినవాఁడై తర్కప్రకరణములను లఘుకౌముదియుం గఱచె. ఇంక నాంధ్రమునను బిత్పాదులతోడఁ బెక్కుకబ్బములం జదివి వైద్యము నార్జించె. మఱియు నటనట నాగమతంత్రజ్ఞతయుఁబడసె. ఇట్టి యీతనికిఁ ‘బ్రాక్తనజన్మవిద్య’ యోయన, నవకోమల కవితావనితా స్వయంవరంబబ్బె. ‘హేమ్నః పరమామోద’ మ్మన్నట్లున్న పాండితి కది వన్నెతెచ్చె. అంతకుం బెచ్చువయసునఁ బిన్నయాతతిఁ బాండితిం బెద్దయయ్యె, ‘నమంతి గుణినోజనాః’ అనుదానికిఁ దాను లక్ష్యభూతుండయి విధేయతాది సల్లక్షణయుతుఁడై నిరాడంబరుఁడై నెగడు నది మఱెంత ప్రశంసార్హము.

‘కవియశఃప్రార్థు’లగు వారు మున్ముందుగాఁ జాటువులుం బిదపఁ జిఱుకబ్బములుంగొన్ని యైనవెనుక నుద్గ్రంథరచనమునకుఁ గడంగుచుందురు. ఈకవిసింహమో ‘కీర్తిర్యస్య సజీవతి’ యనితదు ప్రాజ్ఞోక్త్యగ్రియై, ‘కేవలకల్పనాకథలు కృత్రిమరత్నము’లని తొలుదొల్తనే, ‘నవకాళిదాస’ గ్రథిత మహాకావ్య మత్తేభ వశీకరణైక చిత్తవృత్తిం గలిగి యట్లొనర్పఁగలిగిన వాఁడయ్యె. అట్టి యీతని పూనిక కొనసాగఁగనుట ప్రాగ్భవపుణ్య పరిపాకమే యనఁదగినది,

ఈతని యాంధ్రీకరణము కొంతవఱకు మూలానుసారముగను జాల వఱకు 'డిండిమ' వ్యాఖ్యానుసారముగను నడచినది. కావుననే దిగ్విజయ కథనమున మూలముకన్న విస్తరించినది. ఎట్లయినఁ దత్తచ్ఛాస్త్ర పరిచయలోప మట నట బాధింపకపోలేదు. బుద్ధి మంతుఁడగుటనే యింతవఱకు సమర్థింపఁగలిగె ననవలెను. మాధ వీయమునఁ బదేనవసర్గమును నవమాశ్వాసముగా విరచించుతఱి నానందగిరి ప్రణీత భాష్యమంత్రియుత 'శంకరవిజయము' నూఁతఁ గావించికొనెను. ఇంతకు, శాస్త్రచర్చ విస్తరించుతఱి నింపుగోలు పమి, 'నమః ప్రామాణ్య వాదాయమత్కవిత్వాప హారిణే' యను నట్లు కొంత విసువను విడిచె.

కవిత్వశైలి:—

కావ్యకాంతకు వాగర్థములే దేహమనియు, రీతులంగస్థాన విశేషములనియు, గుణములే గుణగణములనియు, నుపమాద్యలం కారము లాభరణప్రాయము లనియు, దోషములు కాణత్వాదిక సదృశములనియు నంతకుం బ్రధానము రసమే జీవితమనియుం జెప్పు దురు. కావున, మూలము యమకానుప్రాసాంత్య నియమాది బహుళంబైనను, 'ప్రాయేణ యమకేచిత్రే రసపుష్టిర్న విద్యతే' యను నాలంకారికోక్తి మనమున నిడికొని యిక్కవి యాంధ్రీకరణ మున శబ్దాలంకారముల నెక్కువగాఁ బాటింపలేదనవలెను. ఈ తని కవిత మొత్తముమీఁద సుశబ్దయుతమై ధారాశుద్ధి గలదైనను నిది యీతనికిఁ దొలుతటి కబ్బమగుట నిందుఁ గ్రియాత్యాదికంబె సాగిన కొలఁది వ్యర్థపదప్రయోగాదికము లచ్చటచ్చట రసపోషణము హెచ్చినట్లు కానుపింపకపోదు. మఱియు నీకవిజనకులు పౌరా ణికులయి పెక్కుసారులు భాగవతమ్మును బఠింపఁ దావినియుంటంగాఁ బోలుఁ బండితపామర హృదయంగమములగు నందలి పోకడలీతని కొకవిధముగా నలవడినట్లు కానుపించెడిని. ఇందులకు, దిఙ్ముఖ ముగా నొక్కెడఁ గల మూలశ్లోకములను నవి తెలిఁగించిన తెఱఁ గుం జూపెదను.

శ్రేణికిఁ దోయజాత భవచిత్తవశీకరణైక వాణికి,
న్వాణికి నక్షదామ శుకవారిజ పుస్తకరమ్యపాణికిన్॥ (పోతన)

ఉ॥ వర్ణనఁజేసి మ్రొక్కెద శివస్ఫురదంకతలాంచితాసనో,
దీర్ణకు భక్తకామిత వితీర్ణకు సాధుజనానురాగ సం,
పూర్ణకు నంబుజప్రభవముఖ్య సుపర్వచయాస్తుతాత్మస,
ద్వర్ణకుహర్ష పూర్ణకు సువర్ణసవర్ణకు నన్నపూర్ణకున్॥ (౫-౧౯౩)

ప్రతిపద భిన్నాంత్యాను ప్రాసంబులకివి పోల్చిచూచునది:

సీ॥ కమనీయశుభగాత్రుఁ గంజాతదళనేత్రు వసుధాకళత్రుఁ బావనచరిత్రు,
సత్యసంకల్పు నిశాచరోగ్రాకల్పు సతపస్స్వగాకల్పు నాగతల్పుఁ,
గౌస్తుభమణిభూషు గంభీరమృదుభాషు శ్రితజనపోషు నంచితవిశేషు,
నీలనీరదకాయు నిర్జితదైతేయు ధృతపీతకౌశేయు నతవిధేయు,
నఘమహాగదవైద్యు వేదాంతవేద్యు। దివ్యమునిసన్నుతామోదుఁ దీర్ఘపాదు,
జిష్ణు వరసద్గుణాలంకరిష్ణుఁ గృష్ణుఁ।జూడుదైతేయకులబాల సుభగలీల॥(పోతన)

సీ॥ మౌళిసంగతగంగ మదగజాసురభంగ మహితకృపాపాంగ మదనభంగ,
విధుశిరోభూషణ విశ్వాతిశోషణ విధిముఖపోషణ వినుతధిషణ,
నిజభక్తజనపాల గజజినోత్తరచేల కరకంజధృతశూల కాలకాల,
నిగమౌఘకంఖాణ నీరధిచయతూణ శరధిజాధవబాణ వరకృపాణ,
నిఖిలపశురక్షణోత్కంఠ నీలకంఠ। సారథికృతపంకేజాత జాతశీత,
శైలకన్యామనోహర సర్వహర। పాహివిశ్వేశ కాశీశ పార్వతీశ॥ (౫-౧౯౨)

మఱియు నిక్కవి తన రచనమున నెటఁజూచిన సాంస్కృతికము లెచ్చుగఁజేర్చినవాఁడయ్యుఁ బోతనవలె నెటనేనియు సొంపుగులుకు నచ్చతెనుంగులం గూర్చినతెఱంగున కివి పరికించునది:

సీ॥ తలపైననూఁడుపోకలఁబోవు చదలేఱు సాగితా నొకవింత సలుపుచుండ,
వలకేలనిమావ యాఁదలపైఁ జెలంగుచుఁ దెలిమానికపుఁజెల్వుఁ గొలుపుచుండ,
నఱుతనల్లనిమచ్చయల్లో నేరెడుపండువలెనుండి నీలంపుఁ జెలువుఁగూర్ప,
అొమ్మునందున వేమొగమ్ముల చిలువతాజందెమై యొకవింతయందమొసఁగ।
మంచుమలపట్టి తొడపైన సంచునించఁ। గాలిదమ్ములపైన జేజేలువ్రాలఁ,
జిఱునగవుపల్కుతోఁగూడి చెలువొనర్పఁ। జెలఁగు మిమ్ముఁ గంటిఁజెట్టలఁ
జీల్చికొంటి॥ (౫-౧౮౮)

చ॥ కలకురులొక్కమాదిరిగ మొగమ్మునఁగ్రమ్మి యటున్నయట్టిరి,
క్కలగుమిఱని కప్పాక రకమ్మగు చెల్వమొసంగుచుండఁ దా,
వలమగఁ దావలమ్ములగు పాములు నొఁదలలూఁచుచుండఁ జిం,
దులఁ జలిగట్టుపట్టి కనఁదొక్కటు నిన్నుఁ బలంతు నిచ్చలున్॥ (౫-౧౯౩)

ఇంక నియ్యది మృదుమధురపద గుంభితములై ద్రాక్షాపా రకములగు సముచిత వృత్తరీతుల నలరారుచున్న వన్నియం దెలుపుటకై.

మ॥ రసనాగ్రస్థలనృత్యదబ్జభవ భార్యాపాదమంజీర యు।
గ్మసుశబ్దంబులొ సత్కటీతట లసత్కాంచీనినాదంబులో।
లసదాత్మీయ చలత్కరాబ్జ కటకాలాపంబులోయన్న మా।
నసశంకన్ జనియించు శంకరుని విజ్ఞానంపు వాగ్గుంఫముల్॥ (౪-౧౦౫)

మ॥ అరవిందంబులఁ దోఁగి యుత్పలసమూహంబందు నర్దాఁగి క।
ప్పురపుం దిప్పలఁ మూఁగి చందనపుటామోదమ్మునన్ మ్రాఁగి క।
స్తురినింబుగ్గునసాగి సూననిచయాస్తోకాంచితామోద సం।
భరితంబై మలయానిలం బెసఁగె నాపత్రిత్ర్యాపమందొప్పగన్॥ (౭-౬౩)

ఇట్టి ప్రాచీనకవితాశయ్య పట్టువడిన యీతనికి భాషాంతరీకరణమునఁ గలిగిన నేర్పును గొన్ని యెడలఁ బెంచి వన్నెతేఁజాలిన విధముం దెలియుటకిట సమూలముగా నుదాహరించువాఁడను.

మూ:- గిరాంధారా కల్పద్రుమ కుసుమధారా పరగుణో।
త్తదర్థాలీ చింతామణి కిరణవేణ్యా గుణనికా।
అభంగవ్యంగ్యౌఘ స్సురసురభి దుగ్ధోర్మి సహభూ।
ర్దివం భవ్యైః కావ్యైస్స్రజతి విదుషాం శంకర గురుః॥

సీ॥ తనవాక్యసద్ధారఘనకల్ప భూమిజాత సుగంధవత్పుష్పధారగాఁగఁ।
దత్పదర్థాళి చింతామణీకిరణ సరోజవేణీ నృత్యరూపగాఁగ।
భంగహీనవ్యంగ్య పాళినిర్జర ధేనుకామదక్షీరోర్మిగణముగాఁగఁ।
నుత్తమరసపాళి నత్తమిల్లెడిగుణావళి లసత్ప్రియాపజలధిగాఁగ।
సకలసజ్జననిచయంబు సంతసిలఁగ। భవ్యగంభీర మృదుకోశపాళిచేతఁ।
బరమకరుణాబ్ధియైన శంకరగురుండు। నాకముంగల్గఁజేయు నీలోకమందు॥
(౫-౩౯)

మూ:- రోషానుషంగ కలయాఽపి సుదూరముక్తో।
ధత్తేఽధిమానసమహో సకలాః కలాశ్చ।
సర్వాత్మనా గిరిజయోపహితస్వరూప।
శ్శక్త్యో నవర్ణయితుమద్భుతశంకరస్త్వాం॥

సీ॥ క్రోధామషంగముక్తుఁడవీవు యతివర్య రోషానుషంగ నిరుద్ధుఁడతఁడు।
కలలఁదాల్తువు మనఃకంజంబునందీవు తలనొక్కకలఁదాల్చి చెలఁగునతఁడు।
గిరిజతో నెల్లెడవఱలెద వీవెప్డు నర్ధాంగగిరిజుఁడై యలరునతఁడు।
ధనమన్న వినక మేదినిఁ జరించెదవీవు ధనదునండను గొని మనునతండు।

నీకు శివునకు నెంతయో నెగడు భేద । మనని నద్భుతశంకరుండనటు కాన।
నోయమీద్వర నిను నుతిఁ జేయుటకును । జిలువ తీనికి నేనియు వలవిగాదు॥

వెండియు, నీతని వ్యాఖ్యానసరణము దానసైన విపులీకరణము. తెలుపుటకింకొక ముఖ్యఘట్టమగు 'మండనమిశ్ర సంవాదము' న నొక్కింతయగపఱచెద.

మూ:- 'భో భో యతిక్ష్మాధిపతే భవద్భిర్జీవేశయోర్వాస్తవమైకరూప్యం।
విశుద్ధమంగీ క్రియతే హి తత్ర ప్రమాణమేవం నవయం ప్రతీమః॥

వ్యా:- 'భో భో ఇతిసంభ్రమే వీప్సా, యతిక్ష్మాధిపతే యతిరాజ, జీవేశ్వరయోర్వాస్తవమైకరూప్యం విశదం యద్భవద్భిరంగీ క్రియతే తత్ప్రమాణం వయం న ప్రతీమః నజానీమః తత్ప్రమాణం నాస్తీత్యర్థః అయంభావః నహి శ్రుతిమస్తక ముక్తార్థే ప్రమాణం భవితుమర్హతి. శుద్ధబుద్ధోదాసీనతయోపేక్షణీయం బ్రహ్మభూతమభిదధత స్తస్యాః పురుషార్థోపదేశినోఽప్రయోజనత్వ ప్రసంగాత్' కించ యథా లౌకిక వాక్యాని ప్రమాణాంతరాపగతార్థబోధకానినస్వతః ప్రమాణం తథాభూతార్థానువాదకత్వేన శ్రుతిమస్తకస్యానపేక్ష్యలక్షణం ప్రామాణ్యం వ్యాహన్యేత. తథాచ ప్రత్యక్షాది విషయస్య పరినిష్ఠితవస్తునః ప్రతిపాదనాసంభవాత్తత్ప్రతిపాదనేచ హేయోపాదేయ రహితే పురుషార్థాభావాచ్ఛ్రుతి మస్తకస్య తత్ప్రమాణత్వాభావేన భవత్సిద్ధాంతే వయం ప్రమాణంన ప్రతీమ ఇతి.'

సీ॥ ఓసంయమీశ్వర వాసిగా జీవేశ్వరులకు నెప్పుడు నేకరూపమగుట।
మంచిగా నంగీకరించెదరీరందు నలరుసాక్షిగ బ్రహ్మమనవరతముఁ।
దగశుద్ధతను బుద్ధతను నుదాసీనత నొప్పుచుంటనటంచుఁ జెప్పిమరలఁ।
బురుషార్థదముగఁ జెప్పుటను వేదశిరంబులకు నెప్డునప్రయోజకతయనదె।
యయియు మానాంతరావగతార్థబోధ । కంబులగు లౌకికోక్తులగతి స్వతః ప్ర।
మాణవిషయంబుగాఁగ నాత్మనువచింప । కునికినందుఁ బ్రమాణంబుఁ గనము
మేము॥ (౭–౮౭)

అర్థాలంకారములు:—

ఇంక, 'శబ్దార్థయోరస్థిరా యేధర్మాః శోభాతిశాయినః। రసాదీనుపకుర్వంతోఽలంకారాస్తేఽంగదాదివత్॥' అని విశ్వనాథ పంచాననుఁడు వల్కినట్లన్ని కావ్యములం దట్లే 'మాధవీయము'వను నుపమోత్ప్రేక్షాక్షేపదృష్టాంత నిదర్శనాద్యలంకార విశిష్టములగు పట్టులం దెలుఁగు సేఁతయుం జవిచూడఁ దగినది. అందుఁ బ్రథానమును సాధర్మ్యబోధకమునగు నుపమాలంకారమునకు:

కావ్యగుణంబులు సోదాహరణంబులుగా నిరూపించుటయు మొద
లిడిన నింక గ్రంథవిస్తరమగునని యభిరూపశేఖరులపై నాభార
ముంచి యందుం దుదిఁగల చిత్రబంధగర్భ కవితాచమత్కృతిం
గూర్చి యించుక ప్రస్తావింతును.

బంధగర్భకవిత:—

'కావ్యాంతర్గడుభూతాయాం । సాతునేహ ప్రపంచ్యతే।
రసస్య పరిపంథిత్వా । న్నాలంకార ప్రహేలికా॥'

యనునట్లు రసజీవితములగు ప్రబంధములం దఱచుగాఁ
చిత్రబంధాదుల సంధింపరు. కాని చమత్కారమునకును వైదుష్య
ప్రకటనమునకును బ్రౌఢకవిరాజులు మాఘప్రభృతులోపికదీఱిన
నంతంతవి పొందుపఱచి నిజశిల్పకల్పనాప్రాచుర్యము కావించుట
తజ్జ్ఞులకు విశదమేకదా! ఈకవివర్యుఁడు నట్లు, దిగ్విజయానంతర
నకశ్లేషస్తుతియందును నవతారపరిసమాప్తికగు విబుధాగ్రకర్తృక
శంకరస్తవమునను దనకుఁ గలిగిన యందలి నేర్పొక్కింత యగపఱ
చినవాఁడయ్యె. అదియుం బ్రశంసార్హమేకదా!

దోషములు:—

ఇఁకఁ బ్రబంధకవిత వెనుకఁబడిన యీదినాలలో నిట్టిది
పద్యరూపమున రచింప నేమిటికని కొందఱనవచ్చును. మఱియు,
వేదాంతరహస్యోద్బోధనము గీర్వాణమున నుండ నది సులభగ్రా
హ్యముకాదనికదా తెలిఁగించునది. అట్టియెడ నెంత తేటతెనుఁగున
నున్న నంతమేలాయె. మఱియు, మీమాంసాపూరిత మతచర్చ
లకును రసోద్దీపక భావగర్భిత కవితారీతులకును దూరమాయె.
కావున, వచనరచనముననే మేలయ్యెడిదని తోఁపనువచ్చును. పైఁగ
నిందుఁ దొలుత గద్యపద్యాత్మకముగా మొదలిడినను బోయిన
కొలఁది నిర్వచనమే యయినది. అది రుచిభేదము. కాక, యా
ధ్యాత్మికచింత మొదవవలెంగాని యిదిమదికెక్కించికొన గణబద్ధశ
యన్నా? శైలి సులభమేయాయె. కాదందురా, వచనకృతు
లిదివఱకేయుండె. ఇది పైమెట్టు. ఇందు నెందైనఁదలివిపందని

కొండఱికిఁ గ్రమముగా యథామూలసారగ్రహణైకపరత కవకాశ మొదవించినదైనఁ గానగుఁగదా! ఇంతకు 'మహాజనో యేన గత స్సపంథాః' అని యిట్లు కావ్యరూపమునఁ గావించెననికోఁదగినది.

అయిన నిందప్రయుక్తాది పదగతదోషములుగాని, 'శబ్ద హీనా'ది వాక్యగతదోషములుగాని, 'యపార్థ' ప్రభృతి కార్థదోషములుగాని కలవా యనుట కేతద్గ్రంథపరిష్కరణాదికమున నెక్కువగాఁ బాల్గొన్న నాకన్నఁ బ్రాజ్ఞవతంసుల బుద్ధియే ప్రమాణము. 'హేమ్నస్సంలక్ష్యతే హ్యగ్నౌ । విశుద్ధిశ్శ్యామికాపివా' యను నట్లీకావ్యరత్నము తచ్ఛాణోల్లీఢంబగు తఱింగాని దోషవిరహితత్వము నిరూపింపఁగాదు. కాని, స్థూలదృష్టిని, 'పాదపూరణమాత్రం యత్తన్నిరర్థక ముచ్యతే' యనునట్టివిమాత్రము సమస్తపదములను వ్యస్తములను గానుపించితీఁయునని మాత్రము చెప్పఁగలను.

ఇంక, ఛందోవిషయమున నఖండయతియాధునిక కవిసమ్మతినెటనేని గ్రహింపఁబడినది. మఱియు.

'ముఖ్యపంచకమనుచుఁ జె ♦ ప్పఁగురశస్త' ౧౦—౭౩

'శాస్త్రములనొసంగిన యయ్యాతి ♦ పునను నెల్ల' ౧౦—౭౮

మున్నగు పెక్కు తావులఁ బోలింపఁగాకున్నను 'పు' 'ము'లకు మైత్రికాననౌను. కాని, 'ముత్తెపు ఝల్లరులతోడి ♦ బుఱ్ఱటకొమ్ము' లెఱిఁగినవారికిది క్రొత్త కాదుకదా. మఱియు, 'ర' 'ఱ' ప్రాసమునుగలదు. కవిజనాశ్రయమున,

క॥ వణలను రెండక్కరముల । కును వడిఁ బ్రాసంబుఁ బెట్టుకొనవచ్చుఁ గృతి ।
న్విషు రఱల కట్లపెట్టం । జనులకెల ♦ ఖేదమరయ సర్వజ్ఞనిధీ॥

యని త్రోవచూపఁబడియున్న దేయాయె. 'నాన్యేషాం వైధర్మ్యం లఘ్వలఘూనాం రయోస్తు నిత్యంస్యాత్' అను నాంధ్రశబ్దచింతామణి ప్రోక్తసూత్రానుసారముగా,

'ఉ॥ బమ్మెరపోతరాజ కృతభాగవతంబు సలక్షణంబుగా
కిమ్మహినేమిటం గొదవయెంతయు నారసిచూడఁగాను రే ।
ఫమ్ములు ఱాలునుంగలిసి ప్రాసములైన కతంబునంగదా ।
యిమ్మ్మల నాదిలాక్షణికులెల్లను మానిరుదాహరింపఁగన్॥'

అని పోతనకై తలంచిన యప్పకవి తానే, 'కేరు, చేరు, తాఱు, దూఱు,' ప్రభృతులం గూర్చియుండెనాయె. ఇతరులమాట చెప్పనేల? నన్నయ పెట్టినదే భిక్షమగుట నాతనివిడిచిన నిఁకఁ దక్కిన తిక్కనాదులందు లఘ్వలఘురేఫమైత్రి గూర్చనివారే యరుదేమో! ఇట్లు మహాకవి సమ్మతిపడసిన వానిని దోషములుగాఁ బరిగణింపనేరాదు. కావున, మొత్తముమీఁద నిది యుత్తమ కావ్యములం దొక్కటిగాఁ బరిగణింపఁబడఁదగినదే యననౌను.

ఇంకఁ గథాసందర్భములం దెటనైన మదికిఁ బొడకట్టఁదగు ససంగతాంశములంగూర్చి ముచ్చటించికొందము.

(i) ఇందు మండనమిశ్ర జననీజనక సంవాదమునఁ బ్రాస్తావికముగా నొదవిన రుక్మిణీ పరిణయ కథాసందర్భమున నిట్లుకలదు.

తే॥ ద్వారకావిభుఁడైన యాశ్రీరమణుఁడు । తీర్థసేవాచ్ఛలంబునఁ దిరుగుచుండఁ।
కుండినేశుండునౌ భీష్మకుఁడు తనదు । తనయయైనట్టి రుక్మిణిఁ దడయకిడఁడె॥
(౩—౮౬)

ఇది ప్రసిద్ధగాథకు భిన్నముగదా. ఎట్లనిన, శ్రీమద్భాగవతమున,

'రుక్మీతు రాక్షసోద్వాహం । కృష్ణద్విడసహన్ స్వసుః
పృష్ఠతోఽన్వగమత్కృష్ణ । మక్షౌహిణ్యా వృతో బలీ॥' యిందులకు,

'వ॥ రుక్మియనువాఁడు కృష్ణుండు రాక్షసవివాహంబునం దన చెలియలిం గొనిపోవుటకు సహింపక నేకాక్షౌహిణీ బలంబుతోడ సమసన్నాహంబునం గృష్ణుని వెనుతవిలిపోయె.' పోతన

ఇట్లుండ, మూలగ్రంథమగు మాధవీయమునందు మాత్రము,

'నైవం నియంతు మనఘేతవశక్యమేత । త్త్వం రుక్మిణీం యదువరాయ కుశస్థలీశే ।
ప్రాదాత్స భీష్మకనతః ఖలు కుండినేశ । స్త్రీరాప దేశమట తే త్వపరీక్షితాయ॥'

యని యేలకో తద్భిన్నముగాఁ గలదు. దీన మనగ్రంథకర్త మూలానుసారియయ్యెనని మాత్రము తెలిసికోఁగలము.

(ii) కుమారిలభట్టు నగ్నిప్రవేశమును, వ్యాసజైమిన్యాది సందర్శన విషయమును జారిత్రిక సమ్మతి వడయుట దుర్ఘటము. ఇదియు మూలస్థమే. ఏమైన నవతార పురుషుఁడగు శంకరుఁ డిచ్ఛామాత్రమున నిజమనఃఫలకమున వారిని మూర్తీభవింపఁజేసి క్షోజ్ఞాళి యుంచునని కొందము. ఇంతకు, జిజ్ఞాసువులు సూక్ష్మ

ముగా జ్ఞప్తినుంచికొని మననము సేయ వీలుగాఁ దత్తత్ప్రోక్తములయిన సిద్ధాంతసూత్రములకు భగవత్పాదులు నిజభాష్యవిరచనమునఁ జైతన్యమొదవించి మెప్పువడయఁ జాలిరని నచ్చఁజెప్పుటకల్లభివర్ణింపఁబడి యుండునొప్పునదియైన సరిపెట్టికోఁ దగినది.

(iii) ఇందు, నవమాశ్వాసమునఁ గల నాచికేతోపాఖ్యానమునఁ దజ్జనకుఁడు గౌతముఁడని (౫-౨-౨) కలదు. శ్రుతులవల్ల భృగువని తెలియనగు. ఇది పర్యాయసంజ్ఞ కావలయు.

(iv) తుదిన ష్ణకుండ నిర్మాణము కేదారముననని కలదు. యాత్రికులు కొందఱు బదరికాశ్రమమునఁ జూచితి మందురు. గంధకపు గను లెటనుండిన నటఁ గానవౌను లెమ్మని కొన్నఁ బోవును.

అరయనరయ నింకేనెన్నియైన దొరకినదొరకుఁగాక. ఇందేవియు గ్రంథ ప్రాశస్త్యమునకుఁ గొఱంత తెచ్చునవి కావు. ఇంతకు నవిద్యాక్షతియే ఫలముగాఁగల యీ కోశావతంసమునకీ స్వల్పభేదములవలన నెట్టి కొదవయు నొదవనేరదు.

ఉపసంహారము:—

ఈకృతి తన్నాయక గుణగణ చరిత్రాభివర్ణనాదికమున కనువయిన శయ్యాపాక వృత్త్యలంకారాది బంధురంబయి చ్యుతసంస్కారాది దోషబహుళంబుగాక,

'సారశ్లేషవిశేష చిత్రపరిణామోదాత్త సద్రూపకై
ర్వ్యాఘాత వ్యతిరేకవద్భిరుపమిత్యన్యోన్యదృష్టాంతకైః।
విత్రైర్గర్భమదీవరేణ ఘటితైస్సమ్యగ్గుణోజ్జృంభితై
స్స్నిగ్ధోష్ఠైర్వివిధై రలంకృతిగణై రమ్యా రసో రాజతే॥'

యనునట్లు రససింధువై, సహృదయ హృదయాహ్లాదసంధాయకంబు కానొప్పు ననుట కింతయు సందియము లేదు. ఇట్లు సాక్షాచ్ఛంకర పవిత్రగుణాభివర్ణన రూపమయి యద్వైతార్థ ప్రతిపాదక మహాకావ్యమై, కవితారీతిని బోతన పాదచ్ఛాయలఁ ద్రొక్కఁ జాలినందులకు నాతఁడన్నమై,

ఉ, "ఇమ్మనుజేశ్వరాధములకిచ్చి పురంబులు వాహనంబులు
న్సొమ్ములు కొన్నిపుచ్చుకొని చొక్కి శరీరముఁబాసి కాలుచే
సమ్మెటపోటులంబడక సమ్మతి"

శ్రీసకలేశ్వరార్పణం

బిమ్మహినీతఁడిట్లు పొనరించుట మించుఁదరించు నెంచఁజోన్॥

చ. గురువిజయానుసారి బుధకుంజర మాధవకర్తృకంబు 'శం
కరవిజయం' బిటు తెలుఁగొనర్చె మృదూక్తుల, భక్తియుక్తులా
వరమతులార! మా నిడిపాటికులీనుఁడు సుబ్బరాయఁడా
దరము మెయిన్గనుండఁగుఁ గృతజ్ఞుఁడు విజ్ఞ లసద్గుణజ్ఞతన్॥

ఇట్లు,
ప్రాజ్ఞజనవిధేయుఁడు,
నాదెళ్ల మేధాదక్షిణామూర్తిశాస్త్రి.

బందరు,
20-5-31.



శ్రీ మేధా దక్షిణామూర్తయేనమః

# శ్రీ శంకర విజయము.

## ప్రథమాశ్వాసము.

---



కాత్యాయనితో మహేశ్వరగిరిస్థుండై ♦ చెన్నొందు వె
న్నదెపై । నేకత్వంబునఁబొల్చి కంజభవల ♦ క్ష్మీ
శేంద్రముఖ్యామరా । నీకంబెంతయు భక్తితోఁ
గొలువ ని ♦ ర్నిద్రానుకంపేక్షణా । స్తోకానంద
ములంజెలంగు సకలే ♦ శుం గొల్తు నెక్కాలమున్॥

శా॥ క్షీరాంభోనిధి మధ్యభాగమున భో ♦ గిశ్రేష్ఠసచ్ఛయ్యను ।
స్స్మేరంబానన మందె సంగ వరల ♦ క్ష్మి న్వక్షమందూని వి
స్తారామోదకరోక్తులం బలుకుచుం ♦ బచ్చిత్తకంజంబుఁ జే ।
న్నారంజేయురమాధవుం గొలుతు ను ♦ ద్యద్భక్తితో నెప్పుడున్

ఉ॥ ధాతకు, లోకసంచయవి ♦ ధాతకు, భక్తహృదీప్సితార్థసం।
ధాతకు, సత్తపస్విజన ♦ తానరదాతకు, సత్యలోకసం ।
త్రాతకు, నారదర్షివర ♦ తాతకు, నిస్తులవేదసంచయా ।
ధ్యేతకు, వాగ్వినేతకుఁ గృ ♦ తింగృపఁ బ్రోవ నతుల్గొనర్చెదన్॥

మ॥ అగజాతానన వారిజాతమున కౌ ♦ సర్యుండను విఘ్నాద్రిభే ।
ది, గజాస్యుండు విధూతభక్తదురితో ♦ ద్రేకుండు; లంబోదరుం
డగభేదిప్రముఖామృతాశ నుతుఁడా ♦ హారీభవన్మోదకుం
డగు విఘ్నేశుఁడు మన్మనశ్శ్రుతమున ♦ హ్లాదప్రదుండయ్యెడున్॥ ౪

చ॥ మనమున నెప్పుడుం దలంతు ♦ మంగళ నాదవిలాసమైన, నీ
ఱను, నొడిఁబెట్టి తుష్టినిడ ♦ నాంతమున్ స్వకరాంగుళిన్ గల ।
స్వనమొలుకంగ సుస్వర వి ♦ భాస్వర కంఠరవంబుఁ గూర్చిమీ ।
టునిఖిలలోకమాతను బ ♦ టుశ్రుతిగీతను వాగ్విశుద్ధికిన్॥ ౫

సీ॥ శ్రీమదద్వైతదే ♦ శికపావనంస్తవా; ప్తిసుకృతౌదార్య ♦ యుత
యును నురు । తపసయాభిఖ్య సు ♦ ధారసకలిత నీ; క్షణరక్షిత
బుధులో ♦ కయగుశార । దాంబ, నటద్విరా ♦ పాకుసమున్నత
మకుటాగ్రిని సరిన ♦ స్మహితగగన । గంగార్ఝురీతరం ♦ గచయ
కోలాహల; మనఖండి పాండిత్య ♦ మండితయగు॥

గీ॥ స్ఫూర్తిధారను గడునను ♦ రక్తితోడ । నాదు నాలుకకొనయను ♦
నవ్యసంచ । ముఖసదాసనమును రయ ♦ మునఁదగుగతిఁ జేర్చి
గావుత నను ధన్యుఁ ♦ జేయుఁగాత॥ ౬

గురుస్తుతి.

సీ॥ నారాయణుఁ జతురా ♦ ననువసిష్ఠమునీంద్రు; శక్తిర్షివరుఁ; బరా
శరమహర్షి । బాదరాయణముని ♦ ప్రవరు శ్రీశుకయోగి; విభు
గౌడపదుని గో ♦ వింద తీర్థు । శ్రీశంకరార్య దే ♦ శిక సార్వ
భౌముని; బద్మపాదాభిధా ♦ ప్రథితగురుని। ఘనుని హస్తామల ♦
క ప్రఖ్య ననఘు, దో; తక విఖ్యసంయమి ♦ ప్రకరధుర్యు॥

గీ॥ ధీమదభివందితుండును వా ♦ ర్తిక విరచయి । తయునగు సురేశ
గురుని మ ♦ త్రయు నితరుల । జ్ఞానదాయకులైన య ।
స్మద్గురువుల నిరతమును భక్తి ప్రముక్కు దా ♦ నింతునెదను॥ ౭

శా॥ ఓరా! నాయన! యంచు నెక్కుడగుగా ♦ రాబంబుసంజేసినై
శోరుస్థాయిగ నుంచిచెడ్డలను నే ♦ నొప్పారఁగాఁ జెప్పిన
స్థైరుం జేసిన వేంకటాచలపతి ♦ స్థీమద్గుణ స్తవ్యునా ।
శారాజత్ప్రతిభు స్గురూత్తముని మ ♦ త్స్వాంతంబునందెంచెదన్॥

కం॥ కొలుతున్ మద్గురుఁ గుప్పా । కులదుగ్ధపయోబ్ధిపూర్ణ ♦ కళ
లయహితు; ని । స్తులు నిస్సర్వకళాకరు । సలపుఁ శ్రీవేంక
టేశ్వ ♦ రాభిధువిబుధున్॥

చం॥ ధరణిఁ జతుర్విధాగ్రకవి ♦ తా వనితాహృదయంగమంబుగా ।
సరసముగాఁగఁగబ్బములఁ ♦ జాల రచించివిరించిఁ బోత్ర భా ।
సురయగువాణినివ్వేఁగ ♦ సూరులుమెచ్చ నొనర్చికొన్న వి ।
స్వరగురుఁ బూరుషోత్తమబు♦ధప్రవరున్భజియింతు భక్తితోన్॥౧౦

మ॥ తనయాత్మోద్భవునందున న్వజలు చే ♦ దాక్షిణ్యమద్దానితో ।
ననువీక్షించి మెఱుంగువెట్టఁగనుచుం ♦ దప్పుల్కృతిం దెల్పిన ।
న్ననుధన్యుంబొనరించు నాదేశికులేం ♦ దుంబూరుషోత్తంసు స ।
జ్జనగణ్యుం గవివర్యధుర్యుఁ గరుణా♦సారున్బ్రశంసించెదన్ ॥౧౧

మ॥ నాకుండమ్ములులేమి నీవెనుము యె ♦ న్నందమ్ముఁ జౌదంచు న ।
స్తోకంబౌకృప నాపయింబఱపి యెం ♦ తో శ్రద్ధమైఁబూని నా ।
వాకబ్బంబుననున్న తప్పులను బా ♦ యంజేయఁ దోడ్పైన వి ।
ద్యాకుత్పీలము సత్కవిందలఁతు మే ♦ ధానక్షిణామూర్తినేన్ ॥

శా॥ ఆదిన్నాకుజు బౌనరాయణుని, ని♦ త్యంబైన సద్భక్తిఁ గా
ళిదాసు న్భవభూతి, బాణు, శుకు, గీ ♦ ర్లీలావిదీశానులన్ ।
వైదుష్యంబు వహన్ విరాజిల నమో ♦ వాకంబు వాకొందు నా
కేదోషంబులు లేకపోవుటకు సం♦ హృష్టాంతరంగంబుతోన్॥ ౧౩

చం॥ తొలుతఁ దెనుంగు బాసను బు ♦ ధుల్కవి మెచ్చఁగ భార
తాదులన్ । లలితగతి న్రచించి విపు ♦ లంబగు పేర్మిని
మేలు నెల్లమ । ర్త్యులకు నొనర్చి యాఁ వివి ♦ ధుస్థిరమా
యశమున్గడించి ధ । న్యులయిన సత్కవీంద్రుల న ♦ నూన పు
భక్తి భజింతునెప్పుడున్॥ ౧౪

— అవతారిక —

సీ॥ శ్రీమాన్యమైన పూ ♦ ర్ణా మహానదిచెంతఁ; గాలట్యభిఖ్యవి ♦
ఖ్యాతమైన । వరపురంబున శివ ♦ గురు మహీసురవరు; గర్భ
శుక్తికి మహాసూక్తి ♦ కంబనంగ। జనియించి పంచమ ♦ సమకృత
వ్రతుఁడౌచు; సకల వేదంబుల ♦ సారమరసి। సంసారమునుఁరోసి ♦
సన్యసింపఁదలంచి; జననిచే నెట్టులో ♦ యనుమతిఁగని!

గీ॥ యతివరేణ్యుఁ డానంది కుమతాగ ♦ వితతినెల్ల । నుక్తివజ్రంబుచే
సంత ♦ మొందఁజేసి । సుఖకరాద్వైత విద్యనే ♦ సూరివర్యుఁ ।
డలరఁజేసెనో యాశంక ♦ రార్యుఁదలఁతు॥ ౧౬

ఉ॥ శ్రీగురుదేవపాద సర ♦ సీరుహ యుగ్మము నాత్మ నిల్పెదు;
ర్వ్యాగురఁబోలు దుర్భర భ ♦ వంబును ద్రెంపఁగ నుండలంచి ధా;
త్రీగురు శంకరార్యుని చ ♦ రిత్రపు సారము గ్రుక్తికీర్తిగా;
నాగురు సత్కృపేక్షణము ♦ నన్ రచియించెద నాంధ్రభాషలోన్॥

ఆ॥వె॥ కొద్దియద్దమందు ♦ కొండకొగాఘుటవితతి ఁజూచునట్టి ♦ విధ
ముగాను । చిన్నిహొత్తమందు ♦ శ్రీశంకరార్యుహా । కస్సంచయం
బుఁగనుఁడు ♦ సరసబుధులు॥ ౧౭

గీ॥ అధికరుచినొప్పుమధురిమ ♦ సన్నమైన।చవిని గలిగింప రుచినొం
దు ♦ జతను గూర్చు । విధముగా ఁబూర్వసత్కవి ♦ విమలపద్య ।
ములను మత్పద్యసంవేశ ♦ ముంబొసంగు॥ ౧౮

గీ॥ సరసకవినుతుఁడైయు భా ♦ ష్యంకరుండు।సస్మదీయకృతిం దుష్టి ♦
నందుఁగాత। క్షీరవారాశివాసియౌ ♦ శ్రీవిభుండు , గోష్పదమందున
బాలను ♦ గ్రోలుపగిది ॥ ౧౯

గీ॥ క్షీరవార్ధిఘుటీవిని ♦ స్సృతసుధారస । కారిమాధురినలరువా ♦
క్కారిముత ఫణీంద్రుమిందెదుశ్రీసంయ ♦ మీంద్రచిదగు।
హృదయశోధకమా యశం ♦ బెన్నఁదలఁతు॥ ౨౦

ఉ॥ కాలలసత్సుమల్లికల ♦ గంధము నొంపఁగఁజాలునట్టి లీ|
లాలసితంబుతో గురువి ♦ లాసగుణప్రకరంబు లేడ నే|
చాలునువీలునుం దెలియఁ ♦ జాలనిబాలుఁడనేడ, నైననా
పాలకదేశికోత్తమకృ ♦ పాకలనంబునఁ గంటిస్వరతిన్॥ ౨౧

సీ॥ మిగులఁజంచల యనఁ ♦ దగులచ్చియనునటి; చేసెను నాట్యం
బు ♦ చేఁబ్రమత్తులై సుజనులఁగ థ ♦ న్యాత్ములఁగాఁగ భా;
వించుకొనెను నవి ♦ వేకులౌన| రాధములదగు క ♦ థాధోరణి
యను క; ర్దమముచే మిగులవ్యా ♦ ప్తమగు నాదు, నుడిని నిత్త
టిని ఘ ♦ నుండగు శ్రీశంక; రగురునిదగు విహా ♦ రమునఁ
గ్రాలు॥

గీ॥ నట్టి విమలోద్యశంబను ♦ నబ్ధివారి | ఝురిని వేగమొకడఁగి సం ♦
సారహాళి| మునొఁగిఁద్రుంచెను గురుకృపఁ ♦ బొందినిత్య| హర్ష
భరితాంతరుండనై ♦ యలరుచుందు॥ ౨౨

సీ॥ పరికింప గౌడాగ్రిలి ♦ పట్టితో గార్దభీ; శృంగంబుతో సాటిఁ ♦
జెందఁదగిన| నీచభూపతులవౌ ♦ నిక్కంబుఁ బేర్మియు; శౌర్యం
బు, క్షమయు నౌ ♦ దార్యము ధృతి| మున్నుగాఁగల గొనం ♦
బులఁ గొనియాడుట; యనియెను మర్గంధ ♦ మునఁగనుఁజెడి|
నట్టి నావాణి ని ♦ ష్పట్టున ముజ్జగం; బనెనురంగస్థలం ♦ బున
నటించు॥

గీ నట్టి శ్రీశంకరార్యసం ♦ యమివరేణ్యు| కీర్తినర్తకిమెయినుండి ♦
క్రిందఁబడిన| చందనపరాగ పుంబట ♦ లిం దగుగతిఁ| బరిమళిం
పంగఁజేసెదఁ ♦ గరము నియతి॥ ౨౩

గీ॥ చంద్రశేఖరరూపుఁడౌ ♦ శంకరార్యు | సత్కృపాస్థేమపూర్వార్హ ♦
సరసవాక్సు | మంబు, బుధరాజికామోద ♦ దంబు, శంక |
రార్యవిజయాఖ్యకల్పాగ ♦ మ వనినలరు॥ ౨౪

చం॥ సపరిమళాచ్ఛకస్తురిని ♦ జాలవటంచుహసించి కల్పసూ।
న పువిపులంపుగంధమును ♦ నవ్వుచుఁ జందనహేళనంబుఁ దా।
విపులముగానొనర్చి బహు ♦ విస్తృతినందిన మాధవార్యవా,
క్ప్రవటుతగోవ్రమ్లేచ్ఛగతి♦ శోధనముంబొనరింత్రుకాకవుల్॥ ౨౫.

ఉ॥ ఐనను జింతలేదు సద ♦ యాంతరుల న్నసదుక్తిమాత్రకా।
దానులు, నాత్తరక్షణులు ♦ ధన్యులు సత్పురుషోత్తముల్గలా,
రైన నను గ్రహంబునిధి ♦ యాశ్రితపోషకుఁడు సృహాసుధీ।
శానుఁడుశంకరార్యపర♦ సద్గురుఁడుండెకుకాదనిమ్ముగన్॥ ౨౬

గీ॥ గురునిగొనముల నుతిఁజేయఁ ♦ గొండఱుగాని । సద్యపాణార్థ
మునవెత్ర ♦ భగ్నులైరి। ఇట్టివానిని వినుతింప ♦ నేఁదలంచుట।
కరముతో నిందుగ్రహియించు ♦ కరణి కాదె॥ ౨౭

ఉ॥ ఐనను మూకు నాకకవి ♦ యట్టులొనర్పఁగఁజాలి దుగ్ధపా।
థోనిధివీచికానిచయ ♦ దూషణఁ జేసెడుదేశికాచ్ఛవీ।
జ్ఞానిచయంబు నాపయిః బ్ర♦ సారతనందఁగ నింకశంకలే,
దానిపుణుండెచెంతఁదగి♦యంతయుఁజేకుఱఁజేయుఁగావునన్ ౨౮

మ॥ తలఁపన్ శంకరసద్గురూత్తమ చరి ♦ త్రంబేడ నేనేడ ని,
య్యాలలోఁజూడవరాకి నేమిటికి న ♦ స్నీరీతిబంధింతు రెం,
దులకై కీర్తిఁ జిరార్జిత స్జలధియం ♦ దుం ద్రోతురీరంచుఁ జం।
చలమైపర్వెడు వాణిఁబట్టి గురునెం♦చంగా విధింత్రంచితుల్॥ ౨౯

సీ॥ కవయితఁజూడ నా♦ గమపాళికంతకు; నిర్మలభానంపు ♦ నీటుఁ
జాటుఁ। గావ్యంబుఁబరికింపఁ ♦ గల్పాగముంబోలె; నిఖిలేష్టదం
బయి ♦ నెగడుచుండు। నేతనీక్షింపంగ ♦ భూతలంబున నద్వ;
యామృతంబును జిల్కు ♦ నట్టి ఘనుఁడు। లసితేషతోడఁద♦ద్రస
మ్మునీక్షింప బ; హ్మానందమిడునట్టి ♦ దై చెలంగు॥

గీ॥ నట్టిశంకరవిజయంబు ♦ నాంధ్రమందు। సాంబునందలి భక్తిచే ♦
సంబుచేశఁ। జెప్పఁబూనితి సాహస ♦ ముప్పతిల్లఁ। గాని
పాండిత్య గర్వంబుఁ ♦ బూని కాదు॥ ౩౦

చం॥ చరితము సారవంతమఁట ♦ శంకరుఁడందును నేతయంట సం।
సరణముఁ బాపఁగాఁ దగిన ♦ సత్పథమొప్పనదంట మాసుఫీ।
వరులకనారతమ్మునిదె ♦ వర్ణ్యమఁటట్టి మహేశరూపశం।
కరగురుగాథ నాంధ్రమునఁ ♦ గల్పనఁజేసినఁ గానెఘన్యుఁడన్॥ ౩౧

చం॥ అనిమదినెంచి మత్పితయు ♦ నై గురుఁడై తగువేంకటాచలే।
శుని నురుభక్తిమ్రొక్కి పరి ♦ శోభితవాక్యులగ్రాలుపెద్దల।
న్వినయమున న్నుతించి యతి ♦ వేలకృపార్ఘుని నొప్పు దేవపౌ।
షను బలుకంగఁబూనితిని ♦ గానియెడంబలుకంగ నేర్తునే॥ ౩౨

ఉ॥ అంబుజగ[illegible]♦హార్ద దకచ్ఛపిపాణి, వర్షకా।
లాంబుదనీలవేణి, యమ♦ రావళిసన్నుతవాణి, భక్తనా।
రంబునుతింపఁ గోర్కెల ని♦రంతరము చ్చెడుచారువాణి, నా।
కుంబలుమార్దవంపుఁబలు♦కుంగృపసేయుము దేవి! మ్రొక్కెదన్॥

కం॥ కాకవులనవరతంబును। నేకడనోచేరి దోష ♦ మే కైకొంద్రా।
కాకులరీతిని, వారల। వాకొనకిఁక వలయుదాని ♦ వాకొనఁ
దలఁతున్॥ ౩౪

కం॥ అని సుజనావళిఁ బ్రార్థన। మునుజేసి యనంతరంబు ♦ మూర్ధని
కారం। బొనరించి శంకరార్యుని। ఘనచరితముఁ వ్రాయవంశ ♦
గౌరవమెంతున్॥ ౩౫

## కవివంశవృత్తాంతము.

సీ॥ బ్రహ్మవిద్యపరం ♦ పరవరిష్ఠుండును; బ్రహ్మిష్ఠుఁడనుముని ♦ప్రవ
రుఁడుపగు। శాండిల్యమౌని వి ♦ శ్వమున రాణవహించె; నస్మ
త్కులంబున ♦ కతఁడెకర్త। బోధించెనచ్ఛిష్య ♦ పుంజంబునకు
సాంగ; నిగమతదర్థముల్ ♦నియమమునను। గులపతియయ్యెనే♦
క్కడు భక్తిమునికోటి; తనయానసనొఁదలఁ ♦ గొనిభజింప॥

గీ॥ ప్రవిమలాష్టాంగయోగ వి • భాసురుండు । సురుతపోధనుఁడాత్మ
వి • ద్యోపదేష్ట। పరమకరుణాఢ్యుఁడేసుతే • స్ఛన్యగోత్ర। జల
మునువినీతులము మహీ • సురులముసుఁడి॥ ౩౬

కం॥ వైదికులవియాపస్తం । బోదీరితసూత్రగుఁని • యును వెలనాడ
న్వైదముక్రమమున నిల సం। పాదితములు భమిడిపాటి•వారసఁగఁ
దెగల్॥ ౩౭

సీ॥ గోవిందరామాభి • ధానిరాజితుఁడై స; భూసురుఁడావంశ •
మునరహించె। సదమలాచారభా • స్వరుఁడును నిగమజ్ఞుఁ; డు
నమలచేతస్కుఁ • డునయిచెలఁగు । సర్వజ్ఞుఁడను సక్ర • మా
మ్నాయపారగుఁ; డనిశసత్కర్మపా • వనుఁడునైన । వేంకటా
చలపత్య• భిఖ్యుఁడాంటుదయించె; సావిత్రసన్మంత్ర• జాపకుండు॥

గీ॥ సతతపతిపాదపూజనా• సక్తచిత్త। యును సుగుణరత్నఖనియునై •
యొప్పులక్ష్మ। మాంబఁ బరిణయమయ్యె శ్రీ • హరిరమాంబఁ।
బరిణయంబైనపగిది నా • భవ్యగుణుఁడు ॥ ౩౮

శా॥ ఆలక్ష్మ్యంబికఁబత్నిఁగాఁగొని ప్రహృ•ష్టాంతస్స్ఁడై గార్హ్య ధ।
ర్మాలిన్నఃబ్బచు నాబుధుండతిథి సే • వాసక్తుఁడై యగ్రాల స।
చ్ఛీలాఢ్యుల్సుతులిర్వురాఘనుఁడకుఁ • శ్రీశూలికిన్సన్మహో।
ద్వేలుల్మన్న గజాస్యషణ్ముఖుల మా • ద్రిఁగల్గిరంచన్మతుల్॥

కం॥ పితృభక్తిగలిగి సుజన । స్తుతిపాత్రగుణాఢ్యులయి య • శూ
న్యసుహృత్త్వ। స్థితిని మహిఁ బేరయాభి । ఖ్యాతశేషయవిఖ్యాతత
గఁ గాంచిరి వారల్॥ ౪౦

గీ॥ క్రమతసంస్కృతులగుచు స • క్రమఘనముగు । శ్రుతిని సాంగ
ముగాఁగను • రుసవిధముస। నిష్ఠఁబఠియించి రమలవి•నీతివఱలఁ
బేరయమనీషి శేషయా • భిఖ్యబుధుఁడు॥ ౪౧

ఉ॥ పిచ్చమసాధ్వి(బత్నిగను ♦ బేరయపండితుండూని సూపె తా(।
బొచ్చెము లేనిభక్తిం దగు ♦ పొందిక(దన్నుభజింపంగా శ్రుతి
ప్రోచ్చరితార్హకర్మముల ♦ నుత్కటభక్తి విశ్రద్ధనొప్పి వి
ద్వచ్ఛయవంద్యుండై యవిర♦తంబు రుబావసు(గొల్చుచుండెడాన్॥

మ॥ తనపంద్రెండవవత్సరంబు మునుగా ♦ దాళీదళత్రాతమం
దున నాకోవిదుం డారవిందుభమున ♦ స్తోకస్వసత్కీర్తి ధా
త్రిని దైవారంగ(బెక్కుకబ్బముల స ♦ త్కింపాచ్చితాత్రాపెనా
ధన మేమమ్మనిధానమై మనిచెడిం ♦ పథ్యంబుగాని త్రజిన్ ॥౨౧

సీ॥ ఆదంపతులకు భ ♦ వ్యగుణాఢ్యులగు మూ(గు, రాత్మజులాత్మ
ర్తిత ♦ యంబు(బోలె నుదయించిరగ్రిము( ♦ డొప్పు(దా వేం
కటా; చలపతిప్రథధర్మ ♦ శాస్త్రవేత్త నిత్యకర్మమునం ♦ దిరతుండు
ను నాపెంతీ,ధనుండు సుజ్ఞా సా ♦ ధను(డగుచు నాగించె
నట్లె సు ♦ బ్రహ్మణ్యుండన ద్వితీ, యుండు శ్రీనరసింహ ♦ పండి
తుండు॥ గీ॥ శ్రౌతమార్గవిదుండునై ♦ ఖ్యాతిగనియె( దాస్య
తీయత నట్టి సు ♦ తత్రయంబు దన్ను నెమ్మిభజింపంగా ♦ నెన్ని(
గని యలరె(బేరయకోవిదుం ♦ డవనిమిగుల॥ ౨౨

సీ॥ మిగులసమర్థులై ♦ తగుతనూజులుతోడు, గా(గాని నొప్పుత్రి
కంబునిష్ట సిద్ధి గాగనె నవి ♦ చ్ఛిన్నాగ్నిహోత్రియై, యంతి
నగ్నిష్టోమ ♦ యాగము(దగ, నొనరించి యజ్వనా ♦ నొప్పవి
ష్ట్యాదుల, సర్వకాలములందు ♦ నాచరించి దానహోత్రమును
బాపె( ♦ దద్వంశమునకు సుజ్ఞానియై మిగుల(బ్రి ♦ శక్తినెసగె(
గీ॥ దాళదళసంపుటంబుల( ♦ దాల్మితోడ, భారతాదిమహాగ్రం
థ♦ వారము(దగ విజ్ఞు(డై మేనిలిమదన్య ♦ వేద్యవాఙ్మ, పేర
యజ్వనువినుతింప ♦ నేరికగును?॥ ౨౩

శా॥ ఆతత్త్వజ్ఞుని యగ్రసూనుండు దిగం ♦ తాక్రాంతసత్కీర్తి వి
ద్యాశ్రితస్తుత్య సుమార్గవర్తిపరమా ♦ ర్థస్వహృత్తూష్టి సం
శ్రీత స్వాంతవిఖండితార్తివిలస ♦ త్ప్రియూషతుల్యోక్తి స
చ్చేతోవృత్త సువేంకటాచల విప ♦ శ్చిన్మూర్తియొప్పెంగమున్

స్వామి

చం॥ అలఘుఁడుసాహితిం బ్రథుఁడ ♦ యాకలితుండును శ్రౌతవేదిని।
ర్మలహృదయుండును న్నృపుఁడు ♦ రాణనువ క్త్రచయాగ్రవ ర్తిని।
స్తుతి వరధర్మశాస్త్రభరి ♦ తుండు నయాన్వితుఁడెన్న వేంకటా ।
చలపతిశాస్త్రి తత్సుగుణ ♦ సంతతి సంతతమున్బ్రభోద్యమా ॥

సీ॥ మాన్యుఁడాబుధుఁడు కౌం ♦ డిన్యగోత్రంబుతో, నలరెడు నిమ్మ
గ ♦ డ్డాభిధాన। మైనసద్వంశంబు♦ సందీప్యఁడై న ల, క్ష్మీ నరసిం
హాఖ్య ♦ ధాని పౌత్రి। యును సుధీవరుఁడౌచు ♦ నొప్పు నప్పయ
కోవి, దుని యగ్రతనుజాత ♦ యును సుబుద్ధి। యగు వేంకటే
శ్వర ♦ సుగుణికగ్రజయును । సద్గుణాఢ్యయైన పి ♦ చ్చమసుసాధ్వి॥

గీ॥ ధర్మపత్నిగఁగాంల ♦ స్వధర్మనిరతి। నెసఁగెననుకూలవతియౌచు♦
నెలమి నామె। సలుప నిత్యాగ్నిహోత్ర[illegible] ♦ చెలఁగెనిష్ఠ।
బహువిదుఁడు వేంకటాచల ♦ పతి బుధుండు॥ ౪౮

ఉ॥ అత్తకుమామకుం బతికి ♦ నాడదు తా నెదురెన్నఁడుం గడుం।
బత్తిని సేవలన్నలుపు ♦ భర్తకు; దేవరులందుఁదమ్ములం ।
జా త్తిలుపేర్మిఁజూపుఁ బరి ♦ శుద్ధమనంబుననాఁడుబిడ్డల ।
న్నాత్తనుగృత్యమే మఱద ♦ సంగడుఁబిచ్చమసాధ్వియొప్పెఁదాన్॥

కం॥ నేనాయుగ్మంబునకున్। సూనుఁడనై జననిగాంచి ♦ సూరీడ్యగు
[illegible]నుండౌ మజ్జనకున । నూన దయావీక్ష శిక్ష ♦ నుచిత
తేఁగంటిన్॥ ౫౦

కం॥ వేంకటసుబ్రహ్మణ్యం । బంకంబైయొప్పఁ బెద్ద ♦ లాశీస్సు
లిడన్। శంకరవిజయాంధ్రకృతి । శంకాతంకములులేక ♦ సా
గింతునికన్ ॥ ౫౧

---

## ♦ ష ష్ఠ్యం త ము లు. ♦

కం॥ ఓంకారరూపునకునే। హాంకాభరణునకునాగ ♦ మాంతస్థునకుం।
బంకిలపంకాపహునకు । శంకరునకు గిరిసుతావి ♦ శాలాం
కునకున్॥ ౫౨

కం॥ నిగమాంతపీఠసంస్థున । కగజాహృదయాంబుజాహ ♦ రధినా
ధునకు । జ్జగతీభవవృద్ధిక్షయ । సుగమీకరణైకహేతునకును ♦ సోమ
ధరునకున్॥ ౫౩

కం॥ నారదముఖమునినుతునకుఁ । శారదశరదభ్రతుల్య ♦ భవ్యాంగు
నకు । న్నారకృపానిలయునకగ । జారమణీకలితునకును ♦ సక
లేశునకున్॥ ౫౪

వ॥ సభక్త్యానందకందంబుగా సమర్పింపనెంచి నాయొనర్పంబూనిన శ్రీశంకరగురుచరితంబు మున్ను సకలాగమార్థప్రచురీకరణప్రవీణుండును శివగురువరసుతచరణనీరజసేవాసమాసాదితకీర్తికాంతాక్రాంతదిగంతుండునునగు శ్రీమాధవాచార్యగురువర్యులచే గీర్వాణభాషయందు షోడశసర్గాత్మకంబగుకావ్యంబుగా రచింపంబడియె నందుఁబ్రథమంబున నుపోద్ఘాతంబును ద్వితీయంబున శ్రీశంకరగురుసముద్భవంబును దృతీయంబుననాయాయమృతాశనులయవతారనిరూపణంబును జతుర్థంబున నప్పరమగురునిశుద్ధాష్టమవర్షప్రాక్చరితంబును బంచమసర్గయందుఁదదర్హసుఖాశ్రమప్రాప్తియు షష్ఠంబునసాంప్రదాయాగతంబును జిరకాలోత్సన్నంబును నగుశుద్ధాద్వయవిద్యంబ్రతిష్ఠించుటయు సప్తమంబున సకలకలావాసుండగు వ్యాసమహామునిసందర్శనంబును నష్టమంబున నశేషవిద్యామండితుండగు మండనమిశ్రునితోడిసంవాదంబును నవమంబున సరస్వతీసాక్షికసర్వజ్ఞతానిర్వాహణోపాయపర్యాలోచనంబును దశమంబున యోగశక్తిచే భూపకాయంబుఁ బ్రవేశించియందుఁ గంతునికళలసాంతంబుగానెఱుంగుటయు నేకాదశంబున నుగ్రభైరవునిజయించుటయు ద్వాదశంబున హస్తామలకతోటకార్యులసంశ్రయంబును ద్రయోదశంబున వార్తికాంతాద్వయవిద్యాప్రచారంబును బదునాలుగవసర్గయందుఁ బద్మపాదునితీర్థయాత్రాప్రకారంబును బదునేనింటఁ బరమగురునిదిగ్విజయకథనంబును బదునారవసర్గయందమ్మహాత్మునిశ్రీశారదాపీఠనివాసంబునుగలుగునట్లభివర్ణింపఁబడియె. ౫౫

కం॥ కలినిదళింపఁగఁజేయుట, కలరెడిచరితంబు వినవె ♦ యఖిలాఘములు, న్విలయము నందెదుఁ గావున। సలలితముగ శంకరార్య ♦ సరణిఁ బ్రాఁగడెదన్॥ ౫౬

---

—♦ క థా ప్రా ర ం భ ము ♦—

శ్రీశంకరు దర్శింపఁగైలాసంబునకు దేవతలరుగుట

చం॥ ఒకదినమందు దేవతతి ♦ యొక్కెడఁజేరి ప్రపంచవర్తనా
ధికవిపరీతచర్య జగ ♦ తి న్నశియించి సుమార్గమేవిధి।
న్సకరముగాలభించు? నని ♦ శోధితబుద్ధులఁ జర్చఁజేసి యీ।
శకరుణఁగాని యద్ది కొన ♦ సాగదటంచుఁ దలంచియంతటన్॥
కం॥ కాంచనగర్భాదికసుర। సంచయమురువినయకలిత ♦ సద్ధృదయంబై। పంచాననుఁ వీక్షింపఁగఁ। జంచద్గతిఁబయనమయ్యె ♦ శంకరగిరికిన్॥ ౫౭
చం॥ చనిచనికాంచెదేవతతి ♦ సాంగలసత్ప్రచ్ఛతిభాస, మచ్ఛస।
న్మునిగణవాస, మాగతవి ♦ మోదకరార్హవిభాస, మజ్ఞతేం।
ధనహరణాగ్నిభాసము వి ♦ దారితకామముఖారికాసము।
న్ధనదసుహృన్నివాసమగు ♦ ధన్యవిలాసము రౌప్యభాసమున్॥
సీ॥ ఒకవంక సకలంక ♦ సకలాగమంబుల; వినుతిఁజేసెడు వేద ♦ విచ్ఛయంబు, నొకచోట నానంద ♦ ముకుళితహస్తులై; భక్తిమెనుతిసల్పు ♦ భక్తవితతి। యొకచాయ భవము నో ♦ పికతోడ నిరసించి; సన్న్యసించిన యమి ♦ సంచయంబు। నొకదండ నండజా ♦ దికమందు నీవుందు; వనుచుఁబాడెడు గాయ ♦ కావళియును॥
గీ॥ లలితపల్లవకుసుమఫ ♦ లస్ఫురత్సు, సకలభూజాళిశాఖలఁ ♦ బికమయూర। ముఖరనాదంబు శ్రుతులకు ♦ సుఖముఁజేయ। నొప్పు కైలాసమును గాంచి ♦ రుత్సవమున॥ ౬౦

గీ॥ పూర్వగిరిపైననొప్పెడు ♦ పూర్ణచంద్రు। పగిది రౌప్యాచలాగ్ర
వి ♦ భాసియైన। యద్రిజాసంగు, నంగజా♦ తారి నభవు। గాంచి
రమరులు కన్నుల ♦ కఱవుదీఱ॥ ౬౧

లయగ్రాహి॥ సంబరముతోడ సుర ♦ లంబుదకచున్మనిజ ♦ నంబుల
మనస్సరసి ♦ జంబుల విహార। మ్ముంబొలుపుగా నొనరు ♦ పం
బటుసమీహాగల ♦ త్ర్యంబకుఁగనన్నుతిశ ♦ తంబుల నొనర్చ।
న్నాంబుఁడు సుధామధురి ♦ మంబు గల చూడ్కులధి ♦ కం
బుగ సురాళిపయి ♦ నిం బొదలఁజేయఁ। శంబరజసన్నిభక ♦
రంబులను గుట్మలస ♦ మంబులుగఁజేసి విన ♦ యంబుమెయిఁ
బల్కెన్॥ ౬౨

ఉ॥ అంగజభంగ భక్తజన ♦ తార్తివిభంగ! కృపారసాంచితా।
పాంగ! జటాస్థగంగ! హిమ ♦ పర్వతభూకలితాంగ! చంద్రికుం।
డాంగ! నిరీహయోగిహృద♦యాంబుజభృంగ! నిరీహసంగ! యో
లింగ! నుతించుమమ్ములఁ జ♦లింపనిపేర్మినిఁ జూడుమోమృడా॥

కం॥ దేవరకుఁదెలియనిది జగ। తీవలయంబునను గలదె? ♦ దేవ
హితకరుం। డై వసుమతి బుద్ధుఁడను సు। ధీవరుఁడై హరియె
సుగత ♦ ధిక్కృతిఁజేసెన్॥ ౬౪

గీ॥ సాంబ! యాతనిచే రచి ♦ తంబులైన। యాగమంబుల ననిశం
బు ♦ నభ్యసించు। నట్టి బౌద్ధులచే వ్యాప్త ♦ మయ్యె జగము।
పటుతమోవ్యాప్తమగు రాత్రి ♦ పగిది నిపుడు॥ ౬౫

సీ॥ ఆగమపాద! మా ♦ యగచాట్లు వినిపింతు; మనలసమునమున ♦
వినఁగదయ్య। వర్ణాశ్రమాదుల ♦ వర్ణోధిలోముంప; యత్నం
బుఁజేయు బ్ర ♦ హ్మఘ్నులాగ। మావళి జీవిక ♦ కై వసుం
ధరఁబుట్టె; ననుచు స్నానాదుల ♦ నాచరింప। రక్కట! 'క్రతు'
నామ♦కాక్షరంబులు రెండు; వినవీనులన్ను మూసి♦కొనఁదలంతు
గీ॥ రిఁకఁ గ్రియాజాలమేరీతి ♦ నెసకమెసఁగు;। యాగభుక్కులమె
ట్లాడు ♦ మవని లింగ। చక్రముఖచిహ్నధరులుపా ♦ షండు
లాగిను। కర్మముల విడిరనుకంపఁ ♦ గశ్మలులట॥ ౬౬

సీ॥ అన్యభావంబు మతిలేక ♦ యనఘుఁబురుషుఁ। గుఱిచిపోయెను శుచిరతిసాధ్విఁ ♦ గుమతియుతులు। నధికమదమత్తులైన శా ♦ క్యాధములటుఁ। గలఁచి చెఱచిరి; ద్విపరాజి♦జలజిని బలె॥ ౬౭

కం॥ వరభూసురశిరముల వే। గిరముగఁగని కోసితెచ్చి♦కితవకపాలు। ల్గురుముదమున భైరవపద। సరసిజముల నుంతురి లోక ♦ సరణి సెడంగన్॥ ౬౮

ఆ॥వె॥ ఇంకనవనిలోన ♦ సంకటకరకంట। కాళికీర్ణమార్గ ♦ పాళి యుండె। నడుగుపెట్టునెడలఁ ♦ గడువెతయగు; నేత్రి। జలముఁ గారఁజేయు ♦ జనులకద్ది॥ ౬౯

ఉ॥ కావున దుష్టనిగ్రహముఁ ♦ గ్రక్కునఁజేసి మనుష్యకోటికిన్। న్భావుకమిచ్చు శౌర్తమగు ♦ పంథను లోకహితార్థమై మహా దేవ మునీంద్రసద్హృదయ ♦ దీప్తమహామహిమానుభావ! యి। చ్ఛావిధి నిల్పు, మంచు సుర♦సంఘమువేడఁగ శంకరుండనున్॥

—♦ శంకరుఁడు దేవతల కభయ మొసంగుట ♦—

ఉ॥ దేవతలార! మీరలిటు ♦ దీనతనందకుఁడింక శంకరా। ఖ్యావిలసద్వతీంద్రతను ♦ ఖ్యాతిగ భూతలమందుఁబొంది దు। ష్టావిలమార్గనాశమును ♦ నంచితధర్మనివేశమున్ సుధీ। శావళిమెచ్చుసూత్రముల ♦ కర్థముఁజేసి యొనర్తు మోదమున్

కం॥ నలుగురుశిష్యులు నూరిభుజ। ములొనాఁగా, ద్వైతతిమిర ♦ మోహితజనపా। ళిలకటమధ్యాహ్నార్కులఁ। బలె వఱలఁగ సంచరింతు ♦ వసుమతి నంతన్॥ ౭౧

ఆ॥వె॥ నాకవాసులార ♦ నావలెమానవ। తనువుతోడనన్ను ♦ నను సరింపుఁ। డట్టుతేనిమీదు ♦ గట్టికోరికలెల్ల। నెసఁగు ననుచుఁ బల్కె ♦ నిందుధరుఁడు॥ ౭౨

వ॥ అని, యపర్ణావిభుండు వందారుసుపర్వాణ బృందంబుతోఁబల్కి భానుండుభానుసంతతి నరవిందంబునందు నుంబోలె నన్యదుర్లభంబులగు కరుణాకటాక్షంబులఁ గార్తికేయునందుంబ్రసరింపఁ జేయ నుదధి యైందవకిరణంబులనంది పొంగునట్లు పయఃపారా

వారభవ్యవీచికాసచివంబులగు తత్కృపేక్షణంబుల గుహుండ
ధిగమించి యభివందించుచుండ, దంతచంద్రికానందితబృందా
రకచకోరకుండగుచు నందనుండగు స్కందుంగూర్చి పొందుగా
నిందుశేఖరుండిట్లనియె॥ ౭౪

చం॥ వినుము; కుమార! లోకములు♦వి స్తృతసౌఖ్యమునందుతీరు; వే
దనిచయరక్షణంబున వి ♦ ధాతృముఖోద్భవరక్షణంబు, దా
ననుజగతీతలావన త ♦ నర్చు; సదాశ్రమవర్ణజాలమం
దునను సెలంగుట న్స్మృతిని ♦ ధూతవివాదను గాఁ బొనర్పనౌ॥

సీ॥ ఇది యుద్ధరింప నా ♦ మదిఁగల్గ మత్సకా; శస్తుకౌ విష్ణుశే ♦ ష
ప్రసిద్ధు। ల తిగూఢమైన నా ♦ మతిఁగలభావంబుఁ; దెలిసి నా
యనుమతి ♦ వలన నిలకుఁ। జనుచు మధ్యమకాండ ♦ ముసు
బోవ సంకర్ష; ణాఖ్యుఁ బతంజలి ♦ ప్రఖ్యతోడఁ। బుట్టియోగ
విధంబు ♦ బోధసేయుచునుండి; రేనుజ్ఞానపథంబు♦నెఱుకపఱతు॥

గీ॥ ననుచుఁబల్కితిసకలసు♦రాళికిపుడు। కనుక జైమినినయవార్ధి ♦
కిని శశాంక। రూపమునఁగర్మకాండని ♦ రూఢినీవు। నుద్ధరింపుము
ప్రజలకు ♦ నుత్సవముగ॥ ౭౬

శా॥ వేదార్థంబులకెల్లశత్రులగుచు ♦ న్విశ్వంభరామండలి।
న్వాదంబుల్పచరించుసౌగతుల దు ♦ ర్బాధాఢ్యులం గెల్చి త।
ద్వేదాపాదితకర్మమార్గమును నీ ♦ వేచేయఁగాఁజాలు దా।
పై దీపించు మయూరవాహ మహిసు♦బ్రహ్మణ్యవిఖ్యాతియుణ్॥

కం॥ అజుఁడిల మండనమిశ్రుఁడ। న జనించును విప్రులందు♦నాయ
కుడై నా। కజపుఁడు సుధన్వుఁడనఁదగు। భుజజుండై నీకుఁదోడు♦
భుజముల పగిదిన్॥ ౭౮

వ॥ అనియాభూతవిభుండాదేశింప వేధకైన విధాయినియగు నయ్యా
దేశంబు నమృతంబునుంబోలె నెంతయువిధేయుండై బాహులే
యుండు పరిగ్రహించెనంత॥ ౭౯

కుమారస్వామి శివునాజ్ఞ భట్టపాదాఖ్యుఁడై సుధన్వుకడకరిగి బౌద్ధులనుజయించుట

సీ॥ నాకేశుఁడ య్యాప ♦ ర్ణాకాంతునానతి; చే భూమిపతియాచుఁ♦
జెలఁగి మించి। నాకలోకంబుగా ♦ నరలోకమును జేసి; తన
పురి నమరావ ♦ తినిగఁజేసి। సర్వజ్ఞుఁడై యును ♦ శ్రీద్ధనో
ప్పెడువానిఁ; బోలె సౌగతశాస్త్ర ♦ ములనుజదివి। క్రౌంచారి
రాకఁ గా ♦ మించి బౌద్ధుల నెల్ల; రావించి ముదమున ♦ రాజి
లంగ॥

గీ॥ సంతసేనాని భూమియం ♦ దవతరించి। భట్టపాదుండునానొప్పి♦
భవ్యుడై మి। నీయసూత్రింబులన్నిటి ♦ నిలిపె నరుణ। భాసితం
బైన జగమును ♦ భానుఁడువలె॥ ౧౦

ఉ॥ అంత దిగంతసంగతవి ♦ హారవిలాసయశోంగనామనః।
కాంతుఁడు కార్తికేయుఁడు సు ♦ ఖంబుగఁ జేరె సుధన్వుపట్టణ।
ప్రాంతము నంతభూవిభుఁడు ♦ స్వాగతవందనపీఠికార్చలన్।
స్వాంతమునందు సంతసమె ♦ సంగ నొసంగెఁబినాకిసూతికిన్॥

కం॥ ఆశీస్సులనధికంబుగ। నాశాపాయుధుఁడొసంగె ♦ నధిపునకట
సం। వేశితుఁడై కల్పము త్రిద। శేశువనంబునకుఁ బోలె ♦ నిం
పిడె సభకున్॥ ౧౨

గీ॥ సభకు సన్నిధినుండు వృ ♦ క్షంబుమీఁద। నుండుకోకిలదారుతి♦
దండిగవిని। వ్యాజమున రాజుగుటెచి య ♦ వ్యాహతముగ।
నిట్లులనియెను భూసురుఁ ♦ డింపుగదుర॥ ౧౩

గీ॥ శ్రుతివిదూషకనాదంబు ♦ కతన నీచ। జాతియనఁదగి మలిన
సం ♦ జాతమైన। కాకలోకంబుతోఁ బొందు ♦ లేకయున్న। వా
కొనంగను దగుదువో ♦ కోకిలంబ!॥ ౧౪

ఉ॥ ఆపలుగాకులాపలుకు ♦ లందలియర్థముఁ గాంచిభూరిరో।
షోపగతిం బదాహతమ ♦ హోరగలీల నెదుర్కొనంగ ని।
ష్పాపుఁడు యుక్తివజ్రమున ♦ వారలదొ మతశాఖి నొంచియు
త్కోపమహాగ్నికీలఁ బరి ♦ తోగతఁ జేసె సదస్సునందొగిన్॥

గీ॥ వారిరోషయుక్త ♦ వదనాళి నాసభ । కదునెసంగెఁ గమల ♦
కాంతుకిరణ। సన్నివేశఫుల్ల ♦ సరసీరుహావళి। చేత నొప్పుసరసి ♦
భాతి నపుడు ॥ ౮౬

కం॥ గట్టిగ నిట్టుల నొకనిం । బట్టి మఱొక్కండు చెలఁగ ♦ వాదం
బున న। ప్పట్టునఁ బుట్టినశబ్దము । బెట్టిదమై దిక్కటాహ ♦ భేద
ముఁ జేసెన్ ॥ ౮౭

ఉ॥ ఇట్టుల నాబుధేంద్రుఁడుమ ♦ హేషులు మేలన నుక్తివజ్రముం।
బట్టి తథాగతాగముల ♦ పక్షములం దెగవ్రేయ బౌద్ధుల ।
ప్పట్టున మోములెల్లవెల ♦ వాఱఁగ గోడలనుండు బొమ్మల ।
ట్లెట్టకనంబడ న్విబుధుఁ ♦ డాశ్రుతిశస్త్రిని దెల్పెనేతతోన్ ॥ ౮౮

—♦భట్టపాదుఁడు ప్రభునియానతి వేదమార్గ స్థాపనమునకై గిరినుండి దూఁకుట♦—

ఉ॥ ఆతఁడె నానృపాలుఁడనె ♦ నార్య జయంబుఁ బరాజయంబు వి।
ద్యాతిశయాగతంబులగు ♦ నట్లగుట న్గిరిశృంగమెక్కి య।
త్యాతురతంబడంగ నెవఁ ♦ డవ్యయుఁడో? నతఁడెన్ను నామతం ।
బీతఁడె నిశ్చయంబనుచు ♦ నేవయొ బౌద్ధులయందు లేనటుల్ ॥ ౮౯

చం॥ అనవిని భట్టపాదుఁడు మ ♦ హాగిరిశృంగముఁ దుష్టినెక్కి భూ।
మిని నిగమాళి సత్యముగ ♦ మేకొనెనేని రవంతకష్టమేఁ ।
గననని పల్కి యున్నత న ♦ గాగ్రగుఁడై దుమికె న్బిరానఁ జా।
లనియతిఁ దమ్మునెన్ను జను ♦ లగ్నతదుఃఖులఁ జేయవేశ్రుతుల్ ॥ ౯౦

ఆ. వె॥ అష్టకప్రదత్త ♦ మైన పుణ్యముగూడ। లయమునంద స్వస్థ ♦
లంబునుండి । భ్రష్టుఁడో యయాతి ♦ భాతిఁ దోఁచెను భట్ట ।
పాదుఁడపుడు సూచు ♦ వారికెల్ల ॥ ౯౧

గీ॥ విస్మయంబిచ్చునిద్దాని ♦ వినిద్విజాళి। సకలదిక్కులనుండి యు ♦
త్సాహమొప్పఁ । జేరె నచటికి మేఘగ ♦ ర్జితమునువిని । కుంజ
ములనుండి కేకుల ♦ పుంజమట్లు ॥ ౯౨

గీ॥ ఇట్టులే బాధలేకొప్పు ♦ భట్టపాదుఁ । జూచి నిందించుకొనియె
దు ♦ ష్టులచెలిమిని। దూషితుఁగఁదన్ను నదివిని ♦ తోనబౌద్ధు।
లిట్లువల్కిరి రాజుతో ♦ నేకముగను ॥ ౯౩

వ॥ దేవా! మణిమంత్రౌషధాదులచే దేహరక్షణముఁ జేసికొననగుఁ
గాన నీతనియం దట్టి లక్షణంబులుండంబోలు దాన సురక్షితుం
డయ్యె నంతమాత్రనే మమ్ము ఖలులనిభావింపం దేవరకుంజన
దన నానుధన్వుండు ప్రత్యక్షార్థంబుఁగూడ వేఱుతీరగుట నీక్షించి
భ్రుకుటీభీకరముఖుండై యుగ్రంబగు ప్రతిజ్ఞగా నిట్లనియె. ౯౪

—♦సుధన్వుండు బౌద్ధుల ప్రేరణమున నుభయవాదులఁ బరీక్షించుట♦—

గీ॥ అడిగెదను మిమ్మునొక్కటి ♦ కఠురయమునఁ । జెప్పుఁడ ద్దానిఁ
జెప్పని ♦ చెనటులనిటఁ । గఠిన యంత్రంబులందుంచి ♦ ఘాతఁ
జేయ। నాజ్ఞఁజేసితి నిస్సంశ ♦ యంబుగాను ॥ ౯౫

కం॥ ఈతీరున నాభూపుఁడు। చేతంబునఁ గుపితుఁడౌచుఁ ♦ జేసిప్రతి
జ్ఞ౯। శ్వేతాశీవిషమును ఘట। పాతితముంజేసి తెచ్చెఁ ♦ బలు
కుఁడటంచున్ ॥ ౯౬

సీ॥ ఆతఱి భూసుర ♦ వ్రాతంబు సౌగత; వ్రాతంబుఁ గూడిభూ ♦
పతినిఁగూర్చి। పలికిరిట్టుల శ్వాశ్వ ♦ భాతమందున నిల్చి; యుంచి
పల్కెదము భూ ♦ మీశయనుచు। రాజు ననుగ్రహ ♦ భ్రాజితుఁ
గాఁజేసి; పోయిరంతట నట ♦ భూసురాళి । కుత్తుకబంటిగాఁ ♦
గూలంకషనునిల్చి; పద్మాప్తుఁగూర్చి త ♦ పంబొనర్చ ॥

గీ॥ నంత మిత్రుండు ప్రత్యక్ష ♦ మైవచింపఁ । దగినది వచించి
యంశర్చి ♦ తత్త్వమందు । పిదప ద్విజులును సౌగత ♦ వీరులు
సభఁ। జేరి వాదింపఁజొచ్చిరీ ♦ చెలువుగాను ॥ ౯౭

గీ॥ సౌగతులు దీననుండుభు ♦ జంగమనిరి। కాదు భుజగేంద్రశాయి
శ్రీ ♦ కాంతుఁడనుచు । భూసురులు వల్కిరటమీఁదఁ ♦ బో
నఁగెవాద। మిరువుర కపారముగను భూ ♦ మీశుసభను॥ ౯౮

చం॥ జగతిని సర్వవేది యగ ♦ జానుతుఁ డాగమమార్గమెంతో మె।
ప్పుగనొనరింప నంతనురు ♦ పుణ్యుఁడు వార్ధిసమాన సత్కృపుం।
డగు, శశిచూడుఁడీశుఁడు భ ♦ వాంబుధిమగ్నజగంబు నుద్ధరిం।
పఁగ మనమందు మానవతఁ ♦ బైకొనఁగాఁ దలపోసె నత్తఱిన్॥

ఆశ్వాసాంతము.

కం॥ నిగమాంతస్తుతమహిమా!। జగదుద్భవవృద్ధిహాని ♦ జాలవిరచ
నా । విగత ధనాదీషణ జన । సుగమా భక్తాంబుజాత♦ సూర్య
ప్రతిమా! ॥ ౧౦౮

శా॥ దారాపత్యవిరక్తయోగిహృదయా ♦ స్తస్సంచరత్పాద వి ।
ద్వారధ్యేయసునామ! నామజపసం ♦ ధామాత్రసంతుష్ట! దు।
ష్టారిప్రాకటభంగ! భంగనికరో ♦ ద్యచ్ఛుభ్ర గంగాధరా! ।
సారాసారవిదుత్తమాంతరవిలా ♦ సా! §మోహినీపూర్ధవా॥ ౧౦౯

—♦ గద్యము ♦—

ఇది శ్రీ మచ్ఛంకర గురుకరుణా సమాసాదిత సరసకవితా విభాస్వర
ప్రవర్ధమాన శ్రీమ ద్భమిడిపాట్యన్వయ పయఃపారావార రాకా
సుధాకర, శ్రీమచ్ఛాండిల్యసగోత్రపవిత్ర, సంతతాగ్నిహోత్ర
పరిచర్యోపాత్త ఘనతరసద్వైదుషీవిరాజమాన పేరిసోమ
యాజిపౌత్ర, బుధజనసంభావ్య సచ్ఛేముషీకలిత వేం
కటాచలపతి సుధీతనూభవ, నైరంతర్య భక్తిసం
భావితభవానీధవ, విబుధజనవిధేయ, వేంకట
సుబ్రహ్మణ్యశర్మాభిధేయాంధ్రీకృతంబైన
శ్రీ శంకర విజయంబునందుఁ
ప్రథమాశ్వాసము. ౧౧౦

§ మోహిదేవి.

# శ్రీ శంకరవిజయము.

## ద్వితీయాశ్వాసము.



శముఖామరతతినుత ।
పాశాయుధగర్వభంగ ♦ పదరాజీవా ।
కాశేందుకుంద సుమసు ।
శ్రీశాలిశరీరకలిత ♦ శ్రీసకలేశా॥

గీ॥ అవధరింపుము; కేరళ ♦ మనెడుదేశ। మందుఁ జెలఁగెడు వృష
శైల ♦ మందుఁ బూర్ణ। యనెడునదిచెంతఁ గరుణాబ్ధి ♦ యైన
శంక। రుండు లింగాత్మకుండయి ♦ యుండె నంత॥ ౨

శా॥ ఆదేశాధిపుఁడీ శ్వరుండొకత్రియా♦మాంతంబున న్స్వప్నమం।
దాదేశింపఁ దదీయవైభవనిరీ ♦ క్షాత్యంతసద్భక్తిఁ బ్రా।
సాదంబుల్ న్రిచియించి యవ్విభు విరా♦జన్మూర్తి సేవించె దే।
వా! దాసున్ననుఁ బ్రోవుమంచును మహా ♦ భక్తిన్నుతిం
జేయుచున్॥ 3

—♦కాలట్యగ్రహారస్థిత విద్యాధి రాజవైభవము.♦—

చం॥ కలదొకపూర్వరంబు శశి ♦ ఖండవిభూషణ సత్కృపేక్షణా।
వలిసముదీక్షనీతి భయ ♦ వర్జితమై తనరారి వేదవి।
ద్యలపఠనంబనారతము ♦ నౌచితియుక్తముగానొనర్చు భూ।
తలదివిజాళినొప్పెసఁగుఁ♦దత్తటిఁ గాలటి నాఁగ నుర్వరన్॥ ౪

గీ॥ ఆపురంబున నభ్యసి ♦ తాఖిలాగ। ముండు విద్యాధిరాజన ♦
నుండు ద్విజుఁడు। సుగుణమణిపేటియైనయా ♦ సూరివర్యుఁ।
దాతఁగాఁ గోరె వృషభాద్రి ♦ నేత భవుఁడు॥ ౫

ఉ॥ అమ్మహనీయు పూర్వజన ♦ నార్జితమైన విశేషపుణ్యసా।
రమ్మునఁ బుట్టె జ్ఞానమున ♦ రాజకళాధరుఁ బోలి వాక్యసా।
రమ్మున జీవుఁ బోలి యవు ♦ రాయని మెచ్చఁ దనూజుఁడొక్కరుం
డమ్మహితాత్ముఁడట్లగుట ♦ నయ్యె ధరన్శివగుర్వభిఖ్యుఁడై॥ ౬

—♦శివగురు విద్యాభ్యాసము.♦—

గీ॥ ఆతఁడు సకాలమందుప ♦ నీతుఁడగుచు। గురునికేతన వాసియై ♦
గురునియాజ్ఞఁ। జేయుచును భైక్ష్యభోజియై ♦ చెలఁగి యగ్నిఁ।
గాలములఁగొల్చి నిజవేద ♦ పాళిఁజదివె॥ ౭

మ॥ నిగమాళింబఠియించి భావమును ని ♦ ర్ణీతంబుగాఁ జేయకు।
న్నఁ గనంగర్మఫలంబశక్యమగుఁ గా ♦ న న్వేదసంతానము।
న్నగమంబౌనటుచేసి యర్థముల నౌ ♦ త్సుక్యంబుతో నేర్చె నా
నిగమార్థమెఱుంగ శక్యమగునే ♦ నిర్ణేత లేకున్న చోన్॥ ౮

—♦దేశికుండు శివగురునకు గార్హస్థ్యముఁగొనుమని చెప్పుట.♦—

గీ॥ ఆగమావళిఁజదివి త ♦ దర్థములను। బజ్జనేర్చినశిష్యుతో ♦ నో
జ్జవలికె। వత్స! సాంగాగమంబుల ♦ మత్సకాశ। మందుఁ జదు
వఁగ బహుకాల ♦ మయ్యెఁ గాన॥ ౯

ఉ॥ భక్తుఁడవైయు నిప్పుడభ ♦ వన్నిలయంబునకేగు, నిన్ను నా।
సక్తిని జూడఁ గోరెదరు ♦ సద్బుధులౌ భవదీయబంధుల।
త్యుక్తిగ దీనినెంచక త్వ ♦ దోకముఁ జేరిముదంబుఁ గూర్పుమా
సక్తులఁ దన్పువాఁడె పురు ♦ షప్రవరుండగు శిష్యసత్తమా!॥

కం॥ అపరాహ్ణాపుఁబనిఁ దత్పూ। ర్వపుఁగాలమునందొనర్ప ♦ వలె
విజ్ఞుఁడు స్థైర్యపరుడు రేపటికార్యము। నిపుణత నీదినమునందె ♦
నెఱవేర్పవలెన్॥ ౧౧

ఆ॥ వె॥ కాలనిహితబీజ ♦ పాళిఁబోలె సకాల। పాణిపీడనంబు♦ఫల
మొసంగు। వ్యర్థమానకాల ♦వై వాహికంబిల। నతరుణోప్త
బీజ ♦ తతినిఁబోలి॥ ౧౨

ఉ॥ పుట్టినదాది నీజనన ♦ పుంగతవర్షములెల్ల లెక్కలం।
బెట్టుదురయ్య నీవయిన ♦ పెండ్లికినై తలిదండ్రులింటిలో।
నట్టిద; తల్లిదండ్రుల మ ♦ నోజ్ఞములందలి భావమాదిలోఁ।
బట్టికి ముండనంబు నటు ♦ పైని కరగ్రహణంబుఁ గోరుటల్॥

ఉ॥ దండిగ భావమందుఁ దలి♦దండ్రులు పుత్త్రుని దారయుక్తుఁగా।
నుండఁగఁగోరుచుందు రది ♦ యుక్తమదేమనఁ బుత్త్రరాజిలోఁ।
బిండదుఁడుండ నగ్రిమునఁ ♦ బిండవిలోపములేదు గానఁ బు।
త్త్రిండిలఁ దండ్రియానఁ గొని ♦ రూఢిగ దారను గైకొనం
దగున్॥ ౧౪

కం॥ వేదేక్షణమర్థాపగ । మోదారఫలంబు; నదియు ♦ నుచితను
కర్మా। పాదకమదియును గృహికే।యీాధరలోఁ జెల్లునని♦ఋషి
వరులెల్లన్॥ ౧౫

కం॥ అనుదేశికువచనంబుల। వినిశిష్యుఁడు వినయమునను ♦ వినమిత
శిరుఁడై। చనువుస నీవిధిఁ బలికెను। దనభావమునందు భక్తి ♦
తల్లడిలంగన్॥ ౧౬

—♦శివగురువు గురువుతో గార్హస్థ్య మొల్లమిం దెలుపుట♦—

ఉ॥ మీారు వచించుమాట నిజ ♦ మే యగుగాని యధీతవేదుఁడై।
దారనె పూను నొండుగతి ♦ దాఁగనఁడంచు నియామకంబులే।
దారయుఁగా విరక్తుఁడు భ ♦ వాంబునిధిందరియించు భిక్షుఁడై।
వేఱుమనంబుగల్గునవి ♦ వేకి మెలంగెడు నీభవంబునన్॥ ౧౭

చం॥ బ్రతికినయంతకాలమును ♦బ్రహ్మచరత్వమునూని మీాదరిఁ
హుతవహునందు వేల్చుచున♦యోద్ధతి దండము నిత్తితోలుఁదా
ల్చి తగువిధింబఠించిన న ♦ శేషములౌ శ్రుతులింకవిస్మృతి।
స్థితిఁ గనకుండఁగాఁబఠనఁ ♦ జేయుచునుండెద నైష్ఠికుండనై॥

కం॥ అనుభవముగానివఱకో। యనఘా! సుఖమొసఁగుఁ గన్య ♦
కాలంబనమా। వెనుకను విరసత మెల్లఁగఁ। గనునని గుర్తెఱుఁగు
నన్నుఁ ♦ గప్పెదరేలా?॥ ౧౯

చం॥ సకలము నింటనున్నను వి ♦ శాలముదంబునుగానఁడెప్డు దే।
శికవర! యార్జనోత్సుకత ♦ చేఁ గష్టముఁ గాంచుఁగాని నే।
నిఁక సుఖనంచుఁ దృష్ణను వి ♦ హీనను గా నొనరించి లోననో
పికఁ గనఁ దర్థియైన నన ♦ బీద సుఖించునె తా గృహస్థుఁడై॥
గీ॥ ఆగమప్రోక్తవిధిచేత ♦ యాగములను। జేయునెడఁ బూర్ణఫలము
సం ♦ సిద్ధమగును। విధ్యతిక్రమణంబున ♦ మధ్యవృష్టి। చేత
సస్యంబు సెడునట్లు ♦ చెడును ఫలము॥ ౨౧

చం॥ గురువర! నిస్పృహుఁడైన గృహి ♦ కుందు భవాంబుధియందు
నేమియున్?।
దారకమిఁజేసియు స్వజనులు ♦ దూరమునందె హసించుచుంట సం
చరణముచే మనంబు విర ♦ సత్వమనారతమందుట న్స్వకీ।
యరమణిగూడ నీచునిఁగ ♦ నంతరమందుఁ దలంచుచుండుటన్

సీ॥ అర్జనాపరుఁడైన ♦ యాత్మేశుఁ జూచిన; నంతరంబున: దుష్టి ♦
నందు నతివ। ధనియౌ మనోవిభుఁ ♦ గనినంతనే కాంత; నయ
భయయుతయౌచు ♦ నాథుఁగొలుచుఁ। దానుకోరినదానిఁ ♦
దడయక కూర్చెడు; విభునాదరించును ♦ ద్విరదయాన। తా
నొనర్చెడుపనిఁ ♦ దగునటంచువచించు; భర్తనే పలుమారు ♦
ప్రస్తుతించుఁ॥
గీ॥ గాని తల్లక్షణంబులు ♦ లేనియట్టి। వాని వాకొనదీక్షణ ♦ మైనఁ
జేయ। దెంతవిద్వాంసుఁడైనను ♦ సుంతయైన । నాదృతినిజాప
దర్థాంగి ♦ హర్షమునను॥ ౨౩
ఉ॥ సర్షపషోడశాంశమగు ♦ సారముగూడను లేనియట్టిదు।
ర్ధర్షభవాబ్ధిలోపలఁ జొ ♦ రంగను మానసమొప్పదందును।

—◆శివగురు వివాహ ప్రయత్నము◆—

ఉ॥ భూసురసూను యోగ్యగుణ ◆ పుంజ సుపాశముచేతఁ గ్రట్టబ
భూసురరాజు యాత్మజలఁ ◆ బాల్యగు నాతనికీయనెంచియు।
ల్లాసముతో డరాఁగ శుభ ◆ లగ్నము నెందికే ముందుటుండనే।
భాసిలమయ్యెఁ దద్గృహము ◆ నంతటఁ దా వరుఁ గోరువారితోఁ।

కం॥ మాతరుణిని మాతనుజుఁ। కేతరుణమునందునొసఁగ ◆ నెంచితి
మన నా। భూతలదివిజుఁడుగొనక సు, పూతాంచితవంశజాతఁ
బుత్రినకడుగన్ ॥ 33

గీ॥ కోటివిద్యాధిరాజ స ◆ త్కులజు నిఖిల। కలలసాంగంబుగానేర్చి◆
గఱ్యుఁడైన। వాని మఘుపంచితునని దా ◆ వకలనరాజ। నిమ్మ
మత్పూనునకనంగ ◆ సమ్మతించె ॥ 34

సీ॥ అయ్యెఁ గన్యకతండ్రి ◆ కయ్యెడ వరుతండ్రి; కని వాగ్వివాద
మా ◆ క్రియగనచటఁ। బ్రవృత్తిత్రినకు నాదు ◆ తనయనిచ్చెద
మద్గృహంబున బాలిక ◆ హంబు జరుగు। నస్మదాగారం
బు ◆ న స్మయంబొప్పఁ దా; వకపుత్రిఁ దెచ్చి యు ◆ ద్వాహి
తఁ జేయు। మనఁ గాదు నాయింట ◆ హస్తగ్రహంబైన; రెట్టి
గా బహుమతిఁ ◆ గిట్టయిమదుఁ॥

గీ॥ గాదుకట్నంబులేకయే◆కన్యఁగొనెద। నాగృహంబునఁ గరపీడ◆
నంబుజరుగు। నెడల, ననుచిట్టులిరువురుఁ ◆ గనుజగడముఁ। జేసి
రైశ్వర్యవిద్యాపరి ◆ సిద్ధులగుట॥ 35

కం॥ అత్తఱిఁగన్యాజనకసు। హృత్తు మఘుంగాంచివలికె ◆ నీవిధము
గఁగం। చిత్తును సందియమందకు। మిత్తురు వేఱొకరుకన్య ◆
నితనికిఁగానఁ॥ 36

చం॥ అనిచెలికాఁడు పల్కవిని ◆ యామఘుఁడావరతాతభాషితం।
బును నెవ సమ్మతించె ద్విజ ◆ పుత్రిసుహాపగుణప్రముగ్ధుఁడై।
గొనముననుగన్గొనన్మభముఁ ◆ గూర్చునిరంతరభావితాచ్ఛమం।
త్రనిచయపరాభిరూప్యముగ ◆ ధారుణిలో శుభమిచ్చునట్లుగన్॥ 37

భ్రాంతమనస్కుఁడై వరుస ♦ రంబులఁ దత్పితృహస్తపాళి నీ|
కాంతను నీటఁబోలనటు ♦ గాకెటులుంచితమీఁదెయంచిడెన్ ॥ ౪౩

ఉ॥ అల్లునిఁజూచిపల్కుమఘుఁ ♦ డాత్మజయాత్మజుఁడీమెయంచుమే
మెల్లవిధంబులన్ బెనిచి ♦ యిచ్చితి మీఁపెను నీకు నీమెఁ|
బిల్లి వెలుంగుతాకినను ♦ వేమరు; మంచియుఁజేటుఱుంగది|
వెల్లవిధంబులఘ్నుఁడ ♦ వేమని నీకువచింతు మిమ్మెయిన్ ॥ ౪౪

గీ॥ ఈపెయొక్కతయగుట వే ♦ మింటిపనుల| ముట్టనీయము
దానసీ ♦ ముగ్ధ యాట| పాటలనె తూఁగు నానంద ♦ పరవశ
మున| సకలవిదులకుఁ జెప్పఁగా ♦ సరసమగునె?॥ ౪౫

సీ॥ కావున నాగార ♦ కార్యంబులను నేర్పి| నళినాక్షి నేలుమో ♦
నలలితాంగ!| ధర్మార్థకామప్ర ♦ ధానకార్యంబుల; నతిశయిం
పకు మీఁపె ♦ నమలధీక | ఉచితానుచితఫక్కి ♦ నూహింప
నేరదీ, కుందకుట్మలదంతి ♦ గోలసుమ్మ| కోపప్రసాదవా ♦
క్కుల తీరెఱుంగదీ; యబల; యెట్టులనీపెనాదుకొనెదో?|

గీ॥ తెలియనేరనిదానిని ♦ దెలియఁజెప్పి| చేయనేరనిదానిని ♦ జేయఁ
జేసి| సరసముగనేలుకొనుము యీ ♦ సారసాక్షి| నమలగుణాగణ్య!
యువనీసు ♦ రాగ్రగణ్య॥ ౪౬

చ॥ సకలము గుర్తెఱింగి జన ♦ సన్నుతులందిన మీకుఁజెప్పనే|
నకుశలుఁడన్మదీయసుత ♦ యజ్ఞయటంచునుమాత్రమీఁడఁజె|
ప్పకనిలుపోపలేక, యిటు ♦ పల్కఁగసాహసమూనినాఁడ నీ|
శిశిరకలవాణి నేలుఁడతి ♦ వేలదయాకలితేక్షణాంబులన్ ॥ ౪౭

వ॥ అని వరునకును వరజనయిత్రిజనయితలకును వేఱువేఱుగాఁ జెప్పి యప్పద్మనయననప్పగించి నయనంబులనుండి యశ్రుకణంబులజస్రంబుగా స్రవింప ముగుదయగు నాచిన్నియన్నుల మిన్నంజేరి యిట్లనియె॥ ౪౮

ఉ॥ అమ్మరొ! రమ్మ;ముద్దులిడు ♦ మమ్మ! నినుంగనుకోర్కెఁజేసిదా|
నమ్ముల నీశ్వరార్చల నొ ♦ నర్చితిమీశుకృపం బసిండిరూ|

పమ్మను నవ్వునిన్నుఁగను ♦ భాగ్యమెసంగెను, నాఁటినుండి ని।
క్కముగ నీముఖాంబుజముఁ♦గాంచి సుఖించితిమింతకాలమున్॥

ఉ॥ నేఁటికిఁ బెద్దదానవయి ♦ నేస్తముతో శ్వశురాలయంబునం।
దాటలఁ బాటలన్మఱచి ♦ యత్తకు మామకు భర్తకింక జం।
జాటముగల్గువారలకు ♦ సర్వసపర్యలఁ జేయుకాలమో।
పాటలగంధి! వచ్చెఁదగు ♦ భంగినినీవట సంచరింపుమీ॥ ౫౦

చ॥ అరుణగభస్తి యభ్యుదయ ♦మందకపూర్వమె నిద్రలేచి యు।
ద్ధురతరభక్తిరాజిల న ♦ తుల్ పతికత్తకు మామకిచ్చి సం।
బరముననింటికార్యముల ♦ భవ్యులుమేలనఁజేసివారలా।
దరమున నిచ్చుదీవెనలఁ ♦ దాల్చిసుఖంబును గాంచుమమ్మరో!॥

సీ॥ అత్తమామల భక్తి ♦ నారాధనముఁజేయు, మాత్మేశుఁగనుము
శ్రీ ♦ హరిగనెపుడు। తోడికోడండ్రతో ♦ నీడుగాఁజరియింపు
మాడుబిడ్డలతోడ ♦ జోడుఁగనుము। బావల మఱఁదుల ♦భక్తి
వాత్సల్యంబు; లను జూడు పెద్దలఁ ♦ గనుము భక్తిఁ। బర
పూరుషులతోడ ♦ భాషింపఁదలఁపకు; మితరులయిండ్లకు ♦
నేగఁబోకు॥

గీ॥ మతిన! యీవార్తతిని జిత్త ♦ గతముఁజేసి। మెలఁగు మతిజాగ
రూకతఁ ♦ గలిగి పుట్టి। నింటికిని మెట్టినింటి క♦హీనయశముఁ।
దెమ్మ ననుఁగన్నతల్లి! స ♦ తీమతల్లి!॥ ౫౨

మ॥ పతిచేతోగతిగుర్తెఱింగి చరియిం ♦ పం జెల్లుస్వాధ్వికిన్
యతివా! యాతఁడుపాగతుండయినఁబా♦ద్యర్ఘ్యముల్ పూర్వపచా।
రతతింజేసి ప్రసన్నుఁజేసికొన ధ ♦ర్మం, బిద్దిగాపించి మా।
ర్గతమీఱంజరియింపఁగాఁజనదు హా ♦ స్యంబులనౌనెప్పుడున్॥

కం॥ పతియే శ్రీహరియనుచును। సతి పతితమ్ముగొందుఁదలఁచి♦సర్వా
వస్థా। స్థితులను దద్దర్శమునే। కుతుకమునను గౌరవఁయు ♦ గుణా
మదెపట్టీ॥ ౫౪

ఉ॥ కాంతరో? యట్లుచేయ భవ్య ♦ కంబగు నీకును మాకుఁగూడస
ర్వాంతరసంస్థుఁడైనశివుఁ ♦ డందును మోదము దేవతాళియున్
స్వాంతమునందుఁ దుష్టిఁగను ♦ సర్వసుఖంబులుఁ గల్గుదాన, నే।
నెంతవచింతు? సద్యశము ♦ నిమ్ముగఁగాంచి సుఖింపుమమ్మరో॥

వ॥ ఇట్లమ్మఘుపండితుండఖిలధర్మాభిజ్ఞుఁడయ్యును బాలయగుటఁ దన
కూరిమి తనూజయగు సతీమణి కర్తవాటెంట వర్తింపఁదగు
తెఱంగు నెఱిఁగించి సకుటుంబముగా నందఱచేననుమతుండై,
పుత్రికావియోగంబు సహ్యంబుగాకున్ననెట్టులో యప్పట్టినట
విడిచి యాత్మపురంబునకరిగెనంతనాదంపతులు. ౫౬

—♦ శివగురు గార్హస్థ్యము ♦—

కం॥ అంబుజలీలలనవ్వుము। ఖంబుల, శుభవస్త్రములను ♦ గమ
నీయసుదం। తంబులనెసఁగుచు దేవయు। గంబువలెంజెందిరమిత♦
కల్యాణములన్॥ ౫౭

చ॥ భువనమునన్నిఖిత్రియముఁ ♦ బూర్వమె పూనకయున్న సన్యస
త్సవనములందు యోగ్యతపొ ♦సఁగదటంచువచింత్రు గాననా
శివగురుఁడర్హయాగములఁ ♦ జేయఁగఁ గోరి విధిజ్ఞులైనభూ।
దివిజులఁ గూడి వహ్నులను ♦ దీరుగఁ బాగ్రిహించె,
మూఁడిటన్॥ ౫౮

కం॥ బహువిత్తసాధ్యయాగని। వహమున లోకములనువశ ♦ పఱచి
కొనినయా। మహనీయు యజ్ఞహుతభా। గహరణమువలన
నమృతము ♦ గనరైరమరుల్?॥ ౫౯

కం॥ పితృదేవమనుజులతిహా। ర్షితులగుటను నిష్టవస్తు ♦ సిద్ధికరుండౌ।
క్షితిదివిజుంగని సుమన। స్తతినొప్పుట భూమిఁగల్ప ♦ తరువనిరి
జనుల్॥ ౬౦

గీ॥ ప్రతిదినంబును వేదపుఁ ♦ బఠసనొప్పి। పరులకుపకృతిసల్పెను ♦
వ్రతముకలిగి। యాగమప్రోక్తకృత్యంబు ♦ లాచరించు। నతనికి
సమంబులయ్యె క్ష ♦ ణాభములుగ॥ ౬౧

—♦ శివగురుఁడు సంతత్యభావమునకుఁగుందుట. ♦—

శా॥ రూపంబంపును గానుఁ జేర్పున ధరా ♦ రూపుండు వేదాదివి।
ద్యాపారంగతుఁడర్థవంతుఁడునగ ♦ర్వవ్యగ్రేసరుండా ర్యసే। వాపా
రీణుఁడు నైయు భూసురుఁడు స ♦ ద్వత్సాప్తిలేకెంతయుం ।
దాపంబందె జరాయుతుండగుచు నాం♦తర్యంబులోఁబుత్త్రికై ॥

చం॥ ప్రమదముఁగూర్పవయ్యె బహు ♦ భాగ్యములన్విలసిల్లునిల్లువి।
త్తము బహుసస్యయుక్తనసు ♦ ధాతలమంచితధేనుసంఘమా
గమగతసర్వవేత్తృతయుఁ ♦ గైనను మంచితమానసంబుఁ బు
త్త్రిమణిని బొందనట్టి ద్విజ ♦ తామణికిన్నియునంతరంబునన్ ॥

కం॥ ఇప్పటికిఁ గలుగకుండినఁ। దప్పక యుదయించునుతుఁడు♦దదనం
తరమం। చెప్పటికప్పుడె దిష్టము। నిప్పగిదింగడపె నీహ ♦ నెట్టు
లొ యతఁడున్ ॥ ౬౪

ఉ॥ అంతట నిత్యకృత్యనిచ ♦ యంబులఁదీర్చి స్వకాంతతోడ దుః।
ఖాంతరుఁడౌచు విప్రుఁడనె ♦ నంబుజనేత్రిరో దేనినంద స।
త్సాన్వంతులుకోరువారో! యటు ♦వంటి సుతాననవీక్షలేక య।
థ్రాంతరమయ్యెఁ బ్రాయమెటు ♦ లందఁగలార మొనత్తనూభవున్॥

ఆ॥వె॥ అతివ యాత్మజాతుఁ ♦ డావిర్భవించిన। వెనుక మృతియు మ
నకు ♦ విపులసుఖద । మట్టిపట్టిఁ గనక ♦ పుట్టియుఁ బుట్టని।
వాఁడనైతి నేఁడు ♦ వసుధలోన॥ ౬౬

ఉ॥ నిక్కము; పుత్త్రిపౌత్త్రిసర ♦ ణిం ధరలోనఁబ్రసిద్ధినందుటా।
ఫక్కినె కాంచనట్టి మన ♦ భవ్రిము నెవ్వరుసెప్పికొందుర్రి? స।
మ్యక్కుగసూనపల్లవ ఫ ♦ లాళినెసంగునగంబునెన్నకె।
ప్రెక్కుగాఁడలంతుర్రిఫల ♦ హీనమనారతముండలోదరీ॥ ౬౭

చం॥ అనివచియించుభర్తఁ గని ♦ యాసతివల్కు; గిరీశకల్పకం।
బును భజియింప నిష్టఫల ♦ పుంజము శాశ్వతమైతనర్చు, బా।
లుని నుపమన్యు భక్తు సతి ♦ లోకు నొనర్చెనుగాదె? యంతక।
న్న నెవరిఁగొల్తుమార్య మన ♦ సంబునఁ దత్ఫలదుండెవండికన్॥

—♦ శివగురువు భార్యతో వృషశైలమునకరిగి యట శివునారాధించుట. ♦—

గీ॥ ఇట్లుభార్యోక్తిఁ గ్రోలి మ ♦ హీసురుండు। పుత్త్రుఁగోరుచు
సోమార్ధ♦ మూర్ధ్నుఁబ్రీణత। వశ్యుసోమార్ధు నీశుఁ ద ♦పంబు
చేతఁ। దృప్తుఁజేయఁబ్రియత్నించె ♦దిటప్రభక్తి॥ ౯౬

శా॥ ఈశాగారముచెంతనుండెఁ బుధుని ♦ త్యైలాగతిన్ స్నాతుఁడౌ।
చీ శానార్చనొనర్చె దుంపలను దిం ♦ చీరీతిఁ గొన్నాళులా।
పై శారీరసుఖంబులన్మఱచి త ♦ త్పాదాబ్జభృంగంబునై।
లేశాహారముఁ గూడఁగైకొనక కొ ♦ ల్చెన్భక్తిమై నీశుఁదాన్॥

ఉ॥ ఆయనఘాత్ము భార్యయు న ♦ హార్నిశలం దనభర్తతోడ స।
త్కాయముఁ గష్టపెట్టి గర ♦ కంతుభజించెవృషాద్రియందు ని।
ట్లాయతకాలమేగ ఫణి ♦ హారుఁడు నొక్కదినంబునందు ని।
ద్రాయుతుఁడైన విప్రునకుఁ ♦ దాఁగనుపించి వచించెనీగతిన్॥

—♦ శంకరుఁడు శివగురునకు స్వప్నమునఁదోఁచి వరమొసంగుట. ♦—

కం॥ ఏటికిటుతపముఁ జేసెదు?। పాటింపుమునన్నటంచుఁ ♦ బలికెఁబు
శివునిం। బాటించివిప్రుఁడనియెను। మేటిసుతుంగుఱిఁచి తపమ ♦
మేయ మిదంచున్॥ ౨౭

ఉ॥ దేవర వల్కునిట్లు గణు ♦ తింప నమోఘము మద్వరంబు, వి।
ప్రా! వరలక్షణాఢ్యగుణ ♦ భాసితుఁడౌచును సర్వవేదియౌ।
కోవిదు నల్పజీవుఁ గనఁ ♦ గోరుదువో? భూరితరాయువుల్కుధీ।
భావితులైన పుత్త్రులనుఁ ♦బల్వురఁగాంచఁ దలంచెదో?యనన్

చం॥ విని శివగుర్వభిఖ్యుఁడను ♦ విశ్వమునంజిరజీవులైన దు।
ష్టనియతులాత్మజాతులయి ♦ సంభవమందుటకన్న సర్వస।
జ్జనసుతుఁడౌచు సర్వగుణ♦సంయుతుఁడైన సుతుండొకండె చా
లును; భవ! యట్టిపట్టి ధర ♦ లోఁగనఁ గోరెద నిమ్ము
పేర్మితోన్॥ ౨౮

చం॥ అనివినుతించు విప్రుఁ గని♦యట్టులెసత్సుతుఁడుద్భవించు, భా
ర్యనుగొని యింటికిం జని ఘ♦నాస్థను నన్భజియింపుమంచుఁదాఁ

జనేశిపుఁడంతమేల్కని ద్వి • జపత్రివరుంపు సుషుప్తినున్నభా।
ర్యనుడగురీతిమేల్కలిపి •యప్పటివృత్తముఁ జెప్పె నొప్పుగ౯॥

కం॥ పతిసెప్పినవృత్తముఁ ద। త్సతిసంస్తుతిఁజేసె మిగుల • సంతు
ష్టిని స। త్సుతుఁడు దయమందు నగజా। పతికరుణను మనక
టంచుఁ • బలుమఱుకలఁ డా౯॥ ౭౮

చం॥ శివపరులౌచు స్వప్నమును • జేతమునందును సంస్మరించుచు
న్భవనముఁజేరి పారుల స • భక్తికభోజన దక్షిణప్రిదా।
నవిపులతృప్తులం గను నౌ • సర్చుచుదీవనలందిదానసం।
భవమగుతుష్టినందిరెద • భవ్యమనస్కులు విప్రిదంపతుల్॥ ౭౭

—• సతీమణీదోహదాభివర్ణనము •—

సీ॥ అంతట నొకదినా • భ్యంతరంబున మహే; శ్వరుతేజమాశివ•
గురుసుభోతు। మాణాన్నగతమయ్యె • మాన్యుఁడౌ శివగురుఁ।
డగ్రిజానుజ్ఞఁ దా • నాహరించెఁ। బతిభుక్తశేషముం • బతి
వదనీరేజ; భృంగయౌ నంగన • పొంగుచుఁగొనె। మృగశాబ
నేత్రి భ • ర్తృగయౌచు నారాత్రి; శివగర్భగర్భసం • సిద్ధిఁ
బడసె॥

గీ॥ నంతగర్భంబు వృద్ధియై • యంగమగుచు। దివసమధ్యంబునందు
దే • దీప్యమాన। నరనిరీక్షణదుశ్శక్య • నలినమిత్రి। తేజమ
ట్లొప్పనత్తఱిఁ • భ్రాజితమయి॥ ౭౮

ఉ॥ భూమిజలాదులేవిభుని • మూర్తులు విష్టపసప్తకద్వయం।
బేమహిమాధ్యుచేతవహి •యింపఁబడెం బరమాత్ముఁడెవ్వఁడౌ?
సోమధరుస్థరించినవి • శుద్ధ సతీమణి, గర్భభారసం।
కాంతియుతయౌచు మందగతిఁ•గాంచెను సుంతయునంగఁజిత్రమే?॥

చ॥ సకలశరీరసంగియగు • శంకరుఁడీపెశరీరమందునిం।
చుకయునునున్కి దుష్టులకుఁ • జొప్పడునట్టులొనర్పఁడయ్యెనిం।
తకుఁగపుముస్నయుత్సుకతఁ • దామరసేక్షణమేనదెల్లదో।
తకమగురీతిదివ్యమగు •ధామముచేతసమాక్రమించియు౯॥ ౮౦

చ॥ రమణిసుగంధపుష్పనిక ♦ రమ్ములఁ బూనవశక్త్రయైనయ।
ప్రమితభరమ్ముచేనెసఁగు ♦ నాభరణమ్ములఁగోరునే? గురు।
త్వముగలదాచునెయ్యదివి ♦ భాసిలునట్టిపదార్థమున్స్వహ।
స్తమున వహింపఁగా వెలచు ♦ సాధ్విసదోహదయాటనత్త్రజేక్॥

ఉ॥ బందుగులెల్ల నాసుదతి ♦ ప్రాకటగర్భముఁ గాంచెనంచునా।
నందముతోడదుర్లభమ ♦ నర్ఘమపూర్వమునైన వస్తువుం।
బొందికగాఁగఁ దెచ్చివిరి ♦ బోఁడికొసంగఁగ దానిఁగొంచునా।
నందముగాంచె;గర్భభర ♦ ణంబనఁ గష్టముగాదె నాతికిన్॥ ౮౧

చం॥ పలికితి మర్త్యధర్మమును ♦ బట్టి యదిట్లుల గానియాసతీ।
తిలకము కష్టమించుకయు ♦ దేవధృతింగనదయ్యె నౌను బా।
ధలుతొలఁగు న్సుధాకిరణ ♦ ధారిని శంకరు భక్తి నొప్పునే।
వలఁ బరితుష్టుఁగానొనరు ♦ పంగ సుఖంబగునందురంచితుల్॥ ౮౩

మ॥ వినయోపాగతగాన శాస్త్రవిలస ♦ ద్విద్యాధరశ్రేణి భ।
క్తినిబద్ధంబగునట్టిగాన మనుర ♦ క్తిన్సల్పఁగా శ్వేతరూ।
పని కామోన్నతమావృషంబుపయిన ♦ న్భాసిల్లు నీశానునిం।
గనెనిద్రాయుతయాచుస్వప్నమున స ♦ గర్వంబందు సస్మేరయై॥

చం॥ జయ! జయ! దేవదేవ!విల - సద్దయనొప్పెడుదృష్టిఁజూచిమా
భయమునుబాపి మమ్ముఁబరి ♦ పాలనఁజేయు మటన్నపల్కువి।
స్మయమెదనొప్పఁగావిని ప్రస ♦ న్నతగాంచి నిరీక్షఁజేసి యే।
మియుఁగనకంత నిద్రఁగని ♦ మేలగువాక్కులఁగ్రమ్మఱన్విను౯॥

శా॥ చంచన్మంచముఁ జేరునట్టితటి హా ♦ స్యంబొప్పువాక్యంబులం।
గొంచెంబైన వినంగలేని సుదతీ ♦ కోటిస్ఫురద్రత్నము।
త్సంచారంబున నన్యులంగలిచి స ♦ త్సారస్వతాఖ్యాసనం।
బంచల్లీలనునెక్కపట్టెఁ గనెస ♦ ద్ధర్షంబున న్నిద్రిలో౯॥ ౮౪

గీ॥ సాత్త్వికోద్వృత్తులందున ♦ సమతగలిగి। వైషయికవృత్తులం
దునై ♦ రేమగలిగి। యొప్పుతత్సతిచేష్టగ ♦ రోభ్లసత్సు। పుత్త్రి
చిత్రికథం జెప్పు ♦ పోల్కి నొప్పె॥ ౮౨

గీ॥ ఆపెనుచపర్వతపత్రిభా ♦ హారిదిసీను| శైవలంబట్టులోన్న నో ♦
మావళియును | బాలుఖేలనముంగూర్చి ♦ బ్రహ్మదేవు | చేతఁ
గృతమైనవేణువు ♦ రీతినొప్పె॥ ౮౮

ఉ॥ ఆజలజారిధారె, సతి♦ కాత్మభవుండయి పుట్టెత త్కుచ|
వ్యాజముచేత దుగ్ధమును ♦ బానమొనర్చునటంచునెంచి యం|
భోజభవుండువేలుపుల ♦ బువ్వనునింపిన హేమకుంభము|
ల్లాజతగా నురంబున సు ♦ తారరుగా సమకూర్చెనింతికిన్॥ ౮౯

గీ॥ గర్భగతుఁడైనయపుడె య ♦ య్యర్భకుండు| ద్వైతమాధ్యమి
కాఖ్య మ ♦ తద్వయంబు| నమలధీగర్వ్యమగుట నా ♦ రమణి
దైన| హేమకలశాభకుచమధ్య ♦ మేవగించె॥ ౯౦

— ♦ శ్రీశంకర భగవత్పాదావతారము. ♦ —

ఉ॥ సూర్యుఁడు మేషమందున వ ♦ సుంధరజాతుఁడు నక్రరాశియం|
దార్యుఁడు కేంద్రమందుఁ దుల ♦ యందు శనైశ్చరుఁడొప్ప
చుండఁగా| నార్య కుమారుఁబోలె శుభ ♦ మైనముహూర్తము
నందుఁ గాంచెనా| శ్చర్యముదోఁప భూసురుని♦ జాయ సులక్ష
ణపాత్రుఁబుత్రినిన్॥ ౯౧

చం॥ శివగురుఁడంత సూనునిశ ♦ శింబురుడించెడివానిఁ గాంచితా|
శివజలధి న్మునింగియును ♦ శీఘ్రమె సీటమునింగి యంతభూ|
దివిజుల నర్హులంబిలిచి ♦ దీప్తసుతాంచితజాతకర్మమం|
దవనిని గోవులన్దనము ♦ న త్తఱిహర్షముతో నొసంగెఁదాన్॥ ౯౨

కం॥ గజహరిగోవ్యాఘ్రాదు ల| హజవైరముగల్గుమృగము ♦ లన్ని
యు నరితం| ద్యజియించి మైత్రితోనెసఁ| గె జగద్గురుఁడుద్భవం
బొ ♦ గిం గనువేళన్॥ ౯౩

మ॥ దివిజానీకముపుష్పవృష్టిగురిసె ♦ న్దివ్యంబుగానాడిరా|
దివిషద్వారవధూటికానికరమా ♦ దేవర్షి గానంబుఁజే|
సె వరిష్టస్వనయుక్తమౌ మహతిచే ♦ క్షేమంకరుండౌశివుం|
డవనిజ్జన్మమునందు కాలమునన్నా ♦ హాయుంచులోనుబ్బుచున్॥

సీ॥ ఫలసూనపల్లవ ♦ ప్రతతి నత్తతినొప్పె; భూజాతలతికలు ♦ పు
డమిలోన। నిర్మలాంబువులచే ♦ నెగడెనాపగలెల్ల; నంబుదతతి
సువ ♦ ర్షంబు నొసంగె। వాయువద్భుతగంధ ♦ వాసితుండై వీచె;
దిక్కులన్నియునచ్ఛ ♦ దీప్తిం జెలంగె। ననలంబులు ప్రదక్షి ♦
ణాద్భుతార్చులం దేజ; రిల్లె సర్వసుహృత్త్వ ♦ ముల్లసిల్లె॥
గీ॥ సద్వయాభిఖ్యమత్తవై రి ♦ హస్తపుస్త। కంబులిలజారె, నిగమశి ♦
రంబులెల్ల। నవ్వె, వ్యాసుహృదబ్జంబు ♦ నవవికాస। మందె నా
భవ్యుం డుద్భవం ♦ బందుసపుడు॥ ౯౫

కం॥ సుమనోజ్ఞగంధమై స। త్సుమనోవిమలంబునగుచు ♦ శుభసూ
చకమై। సుమనోనిచయోంతమా। సుమనోవర్షంబుగురిసెం ♦ జో
ద్యముగాంగన్॥ ౯౬

ఉ॥ అర్యముతోం ద్రిలోకియు సు ♦ రాగముతోడ ధరాతలంబు వి।
ద్వర్యనివిద్య నమ్రతను ♦ భాసిలునట్టుల నాపతివ్రతా।
వర్య సమస్తసద్గుణ వి ♦ భాసితుండైన తనూజుతోడ న।
య్యార్య షడాస్యుతోడంబలె ♦ నద్భుతతేజముతోడ రాజిలెన్॥

చం॥ శివగురుండంతం గాలప్రవి ♦ శేషములందిలకించినట్టి భూ।
దివిజుల సత్కరించి సుతు ♦ దిష్టపుచర్యను బ్రచ్ఛసేయ వా।
రవని నితంపు సర్వవిదుం ♦ డౌచు రచించునుశాస్త్రపాళి, శా।
స్త్రవులగుపండితాగ్రణుల ♦ భ్రాజితబుద్ధిజయించిమించెడిన్॥ ౯౮
గీ॥ ఇంతయేటికి? భూతల ♦ మెల్లం దనదు। యశముచే వ్యాప్తము
గంజేయు ♦ ననిరి పితయు। నాయువెంతనలేదు వా ♦ రద్దిసెప్ప।
లేను విజ్ఞులమంగళా ♦ శ్లీలమనరు॥ ౯౯

శా॥ బంధుజ్ఞాతిసుహృత్ప్రియాంగనలు శు ♦ భప్రాభవారిష్టని।
ష్ఠుం ధన్యుం గనం గాన్కలంగొని మహా ♦ త్సుకృంబుతోం
జేరి యా। గంధేభప్రతిమానయానలు నిదా ♦ ఘుంబందుం బూ
ర్ణేందుసం। బంధంబుం గవినట్లు బాల్లుంగనితా ♦ పంబెల్లం జల్లారం
గన్॥ ౧౦౦

గీ॥ బాలుతేజంబుచే సూతి ♦ కాలయంబు। దీపమేలేక మిగులనం♦
దీప్తమగుచుఁ।జీఁకటిని, బాసఁజే[illegible] ♦లువుఁజూడ। సకలజను
లకు మిగుల నా ♦ శ్చర్యమొందనె॥ ౧౦౧

—♦ శ్రీశంకర శైశవాభివర్ణనము ♦—

గీ॥ శంకరానుగ్రహంబున ♦ [illegible]డగుట। సకలజనులకుశమ్మని ♦
శమ్ము నిడుట। శంకరాభిధబాలున ♦ కంకితముగఁ। జేసెజన
కుండు సంతోష ♦ సిద్ధితోడ॥ ౧౦౨

తరల॥ సకలశ క్తియుతుండునై యును ♦ సర్వవేదియునై యును।
త్సుకతతో నరజాతి రీతిగ ♦ శోభనంది చరించె, నిం।
చుకహాసింపఁ దొడంగెనంతట ♦ శుద్ధకుక్షి విసర్పణం।
బకలుషంబుగఁజేసిప్రాఁకఁగ ♦ నంతనేర్చెనుతుండటన్॥ ౧౦౩

ఉ॥ బాలుఁడు డోలికంజెలఁగు♦పాన్పునఁ గ్రాలఁగ సన్మనంబులెం।
తోలలితంబులై మెసఁగెఁ ♦ దోరపుఁగాంతులసీనురత్నగు।
చ్ఛాలిని జూడనేర్పఁగ వి ♦ దాననసంతతి హంససంతతిం।
బోలె విసీలమై వఱలె ♦ బుద్ధులునట్టులె యొప్పెనత్తఱిన్॥౧౦౪

సీ॥ బాలుండుపర్యంకమునఁ దాఁ ♦ బాదమ్ములంజిమ్మ। వాదులకొంద
ముల్ ♦ వ్రయ్యలయ్యె। నుండియుండియునుడు ♦ లెత్రిండో
మూఁడో పల్క; ద్వైతవీరులు మాన♦మూఁతఁగొనిరి। సంచా
రమును బాద ♦ సరసిజమ్ములఁ జేయ; వైరులు దశదిశ♦ల్పారి
రపుడు। గంభీరవాక్కుల♦ జృంభితంబులఁ జేయ; నరులు కానన
సీమ ♦ కరిగిరాఁగ॥

గీ॥ రంతఁబలుకంగనడనంగ ♦ నంతనేర్చె। వికలమయ్యెను బికమ
రా ♦ లకన్నికాయ। మహిమహిమధామునేతుని ♦ యభ్యు
దయము। నెవరువర్ణింపఁగాఁగలా ♦ రీవసుమతి॥ ౧౦౫

ఉ॥ ధారుణి విద్రుమాంచితల ♦తాతతిసంవృత కాఁగ నింకఁగా।
శ్మీరపర్ణాగపాటలఁగ ♦ జెల్వగుపత్త్రిభచేనొనర్చుచు।

న్మారుధనుర్ధరుండుఁ గడు ♦ మొల్లఁగ బాలునిలీలఁ బూనిసం।
చారమొనర్చి భూపతిజులు ♦ చంద్రనిభుండని సంస్తుతింపఁగన్॥
గీ॥ శిరమునందును హిమకర ♦ చిహ్నముంట। నిటలమందును
భుజముల ♦ నేత్రఫాల। లక్షణములుంట స్ఫటికస♦ద్వృక్షతనువి।
భాసితుండౌట భవుఁడని ♦ ప్రాజ్ఞులనిరి॥ ౧౦౭

చ॥ వ్యసనములేనియట్టిబుధ ♦ వర్యునకంచితవిద్యఁబోలె నీ।
తిసరణినొప్పునట్టినర ♦ దేవునకంచితరాజ్యలక్ష్మియు।
ల్లసమలసచ్ఛరత్నమయ ♦ యామవతీనతికాంతిమాద్రి సం।
తసమును దల్లిదండ్రులకుఁ ♦దానొనరించుచునుండె వృద్ధితోన్॥

చ॥ ఉరముననాగచిహ్నముఁ బ ♦ దోదకజంబునఁజామరంబుఁజం।
దురుశకలంబుఫాలమున ♦ దోర్ద్వయిఁజక్రధనుర్గదాదులు।
న్శిరముననాత్రిశూలమును ♦ జెల్వొనర్పఁగనొప్పబాలును।
త్కరమగువిస్మయంబొదవఁ♦గాంచిరికన్నులుమూయకెల్లరున్॥

ఉ॥ సర్గములందుఁబ్రాథమిక ♦ సర్గమువిశ్రమమంద, దేహభృ।
ద్వర్గమనారతంబుమల ♦ వంతముగాఁగ నమర్త్యలోకసం।
సర్గము దొర్గతింగన ల ♦ సచ్ఛుభమోక్షమగమ్యతంగసన్।
భర్గుఁడె విశ్వసృట్సృజనఁ ♦ బాలనఁజేయఁగఁబుట్టెమర్త్యుఁడై॥

శా॥ వాణీశప్రముఖామరౌఘనుతుఁడౌ ♦ వారాశిశాయిందుతా।
వాణీసాక్షికసర్వవిత్త్వుఁడయినం ♦ బాల్యార్థముంజేసె స।
చ్ఛ్రీబల్సంస్తుతిఁజేయస్వాత్మమహిమన్ ♦స్వీయోరుమాయన్విని
ర్మాణాదుల్వొనరించు కేశవుని సా ♦ మ్యంబొప్పఁగా నత్తఱిన్॥

మ॥ చపలాశన్విలసిల్లు శైశవపు సం♦స్థంజెందియు న్శంకరుం।
డపుడాత్మన్ఘనె భూస్థలింగల భవి ♦ ష్యద్భూతరాజిన్వటా
గపలాశాంతరశాయియౌజలధిజా ♦ కాంతుండునౌశార్జగపా।
ణి పవిత్రాత్మను గుక్షిలో।

ఉ॥ లోకము నిర్మిమేమసువి ♦
శ్రీకమనీయపాలుని సు ♦

నీకసుకర్ణవాళిపుట ♦ నిత్యసుపేయసువాక్యజాలునిం,
బ్రాకట వాసుదేవగతి ♦ వామనలీలుని విప్రబాలునిన్॥ ౧౧౩

క॥ శ్రీమానినీశవాగ్విభు। సోమసమానార్భకునకు ♦ సొంపునఁ
గూర్చెన్। గోమలమై నవమేఘ। శ్యామలమా కేశపాశ♦సంత
మసంబుల్॥ ౧౧౪

ఉ॥ వ్యాకులమయ్యెఁ బాశుపత ♦ నైష్ణవబౌద్ధదిగంబరేంద్రుచా।
ర్వాకకుబేరముఖ్యమత ♦ వాదులచే నిగమాధ్వ దాని సు।
శ్రీకముగానొనర్పఁగ ధ ♦ రిత్రిజనించి చరించుచుండె ఘో।
రాకృతి దుర్భవాటవివి ♦ హారశివంకరశంకరుండహో॥౧౧౫

—♦ ఆశ్వాసాంతము. ♦—

క॥ బాలేందులసితఫాలా!। ఫాలలసచ్చంద్రరుక్ప్ర ♦ భాసితదశది।
క్శీలా! జయశీలస్మితలీలా! మిహిరాగజాను♦లీలానిరతా॥౧౧౬

శా॥ శ్రీశారాధితకోమలాంఘ్రికమలా! ♦ శ్రీకంఠశోభాలస।
త్కాకేందుప్రతిమానభాసురశుభా ♦ కారా! యతీశాంతరా।
కాశస్థాంచితపాదనీరజ! జటా ♦ గంగా! రవీంద్వగ్నినే।
త్రా! శీతాగసుతాన్వితా! భసితలి ♦ ప్తా! మోహినీపూర్వధా!॥

ఇది శ్రీ శ్రీమద్భమిడిపాట్యన్వయ .............. వేంకట
సుబ్రహ్మణ్య శర్మాభిధేయాంధ్రకృతంబైన
శ్రీ శంకరవిజయంబునందు ద్వితీయాశ్వాసము.



# శ్రీ శంకరవిజయము

## తృతీయాశ్వాసము



శ్రీగళసుషమాజితజం
బూగుణ గిరిజానురక్త! ♦ పోషితభక్తా!
భోగీంద్రహార! సంశ్రిత
యోగిహృదంబుజవిహార! ♦ సోనకలేశా॥

గీ॥ అవధరింపుము బాలచం ♦ ద్రావతంసుఁ! డవని నీరీతి బాలత ♦
నందినంత! సకలవిద్యావిడంచిత ♦ సత్కులంబు! లందు బృం
దారకుల్జన్మ ♦ మందిరపుర॥ ౨

క॥ కమలాపతి, విద్వరుఁడో! విమలాభిదుఁడైనపుడమి ♦ వేల్పు
నకుసుత! ప్రిముఖతఁ బద్మనమండను! విమలుండై పుట్టెశత్రు ♦
వితతులు బెదరన్॥ ౩

క॥ సవనోన్మీలితయశుఁడై భువినొప్పు ప్రిభాకరాఖ్య ♦ భూసురు
నింటన్! బవనుండు హస్తతిప్యాఫ! లవరాఖ్యతఁ బుట్టె నరివి ♦
లాసహరుండై॥ ౪

ఆ॥వె॥ ఎవనియశముసూడ ♦ నెల్లశత్రులవాక్య! సరసినొంచియొప్పు ♦
సకలదిశలఁ! దోటకాంచితాఖ్య ♦ తో నొప్పునెవ్వండు! పవన
దశశుభాంశ ♦ భవ్యుఁడతండు॥ ౫

గీ॥ మదవదరితతినిగ్రహ ♦ విదితకీర్తి! యైన నందీశుఁడయ్యె దం ♦
కాఖ్యుఁడనఁగ! సర్వవిద్యారహస్యవి ♦ త్స్వామియగుచు! భవ
మునందెశిలాదవి ♦ ప్రభవనమున॥ ౬

ఉ॥ పొందికమండనుండనెడు ♦ భూసురుఁడై జనియించె నాశతా।
నందుఁడు చిత్సుఖాహ్వయుఁడ ♦ నంగ జలేశ్వరుఁడుద్భవించెనా
నందగిరిప్రధన్ద్విజ ♦ నాథపురోహితుఁడుద్భవించె సా।
నందముగా ననూరుఁడు స♦నందనుఁడై జనియించె నిమ్మహిన్॥

క॥ పరమతవిద్విషులౌ ని। ర్జరులెల్లరుపరమగురుని ♦ చరణంబు జగ।
చ్ఛరణముఁ గని కొలువఁగ భూ। సురపుంగవపుత్త్రిలగుచు ♦
శోభిలిరిలలోన్॥ ౮

గీ॥ ధరను జార్వాకశాస్త్రవి ♦ ధానమునను। గుర్విదుఁడౌ ధాతశపి
యింప ♦ నిర్ధరణిని। మండనుండయ్యెఁ జిత్రిశి ♦ ఖండిజుండ।
టందురి, నందియెశివునిచ్ఛ ♦ నయ్యెనందురి। ౯

సీ॥ పూర్వకాలమునందుఁ ♦ బుండరీకజునొద్ద; సర్వజ్ఞకల్పులౌ ♦
సర్వమునులు। నియతయుజ్మతులౌచు ♦ నిగమంబులఁ బఠింప;
వారలలోన దూ♦ర్వాసుఁడనెడు। కోపనముని పరా ♦ కున వేద
పఠనంబు; సందొక్కటందప్పె ♦ నందువలన। వర్ణసంభవశబ్ద ♦
వారమెవ్వరో? యట్టి; యరవిందభవపత్ని ♦ యుపహసించె।

గీ॥ దానఁ గోపించి యగ్నివి ♦ ధంబులైన। చూపులంజూచుచా
పెకు ♦ శాపమిచ్చె। భూతలంబున నోదుర్వి ♦ నీతురాల!। కాం
తవై పుట్టు ననునవ్వ ♦ కతన ననుచు॥ ౧౦

ఉ॥ అంబుజసంభవాంగన దు ♦ రంతవిషాదముతోడఁ దత్పదా।
బ్జంబులవ్రాలిమ్రొక్కి పలు ♦ భంగులసంస్తుతిఁ జేసెనమ్మునీం।
ద్రుంబహురీతులౌనుతుల ♦ తోడ ఋషీశులువేడిరాత్మజా।
తుంబహుదోషుఁ దండ్రిదయ ♦ తోఁగనురీతిసతింగనందగున్॥

మ॥ అనివాణీసతియున్మునీంద్రులుఁబ్రిన ♦ న్నాంతర్యఁగాస్తోత్రపా।
ళినిజేయన్మునివల్కెఁ. బల్కెనమృషా ♦ లేశంబును న్లేదుగా।
ని నరాకారుని శంకరార్యుని సురా ♦ నీకస్తుతుం జూచినం।
తనె యీకాంత నిజస్వరూపముఁగనుం ♦ దక్షంబుముమ్మాత్మ
టికిన్॥ ౧౨

మ॥ అనిదూర్వాసుఁడు శారదాసతికి శా ♦ పాంతంబువాక్రుచ్చినం।
తనె యాకాంత జనించె శాపగతిచే ♦ త న్నోణతీరంబునం।
దనయాత్వంబున విష్ణుమిత్రుఁడను గో ♦ త్రాదేవుగేహంబునం।
దున సల్లక్షణయుక్తయై విదుషియై ♦ దుష్టేభపంచాస్యయై॥ ౧౩

గీ॥ సహజభవవిద్యయు మ్రు ఘా ♦ పాపధూటి। మానవతనందవలసె
న ♦ మ న్యయైయుఁ దలచుభ్రాసినబ్రాఁతను ♦ దలఁగఁజేయ।
నెవరుశక్తులుగాఁగలా ♦ రీవసుమతి?॥ ౧౪

గీ॥ సకలమైననిగమముల ♦ సర్వశాస్త్ర। ములను గావ్యాదికంబుల♦
లలననేర్చె। నింతయేమిటి? కాకాంత ♦ యెఱుఁగనట్టి। దీజగతి
లేదనుచు బుధ ♦ రాజివలుకు॥ ౧౫

—♦ మా హి ష్మ తీ పు ర వ ర్ణ న ము. ♦—

మ॥ ధరనొప్పంబురమర్త్యసూననిచయా ♦ ద్యానాళి నాకాశసం।
చరదంభోజసుహృన్నిరోధచణ వి ♦ స్తారోచ్చసౌధాళిచే।
ఖరరాజిన్విశసత్క్రుశేశయల స ♦ త్కాసారసంఘంబుచే।
నిరవాదుగ్ధపయోధికన్యకన మా ♦ హిష్మత్యభిఖ్యాకమై॥ ౧౬

మ॥ విలసత్సాంగయజుర్ముఖంబులగు స ♦ ద్వేదాళిచేనొప్పి వా।
గ్జలనానాయకునై స వాదమునగె ♦ ల్వంజాలి వేదోక్తకర్మ।
ములఁగర్మంబులఁ దామొనర్చుచునుసం ♦ తుష్టాత్ములంజేయుచీ।
యిలనొప్పారెడు విప్రులంజెలఁగుఁ దా ♦ నెంతేపురీరాజమై॥ ౧౭

శా॥ ఆవీటంగలరాజులాకృతిని బా ♦ హ్వోరూఢి ధీశక్తి స।
త్సేవాసక్తులఁ దుల్యులంగభవ రా ♦ జీవాక్షమిత్రార్యభూ।
దేవోత్తంస మృకండుపుత్త్రులకు భ ♦ క్తిన్ సంశ్రితత్రాణదా।
నావిర్భావములందు నారదహరీ ♦ నాత్మోద్భవప్రాభవుల్॥ ౧౮

సీ॥ సౌధోన్నతత్వపు ♦ సరణివాకొననేల?; యంబరచుంబి శి ♦ రంబు
లనినఁ। బరిఘాగభీరతఁ బలుకనేటికి? నదీ; శానుఁడీ యాకృతి ♦
నూనె ననిన। సరసులసౌరు ను ♦ చ్చముగ నేలవచింప?; సుమ

ధురజీవన ♦ దము లె యనిన। సుపవనస్తోత్రవం ♦బుపవర్ణితముఁ
జేయ; నేల? యిందిరానంబుఁ ♦ బోలుననిన।

గీ॥ తరుణులెల్లరు గంధర్వ ♦ తరుణులె యగు। రూపమును జేయనే
లని ♦ రూపణంబు? । సురపురమెసాటి యాపిటి ♦ శోభకెన్న।
నన్ని లక్షణసంపత్తు ♦ లమరియుంట॥ ౧౯

—♦ మండనమిశ్రవృత్తము. ♦—

శా॥ ఆపిట్టు నరణీసురుండు హిమమి ♦ త్రాఖ్యుండు విద్యాబ్ధిఁదా।
ధీవైశద్యపుఁదాటిచే మనమనం ♦ దీపించు తత్త్వంబుచే।
దేవాభుండగు దేశికోత్తముఁడు ర ♦ క్తిన్ మార్గముం జూపఁ ద।
త్సేవాసంభవమైన సారసుధఁ దా ♦ సేవించి యొప్పారెడిన్॥ ౨౦

గీ॥ అట్టిధాత్రీసురాగ్రణి ♦ పట్టియగుచు। మండనుండన విశ్వరూ ♦
పుండనంగ । నామయుగ్మంబుచేనొప్పె ♦ సలినభవుఁడు। పుట్టె
మాహిష్మతీప్రాఖ్య ♦ పట్టణముస॥ ౨౧

చం॥ క్రమముగశుక్లపక్షపు మృ ♦ గస్ఫుటలాంఛనురీతి మండనుం।
డమితవిలాసుఁడై లిపుల ♦ నన్నిటి నేర్వఁగ నంతఁ దండ్రియు।
ష్టమమగుహాయనంబున ల ♦ సన్మతిఁ దానుపనీతుఁగా సుతుం।
గ్రమముగఁ జేసి దేశికున ♦ కాశగతుంబొనరించె విద్యకై॥ ౨౨

ఉ॥ అంగయుతాగమంబుల ర ♦ యంబున గౌతమపాణినీయశా।
స్త్రాంగితముఖ్యవిద్యల న ♦ హీనమనస్కుఁడు చెప్పినంతలో।
నం గురుఁడౌనటంచన ఘు ♦ నంబుగ నేర్చెననంగ వింతలే।
దంగములాగమంబులు సు ♦ నాతఁ డపూర్వముతాస్పృజించుటన్॥

సీ॥ కలోద్బుధుఁడౌచు ని ♦ ష్కలుషాంతరంగుడై; హరిశంకరుల నా
త్మ ♦ సభినుతించి। పాపహారిణియైన ♦ యాపగాసన్నిధి; కంతేవ
సద్యుతుం ♦ డౌచు నరిగి। కలిమలాపహమంత్ర ♦ ములఁ బఠిం
చుచుఁ గ్రుంకి; దేవర్షితృప్తి భ ♦ క్తిని బొనర్చి। యహరీశున
కు భక్తి ♦ నర్ఘ్యత్రయంబిచ్చి; గాయత్రినుతినిఁ జ ♦ క్కఁగ
నొనర్చి।

గీ॥ అమలమేధాప్రమండైన ♦ యగ్నిఁ దృప్తుఁ। జేయసమిథల మం
త్రిరా ♦ జిం బవిత్రి। మైనవానిని వ్రేల్చుచు ♦ ననఘు గురుని
దంత విద్యలఁబరిచయించె ♦ మండనుండు॥ ౨౮
కం॥ కోమరునిభీగరిమంబును। హిమమిత్రుఁడు కాంచి తుష్టి ♦ నెంత
యునెసఁగెం। సమకన్న సుతులనుమంగు। సమయంబునఁ గీతలు
సంతత ♦ సంబును గనరే॥ ౨౭
ఉ॥ దేశికవర్యుచెంగట సు ♦ శీవరశేఖరుఁడైన మండనుం।
డాశుగతిత్రశ్రీకలితుఁ ♦ డౌచుఁ గలాకలితాత్ముఁడయ్యె రా।
కాశశింబోలె యౌవనముఁ ♦ గాంచెఁ బ్రజావ్రజమీక్షఁ జేసివా।
గీశ రతీశ జేత యితఁ ♦ డెంతయు విద్యల రూపమందనన్॥
ఉ॥ ఆహిమమిత్రుఁడాత్మభవుఁ ♦ డయ్యెఁ గలాపరిపూర్ణుఁడంచును।
త్సాహముతోడ దేశికుని ♦ సన్నిధికింజని తృప్తుఁజేసి దే।
వా! హితుమీదు శిష్యుచను ♦ పం దగునంచునువిన్నవించియు।
త్సాహముతోసుతుంగొనిస్వ ♦ ధామముఁజేరెనుశీఘ్రవేగతిన్॥

—♦ ఉభయభారతీమండనమిశ్ర ప్రేమోదయము. ♦—

చం॥ గుణవతి భారతీసతిస ♦ తుల్ వచియింపఁగ విశ్వరూపుస।
ద్గుణముల సుందరాకృతిని ♦ గూడినవానిఁగ విన్నదై సుధీ।
మణియగు వానినే పతిఁగ ♦ మానసమందుఁదలంచె సౌసుస।
ద్గుణముగ్రహించు నాతిమతిఁ ♦ గోరునొక్కో గుణహీనసంగతిన్॥
గీ॥ ఉభయభారతిసద్గుణ ♦ విభవ మమల। రూపవిభవంబు దావిశ్వ ♦
రూపుఁడవని। సురవరేణ్యులువలుక న ♦ త్తరుణి నాత్మ। నాయ
కునిగాఁగఁ గోరె ♦ మనంబునందు॥ ౨౯
ఆ॥ వె॥ ఒకరినొకరుసూచు ♦ నుత్సుకంబుమనంబు। లందునంజనించె ♦
నందువలన। స్వప్నదర్శనంబు ♦ సంభాషణంబును। బొంది మే
లుఁగాంచి ♦ పొలుపుఁదక్కె॥ ౩౦
మ॥ కలలం గాంచినతీరు మేల్కని కనం ♦ గాలేక యన్యోన్యవా।
ర్తలచేతన్ హృతచిత్తులై మదనసం ♦ తాపంబు రెట్టింపఁ జిం।

తలచేతం దసుతం దనూద్వయమున్నం ♦ దామందఁగాఁ దల్లిదం।
డ్రులు వీరూనినతీరుఁగాంచి కె ను ♦ ట్టుదెల్పఁగాఁగోరుచున్॥
శా॥ అన్నా! చిన్నతనంబునందె భవనే ♦ యంబై నకాయంబుఁజా।
డ న్నాకెన్నఁగరానిసన్నముగఁ గ ♦ ట్టా! తోఁచె నేవ్యాధినీ।
కున్నట్లేకనరాదు గర్వమును నీ ♦ కూహింపఁగాలేదు ని।
ష్పన్నేష్టార్థముహానినందిన నని ♦ షప్రాప్తియందానిటుల్॥ 32
గీ॥ ఎన్నివిధములఁజూచిన ♦ నించుకయును। రెంటియందున లోపం
బు ♦ కంటఁబడదు। దెందుచేనిట్లులైతివో ♦ యెఱుఁగరాదు।
కారణములేక కలుగునే ♦ కార్యమిలను॥ 33
చం॥ తలఁప వివాహకాలముగ ♦ తంబునుగాదు, పరావమానమూ।
కలుగదు లేదు నిర్ధనత ♦ కష్టపుసంసృతిభారమెన్న నా।
తలనె మెలంగుచుంట నది ♦ తావకభావుకహానిఁ గూర్పదెం।
దులకిటులైతివన్న!ధృతి♦తో నొగిఁదెల్పుము కార్శ్యహేతువున్॥
సీ॥ సమూర్మ్యథభావాప♦ జయములు పరితాప; హేతువులనుకొన్న♦
నోతనూజ!। విత్తతిఁ దర్కవి ♦ ద్వితతిసుదుర్గమా; ర్థాగ్రపాఠవి
గాన ♦ నవిఘౌసఁగవు। విహితకార్యానీక♦ నిహితధీయుతుఁడవ।
నుక్తదుష్కృతకార్య ♦ సక్తిఁగలల। నైనఁగానవు గాన ♦ నూ
ననక్కరలేదు; నారకమగు యాత ♦ నాభయంబు।
గీ॥ పుత్త్రి! సర్వకళాయుక్త ♦ పూర్ణచంద్రి। నిరసనముఁజేయుశోభ
చే ♦ నెసఁగునీదు। ముఖసరోజంబు దినదిన ♦ ముం గృశించి।
చెలువుఁదొలఁగిన కతమును ♦ దెలుపుమయ్య॥ 34
కం॥ ఈనియతి ననుదినంబును। సూనునిదయఁ దండ్రియడుగు ♦ చో
మండనుఁడ। మ్యా! నీనిర్బంధముచే। మానుగ సిగ్గును దొలంగి♦
మనవి యొనర్తున్॥ 36
గీ॥ శోణపున్నదతటని♦వాసుండునైన। విష్ణుమిత్త్రాఖ్యభూతల♦ విబు
ధుని సుత। సర్వవిజ్ఞ సురూపల ♦ సత్సువేష। యన్ని బుధులువ
ల్క నెంతుఁబా ♦ ణినిగ్రిహింప॥ 37

—♦ మండనమిశ్రుజనకుఁడు కన్యావరణమునకై వారలఁ బంపుట. ♦—

చం॥ సరసనయంబు దోఁపఁ దను ♦ సంభవుఁ డాడ్రగహించి కన్యకా।
వరణకృతిం బ్రవీణులగు ♦ వారలఁ బౌరులఁ బొరఁ బంప ని।
ర్వురును బవిత్రశోణనద ♦ రోధమునం గలయూరిఁ గాంచిర।
త్రటి విపినాపగాగముల ♦ దాఁటి వధూవరణాభిలాషచే॥ ౩౮

ఉ॥ దండిగ సర్వవిద్యలను ♦ దాఁ బఠియించియు జన్మధారుణీ।
మండలి భక్తిఁ గొల్వఁగ వ ♦ సుంధరయందుఁ బ్రకాస్తిఁ గాంచెనే।
మండనపండితుండ తని ♦ మాన్యపదాంబుజరేణుసక్తనై ।
యుండుదుఁ దండ్రి! నిత్యము మ ♦ దుత్సుకసిద్ధిఁ నొనర్పు
మీవొగిన్॥ ౩౯

గీ॥ శ్రుతిపుటంబులఁ బుత్రివా ♦ క్తతిని భూసు। రుండు గ్రోలుచు
నుండఁగా ♦ మండనార్య। జనకసంప్రేషితులు సద్వ ♦ సనులు
విశద। యష్టులిర్వురు వారలా ♦ యాతురైరి॥ ౪౦

సీ. వచ్చినయట్టి య ♦ వ్వసుధామరద్వయి; నర్హోపచారాళి ♦ న
ర్చఁజేసి। విశ్రాంతినందిన ♦ పిదప మెల్లఁగ వారి; యాయాసకా
రణం ♦ బడుగ వార। లనిరి మండనపండి ♦ తుని తండ్రి, త్వ
త్సుతా; శ్రుతవయఃకులసుశీ ♦ లతలఁ బుత్త్రిఁ। బోలునంచును
విని ♦ బాలనువరియింప; మముఁబంప వచ్చితి ♦ మమలధిషణ।
గీ॥ మండనుండును బుద్ధినా ♦ ఖండలగురుఁ। బోలుఁ దావకపుత్రి
నా ♦ పుడమివేల్పు। పట్టికోసఁగిన మణియుగ ♦ ప్రతిభఁగాం
తు। రిర్వురనటంచుఁ బలుకఁదా ♦ నిట్టులనియె॥ ౪౧

శా॥ నాకున్మీరనుమాటసమ్మతమె, యై ♦ నన్ రాత్రిమద్యోషతో।
నేకాంతంబున సంప్రతించి యటుపై ♦ నేమీకువాక్రుత్తు నా।
లీకాభాస్యలతోడఁ జెప్పఁగవలెన్ ♦ లేకున్నఁ గష్టాప్తులం।
దోకంజాసనవంశ్యులార!పతుల ♦ న్దుఃఖాబ్ధిఁ ద్రోముంత్రుసూ॥ ౪౨

—♦ ఉభయ భారతీ జననీజనక పర్యాలోచనము. ♦—

మ॥ అని భార్యంగనిసల్కు భూసురుఁడు రా ♦ జాగారమందుండి పు।
త్త్రిని యల్లెక్కుడుకూర్మిఁ బెంచుకొనువి ♦ ద్యద్గాత్రిఁ బ

తిగ్గం ద్విజా! గ్రహ్యని సత్వంత్తు గ్రనకుర్వెంగూర్చంగ ప్పజా ♦ గ్రస్త్ర
ల్ప క్తినేతెంచి, రే! మని తెల్పందగు? నెంచిపల్కుచును బలా! ♦ యా
పై ననర్థంబనన్॥ ౪౩

శా॥ ఈరీతి న్వచియించుభ ర్తకను సా ♦ హేలావతీరత్నమో,
సారాసారవిదీశ! మీకుం దెలుప ♦ న్సామర్థ్య మెవ్వారికో;
ప్పారుం జెప్పదు వేదలౌక్యముల నో ♦ ప్పోఫక్తి సంపన్నతుం
డై రమ్యాన్వయుం డైన యోగ్యునకుం గ ♦ న్యం దానమీ
యందగున్॥ ౪౪

చం॥ సిథిం గనదూరము న్వయవి ♦ శేషవయశ్శ్రుతిశీలముఖ్యసం
గతులెఱుంగంగ శక్యములు ♦ గా వటుకావున నేమిచెప్పన
మ్మతిం గననన్న భర్తయను ♦ మానిని! యీనియతిన్వచింప నె
ట్లతుకును? భీష్మకుండుమురారి ♦ కాత్మజనెంచక తానొసంగఁడే?॥ ౪౫

గీ॥ ద్వారకావిభుండైన యా ♦ శ్రీరమణుండు! తీర్థసేవాచ్ఛలంబు
నం ♦ దిరుగుచుండ! గుండినేశుండునౌ భీష్మ ♦ కుండు తనదు
తనయయైనట్టి రుక్మిణిం ♦ దడయకిడండె॥ ౪౬

ఉ॥ ఏమధికంబటంచు మది ♦ నెంచకు దుర్జయబోధిని జ్జయం
బేమహితుండొనర్చె చరి ♦ యింపగఁజేసెనొ వైదికాధ్వనా
ధీమణి భట్టపాదుఁడు సు ♦ ధీయుతునీతని జేసెనన్న చో
ధీమతి యాతఁడిట్టిఁడని ♦ తెల్పఁగశక్యమె ? యెంచిచూచినన్॥

చం॥ వినుమిలలోన విప్రునకు ♦ విద్యయెభాగ్యముగాని యన్యమా
ధనమ్ము ధనమ్ముగాదు సత ♦ తంబు దిగంతవిహారియైన వా
నినె వెనువెంటనంటి ధర ♦ ణిం జరియించునుమీ; సువిద్యమా
నిని! ధరణీశచోరపరి ♦ నీతమునై క్షయమొందదెన్నఁడున్॥ ౪౮

మ॥ ధర సంపాదనరక్షణవ్యయనిమి ♦ త్తంబైన విత్తంబుఁ ద
త్తరమా చిత్తమునెంతో చింతఁగనఁగా ♦ దాఁజేయునిత్యంబుఁద
స్కరధాత్రీరమణాంగనాస్వజనసం ♦ ఘంబద్ది చేకొందురం
చురుభీతింగనుచుంటచే ధనికిలే ♦ దూహింపసౌఖ్యంబిలన్॥ ౪౯

ఉ॥ కొందఱు ధాత్రినీధనము ♦ గోపితముంబొనరింత్రు లుబ్ధులై।
కొందఱుదానిఁ గాలమొకఁ ♦ గూడినఁగూడ భుజింపఁజాలరీ।
చందముగా ధనార్జనముఁ ♦ జాలనొనర్చి ధరిత్రిఁ బెట్టి దా।
నిఁ దిలకించి తస్కరుల♦నీతులునై హరియింతురంతయున్॥ ౫౦

కం॥ కొందఱు కష్టముచే ధన। ముం దగురీతింగడించి ♦ మోహంబున దా। నిం దటినీతటమందును। బొందుగ దాఁపంగ జలమె♦ పోవఁగఁ జేయున్॥ ౫౧

గీ॥ కన్యలఁ జరంబు పితృని ♦ కటమునందు। నుంపరా దెందుచేన న ♦ నువిదపెండ్లి। కాకపూర్వము వ్యక్తతఁ ♦ గనినఁ బితరు। లధికనారకయాతన ♦ లనుభవింతురీ॥ ౫౨

ఉ॥ ఏలవివాద మాత్మభవ ♦ నేపరిపృచ్ఛనొనర్త మాపెయే।
లీలవచింపనౌనొ యటు ♦ లేపొనరించుట మేలటంచు నా।
బాలమెలంగు వోటికి న ♦ భార్యఁ దునై చని పుత్రిఁజేరి యా।
బాలగుఱించి యీవిధిగఁ ♦ బల్కెను వత్సలభావమేర్పడన్॥ ౫౩

కం॥ శ్రీవిశ్వరూపజనకుఁడు। భావుకరతసుతునికొఱకుఁ ♦ బంపించెను భూ। దేవులనిరువుర నాడెన। కేవిధిఁజెప్పుదునో? చెప్పు ♦ మీపోపట్టీ॥ ౫౪

ఉ॥ చంచలనేత్ర తండ్రియును ♦ జక్కనిపల్కులవిన్న యంత రో।
మాంచమిషంబున న్ముదము ♦ పైకొనఁగా వచియించె లోనవ।
ర్తించెనుభావముం బిత్రుమ ♦ తిద్వితయంబు ప్రహర్షమందఁగా।
నంచితుఁడై నతజ్జనకుఁ ♦ డంతటను త్తరమిచ్చెదాననే॥ ౫౫

కం॥ అంతట భూసురయుగళము। సంతుష్టిని జనకగేహ ♦ సంచరవమలా। నంతామరునొక్కనిఁ గొను। చెంతయువేగంపుగతిని ♦ నిండ్లకునరిగెన్॥ ౫౬

గీ॥ పదియునాలుగుదినములు ♦ పైనమెలఁగు। మిత్రతారాలసద్దశ ♦ మీతిధిన్ను। యోగ నొప్పులగ్నమం ♦ చు భయభార। తీసతి లిఖించి దానిపై ♦ దిఱునకంపె॥ ౫౭

న్నామనవచస్సులందనిపి ♦ సాగఁగనంపి యహశ్చతుష్కము।
న్నాభమను గూఢదీక్షఁగొని ♦ పావకుసన్నిధినుండె హృష్టుఁడై॥

సీ॥ పరిణయంబైన పిదప న ♦ వ్వరుఁడు తనదు। వేశ్మమునకేగఁ బ్ర
స్థాన ♦ విధినొసర్ప। వధువుఁగొని తల్లిదండ్రులు ♦ వరుసఁజేరి।
పలికిరివ్విధి వత్సల ♦ భావమొప్ప॥ ౭౯

చ॥ వినుమవధానయుక్మతిఁ బ♦వితృహృదంతర! మండనార్య! మా
తనయ కుచంధయాభ పదిఁ♦బానిసుమంతయుఁగుర్తెఱుంగదా।
మనుసవయస్కలంగలిసి ♦ బోలికబాఁగును బంతులాడుఁగు।
క్షినిత్యుధఁగాంచి గేహమును♦ జేరెను సన్నమునుందిన న్వెసన్॥ ౮౦

సీ॥ ఈమెయొక్కర్తటంచు మే ♦ మింటిపనులఁ। దెలుపకుంటుటఁజేసి
యీ ♦ కలికి వానిఁ। జేయనేరదు గాన వి ♦ శేషదయను। దన
యయందును బోలె ద ♦ ద్దయునుజూపు॥ ౮౧

మ॥ ఒకనాఁడీక్కయనిందితాత్మకలితుం ♦ సుర్వీసురుండేగుదెం।
చి కుమారీశుభలక్షణాళి గని మా ♦ చెంతన్సమీపించి పా।
యకమాఁకోసరెనిట్లు వినాతసయ యా ♦ హాపుట్టుకన్మర్త్యగా।
ని కళాదాంగిరమె, వల్కనుగ్రముగఁజ ♦ న్నే? యూపెయుగ్రం
బునన్॥ ౮౨

క॥ సర్వజ్ఞతాంకమిలనీ। దర్వీకరవేణికమరుఁ ♦ దగునవయమునఁ।
దిర్వ్యరువిప్రులువాదము। నుర్వరఁజేయంగసాక్షి ♦ యువిదయె
కానాన్॥ ౮౩

ఉ॥ ఇట్లనిమాకుఁదెల్పిబుధుఁ ♦ డేగనిజేచ్ఛ ననంతరంబు మే।
మిట్లుగృహాంతరస్థయగు ♦ నిందిరకోడలటంచునెంచి యె।
వ్వట్లను గేహకృత్యముల ♦ బాలనొనర్పఁగనీక భక్తినె।
ప్పట్లను ప్రోచుచుంటిమి వేదఁ ♦ బద్మజభామినిఁబోలు బాలకున్

సీ॥ ఈమెయుత్తకునచియింపుఁ ♦ డీపలుకుల। స్నుషను గాపాడుపట్టి
దా ♦ సుపతియగుట। నీకుని క్షేపమయ్యె నీ ♦ కోకిలగళ। గాన
గృహకృత్యములమెల్లఁ ♦ గానునేర్పు॥ ౮౪

ఉ॥ బాలత నొప్పఁ గుప్పలుగ ♦ బాలికలందు వొసంగుతెక్కొ
చ్చోలవతుల్సతుల్గనఁగఁ ♦ జెల్లదిలన్మనమెల్లఁ గూడినా।
బాలతయందు దోషములఁ ♦ బారముగాఁగలవారె యెంచు నా।
బాలతఁ బాసి శిక్షఁ గని ♦ భవ్యులమైతిమి గాదె! నేఁటికిన్॥ ౮

చ॥ వరజనసీమతల్లిఁ గని ♦ పల్కు నశేషముల స్మదీయ హృ।
త్సరసిజముల్సరిరమిద ♦ సాకుము తావకమంచు నేరుఁ జె।
ప్పరుగద? యైననేనసిన ♦ పట్టున నేఘలమౌనొ? యట్లె యా
వరజనయిత్రి కిష్టులగు ♦ వారలు యుక్తిగఁ జెప్పనొప్పగున్॥

క॥ అనివిష్ణుమిత్రుఁడల్లునిఁ। గని వాక్యభాషితములఁ ♦ గొం
మొప్పఁ। న్విని చి తనతనయఁ గనుఁ గొని। యనఘపత్రికవాక్యరా
సనఘాంతరుఁడై॥

ఉ॥ పొందితి నమ్మ నీవొకయ ♦ పూర్వమహాదశ నట్టిదానినా।
నందము నేర్పనుంగలము ♦ నంబు నరక్షణఁ జేయు మమ్మ; యిఁ
కందగదమ్మ; బాలత య♦ఖండముదమ్మును మాకుఁ గూర
ట్లందటికట్టిబాల్యముపగ్రి ♦ హర్షముఁ గూర్పదు నమ్ము మమ్మ

చ॥ రమణికిఁ దల్లిదండ్రులెక ♦ రగ్రహపూర్వమునందధీశభా।
వముఁ గనుచుండు రావెనుక ♦ భర్తనధీశునిఁ గావ చింతుర।
త్యమలమనీషులట్లగుట ♦ నమ్మకొ భర్తృపదాబ్జమే శర।
ణ్యముగఁ దలంపుమట్లయిన ♦ నాతి! జయింతువు లోకయుగ్మము

శా॥ అమ్మా! భుక్తినొసర్పకమ్మ; ధవుఁడా ♦ హారార్థియై రానిఁ
సౌమ్యుల్ ప్రాణకుమన్య దేశములకిఁ ♦ శుండేగుచో నింక న।
చ్చమ్మెన్నట్టి మహర్షిశేఖరసతీ ♦ చారిత్రముత్కృష్టమౌ।
నమ్మాఁ గావున నీకుఁ దత్సరణి నా ♦ నం జెల్లునెక్కాలమున్

క॥ భోజననిద్రలు చెల్లును। రాజానన! పతియనంత ♦ రమ్మున
కా। యోజ విపర్యాసంబగు। నోజననీ మేలుకొనుట ♦
నాస్త్రనంబున్॥

మ॥ పతిరుష్టుండగు నప్పుడుం గనయుఁ గో ♦ పంబూనకత్యంతశాం|
తతఁ జిత్తంబునఁ దాల్చి యోర్చికొన శాం♦తంబానుసర్వంబు నీ|
గతిఁ జిత్తేశుఁడు నిర్మలాత్ముఁడగు నో ♦ గామ్యంబు సిద్ధించు న|
ష్టతపూ సద్యశమబ్బు నోర్పు తన సం♦తాపమంబులీడేరెడిన్॥ ౫౩

గీ॥ భర్తృసన్నిధియందును ♦ బరపురుషుని| మోముఁగని పల్కఁ
జనదు ప్రౌ ♦ శ్రీమతల్లి| కాంత కేనాంతమును సేల ♦ మంతనంబు|
లుంచు మదినెంచి విమనస్కుఁ ♦ డగును ధవుఁడు॥ ౫౪

మ॥ పతిగేహంబునకేగుదెంచినపుడో ♦ పద్మాక్షి గేహంపుఁగృ|
త్యతతిన్ మాని దురితంబతోయమునఁ బా♦దద్వంద్వసంక్షాళనం|
బతిభక్తింబొనరించి హృష్టుఁడగున ♦ ట్లాత్మేశు నింజేయుమో|
సతి చిత్తంబున నైహికంబగు సుఖా♦శం జెందకశ్రాంతమున్॥ ౫౫

కం॥ ధవుఁడింటలేనివో బాం| ధవులింటికివచ్చునెడలఁ ♦ దగునర్చ
నొన| ర్పవలె స్నేహన్నను వం| శవిదాహాకులగుదు రాశ ♦ చను
టన్నారల్॥ ౫౬

చం॥ తిలసుమనాస! చూడుము మ♦ దెందలిదంద్రములఁబోలెన త్తమా|
మల ననుజన్మసంచయస ♦ మంబుగఁజూడుము దేవరాళి బా|
వలఁగనుమన్నలంగనెదు ♦ ఫక్కి నటుల్కని తేని మిత్రభా|
వలసితులౌదు రమ్మరో! భ♦వత్ప్రియభేదమొనర్పకుంద్రిఁకన్ ౫౭

చం॥ అతులహితోపదేశనిహి ♦ తాంతరులై గురుబంధువర్గ స|
త్కృతులగు నవ్వధూవరుల ♦ దీవ్యదధీశనివేశసంప్రవే|
శితులనొనర్చె నత్యమల ♦ చిత్తుఁడునౌ హిమమిత్రుఁడంతఁగృ|
త్యతతినొనర్చె మండనబు♦ ధప్రవరుండు సభార్యుఁడై యటన్॥

చం॥ మరలఁ బ్రసన్నదుర్వాసన♦ హానిమొసంగెను శాపమోక్షమా|
నరసిజసంభవాంగనకుఁ ♦ జామరొ? సర్వవిదీశుఁడైన శం|
కరయతి సర్వవేత్తృతక ♦ ఖండపుసాక్ష్యమొసంగి నీగతి|
న్వలఁ తెలియటంచుఁ దానుభయ♦భారతియప్పుడు ధనొప్పెనందుచేన్॥

—♦ ఆశ్వాసాంతము. ♦—

కం॥ బాలేందుమకుట! గిరిజా। లోలా! కాబ్జాప్త! పావ ♦ నా! నాకధు
నీ। హాలా! మేరుశరాసన॥ నీలగళస్ఫురిత! సన్మ ♦ నీషినుతాఖ్యా॥

మ॥ నిగమోత్తంసపదంబుసంభవ! భవా ♦ నీభాగసంపన్న! ప
న్నగరాట్తల్పశయానమార్గణ! గణే ♦ నద్యోతితోత్సంగ! సం
గగతిచ్ఛిద్వినుతా! నుతావన! ఘనౌ ♦ కస్సంయమీంద్రాఘుచి:
త్రిగతశ్రీపదపద్మ! పద్మభవను ♦ త్యా! మోహినీపూర్ధవా!॥ ౧౦౧

మాలిని॥ సురనికరనితాంత ♦ స్తూయమానాచ్ఛలీలా!॥
కరతలధృతశూలా! ♦ కంజనేత్రార్ధ్వచేలా!॥
నిరతవినతభక్తా ♦ నీకపాలా! యవేలా।
దరకలితకటాక్షా ♦ ధాన! భూధాత్మజేశా!॥ ౧౦౨

ఇతి "శ్రీమద్భమిడిపాట్యన్వయ..................వేంకట
సుబ్రహ్మణ్య శర్మాభిధేయాంధ్రీకృతంబైన
శ్రీ శంకరవిజయంబునందు
తృతీయాశ్వాసము.



# శ్రీశంకరవిజయము

## చతుర్థాశ్వాసము



శ్రీ జానిప్రముఖామర |
రాజశిరస్థ్సలకిరీట ♦ రత్నద్యుతివి |
భ్రాజితపదసరోజ! గౌ |
రీజానీ! పశుపతీశ! ♦ శ్రీసకలేశా ||

శ్రీశంకర బాల్యాభివర్ణనము.

గీ|| అవధరింపుము; విప్రగే ♦ హమున నాత్మ | మాయచే బాలుఁ
డగుచు ను ♦ మాధవుండు | మదిని జనకుండు ముదమంద ♦
మొదటియేఁట | నే, గ్రహించెను వర్ణాళి ♦ నిస్స్వభావ ||

శా|| అంతన్రెండవయేఁట ఘంవిద ♦ గ్రావాసియౌ బాలుఁడ |
త్యంతోల్లాసత నక్షరంబులను వ్రా ♦ యంబల్కఁగానేర్చె స |
త్త్వాంతుల్ప్వల్కుఁ పురాణకావ్యముల సం ♦ తన్వీధ్రతోడన్వినె |
న్సుంతై నన్వనకుండ నంచితమతి ♦ షుండంతయున్నేరిచెన్ || ౩

చ|| గురుఁడనురక్తితోడఁ దన ♦ కున్పచియించిన విద్య సర్వకుం |
బురుతరమేధతోడుత బ ♦ హుజ్ఞులు మేలనఁగా గ్రహించుచు |
న్గురనకుఁ గష్టలేశమును ♦ గూర్పక తోటిసతీర్థ్యరాజికి |
న్గురుసముఁడౌచు నగ్గురున ♦ కున్నమకూర్చెఁ గపుంబ్రహర్షమున్

గీ|| రజముతో నాపునెడఁగూడ ♦ ద్విజతనూజుఁ | డావజస్త్రమము
లకు న ♦ నాశ్రితుండుగ | నుండి దండిగ విపులన ♦ ఖండమేధ |
తోడఁ దానందె సుజనులు ♦ కూడి మెచ్చ || ౪

క॥ విధివిహితచౌలసంస్కృతి । సుధిషణవిప్రాత్మజుఁడగు ♦ సుషమ
రహించెం । బ్రిధితాజ్యాహుతివర్ధిత । మధితాగ్నిజ్వాలఁబోలె ♦
మహితంబగుచున్॥ ౭

చ॥ ఇతరజనోపదేశనిర ♦ పేక్షసుధీకలితావనీసుప ।
ర్వతనయుఁడా గమంబుల నం ♦ వప్రథితార్థసారసోల్లసత్సునా,
వ్రతతి నఖండకర్కశన ♦ యప్రముఖాఖిలశాస్త్రపాళి నౌ ।
ద్భుతముగఁ దాఁబఠించె బుధ ♦ పుంజములెల్లను సంస్తుతింపఁగన్

క॥ త్రిపురేశజ్యాచాతురిజయ । కృపమలధీకలితుఁడై మ ♦ హింపఁగ
సతనితో । విదితనిజవాగ్వినిర్జిత । మదవదరాతులు బుధులస ♦
మర్థులు వలుకన్॥ ౮

చ॥ ఫణిపతివార్తికస్ఫురణ ♦ బాలకసత్క్రమవాక్యరాజితో ।
రణి విని వాదిసంహతి, తి ♦ రంబుగ యుక్తివిరాజితోత్తరం ।
బణుపరిమాణమిచ్చుటకు ♦ నైనఁ బ్రమాదమునందు, వేదవి,
ద్గణ గణనీయ బాలకస ♦ కాశమునం దసమర్థముంటకున్॥ ౯

ఉ॥ ధీమణియందు సజ్జనను ♦ తింగను నియ్యనఘుండు దుర్మతా ।
రామములన్నియుక్తుల వి ♦ రాజిలువాక్యకుఠారధారలన్ ।
న్నామవిహీనమాసటులో ♦ నర్పఁగ నంతఁడచీయసప్పెచా ।
స్త్రోన్నమునిరస్తులైరి విమ ♦ తుల్ స్వమతస్థితిఁ జేయనేరమిన్ ॥ ౧౦

క॥ యమునాజనకసువర్చ । స్సమతేజఃకలితబాల ♦ సమలంకృతవం ।
శము నతులంబుగశివగురుఁ । డమితానందమున నెంచె ♦ నంతర
మందున్॥ ౧౧

శంకరపితృవియోగము.

చ॥ సుతుఁడు సమస్త్రియుండయి వ ♦ చోనిచయావచనీయలీల న ।
ద్భుతముదముంబొనర్ప జర ♦ తో యుతుఁడై జనకుండు లో
నఁ దా । సుతునుపనీతుఁ జేయఁగ వి ♦ శుద్ధముహూర్తము నెంచు
చుండనే । మృతిఁగనె నౌర; భానుభవుఁ ♦ డెంచునె మర్త్య
కృతాకృతంబులన్॥ ౧౨

మ॥ సుతునిం గాంచుటదుర్లభంబు, ధరఁ ద♦త్సూనుప్రభావేక్షణం|
బతిపుణ్యప్రభవంబటన్న విబుధ ♦ వ్యాహారమీనాఁటికిఁ|
క్షితమయ్యెన్బహుకష్టసంగతిని సం ♦ సిద్ధించెఁ బుత్రాప్తి, గా|
ని తదీయోదయమిట్టివాని కెటులే ♦ నింగూడెనే చూడఁగన్॥

ఉ॥ ఈవిధిఁగాలసంగతము మ ♦ హీసురుఁ గాంచితదీయపత్ని దుః|
ఖావిలచిత్తవృత్తి మన ♦ సాంబుభవప్రభవాశ్రుబిందువుల్|
భూవహరేక్షణద్వయము ♦ పోలిక నుండెను తత్కుచద్వయి|
స్నావుగఁ బార నిట్లనె గ ♦ ళధ్వని గద్గదమై చెలంగఁగన్॥ ౧౪

మ॥ హృదయేశా! భవదీయసన్నిధిని నే ♦ నేలోపమున్లేక సం|
పదలం గల్పకమట్టులిచ్చెడు భవ ♦ త్పాదాబ్జయుగ్మంబు స|
మ్ముదమొప్పార హృదంబుజాతమున నా ♦ మోదంబుతో
నుంచి చే| యుదుఁగాదే? పరిచర్య నిట్టిసను న ♦ య్యో! వీడఁ
గాఁజెల్లునే॥ ౧౫

సీ॥ బహుజన్మకృతపుణ్య ♦ పరిపాకమున నాదు; హృదయసీరజ
మిత్ర♦పదమవైతి| వనుచు భక్తిశ్రద్ధ♦లను బూని కల్యంబు;
నసె లేచిమీపాద ♦ వినతిఁ జేసి| భవదీయవిధుతుల్య ♦ వదన
వీక్షనొనర్చి; గేహకార్యాళి ను ♦ త్సాహమొప్ప| ద్రుతగతి
నొనరించి♦కుతుకంబువికసింప; నత్తమామలకుఁ బ్ర♦పత్తితోడ|

గీ॥ సకలపరిచర్యలనొనర్చి ♦ యకలుషాంత| రంగమున నొప్పఁ మీ
యంచి ♦ తేంగితంబు| నెఱిఁగి వర్తించు నను వీడి ♦ యరుగ
నగునె?| భవ్యకవిద్యాజితాంభోజ ♦ భవుఁడ! ధవుఁడ!॥ ౧౬

చ॥ నిరతము సంబుజంబులవి ♦ నిర్జితకాంతులఁగానొనర్చుదే|
వరపదయుగ్మమున్విడిచి ♦ వైచి మదీయమనంబువేఁడునే|
వరసనుగోరు నుల్లసిత ♦ వారిజసన్మకరందసక్తభృం|
గరమణి యన్యసూనతతిఁ ♦ గాంచి రసంబును గ్రోలఁ గోరునే॥

సీ॥ భవదీయపాదాంబు ♦ భవసేవన మెకాని; హృదయమన్యముఁ
గోర ♦ దించుకయును| భవ్యయుష్మద్గుణ ♦ ప్రణుతిఁ జేయుచె

కిఁక మహ్యక్త్రసదృశసద్దశమె కా ♦ దే, సత్సుఖంబందు నెం|
చి కృశాస్వర్ధ్యులలోఁబడంగసతి తాఁ ♦ జిత్తంబులో నెంచఁగన్‌॥

శా॥ ఆనారీహృదయస్థభావము స ♦ ద్వ్యాసాంకులనిష్ఠుల్బసౌ |
జ్ఞానుల్మన్న యెఱింగి యిట్లనిరి నా ♦ సాధ్వీన్సమీక్షించి, యో|
హో నారీమణి! సాహసంబిటుల నీ ♦ కూనంగనర్హంబె? త్వ|
త్సూనున్సన్నము నేరికిచ్చిచనను ♦ ద్యోగించితో? చెప్పుమా ||

చం॥ సుతునకు నెంచిచూడఁగ ది ♦ క్షుత్వమువాయదికంటిలోననో|
సతి! భవదన్యసంశ్రయమె ♦ సంగదు, చూడఁగ; నీవటన్న నీ|
పతిగతిఁగోరుచుంటివిట ♦ బాలకుఁడెవ్విధివృద్ధినందునో|
మతిఁ బరికించియూపయి స♦ మంజసమౌ గతిఁజేయుమమ్మరో!॥

చం॥ అని జనరాజివల్కవిని ♦ యానతిలోఁ బతిశోకముంచి వ|
హ్నిని హృదయేశు దేహము ద♦హింప సనాభులఁగోరె వారిచేఁ|
దనవిభుపారలౌకికముఁ ♦ దత్పరబుద్ధినొనర్పఁజేసి హా|
యనఘితదీక్షఁదాజరిపె ♦ నాత్మభవుంప్రియమొప్పఁగాంచుచున్‌॥

—♦ శ్రీ శంకర సద్గురు కులవాసము. ♦—

చం॥ ఉపనయనంబుఁ బంచమస♦ మోపనయమందొనరించుచెప్పు శా|
స్త్రపరిగతంబె కావున బు ♦ ధపరివిచారితమౌ ముహూర్తమం|
దుపగతమోదయై సుదతి ♦ యోగ్యుల బంధులఁగూడిపుత్త్రునిన|
చ్చపుమతినంపె దేశికుని ♦ సన్నిధికిన్వ్రతిఁగానొనర్పఁగన్‌॥ ౨౬

మ॥ క్రమమొప్పంగ షడంగయుక్శ్రుతిచతు♦ష్కంబభ్యసించెన్సమ|
గ్రముగా దేశికునొద్ద బాలుఁడు కుశా ♦ గ్రప్రస్ఫురన్మేధనా |
సుమనోగ్రప్రవిభాసు నల్పతనుభా ♦ సుం బాలునీక్షించి లో|
కము సంవిస్మయమందె దేశికునితోఁ♦గాంచెంగడున్వాక్షమున్‌ ౨౭

ఉ॥ తోఁటికలార్థులన్వటువు ♦ తోఁడుతఁ బాఠములంబఠించుచు|
న్నాటివిపహింపరీవృశల ♦ న్మతిఁ బాఠముఁజేయ వీటనే|
పాటవియర్హుఁ డింకనొక ♦ పాటి బుధుండసమర్థుఁడంచుఁ దా|
మాటికిమాటికిందలఁచు♦మానసమందునఁ దద్గురుండహో॥ ౨౮

గీ॥ రెండుమూఁడు నెలల్లోనె ♦ కుందుమొప్ప। పగిది శంకరుఁ డభ్యస్త ♦
నిగముఁడగుచు । నక్కడక్కడ గురుతుల్య ♦ శక్తిఁగాంచె।
నవనిజనులెల్ల మిగుల సం ♦ స్తవమొనర్ప॥ ౨౯

మ॥ శ్రుతులన్ధాతయెయాఁ, డడంగములగా ♦ ర్గ్యంబొలుధాత్రిన్స్మృతిప్రా
స్మృతితుల్యుండు తదర్థపాళి వివరిం ♦ పంగా శ్రుతిప్రోక్తక
ర్మతతిన్వర్ణనఁజేయఁజై మినియె పా ♦ రాశర్యుసింబోలుఁ ద
చ్ఛ్రుతివాగ్జార్థవిబోధమూలమునసా ♦ శోభిల్లెగీల్లుఁజై॥ ౩౦

ఉ॥ తర్కముఁగాంచెఁ, గాపిలమ ♦ తంబుననందె నఖండమేధ, నా
య్యర్కునిఁబోలెఁ గ్రోలె నుర ♦ గాధిపయోగపయోర్ధునిన్ మహా
దర్కదభాట్టఘట్టగత ♦ తత్త్వమెఱింగె, ననేకయత్నసం
పర్కజనిర్మలాద్వయి న ♦ పారసుఖప్రదనందె బాలుఁడై. ౩౧

గీ॥ అర్భకాభ్యస్త నిఖిలవి ♦ ద్యాసుఖంబు। సద్వయామలసుఖమం
ద ♦ యడఁగియుండెఁ। గూపమంగుండు పాసియ ♦ మాసగా
జ। లంబులను దాఁగదోకొ లో ♦ కంబునందు॥ ౩౨

—♦ శంకరుఁడు దరిద్రసతీనిలయంబునకు భిక్షకరుగుట. ♦—

గీ॥ ఇలనతండిట్టులగ్గురు ♦ కులమునందు । వాసమొనరించుచు సతీ
ర్థ్య ♦ భాసమానుఁ। డగుచు నొకనాఁడు భిక్షార్థ ♦ మై దరిద్ర
భూసురావాసమునకేగె ♦ ముదితుఁడగుచు॥ ౩౩

ఉ॥ వచ్చినశంకరాఖ్యవటు ♦ వర్యునిఁగాంచి దరిద్రపత్ని, తా
బోచ్చ్యయనారకా! భవుక ♦ యోగ్యభవాదృశసేవఁజేయునా।
సచ్చరితుండె ధన్యుఁడు ప్ర ♦ జాపతి వంచనఁజేసె మమ్ముఁ గ్రయు।
పశ్చ్చరణార్హుఁజేసి యొక ♦ మారును భైక్ష్యమొసంగకుండఁగన్॥

సీ॥ కృతపకాలమున నా ♦ గతులై సువ్రతి యతి; ప్రముఖాతిథుల
కెల్ల ♦ నమితభక్తిఁ। బాద్యార్ఘ్యములనిచ్చి ♦ భవ్యాసనంబున;
నుపవిష్టులనుజేసి ♦ యపుడె తుష్టి। మృష్టాన్నమొసఁగి సం ♦
హృష్ట చేతస్కుల; నొనరించి సత్కృతి ♦ నొనరఁజేసి । తగుగతి

సంపదగా ♦ దగు, నట్లొనర్చినఁ నుభయలోకములందును ♦ నభ
యుండగుచు।
గీ॥ సర్వసజ్జనసుతిపాత్రుఁడు ♦ దుర్వారనగు। నట్లుగాకున్న దస్యుఁడై ♦
యవనిలోన। రిక్తుఁడగుఁజుమ్ము, మాధవ ♦ రిక్తజన్మ। మున్నఁ
బోయిన నేమున్న ♦ దన్న! ఫలము॥ ౩౭

ఉ॥ ఉన్నకొలంది నాగతుల ♦ కూర్జితభక్తిలసత్సుబుద్ధితో।
మన్ననతోడనన్న మిడ ♦ మానిసియత్నమొనర్పఁజెల్లు, లే।
కున్నను జౌర్యరిక్తతల ♦ కోకముసోనని లోనెఱింగి నీ।
కన్నమిడంగ శక్తిఁగన ♦ నైతిఁగదా? జగదర్చ్యపాదుకా!॥ ౩౮
ఉ॥ దీనవచస్సులీగతి స ♦ తీమణిపల్కుచు నాఁవతిందు్రి స।
న్మానిమఁజేసి యామలక ♦ మాన్యఫలంబునొసంగ నా వ్రతీ।
శానుఁడుఁ దత్సతీసుకృత ♦ సత్కృతినంది తదీయదీనవా।
క్సోనిచయంబుచుంగని క ♦ నెం గరుణార్ద్రమనీష నత్తఱిన్॥ ౩౯

——♦ ఆమలకగ్రహణానంతర లక్ష్మీ స్తవము. ♦——

ఉ॥ ఆముని సంస్తుతించెఁ గమ ♦ లాక్షుసతిన్విధుసోదరిన్దరి।
ద్రామయవారిణిన్భవను ♦ ఖామరసంఘసతీసమావృత।
స్నేమముతోడఁగూడి నవ ♦ నీతసమానమృదుత్వయుక్తవా।
క్ప్రేమమునన్ధరామరున ♦ కుం గలరిక్తతఁ బాపుబుద్ధితోన్॥ ౪౦
శా॥ శ్రీనాథాంచితవక్షమందొనరు నే ♦ చిద్రూప, స్వాహాస్వధా।
ఖ్యానాళిన్విలసిల్లు నేజనని, సౌ ♦ ఖ్యంబిచ్చు నాత్మీయనా।
నానామంబులనెంచుమాతృముల నే ♦ నారీవతంసంబు, నే,
నానారీమణి నెంతు నెప్పుడును న ♦ త్యంతంబు భక్తిన్మదిన్॥
శా॥ తల్లీ! నిన్నుఁ దలంతు భక్తియుతచి ♦ త్తంబందు, నావిన్నపం।
బుల్లంబందుననుంచి భీతమగునా ♦ యుల్లంబు నిర్భీకమై।
యుల్లాసంబున నుల్లసిల్లునటులో ♦ యోషామణీ! చేయుమం।
చల్లిలన్భజియింతు నిచ్చలు సరో ♦ జాతాదిసూనంబులన్॥ ౪౦

వారము తోడి సంగమె యు ♦ పాయముగాని ధరిత్రి దీనులన్।
బారముఁ జేర్ప వేఱొకయు♦పాయములేదు సుమీ యమీశ్వరా॥

చం॥ చిరుతరుణంబు నుండియుని ♦ శేషముగా భగవానుని న్మనం।
గరమిటు చూడఁగోరుదును ♦ గాని మునక్షీపథంబు నీవు ని।
త్తఱి యమివర్య! పొందితివి ♦ తప్పఁగ నీభవమార్గమందున।
న్నరతతి కిష్టయోగముఁ బ్రమ♦సుకృతుకత్వముచేతఁ గామగా॥ ౮౮

గీ॥ కాల మొక్కొకతఱి నిష్టఁ ♦ గలుపుచుండు। నపకృతినొనర్చు
నీచునొ ♦ క్కపుడు కూర్చు। కష్టకూర్చి వియోగంబు ♦ న
పుడెరయొనఁగుఁ। గాలకృత్యములు కష్టసు ♦ ఖంబులరయ॥ ౮౯

మ॥ మునిబంధంబునొసర్చితి స్మృతియు ని ♦ స్తుల్యంబునొ మార్గమి।
ట్లనుచున్నిర్ణయముం బొనర్చితిని నే ♦ నాన్యాయశాస్త్రజ్ఞయు।
క్తిని రాసంబును సల్పితిన్విషయజా ♦ క్షీణోరుజాతంబులం।
గనితింగాని సమర్థతంగనను నీ♦ కాలంబుఁ బోద్రోయఁగన్॥ ౯౦

మ॥ నిగమంబెన్న స్వతఃప్రమాణమనుచు ♦ న్వేదనిర్ణయంబుం బొన।
ర్పఁగ నెవ్వానినిగూఢకే సుఖముఁ గూ♦ర్పంగాఁ బ్రపంచంబు శే।
క్తిఁ గనంజాలదొ? యట్టిదిట్టనిగమో ♦ క్తిస్తోమసంసిద్ధు నీ।
శు గణిష్ఠున్నిరసించి తైనను బరే ♦ శుండౌఁ పనోవిద్వరా॥ ౯౧

కం॥ జగమెల్ల బౌద్ధసంవృత। మగుటయు శ్రుతిపథము చెలువు ♦
సందరునికియుం। దగఁగని బౌద్ధులనోర్పఁగ। నిగమ పురాణాధ్వఁ
బ్రోవ ♦ నేదొరకొంటిన్॥ ౯౨

మ॥ అవనీనాథుఁడు మున్ను గాఁగలుగుమ♦ర్త్యవ్రాతముం బౌద్ధులా।
త్మవశస్థంబుగఁ జేయ శిష్యయుతులై ♦ తామాథరిత్రిశ గే।
హావితానంబునుజొచ్చి యీతఁడుమది♦ యాధీశుఁడక్లాటమా।
దువిశేషాజిరముంగొనుండు శ్రుతియు♦న్దోషాధ్వవర్జింపుఁడీ॥ ౯౩

మ॥ ధరలోన న్బహుమాన బాధవలనం ♦ దథ్యంబుగాఁగం బర।
స్పరవైరుధ్యముఁ బల్కనట్టిదగుటం ♦ బ్రామాణ్యమున్వేదమే।

తఱినై సంగసదంచుఁ బల్కుచును బౌ ♦ ద్ధవ్రాత మెల్లప్పుడుం|
దిరుగుం దానికి నష్ట లేశమును బ్ర♦ప్తిన్గొనదయ్యెంగదన్॥ ౯౪

సీ॥ వేదఘాతుకులైన ♦ యామరాత్ములతోడ; వాదించితిని గాని ♦ వారిసైన| సిద్ధాంతగోవ్యూహ ♦ సింధువులనెల్లం; గక వారిఁ గని పల్కు ♦ టకును శక్తిఁ| గనైతిని నిషేధ్య ♦ మనుగు కైలుగక; తన్నిషేధమొనర్పఁ ♦ దరమె? యనుచు| మతినెంచి యప్రమత్త♦వ్రతమానస్కుఁడనౌచు; సౌగతస్థలికినేఁ♦జనితదీయ|
గీ॥ మైన శాస్త్రంబువినుచుండఁ ♦ గా నొకప్డు| తీక్ష్ణమతి బౌద్ధుఁ డొకఁడు వై ♦ దికపుఁ దెప్పు| నేవినిందించె నావెంట ♦ నేమద శ్రు| కణము ఘనమైనఁ బడె మోగి ♦ గణవరేణ్య!॥ ౯౫

గీ! అస్మదశ్రునిపాతంబు ♦ నతఁడుదక్కఁ| బార్శ్వయుగ్మనివాసు లౌ ♦ పరులెఱుఁగరిఁ| కపుడె మొదలుగనావయి ♦ నాప్తభావ| మునువిడిచియున్న యవ్వారిఁ ♦ బొందె శంక॥ ౯౬

మ॥ బలవంతుండు విపక్షపాతి మునునౌ ♦ పాలుండితం డస్మదీ|
యలసద్దర్శనముం గ్రహించె మనమ ♦ ధ్యన్ గూఢుఁడై వీనినే|
లలినైనన్ వెడలంగఁగొట్టుఁడు దురా ♦ లంబాత్ములౌనిట్టివా|
రలిటన్ నిల్పననర్హులంచు నిటుతీ ♦ ర్మానించిరప్పెల్లరున్॥ ౯౭

కం॥ అనియాబౌద్ధులు నిశ్చయ| మునుజేసి నిపాతభీతిఁ ♦ బొందిన నన్నుం| గని యుచ్చసౌధశిఖరం| బుననుండి ధరిత్రిపైకిఁ♦ బోఁ ద్రోసిరొగిన్॥ ౯౮

చం॥ శ్రుతితతి సత్ప్రమాణమగు ♦ చో విషమస్థలినిచ్చటన్ నిపా|
తితుఁడనునయ్యు నేననుత♦తిన్ విడనంచు వచించి యుచ్చసౌ|
ధతలము లెక్కుచుంబడుచుఁ ♦ దాల్చితినేననుసంచయంబునే|
బ్రతుకుటచేతనే నిగమ ♦ రాజికి మాన్యతయబ్బె విద్వరా!॥ ౯౯

కం॥ అగుచోననుచును సంశయ| ముగఁబల్కుట మిషనుశాస్త్ర♦ మును వినుటను హే| చ్చగుదేశమునుండిపడన్| దగు నాకన్నడఁగె విధికృ ♦ తంబగునదియున్॥ ౧౦౦

గీ॥ అక్షరమునొక్కఁడిచువాఁడె • యగుగురుండ। టనిన శాస్త్రోప
దేష్టనే • మనఁగవలయు?। సుగతగురునుండి విద్యనేఁ • బడసె
తెంగి। దానినిడితి మహాపరా • ధమునతనికి॥ ౧౦౧

ఉ॥ జైమినియేయుపజ్ఞగఁ బ్రశస్తినిగాంచిన శాస్త్రమందునా।
దౌమతిఁజొన్పఁగాఁబడుట • నార్య! తథాగతునుండి తన్మత।
స్థామితగోప్యసంగతుల • నాత్మనెఱింగియుఁ దత్కులంబునే।
నేమునుఘాతఁజేసితి న•నింద్యుఁబరేశుఁ దిరస్కరించితిన్॥ ౧౦౨

కం॥ ఈరెండుదోసములకు సు। ధీరాజ స్తన్య నిష్కృ • తినొనర్పఁ
గ నీ। మారుతసఖుఁజొచ్చితి నది। యూరయఁ బునరుక్తి నీవ •
దాబ్జముఁగనన్ ౧౦౩

ఉ॥ నీవలభాష్యముల్ ఘనమ • నీషనొనర్చితివంచు సంయమీం।
ద్రా! విని దానియందున న • యంబుగవృత్తినొనర్చి కీర్తినీ।
భూవలయంబునంగనెదఁ • బోయనిమెంచితిమున్ను, గాని యి।
ష్టావితథోక్తి నేమియగు?•నట్టిసుభాగ్యము నాకులేదుగా॥ ౧౦౪

మ॥ నిను, నద్వైతముబ్రోవనంచిత జనా • నీకార్థమీ భూతలం।
బునజన్మించినశంభుఁగానెఱుఁగుదుం•బుణ్యాత్మ! పూర్వంబెనా।
కనుఁదెన్నున్ సఫలంబుఁజేసినయెడన్ • గట్టా! మదిష్టక్షయం
బున కేనిట్టిపనింబొనర్పనుగదా; • పూర్ణప్రమోదంబునన్॥

ఉ॥ ఓబుధపూజ్య! యీయుగళ • జోత్కటపాపముఁబాపనిష్ఠ దీ।
క్షాబలమూని యీతుషకృ • శానుశిఖావళిలోనఁజొచ్చితిన్।
శాబరభాష్యమట్లు విల • సద్భవదీయసుభాష్యమందు నా।
కేబహుళార్థమింతలిఖి • యించి నుతింగనుభాగ్యమెట్లగున్॥

మ॥ పరమోదారుఁడు భట్టపాదుఁడిటు సం • భాషింపనీషద్వికస్వర।
స్వరమైయాననకంజమొప్పఁగయమీ • ద్వర్యుండుదాఁబల్కెని
ద్ధరణిన్ వేదచయార్థకర్మవిముఖ • త్వప్రోల్లసద్బాధసం।
హరణార్థంబుజనించు నిన్నుగుహుఁగా•నార్యేడ్య! యేనెర్గుదున్

గీ॥ నీదుసంభావనయుఁ బాప ♦ మీఁదు సజ్జ| నతతిశిక్షకునై నిజ ♦
చరితమునాచ| రించెదవు కరకజలముఁ బ్రో ♦ క్షించిబ్రదుకఁ|
జేయుమనువార్తికము దీనఁ ♦ జేయుమీవు॥ ౧౦౮

మ॥ అనుచుం బల్కెడు బ్రహ్మవిద్వరుని శాం♦త్యర్థాగ్రగణ్యున్ బుధా|
ర్చ్యుని నామస్కరిఁగాంచి ధర్మవిదుఁడున్ ♦ బ్రోద్యత్సు
విద్యాఘనుం|
డనునో భట్టపదాభిధాన విబుధుం♦డున్ బ్రశ్రయం బెంతయో|
తనకుంజెల్వొనఁగంగఁగాఁ బలికె హృ♦ద్యంబౌగతిన్ దాధృతిన్॥

శా॥ ఆహా! నాయెడఁగూడఁ ద్వన్మహితసా♦ధ్వాభాషణం బెన్న నెం|
తో హృద్యంబగు, వక్రమౌధనువునం♦దున్ శూరవర్యుల్ గుణ|
వ్యూహారోపణఁజేయు పోలిక మహా ♦ వ్యూహంబునన్ సద్గుణ|
వ్యూహారోపణముం బొనర్చఁగుటిల♦వ్యూహంబునం దుందయన్॥

మ॥ కరుణార్ద్రోల్లసదచ్ఛతావకకటా ♦ క్షవారిప్రపాతంబులన్|
చిరకాలంబుననే మృతింగనినను ♦ జీవింపఁగాఁజేయ శం|
కర! దక్షుండవు, కానిపూనఁబడెనా♦ మ్నాయోక్తమాసవ్రతం|
బు, రసన్, దీనినివీడఁజో బుధచయం♦బున్నిందనే నందనే?॥ ౧౧౧

కం॥ కావున శుద్ధంబయ్యెను| భూవలయ విరుద్ధకృత్య ♦ మునుస
ల్పఁగ మ| ద్భావంబు సమ్మతింపదు| పావనగుణజాల! భవ్య ♦
పాటలచేలా!॥ ౧౧౨

గీ॥ దేవ! నీమపరిభావంబు ♦ దెలియునాకు| భూతములనొంచి
పూర్వంపు ♦ రీతిఁదిరిగి| యును సృజింప సమర్థుండ ♦ వనిన
నన్నుఁ| బ్రతుకఁజేయుట నీకుఁజి ♦ త్రంబుగాదు॥ ౧౧౩

చం॥ శమివర! మున్నె? చిత్తజల ♦ జాతవినిశ్చితమైన యీపవిత్రా|
గ్ర్యమువిడ నుత్సహింపనటు♦ గావున నాయెడఁజేర్మి నోగురూ|
త్తమ! భవతారకాఖ్య ప్రథి ♦ తంబగుబ్రహ్మము నిష్ఠనాకుఁజె|
ల్పి మహిఁ గృతార్థుఁజేయుమతి ♦ పేశలమౌ హృదయంబె
సంగఁగన్॥ ౧౧౪

—♦ భట్టపాదుఁడు శంకరునికి మండనమిశ్రుని జయింపఁ బనిగల్పించుట. ♦—

శా॥ నీకై మార్గముఁ జూపఁగానలయునో ♦ నేఁజూపెదన్ మండనా।
ఖ్యాకుండున్ సుమనోవరేణ్యుఁడు దిగంతాకాంతసత్కీర్తిభూ।
నాకౌకఃపతిభుఁడొక్కఁడొప్పు జయిం ♦ పందగ్గవాఁడట్టి స।
ద్ధీకుంగెల్చినవో జగంబఖిలమున్ ♦ దేవా! జితంబయ్యెడున్॥

ఆ॥వె॥ మహితకర్మయోగ ♦ మార్గంబెముఖ్యమా। ననుచు నెపుడుఁ
బల్కు ♦ చును ధరిత్రి। వేదవిహితకర్మ ♦ వితతిశత్పరతఁ బ్ర ♦
వృత్తిశాస్త్రపరత ♦ వెలయుఁగతఁడు॥ ౧౧౬

చం॥ అతఁడు నివృత్తిశాస్త్రమున ♦ నాదరముంబొనరింపఁడీకలే।
గతినయినన్ భవద్వశగుఁ♦ గా నొనరింపుఁడు వానినోయమీ।
ణ్ముత! యటులైనమీరవగు మ ♦ నోరథమానటుగాన వేగమా।
గతిని దదంతికంబునకుఁ♦గౌతుకమొప్పఁగనేగుఁడీ త్తతిన్॥౧౧౭

శా॥ ఉంబేకుండననొప్పు మండనునిదా♦యోషాగ్ర్యయుంబాయటం।
చుం బండ్వాఘుము చేతఁ బిల్వఁబడుచుం♦దున్మన్న వాగ్దేవి రో।
షంబుందేననొకన్న దుర్వసనుచే ♦ శాపంబునుంగాంచి ధా।
త్రింబుట్టెన్నయ భారతీప్రథితయై♦దివ్యత్వవిఖ్యాతయై॥౧౧౮

కం॥ ఆవిశ్వరూపుఁ డఖిలక। లావలి ననుమించు, నిష్టుఁ ♦ డగుమ
త్సచ్ఛి। ష్యావళిఁగానఁదదంగన। నీవటసాక్ష్యమ్మునుంచి ♦ యిత
నిం గెలుమా॥ ౧౧౯

ఉ॥ ఆతనిచేతనే భవదు ♦ దంచితభాష్యములందు నన్నిట।
న్నాతిగవార్తికంబులను ♦ గల్పనమ్ముంబొనరింపఁజేయుమీ।
వీతతి విశ్వనాథుఁబలె ♦ నిచ్చటికిం జనుదెంచినావు నా।
కీతతిఁ దారకంబువచి♦యించి కృతార్థునిఁగానొనర్పుమా. ౧౨౦

శా॥ ఓనిష్కారణజాయమానకరుణా! ♦ యోదేశికాగ్రియ! నీ।
పీనాసన్నిధిలో ముహూర్తమితమై ♦ యొంతేనినొప్పారు భ।
వ్యానేహంబునునిల్వ, యోగవిద! నీ♦కాత్మాబ్జభాగ్యంబునా
సీనీరూపముఁగాంచుచు న్మదసువు♦ల్లోలాగతిన్వీడెదన్॥ ౧౨౧

మ॥ అనుచుం బల్కెడు నాకుమారిలుని బ్ర♦హ్మంబుం దగం జెల్పి పై।
టను లోనం గల మోహమంత్రయును నూ♦డం జేసి బ్రహ్మైక్య భా।
వునిగాం జేయుచు నయ్యతిప్రవరుడు♦న్వ్యోమాధ్వముం బూని వే
గనె యామండనమిశ్రు గేహమునకే ♦ గంగాం దలంచె స్మృతిన్॥

ఉ॥ అంతట భట్టపాదుడమి ♦ తాదరమొప్పంగ నైజవాక్యము।
న్నాంతముగా నొనర్చి యతి ♦ సంచయనాథ విబోధితాద్వయా।
త్యంతసుతత్త్వుడై ప్రశమి ♦ తాఖిలబంధుడునై మమత్వము।
న్నాంతముజేసి శంకరుప్ర ♦ సాదమునం గనె విష్ణుధామమున్॥

—♦ ఆశ్వాసాంతము. ♦—

మ॥ దరహాసోల్లసదాస్య! దాస్యశుణ భ ♦ క్షత్రవ్రాతచేతోబ్జ భా।
స్కర! దివ్యత్కరుణాలవాల! గిరిరా♦ట్కన్యాయుతోత్సంగ! సం।
గరరంగాంతరనిర్జిత త్రిపుర ర ♦ క్షస్సంచయాధీశ! సా।
దరతూణా! జగతీతలావన సుద♦క్షా! మోహినీపూర్ధవా!॥ ౧౨౮

ఇది శ్రీభమిడిపాట్యన్వయ ....................వేంకట
సుబ్రహ్మణ్యశర్మాభిధేయాంధ్రీకృతంబైన
శ్రీశంకరవిజయమునందు షష్ఠాశ్వాసము.

# శ్రీ శంకరవిజయము.

## సప్తమాశ్వాసము



దప్రియసఖ! శర్వా!
శేదీవ్యద్వామభాగ! ♦ నిర్మల! నిత్యా!
మోదా! నిజభక్తతతి!
శ్రీదా! ప్రమథావలీశ! ♦ శ్రీసకలేశా!॥ ౧

గీ॥ అవధరింపుమనంతరం ♦ బర్చ్యపాదుఁ| డైన శంకరసంయమీం♦
శానుఁడాప్ర| యాగకడనుండి వెడలెఁదా ♦ వేగమండ| నాఖ్య
పండితునింగెల్వ ♦ నభ్రగతిని॥ ౨

—♦శంకరుఁడు మండనుగెల్వ మాహిష్మతీపురికరుగుట.♦—

మ॥ చనుచుఁ శంకరుఁడర్థ్యగంధిసుమన ♦ స్సంఘాతవిభ్రాజమా|
ననిరీక్ష్యాంచితవీధికఁ విమల ర ♦ త్నవ్రాతచిత్రోచ్ఛ్రవ |
ప్రనఖండాంబరచుంబిరమ్యశిఖర ♦ ప్రాసాదసంఘాత మం|
డనవిభ్రాజితఁ బూర్ఛయప్రవరనీ ♦ ద్యంగాంచెమాహిష్మతిఁ

గీ॥ కాంచి యతివిస్మితాంతర ♦ కంజుఁడగుచు| హరివిధంబుగడిగియె
నం ♦ బరపథంబు| నుండి శంకరయమిసుమ ♦ నోజ్ఞమైన| పుర
వరోపాంతగారామ ♦ మునసుదృష్టి॥ ౪

సీ॥ సుమహితామోద వ ♦ త్సుమనస్సమూహంబు; చే సంతతంబు
భా ♦ సిల్లుదాని| శ్రుతిచయంబునకు స♦మ్మతములౌవాక్యులఁ;
జెప్పు సద్విజరాజి ♦ నొప్పుదాని| మహితజీవనభాస ♦ మాన

మైమూడనో; సరసుల గుమితోడ ♦ వఱలుదాని। సమ్రితవల
రారి ♦ నానాశ్రితేష్ట సం; ధాయిభూజనులచేఁ ♦ దనరుదానిఁ।
గీ॥ బురవరోపాంతవనిని శం ♦ కరయతీంద్రుఁ। డెల్లవైపులఁగనుఁ
గొని ♦ యుల్లమంతుఁ। బురవరంబునఁగాంచి స♦ప్పాడువహించు।
తోరపుందుష్టిసందె బు ♦ ధుండు గాక॥ ౫

చం॥ వికసితకంజదివ్యదట ♦ విన్విహరించి తరంగరంగదం।
బుకణసుశీకరావళిని ♦ మున్గుచు సాలమహీజరాజినిం।
చుక చలియింపఁజేయుచు మ ♦ నోహరమైతగు సర్మదాశుగం।
బకలుషుభాష్యకారుఁగను♦హాయిని గూర్చుచుఁగొల్చెనత్తతిః

ఉ॥ ఆవని విశ్రమించి తన ♦ యాహ్నికమంతయు దానఁదీర్చి తా।
నావనజాప్తుఁడంబరపు ♦ టంతరమెక్కుచునుండ మండనే।
లావిబుధాలయంబునకి ♦ లాగురుఁడేగుచుఁగాంచె వానిదా।
సీవనజాక్షులంజలముఁ ♦ జేఁగొనిరాఁజనువారి దారిలోన్॥ ౭

కం॥ కని శంకరుఁడువిదలతో। ననెమండనపండితాల ♦ యంబెటనని
వా। రునునయ్యద్భుతశంకరుఁ। గనిచెప్పిరుమత్తరంబుఁ ♦ గౌతుక
మొప్పన్॥ ౮

గీ॥ శ్రుతులిలఁ దమంతటనెతాము ♦ రూఢిఁగనునో?। పరునిచేతనో
యనిద్వార ♦ పంజరాంత। రస్థితశుకాంగనాళితి ♦ రంపువాద।
మాచరించునో? యెటఁ మండ ♦ నాలయమదే॥ ౯

గీ॥ ఫలమునిడఁగ ర్తకర్మమై ♦ యలరునో కొ?। బ్రిహ్మమో యం
చునెటద్వార ♦ పంజరాంత। రస్థితశుకాంగనాళితి ♦ రంపువాద।
మాచరించునో? యదె మండ ♦ నాలయంబు॥ ౧౦

గీ॥ జగము సత్యంబెయగుఁగాద ♦ సత్యమెయను। చుంజవంబున
నెటద్వార ♦ పంజరాంత। రస్థితశుకాంగనాళితి ♦ రంపువాద।
మాచరించునో? యదె మండ ♦ నాలయంబు॥ ౧౧

మ॥ అనుచీరీతినిబల్కు తొయ్యలుల వా ♦ క్యాసీకముంజక్కఁగా
విని యాపిమ్మట మండనేశ్వరునిదా ♦ వేశ్మంపుబాహ్యస్థలం।

బునకు న్శంకరుఁ డోగి యేగి సుదృఢం ♦ పుం బల్పుచే మూయఁబ|
డ్డనివేశంబును గాంచి తాఁ జొరఁగ నా ♦ టంకంబటంచెంచుచున్॥

గీ॥ శంకరుండిట్లు వారి వా ♦ క్సరణిఁ గ్రోలి| గృహబహిస్థలికేగిత ♦
దేహమునుగ| వాటగుప్తముఁ గనిచొర ♦ వలనుపడద| టంచు
నెదలోననప్పుడు భా ♦ వించివేగ॥ ౧౩

గీ॥ ద్యుపథమునుబూని దృఢమైన ♦ యోగశక్తి| నరిగి మండనమి
శ్రగృ ♦ హాంగణాంత| రంబునను డిగ్గికనెభూత ♦ లంబు నకును|
మండనంబగు గృహముఁ ద్రి ♦ దండి యపుడు॥ ౧౪

మ॥ కలయంగన్గొని చొచ్చె శంకరుఁడు లే ♦ ఖస్తోమపావాసపుం|
మలమైవాతచలల్లసద్ధ్వజతతిం ♦ దోరంబుగానొప్పి సౌ|
ధలసన్మౌళితలావరుద్ధసురవ ♦ ర్త్మంబై విరాజిల్లు భూ|
తలసన్మండనుఁడైన మండనునియా ♦ స్థానంబు రొక్కున్మదిన్॥

ఉ॥ జైమినిసంయుతుండయిన ♦ సత్యవతీతనయున్మునీశ్వరున్|
ద్దామతపోవిశేషతయ ♦ థావిధిశ్రాద్ధమునన్నిమంత్రణం|
బామెయిఁ జేసి వారిచర ♦ ణాబ్జములంగడుగంజలంగు వి|
ద్యామహిమార్జితప్రతిభు ♦ నబ్జజసన్నిభుఁ గాంచె మండనున్॥

గీ॥ అంబరమునుండిడిగి యట ♦ యతివరుండు| వ్యాసజైమినులం
జేరి ♦ హర్షభరితు| లైనవారలయాదృతి ♦ సర్వగతిని [illegible] గనిము
నివరద్వయాంతిక ♦ మున వసించె॥ ౧౭

ఉ॥ మండనమిశ్రుఁ డంబరపు ♦ మార్గమునం [illegible] నిసంచయా|
ఖండలసన్నిభంగడు వి ♦ కాసమెసంగఁ [illegible] హాని నా|
దండినిజ్ఞానసూత్రశిఖుఁ ♦ దాఁగ [illegible] గాఁ దలంచుచు|
న్మండగు నాగ్రహంబునను ♦ [illegible] వృత్తిపఘోషుఁ డయ్యెనున్॥

మ॥ అతిరుష్టుండగు నాగృహాశ్రమి [illegible] ♦ త్యంతంబుఁ గౌతూహలాం
చితుఁడై మస్కరిచక్రవర్తికిని బొ ♦ ల్చెన్నాసిఁ బ్రశ్నోత్తర|
ప్రతతుల్మెండుగ నుత్తరోత్తరముగా ♦ రాణించుచున్ శ్రోతృసం|
తతికిన్విస్మయదంబులై వరుసను ♦ ద్యద్రీతినిట్లత్తఱిన్॥ ౧౮

—♦ శంకరమండనసంవాదము. ♦—

మం॥ గీ॥ ముండియెటనుండి?
శం॥ యాగళం ♦ బు
మం॥ భవదీయ। మైన మార్గంబునడిగితి ♦
శం॥ నట్టులేని । మార్గమేమునిచెప్పె?
మం॥ నీ ♦ మాతరండ। యనుచునది తెల్పె
శం॥ నారీతి ♦ యర్థమెయగు॥ ౨౦

కం॥ మార్గమునీవడిగితివా। మార్గము నీకుత్తరంబు ♦ మండన! యొసఁగెన్। మార్గమునకుఁగనినాకా। మార్గము నీమాతయనెను ♦
మాట నెటులనున్॥ ౨౧

మం॥ కం॥ సురపీతమైనదా కో?
శం॥ భూ। సుర! యదితా శ్వేతగాదె? ♦
మం॥ సురవర్ణమునీ। వెఱుఁగుదె?
శం॥ తద్వర్ణమునే। నెఱుఁగుదుఁ
దదర్శనము నీవ ♦ యెఱుఁగుదువుసుమా॥ ౨౨

మం॥ చం॥ అకట! కలంజముందిని మ ♦ దాత్మ్మలిటుల్ విపరీత
వాక్యముల్।
...కచకగావచింతురు వి ♦ చారముమాని;
... ప్రవ బు ... । వ... సవిధపరిభూతుఁడు భ ♦ వద్గతి
నెక్కుడుగాఁగలంజ మెం।
చకతిని వాగుచుండె వి ♦ చారమదేటికి మండనాభిధా॥ ౨౩

మం॥ చం॥ ఖరమునకైనభారమగు♦గంతనుమోదముతో వహింపఁగాఁ
బరువె? దురీహ! నీకకట ♦ భవ్యశిఖావిమలోపవీతముల్।
శం॥ పరమదురీహ నీపితకు ♦ భారమునిచ్చెడుగంతనుక్ వహిం।
తువ, శ్రుతికౌనుభారమని♦తోఁపఁగవీడితి జందెమున్ శిఖన్॥ ౨౪

మం॥ గీ॥ పాలనముచేయలేక స్వ♦భార్యవీడి। శిష్యపుస్తకభారేచ్ఛఁ♦
జెలఁగునీదు। బ్రహ్మనిష్ఠత పరికటింపఁ ♦ బడియెనేఁడు। పరమ
భిక్షుకముఖ్య! శం ♦ కరసమాఖ్య॥ ౨౫

శం॥ గీ॥ గురునిఁగొల్చుచు వ్యవధిగా ♦ గురుకులంబు। ననుసమా
వర్తనముఁజెప్పి ♦ యనవరతము। స్త్రీలకెప్పుడు శుశ్రూషఁ ♦ జే
యునీదు। కర్మనిష్ఠతమిగుల వ్యా ♦ ఖ్యాతమయ్యె॥ ౨౬

మం॥ కం॥ ఉంటివిగద మూర్ఖుఁడ! వా। ల్గంటులగర్భముల వారె ♦
కతసనె వృద్ధిం। గంటివిగద! యానాతుల। తొంటికృతము నక
ట! మఱచి ♦ దూఱందగునే?॥ ౨౭

శం॥ కం॥ ఎవ్వరియోనులఁబుట్టితొ?। యెవ్వరి స్తన్యమునుద్రావి ♦
యేపుంగనితో। యవ్వనితలఁ బసువట్టుల। నెవ్విధిఁగ్రీడించుచుం
టి ♦ విల? మూర్ఖతమా!॥ ౨౮

మం॥ గీ॥ వహ్నులకు యత్నమూనియు ♦ ద్వాసనంబు।
వేగఁగావించికంటివి ♦ వీరహత్య।
శం॥ పరమగుపదంబు నెఱుఁగక ♦ పందవగుచు।
నాత్మహత్యనెకాంచితి ♦ వవనినీవు॥ ౨౯

మం॥ గీ॥ ద్వారపాలురవంచించి ♦ చోరుఁబోలె।
నెట్లు మూర్ఖుండ, వచ్చితి ♦ విపుడిచటికి?।
శం॥ కోరివచ్చినభిక్షుల ♦ కొఱకుఁ గూడు।
నిడక కుడిచెదవెట్లు? నీ ♦ విపుడు చెపుమ॥ 3౦

మం॥ గీ॥ కర్మమునొనర్చు సమయంబు ♦ గాన నిపుడు।
మాటలాడనుసుమి మూర్ఖ ♦ మర్త్యతోడ।
శం॥ నహహా! యతిభంగముగ మాట ♦ లాడు నీదు।
జ్ఞానమెంతయుఁ బ్రకటన ♦ మాయెనిపుడు॥ 3౧

మం॥ కం॥ యతిభంగోద్యుక్తకున్। యతిభంగముతనునుగాదె? ♦
శం॥ యతిభంగమునన్। క్షితిసుర! పంచమ్యంతాం! చితముగఁదలఁ
పుము సమాస ♦ సిద్ధిని బుద్ధిన్॥ 3౨

మం॥ ఉ॥ భాసకువాస్యమైమెసఁగు ♦ బ్రహ్మమదేడ? దురీహులేడ? ।స
న్యాసమునేడఁ జూడఁగ న ♦ నారతముం దురితాళిఁ గ్రెల్ల నా।

వాసమునై చెలంగు కలి ♦ వైఖరియేడ? నహో? మహోరసా।
వాసనుఖాన్నసక్తిని జ ♦ వంబుగఁ గంటివి యోగివేషముల్ ॥33

శం॥ ఉ॥ చూడఁగనాకమేడ? నవి ♦ శుద్ధపుటాచరణంబదేడ? నా।
వేడిమివేల్పునేడఁ? బృథి ♦ వింజ నతంతంబఘ సంచయంబుతోఁ।
గూడినయట్టియాకలియుఁ♦గూళ యదెచ్చటఁజూడఁ జేజెలన్।
గూడఁదలంచి కర్మరుల ♦ కుంగలవేషముఁదాల్చితి త్రతిన్॥ 38

చం॥ ఘనరుషతోడ నీమొదలు ♦ గాఁగల దుర్వచనాళినిట్లు మం।
డనుఁడన వ్యానికెల్లను ద ♦ టాలున శంకరయోగి కౌతుకం।
బునవె నదుత్తరంబుఁగఁ ♦ బొల్పుగనిచ్చుచునుండ వ్యాసజై।
మినులపుడంది రిర్వురును ♦ మిక్కిలియక్కజము న్మనంబులన్॥

గీ॥ చిఱునగవుగల్గుజైమిని ♦ చేతఁజూడఁ। బడెను మండనుఁతోనిట్లు ♦
వ్యాసుఁడనియె। నాత్మవిదునిధుతేషణు ♦ నమలినుయమి। నం
చితులఘక్కాగాదిటు ♦ లాడ! వత్స!॥ 3౬

కం॥ మతిఁదలఁపుమితని నభ్యా। గతునిన్ శ్రీకామినీశుఁ ♦ గావేగ
నిమం। త్రితుఁజేయుమనుచు చూనివి। దితవిధ నాశ్రవునిఁ జేసె ♦
ధీశిక్షితుఁగన్॥ 3౭

గీ॥ అంత నామండనబుధుండు ♦ శాంతుఁడగుచు। సంభ్రమంబున
నుదకసం ♦ స్పర్శఁజేసి। వ్యాసమునియాజ్ఞవలన స ♦ న్యాసివ
రుని। శాస్త్రవిధిఁగొల్చికోరె భి ♦ క్షుంగానంగ॥ 3౮

ఉ॥ శంకరుఁడప్పుడిట్లులనె ♦ సౌమ్య! వివాదపుభిక్షుఁగోరి ని।
శ్శంకగఁ దావకీనమగు ♦ సన్నిధికేఁజనుదెంచితి న్నిరా।
తంకముగాఁ బరస్పర వి ♦ ధానవిధేయతయే పణంబుగాఁ।
బొంకముఁజెందు దానినిసు ♦ పూర్వపుటోదనభిక్ష నేమియా॥

చం॥ నిగమశిరఃపథంబున వ ♦ నిన్నిపులంబుగఁజేయుపొంపె నె।
న్నఁగమఱియొండు కామితము ♦ నాకిసుమంతయులేదు, నీవుయ।
జ్ఞగణగతేప్సితుండవయి ♦ సంసృతి తారహిమాంశుసన్నిభం।
బగుచుఁ జెలంగునప్పథము ♦ నక్కట! వంచితముంబొనర్చితో॥ ౪౦

మ॥ ఇపుడాసర్వవివాదివైన నిను నే ♦ హీ! నిర్జితుంజేసి స|
త్యపథంబౌ నిగమాంతముంజగతి వి♦ ఖ్యాతంబుఁగాఁజేయుదుం|
గపటంబున్విడి మన్మతాశ్రితుఁడవై ♦ న న్నేమొలుకాదే నివా|
దపరత్వమ్మునవిల్వు, మోఃశిశినిను♦త్యా!యంచువాక్రుచ్చ్చమా॥

గీ॥ అనుచుఁబల్కెడు యతినరు ♦ నర్థవద్వ| చనమునాలించి పాశ్రి
త్తవి | స్మయుఁడగుచును| నవపరిభవంబుతోడను ♦ స్నతయ
స్కుఁ|డగు నతఁడువల్కె నిజగౌర ♦ వాశ్రితుఁడయి॥ ౮౨

గీ॥ వేయిముఖములఁజెలఁగు ద ♦ ర్వీకరేశు| నెడనయిన నోడినాఁ
డనం ♦ చీతఁడనఁడు | శ్రుతిమతంబునువీడి క ♦ ల్పితమునైన|
మానిమతమునఁ బడఁడెపు ♦ డైనఁగాని॥ ౮౩

గీ॥ అవనిఁ గోవిదుఁడెప్పుడు ♦ ద్భవముఁగనునో | సరసమగువాద
మెపుడేని ♦ జరుగునోకొ?| యని యనారతముంగోరు ♦ కో
నెడునాకు| స్వయముగావచ్చె నేఁడహో ♦ జయమహంబు॥ ౮౪

చం॥ అలరుతనిత్తటి స్మనల ♦ కంచితమై తగువాదగాథ; పు|
ష్కలనిగమోత్పరిశ్రమముఁ♦జక్కఁగ దానఫలించుఁగాత; భూ|
తలమునఁ జూడఁగాన వసు ♦ ధన్వసుధావసధుండునాకె కా|
నలెననుచుం దనంతటనె ♦ వచ్చినదానినిగైకొనండొకో?॥ ౮౫

శా॥ ఈనేనాయమహంతనేనియునుమా♦యింతుంజుమీ యోసుధా|
భానుస్థామృతతుల్య దివ్యతనుశో ♦ భా! నీవభీతిన్మరా|
భాసీకాచ్ఛ కలావహంబయిన దీ ♦ న్యద్యుమ్న వాలాపనం|
తానంపుంగలహంబు నాకిసుము చే ♦ తఃకంజముప్పొంగఁగ॥

గీ॥ అనుగతాఖిలదర్శన ♦ యును దురీహ| వారగర్వాటవికిని గ ♦
ఠోర పరశు| నిభయునగు నాదుపటుతయు ♦ నీదుకర్ణ| పథముఁ
జేరదొకో? వాద ♦ పరుఁడవైతి॥ ౮౭

సీ॥ వాదంబునిడెడు భూ ♦ వమునీకెసంగిన; మొదల భిక్షునుగొం
దు ♦ నిప్పుడనుచుఁ| గడునల్పముగనెనీ ♦ వడిగినాఁడవుసుమ్మ;
దండివరేణ్య! వా ♦ దమునుమాట | వినిసయంతనె మోద ♦

మునుజెందితింజుమీ; చిరకాలమభిలాష ♦ చేతనున్న। నొక్కఁ
డేనియు వాది ♦ ఫక్కిగారాకుంట; నిపుడు నీనుడిచేత ♦ నెసఁ
గె ముదము।

గీ॥ వాదమునొనర్తు సందియ ♦ మేదియిపుడు। మన జయపరాజ
యంబుల ♦ ననెడువాఁడు। వలయుఁగాక కళాహీన ♦ ఫ
లము వాద। మగు, జిగీషులుగావింతు ♦ తగఁగలహాము॥ ౪౮

క॥ వాదమునవాదియుం బ్రితి ♦ వాదియును వి। పక్షపక్షంబులం
గందు ♦ రీక్షితిఁగద। చెపుమ వాదించుమనకిట ♦ శపథమెది
యో?। దానను బ్రమాణమెదియో? మ ♦ ధ్యస్థులెవరో?॥ ౪౯

ఉ॥ నేనన గేస్తులందునుతి ♦ నింగన నర్హుఁడ నీవును న్యతీ।
శానుఁడవో వదద్వర! వె ♦ సన్మన యీవిజయాజయంబుల।
న్మానుగఁజేయుమయ్య సభ ♦ ణంబులఁగాఁ బొనరింతమంతన।
న్మ్యానముగారహించెదు మ♦నోహరవాదమును న్మితంబుతోఁ॥

ఉ॥ ధన్యుఁడనై తినేఁడు వసు ♦ ధాస్థలి నార్యుఁడవీవు వాదపుం।
జన్యమునన్నుఁగోరుట, ల ♦ సద్గతిఁజేపగుఁగాత నోయతీ। ●
ణ్మాన్య! వివాదమిత్తఱిని ♦ మాధ్యదినంపువిధింబొనర్తునం।
చు న్యతిసంచయాధిపుని♦జూచి నయంబునమండనుండనన్॥ ౫౧

చం॥ చిఱునగవంచితాస్య స్సర ♦ సీరుహమందుఁ జెలంగనట్టులే।
జరుగును జేపెవాదమని ♦ సంయమిసంచయపూజ్యుఁడైన శం।
కరయమివల్క మండనుఁడ ♦ ఖండముదంబున వ్యాసజైమినీ।
శ్వరులనువేడె వాదమున ♦ సాక్షితనందుఁడటంచు భక్తితోఁ॥

ఉ॥ నుత్యులు వ్యాసజైమిని ము ♦ నుల్తగ మండనపత్నిని న్సర।
స్వత్యవతారఁగానెఱిఁగి ♦ పల్కిరి మండనుతోడనిట్టులా।
చిత్యమెసంగుచుండ, విదు ♦ షీమణిఁ దావకపత్నిని న్సుధీ।
ట్తున్నత్య! సదస్యఁజేసిధృతి ♦ తోడ వివాదముసల్పుమంచొగిన్॥

చం॥ మునియుగమన్నమాట కను ♦ మోదముఁజూపుచు వంత
మండనుం।

షును బ్రకృతంబు చేయఁగఁ గ ♦ షున్వడి నెంచి శుచిత్రయంబుఁ బో।
లెనసఁగు మూఁగురన్మ్రనుల ♦ లేఖచయార్చ్యుల సప్తదైవయు।
క్తిని నరుదెంచువారలనొ ♦ గిన్విధిఁ గొల్చె వనూనభక్తితోఁ॥

గీ॥ విధని భుజియించి యటనుప ♦ విష్టులగు ము। నులకు నామూఁ
గురకుఁ బార్శ్వ ♦ ములను జామ। రములఁ గొని వీచుచుండిరి ♦
శ్రమముఁ బాప। మండనాశ్రవులిరుపుర ♦ మందభక్తి॥ ౫౫

గీ॥ యమివరేణ్యుఁడు దైవమో ♦ గమునవితరు। లకు సుదుర్లభ
మైనదే ♦ శికుల దైన। దర్శనంబున వారి సం ♦ స్పర్శవలన। భా
షణంబున మిగుల సం ♦ తోషముఁ గనె॥ ౫౬

కం॥ నిగమత్రియ్యంతార్థముఁ। దగ నెఱిఁగిన యామునిత్రి ♦ తయ
మంతటనొ। ప్పగ నొక్కముహూర్తము మెం। డగుతుష్టిఁ బర
స్పరంబు ♦ ననుకొనిరెదియో॥ ౫౭

గీ॥ అథ రామర విధుని గే ♦ హంబునుండి। వెడలిన మునిత్రియంబు
నఁ ♦ దడయకిర్వు। రై రదృశ్యులు, మూఁడవ ♦ యమియొసఁగె
ను। భూజవ స్నర్మదాతట ♦ మునఁ గలగుడి॥ ౫౮

—♦ సూర్యాస్తమయవర్ణనము. ♦—

మ॥ వసుమంతుండ నటంచుఁ దీక్ష్ణమగు గో ♦ వ్రాతంబున న్లోక పుం।
బనఁ దూలించితి సుంత యేనియు సుకం ♦ పం గాంచనైతంచు యో।
గిసమాజేడ్యుని శంకరుం గని విర ♦ క్తింబూని శాంతాత్ముఁడై
వెసమిత్రుండయి పొల్చెఁ బశ్చిమదిగు ♦ ర్వీధ్రింబున న్భానుఁడున్॥

చం॥ కలవసురాజి నిప్పగిది ♦ గాఁ గొని నన్విడె వాసరంపుఁ దో।
య్యలి మఱి దీననేకువల ♦ యూఁదితసక్కటు! కంటినంచుఁ దా।
వలముగ నందె రోషమును ♦ వాసరకామినిపై ననంగఁ బా।
టలరుచితోఁ బ్రతీచినిద ♦ టాలుస భానుఁడదృశ్యుఁడయ్యెఁ దాఁ॥

మ॥ ఘనవైరాగ్యమునూని భాస్కరుఁడు లో ♦ కంబు న్విసర్జించి వే।
గనెహంసత్వముఁ గాంచఁ గాఁ దసమదిం ♦ గాంక్షించి గోసంచయం

బుధ సు స్తంబుగఁ జేసియంతగతమ ♦ న్యుండౌచు నెమ్మేనఁదా।
ల్చిన కాషాయపుటంబరో? యనఁగఁదా ♦ ల్చెన్సంజ కెంజాయ
తోన్॥ ౯౧

చం॥ అమృతముతోడఁ బోల్పఁదగు ♦ నమ్మునియుగ్మము వల్కినట్టివా।
క్యములను నాత్మశిష్యనిచ ♦ యంబునకున్ వినిపించుచుం బ్రమో
దముతన కెంతయేఁగదురఁ ♦ దజ్ఞుఁడు శంకరసంయమీంద్రుఁడా
విమలపురాత్రినంతయును ♦ వేగనుబుచ్చెఁ బరాత్మచింతతోన్॥

—♦ ప్రభాతకాలవర్ణనము ♦—

మ॥ అరవిందంబులఁ దోఁగి యుత్పలసమూ ♦ హంబంచు నన్దాఁగి క।
ప్పురపుందిప్పలఁ దూఁగి, చందనపుటా ♦ మోదంబునన్మూఁగి క
స్తురినింబున్గున సాఁగి, సూననిచయా ♦ స్తోకాంచితామోద సం।
భరితంబై మలయానిలంబెసఁగెనా ♦ ప్రత్యూషమందొప్పుగన్

గీ॥ వెలినిలోనున్న తమము ను ♦ వేగఁ దనదు। గోగణంబున వారింపఁ ♦
గోరి పరమ। హంసయి దెవచ్చె మేల్కను ♦ డనుచుఁ దెల్పు। బో
ధకుఁడౌనాఁ గన నరుణుం డు ♦ పొలిచెఁ బ్రాచి॥ ౯౨

ఉ॥ తిన్నని పేర్మి నొప్పసఁగు ♦ దేశికవర్యుని వాక్యరాజిచే।
మున్నుగలట్టి బంధచయ ♦ మున్విడి స్వేచ్ఛఁ జరించు శిష్యుల।
ట్లన్నళినాప్తసారధిప ♦ రాంశులవిచ్చినతమ్మి మొగ్గలం।
దున్నయళుల్బయల్వెడలె ♦ నుత్కటఝుంకృతులం బొనర్చుచున్

సీ॥ నిగమశాఖాశిఖా ♦ నిచయంబునకు నెవ్వఁ; డలరుగు త్రియసంగ ♦
నలరుచుండుఁ। దగనాగతమనాగ ♦ తము వర్తమానంబు; ధర
నేనికతమునఁ ♦ బరఁగు నిరత। మెవఁడు జంతునికాయ ♦ కృతక
ర్మములకెల్ల; సాక్షియై చనుఁ గర్మ ♦ సాక్షి యనఁగ। దినదినం
బును సద్వ ♦ రునకు నెవ్వఁడు కళా; వలిఁదానొసంగుచు ♦ నల
రఁ జేయు?।

గీ॥ నెవఁడు విబుధులకన్నంబు ♦ నిడు సతతము?। తనదు గోరాజిఁ జక్ర
హి ♦ తంబు నెవఁడు। చేయు? నట్టియహస్కరుం ♦ డాయమరప।
తిదిశనుదయించెఁ గెంజాయ ♦ గదురనంత॥ ౯౩

—♦సరస్వతీసాక్షిక శంకరమండనమిశ్ర వాదోపక్రమము♦—

మ॥ అరుణాంభఃప్రభవా ప్తదీధితులచే ♦ నాకాశమెల్లన్విభా।
స్వరమై యొప్పఁగ ధ్యేయవేదియు న బ్ర ♦ జ్ఞానద్వరుండై న శం।
కరుఁడాత్మీయవినేయసంచయముతోఁ ♦ గాల్యంబులందేఁచ్చెవి।
ద్వరరమ్యంబగు మండనార్యుని సభ♦న్వాదార్థమై చొచ్చెఁదాన్

ఉ॥ మండనపండితుండును స ♦ మస్తకలావలికాలయంబుగా।
నుండెడు శారదాఖ్యనిజ ♦ యోషనుసాక్షినిగా నొనర్చితా।
నుండెవివాదముం గుఱిచి ♦ యుత్సుకుఁడై పతిదేవయైనయ।
య్యండజయానయున్స్వవిభు ♦ నానతిచేఁగొనె సభ్యభావమున్॥

కం॥ పతిచే నియుక్తయగు నా। పతిదేవతయొసఁగె సభ్య ♦ భావ
మునగృహా। శ్రితయతులతారతమ్య। స్థితి నెఱుఁగఁగవచ్చు భార♦
తీదేవియనన్॥ ౬౯

మ॥ ఉరువృద్ధింగనినట్టి మండనుని వా ♦ దోత్కంఠతన్నొఁబరా।
వరవిజ్ఞుండుఁబరేంగితజ్ఞుఁడునునై ♦ వర్తించు నాసంయమీ।
శ్వరుఁడు న్మందుగనే యెఱుంగుటఁబ్రతి♦జ్ఞన్నీయసందాఁబరా।
వరయొగ్యైకపరంబొనర్చెనిటు వి ♦ ద్వత్రాంచితంబౌసభన్

మ॥ పరమార్థంబును సచ్చిదచ్ఛమును నా♦బ్రహ్మంబు దానొక్కఁడే
వఱలున్ముక్తియె వెండియానటుల స ♦ ర్వంబౌ ప్రపంచంబుగాఁ।
గరమజ్ఞానముచేతఁగప్పఁబడి త ♦ ద్జ్ఞానంబునన్బ్రహ్మమై।
మఱలు న్విశ్వమువోవముక్తి యగు నా ♦ మ్నాయాంతమే మా
నమౌ॥ ౭౦

చం॥ నిజముగ దీననేజయము ♦ నేఁగనుఁగొందునో, యొక్కవేళనా।
కజయమైయెనచో యతితఁ ♦ ద్యాగముఁజేసి కషాయచేలము
న్ద్విజవర! వీడికట్టుదును ♦ డెల్లనిపుట్టమువాదమిప్పుడో।
ప్పజయమొ? యొండొ? యీయుభయ ♦ భారతియేమనకున్వ
చించుతన్ ౭౧

గీ॥ కనుసుదారుఁడు యమివరే ♦ ణ్యుఁడున్నైన| శంకరుండిట్లు శప
థంబు ♦ సలుప గేహి| మాన్యుఁడగు మండనుండాత్మ ♦ మతము
నిలుపు| నట్టి శపథంబుఁ జేసెఁ దా ♦ నంతనిట్లు॥ ౨౩

సీ॥ చిత్స్వరూపముచేఁ బర♦ సిద్ధమానాత్మ యం; దును శక్తి సుంత లే♦
మిని నిగమశి| రంబులెన్నఁ దుఁ బరిమా ♦ ణంబులందునఁ గావు; తగ
వాక్యబోధిత ♦ మగున శేష| కార్యజాతము నకా ♦ గమశిఖా
పూర్వభా; గమె ప్రమాణంబుగా♦ నమరు నెపుడు| గొప్ప శబ్దంబుల♦
కును గార్యమాత్రంబు; గుఱిచి శక్తియు నౌన ♦ గూడుచుండుఁ|

గీ॥ జేయవలయును గర్మంబు ♦ నాయువున్న| యంతవఱకును దేహు
ల ♦ హర్నిశంబుఁ| గర్మములనుండియే ముక్తి ♦ కలుగు ననుట|
నిగమములకెల్ల నభిమతం ♦ బుగఁ జెలంగు॥ ౨౪

ఉ॥ వాదమునం బొనర్ప జయ ♦ వంతుఁడ నేనొకవేళఁ గాని-చో|
నేదని తట్టి మాటకు య ♦ తీశనుతా! విపరీతరీతిగా|
నీదు తెఱంగుఁ గైకొనెద, ♦ నిక్కము; సాక్ష్యమునందు మున్ను నీ|
వాదరమొప్పఁ జెప్పిన య ♦ దంగనయే సకలంబెఱింగెడిన్॥ ౨౫

సీ॥ గెలుపునందినవారి ♦ కలరెడు నాశ్రమం; బును బరాజితుఁడుగై ♦
కొనఁగవలయు| ననుచు నేకాంతంబు ♦ ననుఘణంబును జేసి;
కొని శంకరుఁడును మం ♦ డనుఁడు నప్పు| డత్యుదారమనీష ♦
యాద్వయభారతిఁ; జెలువుగా సాక్ష్యాభి ♦ షిక్తఁ జేసి| యొకరి
నొక్కరు గెల్చు ♦ నుత్సుకత మెఱయ; జయదత్తదృష్టులై ♦ నయ
మెసంగ|

గీ॥ దండిపండితవరులతో ♦ నిండియుండు| నింపుసభ నుపవిష్టులై ♦
యుండి వాద| మును సమంబుగఁ జేయుట ♦ కును మొదలిడి| రఖిల
వేదులు సుస్మిత ♦ ముఖములలర॥ ౨౬

గీ॥ నయము మిగులఁగ సన్న్యాస్య ♦ జయముఁ గోరు| మతుల నుపవిష్టు
లగు యతి ♦ పతుల మెడల | నుభయభారతియత్తఱి ♦ నుంచెఁ
బూల| దండలను సభ్యయాచము ♦ దంబుగదుర॥ ౨౭

గీ॥ ఎవని మ్రోలనుండు పూర్వండ ♦ యొలమి నెపుడు। తొలఁగుఁ? సవ్యా
డ యతనికి ♦ గెలుపులేమి। తెల్లమూరని యూయమ ♦ తెలిపి
యరిగె। గృహియతుల కన్నభిక్షల ♦ నింటఁ జేయ॥ ౭౮

కం॥ ఇరువురు జయఫలనిహితా। దరులై యొనరించువాద ♦ తత్త్వ
ముఁ గనఁగాఁ। బరమేష్ఠిముఖులు తన్మం। దిరమున వాహనగు
లౌచు ♦ దివిఁ బొల్చిరటన్॥ ౭౯

చం॥ యమివర మండనార్యులకు ♦ నయ్యె సదస్యబుధోక్తసాధువా।
దము, నిజపక్షయుగ్మసుని ♦ దర్శితవేదము, విద్వరప్రమో।
దము, బహుమంజులాంచితప ♦ దప్రచయోల్లసదర్థవాక్సము।
హమగుటఁ జేఁ బరస్పర కృ ♦ తామితమోదము, వాదమయ్యెడన్॥

చం॥ దినదినముం బ్రకర్షమునఁ ♦ దేజరిలెన్ వ్వదనీకసన్నిధిం।
గనుచుఁ బరస్పరంబుగనఁ ♦ గాఁ బడు భంగముచే జయంబునుం।
గనుకుతుకంబు నిర్వురకుఁ ♦ గల్గ నొనర్చుచునైన సంయుగం।
బుననగు రోషమున్లవముఁ ♦ బొందక వాదము మోదదంబునై॥

శా॥ అన్యోన్యంబుఁ బ్రగల్భమానటుల స్మే ♦ రాస్యాబ్జులై పోరిరా।
ధన్యుల్ బద్ధసుఖాసనస్థులయి స్వే ♦ దంబొప్ప నాకాశమం।
దన్యూనంబగు చూపుఁ జొన్ప ప్రతిప ♦ క్షాచోక్తోత్తరంబు న్సుధీ।
మాన్యంబౌ గతిఁ ద్రుంచి చూఱఁగొనుచు ♦ న్సమ్యగ్యుక్తులా
చిర్వురున్॥ ౮౨

కం॥ అనుదినమును గాల్యంబుల। నొనరిచి యుపవిష్టులగుచు ♦ నొ
నరించిరి మం। డనబుధుఁడు శంకరార్యుం। డును విద్యావాద
ముంగ ♦ ఘున్బుధులెన్నన్॥ ౮౩

చం॥ ప్రతిదివసంబు నాయుభయ ♦ భారతివాసరమధ్యమందున।
య్యతి నిజభర్తృసన్నిధికి ♦ నల్లనఁ జేరి వచించు మస్కరీ।
శతకును బ్రాణనాథునకుఁ ♦ జయ్యన భిక్షకు భుక్తికిన్సమం।
చితమగు కాలమప్పుకడ ♦ చెన్దివసంబులకైదునాఱునన్॥ ౮౪

మ॥ యమిలోకేశ్వరుఁడా విచక్షణునిదా ♦ క్ష్యంబుండగన్ క్షోదసు
క్షమముంగన్గొని యెల్లపక్షములకే ♦ కాలంబునందైన క్షో।
భమునుం గూర్చియు శంకరార్యుని సమీ ♦ పంబందు దీపింపకు।
న్న మహాకోటులనొప్పఁ దాని నిమహో ♦ నందంబుతోఁ ద్రోచెఁదాన్॥

శా॥ ప్రాగల్భ్యంబును వీడియుండియును స ♦ భ్యస్తుత్యుఁడౌ మండనుం।
డాగేయప్రతిభు న్యమీంద్రుఁగని స్వీ ♦ యంబైన సిద్ధాంతము।
న్ధీ గాంభీర్యముతోడ నిల్పఁగ ననె ♦ న్దివ్యాగమాంత ప్రసి।
ద్ధాగణ్యోక్తులనొప్పఁ నద్వయిను ♦ సిద్ధాంతంబుఁబోఁ
ద్రోయఁగన్॥ ౮౬

—♦ శ్రీశంకర మండనమిశ్రుల సంవాదము. ♦—

సీ॥ ఓసంయమీశ్వర ♦ వాసిగా జీవేశ్వ; రులకునెప్పుడు నేక ♦ రూ
పమగుట। మంచిగానంగీక ♦ రించెదరీరందు; నలరుసాక్షిగ
బ్రహ్మ ♦ మనవరతముఁ। దగశుద్ధతను బుద్ధ ♦ తను నుదాసీనత;
నొప్పుచుంటనటంచుఁ ♦ జెప్పిమరలఁ। బురుషార్థదముగఁ జె♦
ప్పుటను వేదశిరంబు; లకునెడ్డ నపరిమో ♦ జకతయసదె?।

గీ॥ యనియుమానాంతరావగ ♦ తార్థబోధ। కంబులగు లౌకికోక్తుల♦
కరణి, సుప్ర। మాణవిషయంబుగాఁగ నా ♦ త్మనువచింప। కు
నికినందుఁబ్రమాణంబుఁ ♦ గనము మేము॥ ౮౭

కం॥ అనవుడు నయ్యమివరుఁడి। ట్లనిప్రత్యుత్తరముఁజెప్పె ♦ సత్త్రతి
నామం। డనగేహివరునితోడం। దనవాక్కౌశలము మెఱయఁ ♦
దత్సభలోనన్॥ ౮౮

సీ॥ మండనబుధ! విను ♦ మానంబిదే సుమీ; తగ శ్వేతకేతు ను ♦
ద్దాలకుండు। నాత్మపైనె శివ ♦ టంచు విజ్ఞుఁగఁజేసె; నేబ్రహ్మ
మెఱిసం ♦ చెఱుఁగుకతన। నభయంబునో జన ♦ కా! వహించి
తివీవు; బ్రహ్మంబున నెయెల్ల ♦ వఱలెఁగాన। నెల్లనీవైతివి ♦ కేవి
శుజ్ఞోమహాముల్?; తనయ! యైక్యములోనఁ ♦ గనెఖనీక।

గీ॥ టించు జనకునివిజ్ఞుఁ గా♦వించె యాజ్ఞ। వల్క్యుఁడిఁక నెందఱో
విజ్ఞ ♦ వరులు శిష్యు। తతిని బరమేశ్వరుని నాత్మ ♦ తనుగ్ర
హింపఁ। జేసిరని వేదమౌళులఁ ♦ జెప్పఁబడియె॥ ౮౯

మం॥గీ॥ వేదమౌళులఁదత్త్వమ ♦ స్యాదివాక్యు। లనఘ! హుంఫ
ణ్ముఖంబుల ♦ యట్టులఘుము। నుతుపుజపియింప; వీనికి♦నొక్క
యర్థ। మునను లేదు వివక్షయె ♦ వ్పునునుగాని॥ ౯౦

శం॥గీ॥ సదమలార్థంబుఁదోఁపమిఁ♦గదయభిజ్ఞు। లనిరిహుంఫణ్ముఖం
బుల♦కునుజపోప। యుక్తతను బ్రాజ్ఞ; యిచటను♦వ్యక్తముగనె।
యర్థమగుచుండ నెటుల జ ♦ పార్థతయగు॥ ౯౧

మం॥గీ॥ తత్త్వమసియనుమాట క ♦ తమునజీవ। శివులకైక్యతయైన
ను ♦ సవనకర్త। శివుఁడెయనుప్రస్తుతినివిధి ♦ శేషమెయగుఁ।
గానియతివర్య! యైక్యంబు ♦ కలుగఁజెపును॥ ౯౨

శం॥చం॥క్రతువులకంగ భూతములు ♦ గాఁజెలునందివ యూపము
ఖ్యవ। స్తుతతుల నెల్లకాలమును ♦ దోయజబాంధవ ముఖ్యదివ్య
సం। తతులఁగఁజెప్పు వాక్తతిక ♦ దా! విధిశేషము? కర్మకాం
డసం। స్థితమగుచద్దియేగతిని♦జెల్వగు వేఱొకకాండమందునన్॥

మం॥చం॥యతికులవర్య! నీవనిన ♦ యట్టులజీవునియందు నీశదృ।
ష్టితనఁజేయు, బ్రహ్మతను♦జెందనియన్నమనోనిలార్కులం।
దతులితరీతి నాగమచ ♦ యంబులు, కర్మసమృద్ధికై సుఖ।
స్థితినిదలిర్చు బ్రహ్మమతిఁ♦జేయువిధంబునఁ దత్త్వమాదులున్॥

శం॥చం॥ప్రకటమతీ! యనారతము♦బ్రహ్మవిభావనఁజేయునాలికా।
దికమితదత్రిఁ దోఁచెడుగ ♦ తిన్నిగమాంతగ తత్త్వమాదివా।
క్యకరమునందుఁ దోఁపదిది ♦ నిక్కముకావున నిప్పుడీవు చె।
ప్పుకరణియొల్లు కూడెడిని ♦ బోధమొయింగనుఁ గొన్ననిత్తఱిన్॥

మం॥సీ॥యతివర్య! నిగమాంత ♦ గతభాషణంబులు; బ్రహ్మాత్మతఁ
బ్రమాణ। పరతఁగనుతనై ననుసోమాధ్వ♦ రానూనపువిశేష;
ములఫలదర్శన ♦ మునకువిధిని। గల్పించినట్టులిటఁ ♦ గల్పింపఁ

దగుఁబ్రహ్మ; మే యగుఁబ్రహ్మంబు ♦ నెఱిఁగినయను । ముక్తిఫ
లంబును ♦ బోధించుశ్రుతికిఁబ్ర; హ్మముకాదలంచెను ♦ నతఁడు
బ్రహ్మ। వేదిగావలెనను ♦ విధినట్టులైనబ్ర; హ్మమునాఁగనేమి?
యా ♦ త్మయననేమి? । యనుచులోశంకించు ♦ కొనితత్త్వరూ
పస; మర్పణచేనిత్యుఁ ♦ డఖిలవిదుఁడు। నానందరూపుండు ♦
నఖిలగతుండును; ననునాదిగాఁగల ♦ యాగమాంత। వాక్యాల
నత్తతి ♦ వాదుకకుందెచ్చి; కొనిబ్రహ్మము నెఱింగి ♦ కొనఁగ
వలయుఁ। దదుపాసననుమోక్ష ♦ మొదవకున్ననుశాస్త్ర; దృ
ష్టంబుగానైనఁ ♦ దేజరిల్లుఁ। దిన్నఁగావిధిఁజొన్ప ♦ కున్నహానాదిశూ;
న్యమునరాజరిగెడు ♦ నవనియెల్ల।

గీ॥ ద్వైపసప్తకయనెడువా ♦ క్యతతికిఁబలెఁ। దత్త్వమస్యాదులకునన♦
ర్థక్యమెయగు। నిఁకఁబ్రవృత్తి నివృత్తుల♦ నేవచింప। కున్నవానికి
శాస్త్రత్వ ♦ మెన్నసున్న॥ ౯౬

శం॥ సీ॥ అక్కట ! విధినిమి ♦ రటుచొన్పఁచోఁగ్రియా; జన్య
యాటవిముక్తి ♦ స్వర్గముఖము। లట్లువినాశంబు ♦ నందుఁగదా
మోక్ష; మునకుసాతిశయత్వ ♦ మునునిత్య। తయునులేమిని
క్రియా ♦ త్వము దానికొనరింపఁ; దగదు జ్ఞానముమనో ♦ ధర్మ
మయ్యు। వానియథాభూత ♦ వస్తుప్రమాణాది; కమునుమాత్ర
మెఱుంగఁ ♦ గలదుసుమ్ము। ఏదేవతమునైగ్ర ♦ హింతమయ్యె
హావిస్సు?! మఱిఁదల్పనౌపవ ♦ ట్కృతులదాని।

గీ॥ నదిమెమానసమనఁబడు ♦ నదియుఁబురుష। తంత్రిమగుటనొన
ర్పంగఁ ♦ దగునొనర్చ। కుంటకును జ్ఞానమునకట్టు ♦ లొనరదెపు
డుఁ। గానఁదజ్జన్యమగుముక్తి ♦ హానిఁగనదు॥ ౯౭

మం॥కం॥తత్త్వమసియనెడు వాక్యము ।తత్త్వజ్ఞ!యుపాసనాభి♦ధాప
ర్యవసా। యిత్త్వముఁగనకున్నఁడు సద్య। శతత్వముజీవునకుఁజెప్పు ♦
సర్వజ్ఞునితోన్॥ ౯౮

శం॥ మ॥ అనఘా ! జీవునకీశుతోఁ దులయునా ♦ హాతత్త్వమస్యుక్తిచే!
తనతన్ జెప్పునొ? సర్వవిత్త్వసకలా ♦ త్మతాద్యాదికాంచద్గుణా।
లినొ? యాద్యంబునన్నఁజెప్పఁదగదో ♦ లింగాంచుటన్నద్గుణా
లినెయన్నన్న మతోద్విరోధముగుట ♦ న్లేదెన్న సామ్యంబటన్॥

మం॥ మ॥ అసురింబోలున విద్యదావృతినివి ♦ ఖ్యాతింగనన్లేనిబో ।
ధసుఖానంత్యముఖంబులై సపరమా ♦ త్మపోల్లసత్సద్గుణౌ ।
ఘసమత్త్వాంచిత సద్గుణంబులను వ ♦ క్కాణించు జీవాత్మకీ ।
శసమత్వంబును దత్త్వమస్యభిధవో ♦ షంబెన్నఁగాలేమగా॥

శం॥ ఉ॥ ఓవసుధాసుపర్వ! భవ ♦ ముక్తిమెజీవున కుంబరాత్మకె ।
డావచియింపరోషమిఁకఁ ♦ దద్విషయంబునేల? నీకవి।
ద్యావరణంబునుండిపర ♦ మాత్మతకుంబ్రితి భానశంకనీ।
చేవిదనీకవర్య! నిర ♦ సింపఁబడెంగద! చూడుమియ్యెడన్॥

మం॥ మ॥ శమిమూర్ధన్య! జగత్ప్రసూతియగునా ♦ సర్వేశుతోఁ జేతన।
త్వముచేజీవునకు న్నసామ్యమునుదా ♦ వాక్యప్రిచ్చెమంగాతఁద।
త్త్వమసీత్యుక్తి జగంబుచేతనమునం ♦ దాఁబుట్టుటంజేసినాం।
ఖ్యముఖుల్ చెప్పుప్రధానభూతమర ♦ మాణ్వాదుల్నిరస్తంబులౌ॥

శం సీ॥ అక్కట! బుధవర్య! ♦ యటులేనిమీామతం; బునఁదత్త్వమసి
యంట ♦ చనదుగాదె?। తత్త్వమస్తియటంచుఁ ♦ దనరఁగావలె
నట్లు; లనుటవేదశిఖాళి ♦ కనభిమతము। జగతికిజడతాభి ♦ శం
కమోవఁగనిల్లై; చెప్పఁగావలెనని ♦ చెప్పదేని। వినుము ‚‚ తద్వై
క్షుత’’ ♦ యనుశ్రుతిలోనుండు; వీక్షణశబ్దను ♦ దక్షుతనది।
గీ॥ తెల్లమగుచుండనన్యగ ♦ తిజ్ఞడత్వ। శంకమాన్పుట కనఁబ్రిశ ♦
స్తంబుగాదు। విప్రవర! శ్రీపతిముగనీక ♦ ణుపదిదాన। ముఖ్యనిర
సనకనుచుఁజె ♦ ప్పటయుఁదగదు॥ ౧౦౩

మం॥ మ॥ యమిపా! నేనుశివుండఁగా ననెడుప్రి ♦ త్యక్షంపుజ్ఞానంబుత।
త్వసీత్యుక్తికిఁగల్గనైక్యపరత ♦ న్వాకుప్రిచ్చఁగారాదువే।
దమునిత్యంబును బత్యమన్నవిధిచే ♦ తందత్త్వమస్యుక్తిజ ।
వ్యమెయాఁగానిఫలంబువేటెదియుసం ♦ ప్రాప్తింపదావాక్యనన్॥

శం॥ ఉ॥ అక్షముచేత భేదమిది ♦ యానెడఁగల్గునె బేధవేదవా।
క్యతతియందిఁద్రియంబునకి ♦ లామర! భేదపుసన్నికర్షమే,
యాక్షితిలేమిఁగల్గదును ♦ మీ! మతిఁగాంచినభేదపుంబ్రమా।
లక్షణమందుచేభిదచె ♦ లంగదుజీవపరేశులందునన్॥ ౧౦౫

మం॥ శా॥ నేనీశానునికంటె వేఱునుడిం ♦ దీపించుభేదంబె యో।
జ్ఞానీ! జీవునకావిశేషణమె, యో ♦ జంగానసంయోగితం।
దానాయక్షుభిదంబులంజెలఁగకు ♦ న్సన్నిన్నికర్షంబుసం।
ధానంబందు విశేషణత్వముసఁగా ♦ దా! వాదమింకేటికిన్॥

శం॥ ఉ॥ కేవలమావిశేషణత ♦ కేవివరింపకసన్నికర్షము।
న్నీవనఁదోసవచ్చు ఘన ♦ ణీసురవర్య! యతిప్రసక్తి, య।
క్షావళిసన్నికర్షముభి ♦ దాశ్రియమైన విశేషణత్వమా।
నావిధిసన్నికృష్టతయు ♦ నాత్మకులేమిననర్హమట్లన్నన్॥ ౧౦౭

మం॥ ఉం॥ యోగివరా! భిదాశ్రియత ♦ నొప్పెడు నాత్మకు నింద్రి
యంబుతో। సాగదు సన్నికర్షమని ♦ చక్కఁగ నీవనుటొప్ప
దాత్మయు। న్లోఁగన నింద్రియంబునన ♦ లుప్తపుద్రవ్యములాట
చేత సం। యోగసమాశ్రియత్వమెన ♦ మున్నతినాయుగమందె
సంగెడిన్॥ ౧౦౮

శం॥ సీ॥ అవనీసురాగ్రణ్య! ♦ యాత్మతాఁబ్రభునైన; నణువైననగుఁ
గాక ♦ యైననేమి? । యుక్తంబుగాదు సం ♦ యోగితనిరువంక;
లను నొక్కదానికై ♦ ననువచింప। సావయవునితోడ ♦ సావ
యవునకెసం; యోగితజగతిలోఁ ♦ దాఁగనఁబడు। మనమునింద్రి
యమను♦కొనిభిదాసంగిత; నంటిమి గాని స ♦ త్యము నరయఁగ।
గీ॥ నింద్రియముగాదుసుమ్ము సు ♦ ధీంద్ర! మనము। నేత్రముఖ్య
సహాయత ♦ నెగడునట్టి। దీపముంబోలు, సమమ యిం ♦ ద్రి
యములందు। మనమునేననుటుడులశ ♦ శిననునుడికి॥ ౧౦౯

మం॥ గీ॥ భేదపుంబ్రమయక్షజ ♦ గాదు, సాక్షి। రూపయగునన్న
దానవి ♦ రోధమగుట। జీవపరమాత్ములకభేద ♦ సిద్ధిఁదెలుప।
వగఁబ్రమాణతఁగనునెత ♦ త్త్వమసిపదము॥ ౧౧౦

శం॥సీ॥ సాక్షియై తనరుఁ బ్ర • త్యక్షంబిలనవిద్య; చేనావృతుం
డైన • జీవునకును| నమితమాయావృతుం • డగుపరమాత్మునకు;
భేదమున్నట్లుతోఁపింపఁజేసె| డినిదత్త్వమసి, వాక్య • మునునవి
ద్యోరుమా; యావినిర్ముక్తజీ • వాత్మపరశి| వులకభేదంబునే•
తెలిపెడి శ్రుతియును; బ్రత్యక్షమునుభిదా • శ్రియములగుట|
గీ॥ చేవిరోధంబులేదును • మీ విరోధ| మున్ననాదిఁబ్రవర్తించు •
చున్నబలర | హితపుఁబ్రత్యక్షముతుదిం బ్రి • వృత్తమైన| నిగ.
మముచ బాధితంబగుఁ • దగరజితమ| తిని ననంతరజాత శు•క్తి
ప్రియయటు॥ ౧౧౧

మం॥గీ॥ అనఖిలజ్ఞుండఁగాన ఘ • టాదికమటు| జీవుఁడువిభిన్నుఁడగు
సదా • శివునికన్న | ననెడునను మానమునునుసం • యమివ
రేణ్య!| రాదొకో బాధకమభేద • వేదమునకు॥ ౧౧౨

శం॥మ॥ తనరంగాఁబరమార్థభూతమె విభే • దంబిద్ది? కాకున్నఁగా|
ల్పనికంబా? పరమార్థభూతమనఁబో • ల్పన్సామ్యమే లేదు, కా|
ల్పనికంబన్నఁ బరస్పరవ్యవహృతి • స్థాయద్విభేదంబు లే|
దనిమేమొప్పితిమందుచేఁజనదు వి • ప్రా! నీకుసాధింపఁగన్॥

—•మండనమిశ్ర పరాజయము.•—

మ॥ తిరమా నీమొదలైన శంకరుని యు• క్తిప్రాతమొప్పారెవా|
క్తరుణీదత్తపరానుమోదమయి వి • ద్వద్విశ్వరూపప్రమో|
దరసస్తంభనమై నిజేశ్వరయతి • త్వవ్యాజవాగీశ్వరీ|
వరసాక్షిత్వయుతంబునై సుమచయో•ద్వర్షాచ్ఛగంధంబుతోన్॥
క॥ యతివరోద్యుక్తినీగతి • నాత్మమెచ్చి| మండనార్యుని మెడనుం
డు • దండవాడి| యుండఁగని భిక్షుకిఁకనీరు • లెండనిపతి| యు
తులతోఁదెల్పి మఱియనె • యతికిన్నంబ॥ ౧౧౩
కం॥ కోపాతిరేకమున మును| శాపమునిడెనాకు దుర్వ • సనముని
భవదీ| యాపారజయమెయవధిగ| నాపనిజరుగుటనువచ్చి• శటు
చనెదయతీ!॥ ౧౧౪

మ॥ అనుచుంబల్కి స్వధామ మందఁజను నా ♦ యంబన్యతీంద్రుండు వే।
గనె బంధించె జయింపఁగోరి వనదు ♦ గ్ధామంత్రిరాజంబుచే।
తనశంకన్స్వమతైక్యసిద్ధికొఱకై ♦ తాఁగాని సర్వజ్ఞతం।
దనకున్నాశ్రమ పూజ్యభావమును సి ♦ ద్ధంబౌటకుంగాదు సూ॥

కం॥ శంకరసంయమివర్యుఁడు। పంకిలమైపరఁగునుభయ ♦ భారతినిటు ని।
శ్శంకగ బద్ధఁగఁజేసె య। లంకృతినయభక్తులటఁజె ♦ లంగఁ
గననియెఁ॥ ౧౧౮

శా॥ అంబా! నిన్నెఱుంగుదున్విధికి భా ♦ ర్యంగాఁ దురీభేదియౌ।
నంబౌజానికిసోదరీమణిఁగనీ ♦ హంజేసియే వేగఁజు।
త్రింబౌ శ్రీముఖరూపముంగ నెను హ ♦ ర్షస్వాంతఁగా, నిప్డువి।
శ్వంబుంబ్రోవఁ గృతావతారనుసర ♦ స్వత్యంబఁగా నేన హా॥

మ॥ జననీ! కావున నేగుమత్తఱినెయు ♦ ష్మద్భక్తవర్యుండనై।
చను నేనెప్పుడు నీనిజంబగు నివా ♦ సంబందనంగీకరిం।
తునొ? యంచావచనంబు శారదకు నెం♦తో సమ్మతంబయ్యె మం।
డనుచిత్తంబు నెఱుంగఁగోరియతియుం♦ దానుండె హృష్టాత్ముఁడై

ఉ॥ నీతియుతంబులై నిగమ ♦ నిస్తులితార్థము నిర్ణయించుచీ।
భూతలమందెసంగు యతి ♦ భూపతివాక్యులచేత వేగ ధ్వ।
స్తాతిశయాగ్రహుండయిన ♦ సంతటఁ గర్మజడుండుగాన నా।
ఖ్యాతలదేవుఁడప్పుడెద ♦ సందియమందియ నెన్నమీాందుగ్రితోన్

కం॥ యతివర! నేనిపుడీన। వ్యతరంబగు నపజయంబు♦ వలనవిపాద। స్థితిఁగననుగాని జైమి। న్యతులోక్తులనొంచితంచు ♦ సందితిఁగ్రొ
శతకఁ॥ ౧౨౨

గీ॥ ఎఱుఁగు జరిగినదానిని ♦ జరుగఁబోవు। దాని, జగమువకెల్ల
హి ♦ తంబుఁజేయు। వఱలుదక్షతనిగమ ప్ర ♦ వర్తనవిధి। నట్టి
ముని స్వార్థపదవక్త ♦ యెట్లులగును? ॥ ౧౨౩

—♦మండనమిశ్రునకు శంకరుఁడు జైమనీయేంగితముఁ దెల్పుట♦—

మ॥ అని సందేహమునందు మండనునితో ♦ నాదండి తాఁబల్కె ని।
ట్లనె, యా జైమినియందు లేశమును న♦ న్యాయంబు చూపట్టదా।

తనచిత్తంబుననుండు భావపుయథా ♦ ర్థంబు న్వీలోకింపఁగా।
ఘనమేయజ్ఞులమాటఁజాల ముసుమిా ♦ మాన్యుండెయానాతఁ।
డుర్॥ ౧౨౪

కం॥ కవిజనమెఱుఁగని మునిదా। ప్రివిమలవచనంబదెదియొ? ♦ పలు
కుము యమివ। ర్య! వినిసమంచితమగుచో। భవదుక్తినెరోషము
డిగి ♦ భావింతునెదర్॥ ౧౨౫

గీ॥ అనుచు మండనబుధుఁడు ప్రా ♦ ర్థనముఁజేయఁ। గరుణనొప్పారు
మతిని శం ♦ కరయమీంద్రుఁ। డుభయభారతి మొదలగు♦సభి
కులువిన ♦ జైమినీయేంగితముఁ దెల్పె ♦ నామెయినిటు॥ ౧౨౬

మ॥ వినుఁడీ బ్రహ్మపరుండునైయువిషయా♦విష్టాత్ములౌవారిఁబ్రో
వనెదండాఁదలపోసియమ్మని పర ♦ బ్రహ్మంబునందంగసా।
ధనతత్సర్వమునైన పుణ్యమును స ♦ త్కర్మాతిరేకంబుచే।
తనిరూపించె దయాపరుండగుచుఁ ద ♦ థ్యంబిద్దిముమ్మాటికిన్॥

మ॥ అమలంబైన ‟తమేత” మన్నదము బ్ర ♦ హ్మజ్ఞానముంగల్గఁజే
యుమహాసాధనమాట, ధర్మసముదా ♦ యంబున్విధించెన్నమో
క్షమునందుత్సుకుఁడైనమానితదపే ♦ క్షంజేసియేధర్మసం।
ఘమురూపించెనుగాని వేఱెదియునుం ♦ గాదంచునేనెంచెదన్॥

కం॥ అని శంకరసంయమిజై। మినిమునిహృదయమును సభను♦మృ
దువుగననమం। డనమిశ్రుఁడంతసంశయ। మునుగనియమివరుని
వినయ ♦ మునవిట్లడిగెన్॥ ౧౨౯

గీ॥ దమివ! సఫలంబులగుఁ గ్రియా ♦ ర్థకములగుట। శ్రుతులె,
యతదర్థకోక్తులీ ♦ క్షితినివృత్తి। యనుచుఁ దెల్పిన జైమిని ♦
మునిశ్రుతులకు। సిద్ధవస్తుపరత్వంబుఁ ♦ జెప్పనొక్కొ?॥ ౧౩౦

ఉ॥ ఈతెఱఁగొప్పనాఁడగయ ♦ తీశితపల్కుఁ, బరంపరాసద।
ద్వైతపరంబునైయు శ్రుతి ♦ వారమునాత్మవిబోధసత్ఫల।
ఖ్యాతసుకర్మమందు నల ♦ రారెడిఁగావునఁగర్మకాండగ।
ఖ్యాతసదుక్తిసంతతికిఁ ♦ గర్మపరత్వముఁజూపెమానితా॥

చం॥ అనవిని మండనుండనుఁజి ♦ దాత్మపరత్వము వేదసంచయం।
బునకగుటిష్టమైనయెడఁ ♦ బూరుషభిన్నమునైన చేఁతకుఁ గా।
ఘనఫలదత్వముం దెలియఁ ♦ గాననిజై మినిమానివానిఁ బా।
ల్చినపరమేశుఁ గూడనిర ♦ సించుటకుం గతమేమి చెప్పుమా॥ ౧౩౨

సీ॥ అనిపల్కు మండనుఁ ♦ గని శంకరయమీంద్రుఁ; డని యోఁదా
నిటు సభ్య ♦ జనులు మెచ్చ। ననఘ! యీ జగమెల్ల ♦ నేగుఁగ ర్త
పూర్వక; మను ననుమానంబె ♦ యాగమోక్తి। తతిలేక యేవ్రి
శా ♦ శితుఁ జేయుఁ బరమేశు; ననువాదమాత్రింబు ♦ లాగమంబు।
లనికాణభుజులుఁ దా ♦ మనిరుపనిషదేక; గమ్యు నీశ్వరునా ♦
గమవిదులెఱుఁ।

గీ॥ గుటకుఁ దగరనినిగమవా ♦ క్కు లెవచించు। నట్టిపరమేశునను
మాన ♦ మిట్టిదెట్టు। లెఱుఁగు ననిదృఢయుక్తిని ♦ కరముననివ।
రపుటనుమానమును మునీ ♦ శ్వరుఁడు త్రోచె॥ ౧౩౩

కం॥ వినుమట్టులె పరమేశా। నునివలన జగంపుభవము ♦ నున్నయ
మును నిం।కనమలమగు ఫలమునుజై। మినిమునినిరసించెమిగుల ♦
మెలకువతోడన్॥ ౧౩౪

శా॥ ఈనేనాడినమాని వాక్యముననెం ♦ తేనొప్పుగోప్యంబున।
జ్ఞానులున్నంతయుఁ జూడనేరకననీ ♦ శపోర్చ్చవాదోత్సుకుం।
గానమ్మాన్యునిఁ జెప్పుచుండెదరు దీ ♦ నం జేసి యేయమ్మునీ।
శానుండానెనిరీశవాదిగఁ బరే ♦ శజ్ఞాగ్య్రుఁడిమ్మేదినిన్॥ ౧౩౫

గీ॥ ఇంతమాత్రినె యతఁ డుని ♦ రీశవాది। యగునెడ, నిశాటనా
హిత ♦ మైనతమము। నహములందున వెలిఁగెడు ♦ నహిమకరు
రుని। మహితమా పరిభవఁ జేయదే? ♦ మలినఁగాఁగ॥ ౧౩౬

కం॥ అనిశంకరసంయమిచె। ప్పినజై మినిమానివచన ♦ విలసితభావం।
బునువినికనిరంబయుమం। డనుఁడునుసభ్యులును నుత్క ♦ టంబ
గుతుష్టిన్॥ ౧౩౭

జైమిని ప్రశ్నకు శంకరుపల్కులు సార్థకములనుట.

గీ॥ మఱడనుండంత జైమిని ♦ మతినెఱిఁగియు। నెదనునందియుమిమ
మంత ♦ కదురఁగమతిఁ। దలఁచెనాతనిపల్కుచే ♦ తనునెఱుంగ
మునిని, మఱనియువచ్చె మం ♦ డనునికడకు॥ ౧౩౮

కం॥ వినుసుమతీ! యనిమునిమం। డనుతోననెవినువుమీాము ♦ నన్నం
శయము। ఘనుఁడీతఁడెద్దినాసూ। త్రినికరవుంభావమనిమెఁ? ♦
దత్త్యంబదెయా॥ ౧౩౯

చం॥ యతివృఁడీతంచు నాదుహృద ♦ యంబునెకాదునుమీా, శ్రుతి
స్మృతి।
ప్రతతిఁగలట్టిభావముఁ ది ♦ రంబుగఁదానయెఱుంగుఁజుమ్మనా
గతమునతీతము న్మొదలు ♦ గాఁగలదెల్లనితండెఱుంగున।
ట్లితరుఁడెఱుంగనేరఁడుసు ♦ మీా, పలుమాటలతోడ నేమియా॥

గీ॥ శ్రుతిశిఖోక్తులకెల్లగు ♦ రుండు నచ్చి। దేకరపతత్త్వరణ నిర్ణ ♦
యించెనుగద। వారిశిష్యుఁడనగునేను ♦ వారికి విను। తముగనం
దునెయొక్క సూ ♦ త్రింబునేని?॥ ౧౪౧

కం॥ సుమతీ! మతిఁగలసందే। హామునున్విడివినుము గోష్య ♦ మగు
వల్కు భవా। బ్ధిమునుఁగుజనుఁబోత్రివఁగగూ। పముఁగనుపరము
నిఁగనితని ♦ భావింపుమెదర్॥ ౧౪౨

సీ॥ కృతయుగంబున సజ్జ ♦ నతతికి విజ్ఞాన; మును గపిలుండను ♦
మునిమొసంగుఁ। త్రేతయందున నవ ♦ ధూతవర్యుండైన;
దత్తుండు విజ్ఞానదాతయగును। ద్వాపరయుగమున ♦ ద్వైపా
యనముసిందుఁ; డొసఁగు విజ్ఞానంబు ♦ ను సుమతులకుఁ।
గలియుగంబునను శం ♦ కరసంయమీాందుఁడె; జ్ఞానంబు నం
చిత ♦ సంతతికిడు।

గీ॥ననుచు శైవపురాణంబు ♦ నందు నితని। మహిమము వచింపఁ
బడెఁగాన ♦ మతిమదగ్ర్య!। యిమ్మహాతు సన్మతంబున్ ♦ విప్పు
డంది। భవజలధి నుత్తరింపుము ♦ భయముడీడి॥ ౧౪౩

—♦ జైమిన్యుపదేశమున నిస్సంశయుఁడై మండనుఁడు శంకరు నుతించుట. ♦—

మ॥ అనుచుఀ జైమిని మండనాఖ్యునకు దీ♦వ్యద్బోధఁగావించియా
త్మనె యాశంకరుఁ గౌఁగిలించికనె నం♦ తర్ధానమున్యాయజూ।
కనికాయాగ్ర్యుఁడు మండనుండునుయతి♦క్ష్మానాథుఁడౌ శంకరా।
ర్యునకు న్భక్తిసెలంగఁగా నెఱఁగిని♦ర్దుష్టంబుగా నిట్లనుఀ॥ ౧౪౪

ఛం॥ అనఘువరా! నిరస్తసమ ♦ తాతిశయుండవటంచు నీజగం।
బునకును హేతువంచు నవ♦బోధయె దేహముగాఁజెలంగుచు ।
న్నన బుధసంచయోద్ధృతినొ♦నర్పఁగ నిమ్మెయిఁదాల్చితంచు ని।
న్నను మతిగుర్తెఱుంగుదు జ♦నుర్లయముఖ్యవికారహీనుఁగఀ॥

చం॥ యమివర! వేదశేఖర చ♦యంబులచే నుదితంబునైన యే।
కముగుపదంబుఁ"దత్త్వమసి" ♦ ఖడ్గముఁజేఁగొని నీవుప్రోవకు।
న్నమహిఁబుమర్థహీనులె య♦నందగు బౌద్ధులపల్కులన్నసం।
తమసపుఁగూపమందుఁబడి ♦తాలయమందక యుండనేర్చునే?॥

చం॥ కలనుబ్రబుద్ధుఁడైనటులఁ ♦గన్గొని మూర్ఖుఁడౌకంతులోననే।
మెలఁకువఁగంటినంచు నెల ♦ మిందలపోసెడురీతిగా మతిం।
దలఁచెదరన్యలోకగతిఁ ♦ దాము విముక్తిఁగఁ గొందఱట్టివా।
రలనిరసింత్రు దేశిక! ని ♦ రాకృతమాయులుగాన మీజనుల్॥

శా॥ ధీరత్వంబున భేదవాదులనుము ♦ క్తిందూఱెదం, జూడని।
స్సారంబై తగుకర్మతాముఖరసం ♦ సారంబుఁబోఁద్రోయమి।
ద్ధీరశ్రేష్ఠ!త్వదు క్తసుస్థిరవిము ♦ క్తిన్మెచ్చెదంజాల సం।
సారాతీతననంతచిత్రమదభా ♦ స్వత్స్ఫుర్తిన్నేసదా॥ ౧౪౮

మ॥ మునుదైతేయ వధూసమావృతను భా♦పుత్రింబ రేశప్రియన్।
హనుమత్ప్రఖ్యుఁడు సూచుమాత్రజనను♦త్యత్వంబుఁదానందెన
న్ననవిద్యాఽసురనారిమ్రింగఁగధృతిం ♦దత్కుక్షిలోఀ వ్రచ్చిపా
వనుసర్వేశునిఁదెచ్చు నీవవని వి ♦ శ్వస్తుత్యతంగాంచవే?॥ ౧౪౯

గీ॥ మున్నచింత్యమునీదృశ ♦ మునగునీదు। మహిమనెఱుఁగమినిపు
డస ♦ మంజసముగ। నేననినదెల్లఁగరుణాబ్ధి ♦ వైన నీవు। తగ
క్షమింపుము జగదార్తి ♦ దమన! దయను॥ ౧౫౦

గీ॥ కపిలగౌతమకణభుజ్ఞు ♦ ఖమునివర్యు। లురుతరప్రతిభాఢ్యులై ♦
యురువిమోహ। మునుగనిరటన్ననిగమార్థ ♦ మునువచింపఁ।
బరశివాంశమునకెకాక ♦ యెరులకగునె?॥ ౧౫౧

మ॥ అమ్మృశోద్ధారమొనర్చునట్టి భవదీ ♦ యాస్యేందునందుద్భవిం।
చుమహాభావవదు క్తిసంచయసుధాం ♦ శుస్తోమమొప్పంగ నో।
యమివర్యా! యిఁకనేలచి త్తమలిన ♦ త్వాపాదకంబైనకా।
ర్దమపాదాక్షకణాదభాషితచమ్యో ♦ ద్యత్సంతమశ్శ్రీణిశోకా॥

సీ॥ దేవునితోడ వి ♦ ద్వేషించుచును సాధు; గోగణంబులఁజీల్పఁ♦
గోరునట్టి। యభినవయవనచ ♦ యంబుచే నీజగం; బెల్లసంవ్యా
ప్తము ♦ య్యెనిపుడుగన। నిట్టివారలఁగొల్చు ♦ నట్టి మర్త్యుల
కెట్టు; లలరెడినోమోక్ష ♦ మవనినకట!। తెలిసె నిర్జితకలి ♦
మలుతొచువిష్ణుత; త్త్వానురక్తులునొచు ♦ నవనిఁబొల్చి।

గీ॥ సద్విదద్వర్యునినుఁగొల్చి ♦ సద్విధగ్ర్యు। లగుచుఁదగుకౌశలిని
దగి ♦ జగతినిబ్రతి। దిక్కునందునఁదామొయై ♦ తేజరిల్లు। నట్టి
వారుండనాకేటి ♦ కట్టిచింత॥ ౧౫౩

గీ॥ అల్పబుద్ధులవివరణ♦లనెడుప్రబల। నాగములకాటులకునొచ్చు♦
నాగమములు। తావకోక్తిసుధాసేక ♦ మేవలలక। యాత్మవిధ్వ
తాశయంబులై ♦ యలరఁగలవె?॥ ౧౫౪

కం॥ తావకసూక్తిసుధాకిర। ణావళిఁగాకున్నఁదీవ్ర ♦ మైదున్నహ
మా। నీవిపులభవఖరాంశుజ। మావిస్తృతతాపమెట్టు ♦ లార్య!
శమించుఁ?॥ ౧౫౫

గీ॥ కర్మయంత్రంబునెక్కి యు ♦క్కటు! తపశ్శ్రీ। తగృహాకాంతా
తనూజభృ ♦ త్యధనతతులఁ ।, గమద్భుతపుమానమునుగని ♦
పడిననన్ను। విమల! మెత్తితిభవకూప ♦బిలమునుండి॥ ౧౫౬

కం॥ తొలిబాములఁజేసితిఁదప। ములనునుకరములను, లేక ♦ మొన
యునె కరుణా। నిలయుఁడవై జగతీశత। నలరెడునీతోడఁగథము ♦
హాత్మ ! యిపుడొగిఁ?॥ ౧౫౭

సీ॥ శమమనుతోలిఁ జేసి ♦ సముపార్జితపుణ్యాబ్ధి; జమునకు మొలకలై ♦
యమరునదియు। దమసముల్లాసభూ ♦ జమునందునలరు కెం;
జిగురు నానుతిఁ జేయఁ ♦ దగినదియును। వైరాగ్యవృక్షంపుఁ ♦
గోరకంబై యొప్పి; సహనతాలతకుఁ బు ♦ ష్ప మగునదియు।
నైకాగ్ర్యసుమపుట ♦ స్తోకమరందమై; శ్రద్ధనొప్పారెడు ♦
సత్ఫలమయి।

గీ॥ చెలువుఁగాంచినమీావగు ♦ పలుకులపరి। చయమునస్మత్సుపు
ణ్యాస ♦ చయముచేత। నేఁటికందంగఁగలుగుట ♦ దీటులేని। భా
గ్యముంగంటినిత్యవై ♦ రాగ్యనిలయ!॥ ౧౫౮

గీ॥ అమరులకునైనఁ బూరుషా ♦ ర్థములనిడుచు। భూరిసంసారపరు
లకు ♦ ముక్తినిడుచు। సత్కృపోర్మిళమైన యు ♦ష్మత్కటాక్ష।
ఝరినిధన్యుండెకుఁ గెడు ♦ గురువరేణ్య!॥ ౧౫౯

చ॥ నెలఁతలమేల్మిచన్నవల ♦ నీటగుపై టచెఱంగు గాలిసో।
కులలినెగాఁగిలింపుఁదమిఁ ♦గూడిన చంచలులున్న నేమి? ని।
స్తులఘునకీర్తికోశులయి ♦ తోఁచు భవజ్జనులన్న, మీాదుప।
ల్కులనుసుధాపయోధిఝరి ♦ లోపలనాడెదరో గురూత్తమా!॥

సీ॥ వాసిఁబొల్చెడునట్టి ♦ వైశద్యమున వేగ; నజ్ఞానతిమిరంబు ♦ నప
హరించు। చింతాఖ్యసంతాన ♦ తంతుసంగ్రథితనూ; తనభవ
త్సూక్తిము ♦ క్తాఫలముల। హారంబులనుదాల్చి ♦ హర్షసంభ
రితులై; చూచుమాత్రనెమన ♦ స్తుష్టినిడెడు। మహితమనస్కు
లీ ♦ మహిలోన నెల్లెడ; విహరించుచుందురని ♦ ర్వ్యషయు
లగుచు।

గీ॥ దండివర! మండనంబెన్నఁ ♦బండితులకు। నింతకన్నను వేఱున్నె? ♦
హృద్యమైన। విద్యయనుకాంత తనయంత ♦ వృత్రహాముఖ।
సురలవారించివారినే ♦ ధరణిఁగోరు॥ ౧౬౧

చం॥ శ్రుతులకు శోభఁగూరిచి వ ♦ సుంధరనొప్పెడు మీాదుకీర్తినం
చితులిలఁదుష్టిపుష్టినిభ ♦ జంతురుగావ్రతలోకబంధుభా।

నుత్తతిని గూఁబలట్టుకుజ ♦ నుల్కుఁకుమోహముఁగొంతు గాతనీ|
క్షితి గురుసేవనేవిగత ♦ కిల్బిషతం బ్రమదాబ్ధిమున్గెదన్॥ ౧౬౨

సీ॥ దమివర్య! మీాదుచిం ♦ తనమె కోర్కెలనెల్లఁ| గల్పనంబొనరిం
చు ♦ కల్పతరువు| గురువర్య! మీాపాద ♦ సరసిజయుగళంబు;
సకు మ్రొక్కుటయె నంద ♦ నమునువనము| శమిసార్వభౌమ!
యు ♦ ష్మత్సేవనాది సం; కల్పమే నిజముగఁ ♦ గల్పవల్లి|
జ్ఞానోపవీత! యు♦ష్మ్రాంతఁబునెదమీాదు; సుగుణవర్ణనమొయమాఁ♦
జుమిసురధుని|

గీ॥ యనఘ! నిరతంబు మీాపద్మ ♦ జనమొకనుల| కగపడెడు సిద్ధరా
వాస ♦ మగుజగమునఁ| గానఁ దిరముగనెంచి నా ♦ కమును
దృణము| కన్నలఘువుగ మీాపార ♦ లెన్నెదరెద॥ ౧౬౩

కం॥ కాననిపుడేఁ గుమారుని| మానినినింటిని ధనంబు ♦ మఱియును
గృహబం| ధానేకకర్మములవిడి| మానితునినుఁగొలుతుఁజూడు ♦
మా; దాసునను॥ ౧౬౪

మ॥ అనిసత్యోక్తిమదార్యసన్నుతగుణుం ♦ డై వేదియాశంకరుం|
డనునవ్విప్రునినుగ్రహంబునయమీాం♦ద్రుంజేయఁగానెంచియా
తని ధర్మానుచరింగనుంగొనఁగ నం ♦ తం దన్మనోనిష్ఠభా|
వనిరూఢిన్నతి తానెఱింగియనె నీ ♦ వాసిన్యమీాశానుతోన్॥

—♦ ఉభయభారతి శంకరునకుఁదనభావిదశను దెల్పి వాదాభిముఖయగుట. ♦—

గీ॥ యమికులశ్రేష్ఠ! నీదుమ ♦ నమునెఱుఁగుదు| మున్ను నే ముని
ముఖమున ♦ విన్నయట్టి| జరుగఁబోవునదెల్ల నీ♦ తరుణమునను|
జెప్పెద సదస్యయుతుఁడవై ♦ చిత్తగింపు॥ ౧౬౬

ఉ॥ నేనొకనాఁడు నాదుజన ♦ నీసవిధంబుననుండ, మించులం|
బూని జయింపనౌజడలఁ ♦ బొల్చుచుఁ దావెలిబూదిపూఁతనే|
మ్మైననెనంగఁగానపర ♦ మిత్రుఁడో నాఁజనుదెంచెన త్తఱి|
న్మౌనియొకండు బ్రహ్మపర♦మానసుఁడౌచుగృహంబుచెంతకున్॥

గీ॥ ఆర్యవర! పాద్యముఖ్యా స ♦ పర్యలనపు । డామునిని దృప్తుఁజేసి
మ ♦ దంబవినయ । మునశిరమునొంచి యంజలి ♦ నొనరిచి
యడి। గెనిట్టు మామకమైనదా ♦ నిని ముదమున॥ ౧౬౮

కం॥ మునివర! నాసుతదాభా । వినినే గుర్తెఱుఁగ నీవ ♦ వేల తప
ముచే। తనెఱుఁగుదెల్లఁ గృపన।ముని యెడ మీాభోఁటులందు ♦ రు
రహస్యంబుల్ ॥ ౧౬౯

చం॥ అనఘమతీ! మదాత్మభవ ♦ యాయువు నెంతవహించు నెట్టివా।
నిని బతిఁగావరించు నవ ♦ నీస్థలి నెందఱఁగాంచుఁ బుత్త్రిల।
స్ఘన ధనధాన్యసంపదను ♦ గాంచి యొనర్చునె యజ్ఞసంతతి।
స్ఘనదయఁ దెల్పుమంచమగఁ ♦ గాక్షణమాత్ర నిమీలితాక్షుఁడై ॥

కం॥ ఆమునివర్యుఁడు వరుసగ। నామాతకుఁజరుగఁబోవు ♦ నా తెఱఁ
గునను। నామలదయతోఁ దెల్పుచు । నామెయుఁ దెల్పెను రహ
స్య ♦ మనునిద్దానిన్ ॥ ౧౭౧

సీ॥ క్షితిలోఁ బ్రబలబాహ్య ♦ మతవితానంబుచేఁ; దొలిచదువుల
తెన్ను ♦ ఖిలముగాఁగ । మఱలదానినిదేర్ప ♦ సరవిందభవుఁడు
మం; డనకవీంద్రాభిఖ్యఁ ♦ గని చెలంగు। నగజశంకరుఁబోలె ♦
హరిఁబయోధిజయట్లు; నీపుత్త్రియనురూపు ♦ నాపురుషునె। పతి
నిగాఁబడసియం ♦ చితులఁ బుత్త్రిలఁగాంచి; యెల్లజన్నంబుల ♦
నెలమిఁజేసి।

గీ॥ ధర్మములకెల్లనిల్లైయె ♦ తనహృదీశు। ననవరతమును నీడయ ♦
ట్లనుసరించుఁ। గలసతులకెల్లఁ దలమాని ♦ కంబునగుచు। నెగ
డుఁ జిరకాలమానంద నిలయమగుచు॥ ౧౭౨

గీ॥ తన్వి! పరిబలంబులా కుమ ♦ తములనష్టు। మహా శ్రుతిశిఖాకృ
తాంతంబు ♦ నంతనిచట। స్థాపనముఁజేయుటకు మర్త్య ♦ తను
వునంది। శివుఁడిలకు నాత్మపదములఁ ♦ జెలువుగూర్చు॥ ౧౭౩

మ॥ శమివేషుండగు నీశుతోఁడుతఁ భవ ♦ త్పత్పుత్రికా భర్తవా।
దమునుంజేసి జయింపఁగాఁబడీ యమం ♦ దంబైనభక్తింబ్రపం।

చముసం దెల్లగకు న్వరణ్యుఁడగునా ♦ సద్వర్యునే స్వీయగే।
హా ముఖత్యాగముఁజేసి తాశరణము ♦ స్వర్గంబునంగాంచెడిక॥
కం॥ ఇటులామునియని చనెని। ప్పటికింతయునద్యో నాకు ♦ భవ్య!
నిజముగా। నెటులను మునిపల్కిన నీ। పటుశిష్యపదంబితని క♦
భావముగమహిక॥ ౧౭౫
కం॥ మతిమద్వర! మైచను నా। పతికీవు సమగ్రముగ న ♦ పజయ
ముబడవే। నితనిమెయి సగముగాన వి। జతఁగాననుఁ జేసికొను
ము♦ శిష్యుగనితనిక॥ ౧౭౬
గీ॥ జగమునకు నెల్లఁగారణ ♦ ముగఁజెలఁగుచు। సర్వవిత్త్వమునఁ
దగెదు ♦ సర్వగుఁడవుఁ। బరముఁడవునైయు గురుమతీ ♦ కర
మువాద। మొనర నీతో నొనర్పవే ♦ డ్కనువహింతు॥ ౧౭౭
మ॥ అనుచుంబల్కిన మండనార్యసతి దా♦ నాయర్థవద్వాక్యరా।
జిపగర్వాంచితశబ్దసంచయ విరా ♦ జిన్మంకరార్యుంకుదా।
విని సమ్మోదరసాబ్ధిలోమునిఁగి యా♦ విఖ్యాతరోమాంచుఁడై।
యనె నాసాధ్వినిగాంచి యిట్లుశరదిం ♦ ద్వంశుప్రభాస్మేరుఁడై॥
గీ॥ వెలఁది! నామదివాదంపుఁ ♦ గలహమును నో। నర్పవేడుకఁగనె
నంచ ♦ నంగనీకుఁ। దగదు, మహితయశస్కలీ ♦ జగతినంగ।
నాజనముతోడ వాదమొ ♦ నర్పరెపుడు॥ ౧౭౮
కం॥ అనిపల్కు శంకరాచా। ర్యునిసంతేవాసినిచయ ♦ యుతునింగ
నితా। ననెనిట్టులుభయభారతి। ఘనతరసద్యుక్తులెసఁగ ♦ గాఁ
దత్సభలోక॥ ౧౮౦
గీ॥ ఎవరునిజమతమును నొంప ♦ నెపుడెదఁదలఁ। చెదరో? వారెన్న
నాతుల ♦ గుదురు, పురుషు। లగుదు రెవరైన నవ్వారిఁ ♦ దగు
జయింప। నాత్మమతరక్షణోత్సుకు ♦ లగుబుధులకు॥ ౧౮౧
ఉ॥ కావుననేయతిప్రవర! ♦ గార్గియనంబడు సాధ్విత్తోడ స।
ద్భావుఁడు యాజ్ఞవల్క్యుఁడను ♦ తాపసవర్యుఁడొనర్చెవాదము।
న్భావిభుఁడైన మైథిలుఁడు ♦ మున్నులభాంగనతో వివాదముం।
దావిధిఁజేసె, వీరువసు ♦ ధం బ్రితిభానిధులార్య! కారొకో?॥

గీ॥ ఉభయభారతిశాయుక్తి ♦ నొప్పవచన। మునువిని పరిహృష్ట
మతియై, సురి ♦ తినదిజలధి। యై వెలయుయోగివాగధి ♦ దేవత
యగు। నాపెతోవాదముఁ దలంచె ♦ నాబుధసభ॥ ౧౮౩

ఉభయభారతి శంకరుతో వివాదమునకుఁ గడగి కళాస్థానములనడుగుట.

చం॥ జరిగెవివాదమత్తఱిల ♦ సద్గతినాబుధసత్సభం బర।
స్పరము జయంబెకోరెను వి ♦ భాస్వరబుద్ధుల నొప్పనట్టి చా।
తురినిరచింపఁగాఁబడెను ♦ దోషవివర్జితశబ్ద సంచయో।
ద్ఝురినురువిస్మయంబుఁగను ♦ శారదకున్యమి చక్రివర్తికిన్॥

గీ॥ తగుసుయుక్తుల నెసఁగు చి ♦ త్రిపుఁబదముల। వీరలొనరించు
వాదంబు ♦ విని సభికులు। శేషుఁగమలాప్తుగురుఁగవి ♦ సీసుఁ
బోల్పు। లేదననవనినేరిఁ బో ♦ ల్చెదరువారు? ॥ ౧౮౪

గీ॥ తగునియతకాలమునఁదక్కఁ ♦ బగటఁజేయి। నైననువివాదకథశాంతి ♦
నందదయ్యె। ధీరమతులిట్లు సమముగాఁ ♦ బోరుచుండ। నేగెఁ
బదునేనుదినములు ♦ వేగముననః॥ ౧౮౫

గీ॥ అంత శారదనిగమాదు ♦ లైన నిఖిల। కలలఁగవిజేయుఁగాఁగశం
కరయమీంద్రు। నెడఁదనత్తఱి బాగుగ ♦ నెఱఁగిమఱియు। వేగ
నిట్లనిలోనభా ♦ వించెనపుడు॥ ౧౮౬

చం॥ ఇతఁడతిబాల్యమందె మన ♦ యియ్యమిభావమునందియుంటనం।
చితనియమంబులీయనఘు ♦ చెంతనె వాసముఁజేయుచుండుట
న్రతిహృదయేశ శాస్త్రనిక ♦ రంబు నెఱుంగఁడుగాన వీనివా।
క్చతురిమమీజనమ్మదన ♦ శాస్త్రముతోనిపుడేజయించెదన్॥

గీ॥ అనుచు లోనెంచి శారదాం ♦ గనవివాద। మునఁగల ప్రసంగ
మునుడాఁచి ♦ బుద్ధిచాతు। రినిబ్రసంగాంతరముఁదెచ్చి ♦ ఘన
సభయమి। వరునడిగెమారశాస్త్రత ♦ త్త్వంబునిట్లు॥ ౧౮౭

గీ॥ సుమశరునికెన్నికలలో? చె ♦ ప్పుమవియెట్టి। వి? మహినే, యే
పదంబున ♦ వెలయుఁ? బక్షు। యుగళమున నెట్లు విలసిల్లు? ♦
యువతులందుఁ। బురుషులందునసెట్లెటొ ♦ప్పును? యమీంద్ర!

గీ॥ అందఫ్రుంజందముచకెల్ల ♦ లగుచునూటి। కెక్కుడగుత్రోయ్యలు
లగుమి ♦ యెవనికెనఁగు?। నట్టి యమరకభూపతి ♦ యక్కట!
శ్రిమ ! మునమృతినిగాంచియిలఁబడెఁ ♦ బుత్త్రి! కంటె ౧౯౭

కం॥ మృతుఁడగు నీనృపుకాయము। నతిరయమునఁజొచ్చిరాజ్య ♦
మందితనిసుతుం। బతిఁగానొనరిచియోగపు । గతిఁదిరిగియురాఁ
గవేడ్కఁ ♦ గనెమన్మతియుఖ॥ ౧౯౮

శా॥ నేనీకాలమునందు నీయవనిజా ♦ నిస్తోమమూర్ధన్య, నా।
నానీరేజదళాక్షులందలరున ♦ న్యాద్బృగ్భయాశుద్రిపక్రో।
పానందాదులసర్వవిత్త్వమును దా ♦ ర్ఢ్యంబొగతింజేయఁగా।
సానందంబుగఁజూడఁగోరెదనెద ♦ న్సచ్ఛాత్రిచూడామణీ॥ ౧౯౯

మ॥ అనుచు న్శంకరయోగిపల్కవిని శి ♦ ష్య శ్రేష్ఠుఁడౌనాసనం।
దనుఁడీతీరుగఁబల్కెన త్తఱిని సాం ♦ త్వంబెంతయేనొప్పను।
ర్వనిసర్వజ్ఞవతంస! సుంతయును భా ♦ వింపంగలేదీవెఱుం।
గనిదైనన్ఘనభక్తియి త్తఱి ననుం ♦ గావించువాచాలుఁగఖ ॥

—♦పద్మపదుఁడు శంకరునకు మత్స్యేంద్రియోగి వృత్తముఁజెప్పుట.♦—

మ॥ మునుమత్స్యేంద్రుఁడనంగ నొప్పెడుమహా ♦ త్ముండొక్కఁడా
త్మీయశి। ష్యునిగోరక్షసమాఖ్యు నంచితమనీ ♦ షున్స్వీయదే
హంబుఁబో్రి। వనియోగించిగతాసుఁడైన యొకభూ ♦ ప్రశ్రేష్ఠు
నెమ్మేనియం। దునఁదాఁజొచ్చితదీయపట్టణపునా ♦ థుండయ్యె
దీవ్యన్మతిఖ॥ ౨౦౦

శా॥ ఆయోగీంద్రుఁడు భద్రపీఠికనుదా ♦ నాసీనుఁడై యుండఁగా।
శ్రీమోవాప్తితమనిద్రిమై ప్రిజలనం ♦ సేవించెనశ్రాంతముం।
దోయధ్రింబులు నర్హాకాలములయం ♦ దుందామువర్షించెల।
క్ష్మీయుక్తంబయియొప్పెనప్పురి ఫలిం ♦ చెంబైరులిచ్ఛాగతిఖ॥

గీ॥ కనుఁదెలివినొప్పునట్టి పెద్ది ♦ గ్గడలునంత ♦ తేనిమేచునఁజొచ్చిన ♦
వానినొక్క। దివ్యుఁగానెంచిరాట్పుద ♦ తీమణులను। జెప్పిపంపిరి
వానివ ♦ శీకృతికయి॥ ౨౦౨

— ♦ నిస్సంగునికిఁ బాపపుణ్యములంటవని శంకరుఁడు తెలుపుట. ♦ —

కం॥ సంగవిరహితునకీశ్వర। శింగామములుద్భవింప ♦ నేరవెపుడుగో।
పాంగనలతోడఁగూడియె। సంగెడు శ్రీహరికిఁబోలె ♦ సచ్ఛాత్రమణీ!॥

ఉ॥ నీరజపాద! కోర్కులుజ ♦ నింపవసంగున కెన్నఁడేని నా।
భీరవధూసఖుండగు ను ♦ పేంద్రునకుంబలె నల్పభిక్షునో।
ప్పారెసు నట్టియోగమున ♦ కోఁ బ్రితిమేదినివజ్రమద్ది మా।
కీరసలోనఁజూడ నవ ♦ కీర్ణితదైన విపర్యయంబిదా॥ ౨౧౦

మ॥ కలకామంబులకెల్ల శిష్యవరసం ♦ కల్పంబె మూలంబు శ్రీ।
లలనేశానునకు న్నముండనయిపో ♦ లంగల్గు నాకద్దియే।
కలుగంబోదిఁకఁగామమూలమగు సం ♦ కల్పంబు హానింగన।
జ్జలసంసృత్యఘదృష్టికైన భవపా ♦ శంబెల్ల నాశంబగున్॥ ౨౧౧

చం॥ జడుఁడెవఁడంగముఖ్యములఁ ♦ జక్కఁగనెంచక నేనెయంచులోఁ।
గడునభిమానముంగని జ ♦ గంబుననుండునొ? చూడవాఁడెమూ।
ఢుఁడగుఁజుమీ! నిజంబుగన ♦ రోజపదా! యతనింగుఱించియే।
ర్పడెఁ బ్రతిషేదసద్విధివి ♦ భాస్వరశాస్త్రము లుర్విలోపలన్॥

చం॥ జగతిననాశ్రిముండునున ♦ జాతియునేకరసుండజుండు నె।
న్నఁగనవబోధమాత్రుఁడు స ♦ నంతుఁడవర్ణుఁడునైన యాత్మ నా।
త్మఁగఁగృతబుద్ధితానెఱిఁగి ♦ ధన్యుఁడునై నిగమంపుమౌళిపైఁ।
దగనివసించుచు న్విధికి ♦ దాసుఁడుగాఁడెపుడేనిఁ దానిలన్॥ ౨౧౩

గీ॥ మట్టినుండిజనించిన ♦ యట్టిఘటము। మున్నుగలదెల్ల మన్నులే ♦
కున్నలేని। యటులఁ బరమాత్మజన్యంబు ♦ నైయు జగమె।
సఁగదు పరమాత్మలేక ది ♦ ష్టత్రియమున॥ ౨౧౪

చం॥ మనమునలోకమెల్ల నిది ♦ మాఱుటచేత ననిత్యమంచులో।
గనుఁగొనువిజ్ఞుఁడేగతిని ♦ గర్మఫలంబులచే విలిప్తుఁడౌ?।
ననృతపుబుద్ధిచే నిహిత ♦ మైనదిగావున స్వప్నకాలమం।
దొనర్చుపుణ్యముఖ్యమది ♦ యుర్విఫలంబునకౌనె? చెప్పుమా॥

మ॥ నియమంబొప్పఁగ నర్హదక్షిణలని ♦ ర్ణిద్రిపరిభావంబులౌ।
హయమేధంబుల నెన్నిచేసినను బు ♦ ణ్యంబుంగనంబోఁడు ని।

ర్భయుఁడై పాటులఁజంపివంగనఁడు పా ♦ పంబున్నవ్వక ర్తృత్వమం
తయుహానింగనియుంటచేతఁబరమా ♦ ర్థజ్ఞుండుతానిద్ధరన్॥

గీ॥ త్రిశిరసుంజంపెరుషను య ♦ తిపవరులఁ। బలువురనువేగవృక
ములఁ ♦ పాలుచేసె। దానఁగట! యిందునకులోమ ♦ హానియైనఁ
గలుగలేదని బహుభ్రిచా ♦ గమవుఁబలుకు॥　౨౧౭

కం॥ ఘనదక్షిణలా క్రతువుల। ఘనధనములజనకభూమి ♦ కాంతుఁడు
విబుధా। ళినిద్పృప్తిపఱచి యభయమె। కనెఁ,దనుగతిఁగనఁడ
టంచుచుఁ ♦ దాణ్వనచనమా॥　౨౧౮

చం॥ గురుదురితాళిచేతఁ దఘుఁ ♦ గుంగనఁడెన్నఁడుఁ దత్త్వవేదివృ।
త్రరిపువిమాదిని, నాజనక ♦ రాజువిధంబున వృద్ధినందఁడి।
ద్ధరసుకృతాళిచేత; సుకృ ♦ తంబులనేల యొనర్పనైతి? నీ।
దురితమునేలచేసితిని? ♦ తోఁపక, యంచుఁగనండుతాపమున్॥

గీ॥ కానసీమేనితోడనే ♦ సూనశరుని। కలనెఱింగిన దోషంబు ♦ క
లుగదైనఁ। గోవిదులతెన్నుఁగాపాడు ♦ కొఱకుమతియె। కతను
వుంగనియత్నింతుఁ ♦ గలనెఱుంగ॥　౨౨౦

మ॥ నుతియింపందగుకీర్తినొప్పెడు యతీ ♦ నుండాతఁడీరీతిసం।
సృతిభీతింబరిమార్చు సత్కథలఁదు ♦ ప్పిందెల్పుచున్నిష్యసం।
తతితోడంబదచారులై జనులకం ♦ దంజాలఁగష్టంబునన్।
క్షితిభృచ్ఛృంగముఁజేరితామరలఁబ ♦ ల్కన్నిష్యవారంబుతోన్॥

—♦శంకరుఁడు స్వశరీరమునకు శిష్యులఁగావలియుంచుట.♦—

చం॥ అలరెడుఁజూడుఁడీరలుగు ♦ హాగ్రమునన్నమదేశమాచు భా।
సిలు శిలయొక్కఁడాశిలకుఁ ♦ జెంతనెయచ్ఛజలంబునై ఫలా।
వలిబహుభారనమ్రతరు ♦ వారమనోహరసత్తటంబునై।
చెలఁగుసరస్సరోకండుసర ♦ సీరుహసంచయభాసమానమై॥　౨౨౨

గీ॥ సూనశరవిద్యనెఱుఁగనో ♦ మేనినుండి। దర్పకునివిద్యనంతనే ♦
దగనెఱుంగు। వఱకుమీరిటనుండియే ♦ మఱకనాదు। తనువునన
వద్యగుణులార! ♦ మనుపవలయు॥　౨౨౩

గీ॥ అనివినేయులశాసించి ♦ యాగుహానరు। యోగబలుఁడగుయతి
నేత ♦ వేగఁదన శ। రీరమునువీడియమరక ♦ భూరమణు శ। రీర
మునఁజొచ్చె లింగశ ♦ రీరమునను॥ ౨౨౮

మ॥ తనయంగుష్ఠముమున్నగాఁగదశమ ♦ ద్వారంబుదాఁకన్నమీ।
రునిఁదాఁదేర్చికరంధ్రమార్గమున ని ♦ ర్దుష్ట్వార్ద్వయోగంబెఱిం।
గిన యాయోగి బహిఃప్రదేశమున క ♦ ళ్లేశంబునంజేరియ।
ల్లననాతెన్నునఁజొచ్చెనామృతపదా ♦ గ్రింబేకధీకుండునై॥

కం॥ మృతుఁడైనజేనిమెయివిచ। లితమల్లననయ్యె హృత్థ్స♦లిన్వారు
సగన। ల్లితెఱచెనతులనాభూ। పతిలేచెంబూర్వమట్లు ♦ పరిజ
నులుకనన్॥ ౨౨౯

చం॥ మొదటఁదదంగమందలరె ♦ మోమునరమ్యత, నాసికాంతని।
ర్యదనిలమంతఁజెన్నెసఁగె♦ నక్షి వికాసమెలర్చెనంతటం।
బదచలనంబెసంగెఁబిద ♦ పన్విలసిల్లెబలంబునంత భూ।
మిదయితుఁడాసుషుప్తిఁగని ♦ మేల్కనునట్టుల లేచె సత్వరిన్॥

చం॥ తిరిగియుబుధజీవునిఁబ ♦ తింగని హార్షభవద్రివంబులం।
గరముపహృష్టరమ్యముఖ ♦ కంజములన్వెలఁదుల్చెలంగిర।
త్రతిసరుణోదయస్ఫురిత ♦ తామరసంబులసారసోద్ధృతిం।
దిరముగనొప్పునట్టి నలి ♦ నీలతలట్టులనవ్వనంబునన్॥

మ॥ అమితంబై యలరారు నాసతులదా ♦ హార్షంబునుంగాంచిప్రా
ణమునుంగాంచినజేనిఁగూడఁగనియా. ♦ నందాత్ములౌమంత్రిస।
త్తములుం గాహళకంబుదుందుభిముఖో ♦ ద్యద్ఘోషముంజేసిర।
ద్దిమహీవ్యోమములంబొనర్చెనవుడే ♦ దిమ్ముంగొనంగానతిన్॥

—♦ శంకరుఁడు పరకాయప్రవేశమున నమరకరాజై వెలయుట. ♦—

గీ॥ అంతఁగృతశాంతికవిధులై ♦ హార్షమునఁ బు। రోహితామాత్య
ముఖ్యపౌ ♦ రులుతగుగతి। మంగళముఁజేయ భద్రిమా ♦ తం
గమువయి। నెక్క భూపవరుం[illegible] ♦ నేగెఁబురికి॥ ౨౩౦

క౦॥ నగరంబుఁజేరి నృపుఁడిలఁ। దగునాప్తులఁజూచిసమ్మ ♦ తంబగు సన్మం। త్రిగణములోఁ జేఁపులుతన। దగునాజ్ఞనుమెలఁగఁబ్రోచె ♦ హారిదివసముఁబలెన్॥ ౨౩౧

గీ॥ ఇట్లు నృపభావమునసంద ♦ మీశ్వరుండు। మహినిబాలించు చుండన ♦ మాత్యులెల్ల। నతనియెడ సంశయాత్ములై ♦ యప్పు డే। తంబునంజేసిరాలోచ ♦ నంబునిట్లు॥ ౨౩౨

ద్వి॥కో॥ప్రకృతిభాగ్యవశంబుచే జన ♦ పాలుఁడీతఁడుమి త్రిఁగాం। చిశముపేగమెపాణముంబడ ♦ సైన్యరాష్ట్రలినంత నె। ట్లోకనఁగానటులేయెసంగెఁగ ♦ మున్నుదివ్యులసద్గుణ। ప్రకరుఁడై తొలిమాద్రిఁగాకతి♦ రంపుసన్నుతిపాత్రతన్ ॥

గీ॥ అర్థులకుధనమొసఁగు దు ♦ యాతియట్లు। పలుకునర్జునుఁడై బృహ ♦ స్పతివిధముగ। నరినృపాలురగెలుచుఁ దా ♦ నర్జునుబలె। సర్వమునెఱుంగు నీతేఁడు ♦ శర్వరీతి॥ ౨౩౪

చ౦॥ అనిశవిస్తృత్వరంబులగు ♦ నట్టివియు న్మనులేనిశౌర్యధై। ర్యనియతి దానపూర్వములు ♦ నన్యులకుం గడుదుర్లభంబులై। కనఁదగు సద్గుణంబులన ♦ ఖండమహీవలయేశుఁ డీతఁడో। ప్పనుగనె నాద్యుఁడౌ పరమ♦పూరుషురీతిగఁ జూడుఁడీమెదన్॥

సీ॥ ఋతువులనేకాక ♦ క్షితిరుహంబులివెల్లఁ; గుసుమితాగ్రంబులై ♦ కొమరుమిగిలె। ధేనురాజియుమహి ♦ పీనికాయంబును; జాలునట్లొసఁగెడు ♦ పాలనిపుడు। ఇష్టమైనంత సు ♦ వృష్టిచేఁ దగి యర్థ; సర్వసస్యంబుల ♦ నుర్వియలరెఁ। బ్రజలెల్లఁ దమకుఁ జె ♦ ప్పఁబడినధర్మంబు; లందనురాగంబుఁ ♦ బొందిరితగఁ।

గీ॥ గలదొసంగులకిల్లైన ♦ కలియుదెయు। నతిశయించెడుఁద్రేత నీ ♦ క్షితిపుమహిమఁ। గాన మనతేనిమెయిఁజొచ్చి ♦ కడుసిరిఁ గని। ధరననఘుఁ డొక్కఁడేలెడుఁ♦ దథ్యముగను॥ ౨౩౬

ఉ॥ కానగుణాంబురాశియు న ♦ కల్మషుఁడౌ నితఁడెట్లు పూర్వపు। న్మౌనిని జెందకుండునో దు ♦ మేయసుధీవరులార! యట్లుగాఁ।

బూనికతోడఁ జేయుదము ♦ భూజను లెల్ల సుఖింతురంచు మే।
ధానిధులైన ప్రెగ్గడలు ♦ తామొకనిశ్చయముం బొనర్చుచున్॥

—♦ మంత్రులు మృతకళేబరమెటనున్న దహింపఁజేయ శాసించుట ♦—

ఆ॥వె॥ మహిని నెవ్వఁడేని ♦ మనుజుండు విగతాసుఁ। డైనయెడల
వాని ♦ మేనినీర । ఱెన్నకుండనే ద ♦ హింపుఁడనుచు భృత్య।
వరులకానతిడిరి ♦ మఱుఁగునఁదగ॥ ౨౩౮

ఆ॥వె॥ అంత రాజ్యభరము ♦ నంతయు భూనాథుఁ। డాప్తులగు న
మాత్యు ♦ లందునునిచి। పడఁతులదరిని బెఱ ♦ పుడమిజేనికిఁ
గాని। విషయసమితి ననుభ ♦ వించెనపుడు॥ ౨౩౯

—♦శంకరుఁడు రాజరూపమున రాణులంగూడి కామశాస్త్ర పారగుఁడౌట.♦—

సీ॥ సురుచిరమైన యు ♦ ప్పరిగలో వెన్నెల; వలెనుండు స్ఫటికం
పు ♦ ఫలకముననుI వెలఁదులతోఁ బాచి ♦ కలచే దురోదర;
క్రీడలఁ జేయుచుఁ ♦ గెలుపెసఁగిన। నధరసందశనంబు ♦ నటులె
బాహూద్వహ; నంబును మహితోత్ప ♦ లంబుచేత। సంతాడ
నంబును ♦ వింతయౌ సురతివి; పర్యయంబును నట ♦ ఘణముగాఁగ।
గీ॥ నేరుపాటును జేసి మ ♦ హీతలేంద్రుఁ। డతివిలాసంబుతోడన ♦
హర్నిశంబు। నంగనాపాంగ సంచయా ♦ లింగితుఁడయి। యురు
తరానందజలధిలో ♦ నోలలాడె॥ ౨౪౦

సీ॥ కెమ్మోవిఁగలయ మృ ♦ తమ్ముతోఁ గలియుట; చేతరుచ్యంబయి ♦
చెలఁగునదియు। నానానానిలముతో ♦ నమరినసంపర్క; మునఁ
జేసి పరిమళ ♦ ముఁగనినదియు। వెలఁదులకరముల ♦ వెలయు
చుంచుటఁ జేసి; మిగులహర్షంబు నో ♦ సఁగెడునదియు। సితకర
చ్ఛవిపరి ♦ ష్కృతమునుం దాల్చిన; మదకరమునునొచుఁ ♦
బొదలునదియు।
గీ॥ నైన మధువును భూమీశుఁ ♦ డాదరమునఁ। బసిఁడిగిన్నెలతోఁ
డఁదాఁ ♦ బలుతెఱఁగులఁ। గ్రోలుచువిలాసినీజన ♦ పాళిచేతఁ।
గ్రోలఁజేయుచు హర్షాబ్ధి ♦ నోలలాడె॥ ౨౪౧

సీ॥ మధుపానసంజాత ♦ మదకలకలితంబు; జాతలేశస్వేద ♦ సంయు
తంబు। జేతోహరాలాప♦చాతురీలలితంబు; పులకాంకురవ్యాప్తి♦
విలసితంబు। సంస్ఫురన్నిరేజ ♦ సౌరభరమ్యంబు; నంచితసీ
త్కార ♦ సంచయంబు। దరముకుళితరమ్య♦ తరనేత్రలసితంబు;
లజ్జాలవవశోద్వి ♦ లాసయుతము।

గీ॥ సంచలచ్చూర్ణకుంతల ♦ ప్రాంచితంబు। నతివిస్పృత్వరసుమశర♦
ద్యుతియుతంబు। నగువిలాసవతీముఖం♦బుఁగుతలేశుఁ। డక్షులం
గ్రోలిమిగులఁగృ ♦ తార్థుఁడయ్యె॥ ౨౮౨

సీ॥ సందష్టసద్రద ♦ చ్ఛదబింబసుఫలంబు; బాధితపీన ప ♦ యోధ
రంబు। వివృతసజ్జఘనంబు ♦ వేల్లితమణితంబుఁ; బ్రాప్తామితో
త్సాహ ♦ భాసితంబు। శ్రవణమంగళరణ♦ద్రత్నమేఖలమునా;
సాదితసుక్రియా ♦ భేదయుతము। నటదఖిలాంగంబుఁ ♦ ద్రుటితత
నిశాహంబు; విగతాన్యభావనా ♦ విలసితంబు।

గీ॥ నైనయానందమాధరా ♦ జానికపుడు। వాక్చయంబునకునని♦
ర్వాచ్యమగుచు। దినదినంబునువృద్ధితోఁ ♦ దేజరిల్లి। మదికిమా
త్రంబు తెలియనై ♦ యొదవెఁజూడ॥ ౨౮౩

శా॥ జ్ఞాతానంగకలాసుతత్త్వుఁడు మనో ♦ జ్ఞప్రోల్లసచ్చేష్టితో।
పేతుండున్విషయాళినంతటనువ్యా ♦ వృత్తంబునొనిందిృయ।
వ్రాతంబొప్పఁగఁదాసదానుస్మృతస ♦ ద్రామోత్తముండై కుచ
ఖ్యాతశ్రీగురుఁగొల్చిసద్రతవిధా ♦ త్రానందముంబొందెఁదాఁ

ఆ॥వె॥ పుడమితేఁడు పూర్వ ♦ మునఁబోలెఁ ద్రానందె। భోగినులను
గూడి ♦ భోగములను। గమరమించెఁ గంతు ♦ కలలవాత్స్య
యున। విధులఁగలిసి శాస్త్ర ♦ విధమునెటఁగ॥ ౨౮౫

సీ॥ ధర్మాదివర్గ త్రి ♦ తయపుసద్రీతియు; విద్యాసముపదేశ ♦ వి
ధమునాగ। రికసువృత్తమును నా ♦ యకసహాయముఁజేయు;
దూతికకొనరింప♦ నొతెఱఁగును। సమయభావప్రమా ♦ ణము
లను రత్యవ; స్థాపనములుఁ బ్రీతి ♦ జాతులుఁ బర్రి। రంభణా స

ద్విచా ♦ రములుఁ జుంబనభేద; ములు నఖదశనజా ♦ తులును
దశన| విచ్ఛేద్యవిధులును ♦ వివిధదేశోద్యపచా; రములును సం
వేశ ♦ నములగతులు| వివిధచిత్రరతాళి ♦ విధమును బ్రహ
రణ; పునియోగములరీతు ♦ లును దదుక్త| సీత్కారముల
దైన ♦ చెలువును బురుషాయి; తంపుతెఱంగును ♦ నింపగు
పురు| షోపసంసర్గంబు ♦ నౌ పరిష్టకమును; బ్రణయజకల
హంబు ♦ మునుగలట్టి|

గీ॥ యమలవాత్స్యాయనోదిత ♦ మైన సూత్ర| జాతమును దాని
దైన భా ♦ ష్యముఁ బటుమతిఁ| గనుఁగొని వినూత్నసద్భావ♦
గర్భమగుని | బంధమునుజేసె నృపతినై ♦ పథ్యధరుఁడు॥ అరఁ

చం॥ యమికులసార్వభౌముఁడిటు ♦ లాయవనీశుని మేనఁజొచ్చి వి|
దుత్రమతనులౌ తదంగనల ♦ తో విహరించుచునుండ నంతఁద|
త్సమయముదాఁటుటంగని వి♦ చారముతోయమిపాత్రవు ల్తదం|
గమునటఁబోత్రచుచివ్విధము ♦గాఁబ్రలపింపఁదొడంగిరందఱున్॥

—♦శంకరశిష్యులు చింతించి గురుని వెదకుటకై వెడలుట.♦—

చం॥ మనగురువర్యులొక్కనెల ♦ మాత్రమె తామవధింబొనర్చియే|
గనదియుఁగూడఁబోయె మఱి ♦ ఘనప్రములుంజనె నైదో?
యాఁజో? యిం|
కనుదమమేనఁజొచ్చినను ♦ నాథులఁ గామనలంబొనర్పఁద|
న్మనమునవేఁటికైనను స ♦ మంజసమాదయపుట్టదయ్యెఁగా॥

చం॥ ఇఁకమనకేమిసేయనగు? ♦ నెచ్చటికిన్వెదకంగఁబోవనౌ? |
నకలుషుఁడిచ్చటంగలఁడ ♦ టంచుఁదగన్మనలంగుఱించి భ|
వ్యకరుణతోఁజుతంబలుకు ♦ వారెవరాజలరాశిభూమినో|
పికఁగనినంబరాంగగున ♦ భీతుగురుం దెలియంగనౌనెటుల్॥

తోటక॥ తిరమా కృపనొప్పెడు ♦ దేశికుఁడి|
త్తఱివీడితగన్నవి ♦ ధంబునకు|

న్మతిచేర్పకయున్నెడ ♦ మాకువిప,
ద్ధరతత్పదభాక్కులు ♦ కండయెటుల్॥ ౨౫౦

సీ॥ సకలేంద్రియంబుల ♦ జాడ్యంబుని శ్శేష; ముగఁబాపినవనవ ♦ ముగఁజెలఁగెడు। నాహ్లాదమునుమాటి ♦ కమరుచునదియును; సంతతాశ్లిష్టర ♦ జస్కములగు। సంయమీశ్వరపాద ♦ జలజాత ములనాశ్రి; యించుట శ్రేయంబు ♦ నిచ్చునదియు। విఘ్నం బులేకవి♦వృద్ధినందినయట్టి;దోసంబునకునును♦ద్వాసనయును।

గీ॥ హద్దుసుంతయులేక యే ♦ పార్దునెసఁగు। నదియునాదివ్యవా సన♦ ననవరతము। నంచితమనంబుచేఁ గౌఁగి ♦ లించికొనుచు। విపులమగు భక్తితోడ భా ♦ వింతునేను॥ ౨౫౧

సీ॥ ఫలితంబులగు సత్త్వ♦ పాదపంబులయట్లు; పరిణతయోగసం ♦ పదలరీతిఁ। జెన్నారువైదిక ♦ శ్రీలభాసలఁబోలె; మెయినొప్పు తత్త్వని ♦ ర్ణయములగతి। నిగుడునెసంగుచు ♦నిజలాభవై భవం; బునసుధన్యత్వంబుఁ ♦ గనినవాయన। నుపశాంతినాఁబడు ♦ నువిదతోఁడుతఁగూడి; గార్హస్థ్యభావంబుఁ ♦ గాంచినవన।

గీ॥ నలరియతదన్యతను నఖి ♦ లాత్మకముల। గుచునువెలసెడుశం కర ♦ గురువరేణ్యు। ధామములనెల్లమనకుని ♦ ద్ధాత్రిలోన। నెపుడుదయనొప్పుచు ననుగ్ర ♦ హించునొక్కొ?॥ ౨౫౨

కం॥అజ్ఞావినయముఁబాపుచు। విజ్ఞభవాగ్భృశపశమంబు♦వేచేయుచు యో। గజ్ఞవరుండైతగునా। తజ్జ్ఞుఁడు శంకరుఁడెనాకు ♦ మహి నొసఁగుగతిన్॥ ౨౫౩

ఉ॥ మోహాత మోహతింగనని ♦ పూజ్యునినెవ్వనిఁజేరిసంయము। ల్బాహటమైనమాయనెడఁ ♦ బాసెదరో యమృతప్రదంబునే। నోహరముఖ శ్రితాళికయి ♦ నుత్యతనందెడు నమ్మహాత్ముకా తూహలవద్ద్రగద్వ:బడు ♦ తోడనెశోకపయోధినీఁదనా॥ ౨౫౪

మ॥ మునునాకుండు ననాద్యవిద్యయనఁగా ♦ మోహాపైనపెంజీఁకటిం। దనసద్బోతతిచేతఁబాపిగళిత ♦ ద్వైతంబునొనద్వయం।

బునుదీపింపఁగఁ జేయుచుంబరమత ♦ వ్యాహాంధకారాధ్వపాం।
థనికాయంబుననుండు దుష్కథకుదం♦భంబూన్చుబెష్టొప్పెదో॥

శా॥ ము క్తిన్నాసినిగానొనర్పఁ దగు నొ ♦ ప్పంగాంచియున్నట్టి ర।
మ్యా క్తిన్స్వీయపదాంబుజాశ్రితహృదం♦హోనాశముంజేయుచా
స క్తిన్నవాగిరాకయున్నఁ బరిహా ♦ సంబున్జనుల్సేయ స।
ద్భ క్తింబొల్చెడు నాకుదుఃఖముశమిం ♦ పంబొదుసద్దేశికా!॥

గీ॥ ఇట్టులురుఖేదముందన ♦ హితులు చెంద। నవగతయతీశమహిముండు ♦ నై యుఁబద్మ। పాదుఁడర్థంబుతోనొప్ప ♦ పలుకులఁ దగ। ఖేదమునుబాపుచునుబలి♦కెనపుడిట్లు॥ ౨౫౭

ఉ॥ స్నేహితులార! ఖేదమును ♦ జెందకుఁడీమన మెల్లఁగూడియు।
త్సాహమునూని గూఢముగ ♦ ధాత్రినిలావివరంబులన్దారి।
ద్దాహపథంబునందునశి ♦ వంకరు శంకరు దేవముఖ్యస।
ద్దేహనిగూహితుండఁయిన ♦ దేహినియట్టులకోయఁగావలెఁ॥

భుజంగప్రయాతము॥ అనిర్విణ్ణచిత్తుండు ♦ నై తాఁబ్రియత్నం।
బునంజేయొదుష్ప్రాప ♦ ముంబొందునర్థం।
బునుస్మన్నుదివ్యోత్త ♦ ముల్వీఘ్నముంబొం।
దినంగాంచ లేవేగ ♦ దివ్యామృతంబుఁ॥ ౨౫౯

కం॥ మఱిమొక మెయిఁజొచ్చుటమన। గురువర్యుఁడు వెదకఁబడుట♦ కుంగాఁడయిన। న్సరుచులరాహూదరశశి। థరుఁడట్టులఁ దెలియఁబడెడుఁ ♦ దనగుణములఁదాఁ॥ ౨౬౦

గీ॥ హుతవహద్యుతియైన స ♦ద్యతివరుండు। కామశాస్త్రంబునెఱుఁగన ♦ కామియైయుఁ। దనతనువునుండి వెడలికా ♦ మినులలీల। లకుఁదగినజేనిమేనఁజె ♦ లంగఁబోలు॥ ౨౬౧

చం॥ అఖిరతతృప్తిమద్బుధవ ♦ రాగ్రణియామన దేశికోత్తముం।
డువఱలుచోటమర్త్యులుక ♦ డున్సుఖియింతురు, రోగము।
ఖ్యవిపదనీకముంగనమిఁ ♦గాలనువృష్టిదుఁడిందుఁడోట,ద।
న్యవితతిపీడఁబాయుటను ♦ మర్త్యనిస్వస్వసుధర్మనిష్ఠులై॥ ౨౬౨

గీ॥ కాన నాలస్యమునుపేడి ♦ కేమురయిమున । నిరవధిభవాబ్ధిసేతుఁ
 వౌ ♦ గురువరపద। సరసిజంబును వెదకంగఁ ♦ జనఁగవలయుఁ।
 గాని మనకిటఁ గాలంబుఁ ♦ గడపఁజనదు॥ ౨౬౩

కం॥ అనుచుంబల్కిన యజ్ఞప। దునివచనము నెల్లరునువి ♦ ధూతా
 తిశయా। త్మనిలిపి యటఁగొందఱగురు । తనువును మనుపంగ
 నునిచి ♦ తరలిరివేగన్॥ ౨౬౪

సీ॥ ఒకకొండనుండి వే♦ ఱొకకొండచొప్పునఁ; గలనగంబులనెల్లఁ♦
 గలియఁజూచి। యొకకాననూని యిం ♦ కొకకానరీతిగాఁ; గొ
 ల్లలౌ కానల ♦ నెల్లవెదకి । యొకగొబనుండి వే ♦ ఱొకగొబ
 మాదిగ్రా; గహ్వరంబులనెల్లఁ ♦ గాంచికాంచి। యొకదేశము
 విడి మ ♦ ఱొక్కదేశంబుగా; వివిధదేశంబుల ♦ వెదకివెదకి।
గీ॥ వేలుపులయిండ్లనిరసింపఁ ♦ జాలునట్టి । కలిమినలరారు గృహ
 ముల♦ నలరుచుండు । నమరక వసుంధరేశు దే♦ శములకంతఁ।
 జేరిరా శంకరయమీంద్రు ♦ శిష్యవరులు॥ ౨౬౫

చం॥ అట మృతిఁగాంచియు న్మరల♦నాయువునందుటఁజేడతంపువి।
 స్ఫుటసుగుణంబులం బృథువి ♦ భుప్రితినట్లి దిలీపుసాటిఁగాం।
 చుటవిని దేశికుండెయను♦చుందలపోసి వినేయులెల్లను।
 త్కటవిరహోద్భవార్తివిడఁ♦ దారుధైర్యముగాంచిరత్తఱిన్॥

మ॥ తరుణీసక్తుఁగ గానలోలునిఁగన ♦ ద్ధాత్రీశునాలించి య।
 ప్పురిలోనింక నెసంగు సంగతులనా ♦ మూలాగ్రమున్మన్నెఱిఁ।
 గిరికాన న్వెసవారలెల్లరును సం ♦ గీతజ్ఞవేషంబుల।
 న్సరసంబౌగతిఁదాల్చి యప్పురములో ♦ నంజొచ్చిరంచద్గతిన్॥

గీ॥ అంత జేనికినాత్మ వి ♦ ద్యాతిశయము । రీతిఁ దత్సంగ్రిహార్థ
 ధృ ♦ తాతిశయులు। గాన నెఱిఁగింపఁజేసి యా ♦ జేనిదైవ।
 యానతింగని తుష్టిని ♦ లోనికరిగి॥ ౨౬౮

సీ॥ కరకంకణధ్వను ♦ ల్వెలఁ గెలంకుల; రమణీమణు ల్చామ ♦
 రములవీవ। వీనులకింపుగా ♦ గానంబు సంగీత; విదలైన కామి
 ను ♦ లెదుటఁబాడ। బంగరుంగట్టునె ♦ సంగుసితచ్ఛత్రి; మున

మణిమకుటమ్ము ♦ ప్పనుప వహింప| నిందునిఁ దారకా ♦ బృందవ
మట్టులఁదన్ను; సుదతీనికాయమ్ము ♦ చుట్టికొలువ|

గీ॥ మేనిఁగని మహికిడిగిన ♦ సూనశరుఁడ | నంగ సాంతఃపురం
డైన ♦ నాకవిభుని | మాదిరిగ నర్మ కేళీ వి ♦ నోదములఁగొ|
లువునసలరున్నృపువార ♦ లు కనుఁగొనిరి॥ ౨౬౯

-♦ శంకరశిష్యులు పాటకులైదర్శించి రాజరూపధరగురుని మేల్కొలుపుట. ♦-

గీ॥ కాంచితద్భోగములకు న ♦ క్కజమునంది| తేనికనుసన్న నుప
విష్టు ♦ లైనితాంత| సుస్వరంబుగ మూర్ఛనా ♦ సుపదవిదులు|
సభవిమోహంబుఁగనఁ బాడి ♦ రభయతనిటు॥ ౨౭౧

లయగ్రాహి॥ భృంగవర! నీదయిన ♦ సంగతినివీడి గిరి; శృంగము
నరమ్యభవ ♦ దంగముసెలంగ | స్సంగమునుగాంచె శిశు ♦
భృంగతతి దానిమను; పంగఁ గలుషాంతరము ♦ లంగనుటచేసీ|
వుంగటకటా ! యిటుల ♦ నంగ సమయంబు నెఱుఁ ; గంగను
బ్రపంచముదొ♦ లింగలుగుదానిం| బొంగుచునువీడి నిజ ♦ ముం
గనఁగలేకిటఁజె; లంగుచునువంచనము♦ నుంగనితివేలా?॥ ౨౭౦

గీ॥ శమదమాదిక పూర్వగు ♦ ణములవీడి| గర్వముంగనియిప్పుడ ♦
పూర్వమనము| ననుసరించుచు నావస్తు ♦ వనుచుఁదలఁప| నేల?
రోలంబ! మానూట ♦ నిఁకదలఁపుము ॥ ౨౭౨

గీ॥ నేతినేత్యాది వేదవా ♦ గ్రీతినిపుణ| ముగను మూర్తంబులన
మూర్త ♦ ములనుదొ్రసి| తో్రయఁగారానిదేని బు ♦ ధులును
స్వాత్మ| తనుదలంతురొ; యట్టి సు ♦ తత్త్వమీవె॥ ౨౭౩

ఉ॥ మిన్నది మున్నుగాఁగల య ♦ మేయజగంబును సృష్టిఁజేసి వి|
ద్వన్నిచయంబు గూఢముగ ♦ దానను జేరి సుయుక్తిసంచయం|
బన్న ఘనావఘాతనిచ ♦ యంబునఁ గోశతుషాళియందునం|
దిన్నఁగదేని బియ్యమటు ♦ తీయుదురట్టి సుతత్త్వమీవళీ!॥ ౨౭౪

చం॥ అతివిషమంబులైన విష ♦ యంబులనిచ్ఛఁజరించు నింద్రియా|
శ్వతతిని దోషదర్శనక ♦ శానిహతిన్మరలించి యంతనం |

చితనిజచిత్తరశ్మితతి ♦ చే నెట ధీరులుగట్టియుంతురా।
తతధృతితోడ నట్టి పర♦తత్త్వమవీవసుమీ! ద్విరేఫమా!॥ ౨౭౫
గీ॥ జాగ్రదాదులునౌ నవ♦ స్థలనునేది। తానను స్యూతమగుచున్న♦
సూనములను। దారమట్టులుపాధిని ♦ దాకకలరు। నట్టిపరతత్త్వ
మీవె తి ♦ వళివతంస॥ ౨౭౬
గీ॥ హాటకంబునకును సుకి ♦ రీటముఖ్య। వస్తుతాదాత్మ్యమట్టుల ♦
వరుసశ్రుతులు । పురుష ఏవేదమిత్యాదు ♦ లరయ నిఖిల।
కారణతఁజెప్పు దేనికా ♦ సారమీవె॥ ౨౭౭
ఉ॥ ఈమెయినొప్పు నేనెదివ ♦ సేశ్వరమండలవాసి నాగ్రహా।
గ్రామణి మండలంబున వి ♦ రాజిలుచుండునటంచు వేదవి।
ద్గ్రామణు లాత్మశిష్యులకుఁ ♦ గావ్యతి హారముతోడ దేనినిం।
దాముపచింతురట్టిపర♦ తత్త్వమవీవసుమీ; ద్విరేఫమా!॥ ౨౭౮
కం॥ వేదానువచనసద్దా। నాదికముల శ్రద్ధఁజేసి♦ యమలాంతరులౌ।
భూదేవవరులకెఱుఁగఁగ। నైధీపించెదుసుతత్త్వ ♦మళివర! నీవే॥
సీ॥ శమదమోపరమ ము ♦ ఖ్యములైన సాధనం; బులచే నిజాత్మ
నె ♦ విలసదాత్మ। యందు విద్వద్వర్య ♦ సందోహ మెద్దాని;
వెదకి సుశ్రద్ధఁద ♦ ద్విధమెఱింగి। యాత్తోరుతర సచ్చి ♦ దా
నందరూపమై; సంసృతిఁదిరిగియు ♦ జన్మమృత్యు। లక్షణక్లేశం
బు ♦ లనెపుడు చెందక; నిత్యసౌఖ్యంబుల ♦ నెగడుచుండు।
గీ॥ నట్టి పరతత్త్వమీవాదు ♦ వళివతంస! । తలఁచికొనుము మన
మ్ములో ♦ పలనిజమ్ముఁ। దెల్లముగ మాదుపలుకులఁ ♦ దెలిసి
కొనుము। మోహము వహింపఁబోకుమీ ♦ వైహికమున॥
శా॥ నైపుణ్యంబలరార నిప్పగిది పీ ♦ ణాతంతునాదంబుచే।
నాపృథ్వీశునిమోల వారు నిజకం ♦ ఠాలాపముంజేర్చియా।
త్మ్యాపార్థమెసంగఁ బాడవినిచే ♦ యందగ్గ కార్యంబు నా।
భూపాలుండునెఱింగి వారలఁ దగం ♦ బూజించిపంపెన్వడిఁ।
ఉ॥ సాధువరేణ్యుఁడైవఱులు ♦ సంయమి వారలచేతనిట్టులు।
ద్బోధితుఁడౌచు మెల్లఁగనె ♦ మూర్ఛనుదాఁగనియంతనాధరా।

నాథుని మేననుండి సుమ ♦ నస్కులు మెచ్చఁగనిర్గమించి యా।
భూధరగహ్వరంబునకుఁ ♦ బోయె స్వదేహములోనఁ జేరఁగన్॥

శంకరుఁడు రాజదేహము విడిచి భటులు దహింపఁజేయుచున్న తనదేహమునఁజేరి
తాపోపశాంతి నూనుట.

ఆ॥వె॥ పూర్వదృష్టమైన ♦ భూధరగుహఁజేరి। నృపతివర్య భృత్య ♦
నిష్ఠితవహ్ని। చేదహింపఁబడెడు ♦ స్వీయమౌ మెయిఁగని।
వేగదానఁజొచ్చె ♦ యోగవిదుఁడు॥ ౨౮౩

కం॥ అంతట నవ్వైశ్వానర। శాంతికి నయ్యాత్మవేది ♦ చంద్రుఁడు
నృహరిం। గాంతవదనుతుల నిటుల। శ్రాంతశరణ్యుని నుతించె ♦
సలలితభక్తిన్॥ ౨౮౪

—♦ శ్రీలక్ష్మీనరసింహస్తుతి పద్యరత్నములు. ♦—

శా॥ శ్రీమద్వారిధివాస! చక్రిధర! శౌ ♦ రీ! భోగిరాడ్భోగ సం।
స్థామేయాభమణి ప్రభాసితశుభాం ♦ గా! యోగిపూగేశ! ని।
త్యామోదా! శ్రితభక్తసంతత శర ♦ ణ్యా! దుర్భవాంభోధిపో।
తా! మానాథ! నృసింహ! నాకిడు మనం ♦ తా! నీకరాలంబమున్॥

మ॥ అజరుద్రేంద్ర మరున్నభోమణి సుధాం ♦ శ్వగ్న్యాదికానేకది।
వ్యజనానీక శిరస్స్ఫురన్మకుట దీ ♦ వ్యత్కోటిసంఘట్టితాం।
ఘ్రిజతేజామలకాంతికాంత! వరల ♦ క్ష్మీ సత్కుచాంభోజ హం।
స! జగద్భద్ర! నృసింహ! నాకొసఁగుమీ ♦ శా! నీకరాలంబమున్॥

మ॥ నగధారీ! భవకాననంబునడుమన్ ♦ నైర్మల్యంబున న్సంచరిం।
పఁగ మారోగ్రమృగంబు బాధనొనరిం ♦ పంబూనెఁ దానందు చే।
తఁగడుంగష్టమునంది పర్విడఁగమా ♦ త్సర్యాభిధగ్రీష్మమె।
చ్చఁగఁబీడించెడుఁగాన నిమ్ము నృహరీ! ♦ స్తుత్యా! కరాలంబమున్॥

మ॥ అవనింజూడనగాధమూలమునున ♦ త్యంతంబు ఘోరంబునౌ।
భవకూపంబునఁజేరి దుఃఖశతస ♦ ర్పవ్యాకులాత్ముండనౌ।
చు వడిందీనతనాశ్రయించితి బుధ ♦ స్తోమార్చితా! నిన్నుఁగా।
న వెసన్ శ్రీనరసింహ! నాకిడుమనం ♦ తా! నీకరాలంబమున్॥

శా॥ మానాథా! ఘనపాపబీజమున జ ♦ న్మంబందికర్మోఘశా।
ఖానీకంబుననొప్పి యిందిృయనికా ♦ యంబన్నపర్ణావళిం,
జానై మన్మథదుఃఖసూనఫలమా ♦ సంసారవృక్షంబుపై।
నేనిప్డెక్కి పడంగనుంటినృహరీ! ♦ యిమ్మాకరాలంబముణ్॥
మ॥ అజ! సంసారమహాహివక్త్రిభయదా♦త్యంతోగ్రదంష్ట్రాంతర
స్థజగన్నాశకకాలకూటవిషద ♦ గ్ధంబయ్యె నారూపమో।
భుజగాదీశవిరోధివాహన! సుధాం ♦ భోరాశివాసాస్వభ।
క్తజనార్తిఘ్న! నృసింహ! నాకిడుమనం♦తా! నీకరాలంబమున్॥
మ॥ శ్రితసంరక్షణ! యీభవంబనెడు కా ♦ ర్చిచ్చిప్డునన్నుట్టి వి।
శ్రుతమాభీతినిఁగొల్పు హేతులఁదనూ ♦ రుట్సంతతింగాల్చిబా
ధితకాయుంబొనరించెఁగావున యమి♦ ధ్యేయాభిదా! నిన్నుఁజే
రితి లక్ష్మీనరసింహా! నాకిడుముతం ♦ డ్రీ! నీకరాలంబముణ్॥
శా॥ నారావాస! భవంబునాఁబరఁగునా ♦ నాయంబునంజేరిదు।
ర్వారాత్మార్థములన్నగాలములఁగూ ♦ ర్పంబడ్డయర్థంబులం।
జేరన్ఖండితతాలుమస్తకమునై ♦ చింతించుమీనంబనో।
శ్రీరామేశ! నృసింహా! నాకిడుముపే ♦ ర్మిందవ్వత్కరాలంబమున్
మ॥ భయముంగొల్పెడు నీభవంబనుమదే ♦ భంబోసమస్తార్తిసం।
చయనీహారపతంగ! నాదయినవ ♦ క్షంబున్సమర్మంబుగా।
నయముందావిడివేగఁద్రొండమునఁబిం ♦ డంబొనటుల్సేయన।
వ్యయ! నింజేరితిఁగాననిమ్ము నరసిం ♦ హా! నీకరాలంబముణ్॥
శా॥ భూనాథా! యొకచోటనంధతనుని ♦ ర్మోదుండనై యున్ననా।
జ్ఞానాభిఖ్యధనంబునిందిృయముల ♦ న్సత్త్వాధ్యులాచోరుల।
త్యానందంబునదొంగిలించినను మో ♦ హాంధోరుకూపాంతర।
స్థానుంజేసిరికాననిమ్మునృమృగేం ♦ ద్రా! నీకరాలంబముణ్॥
మ॥ ఘనసంసారపయోధిలోనఁగడున్ను ♦ గ్రింబుంగరాళంబునౌ।
ఘనవక్త్రింబునువిస్తరించినను నీకామాఖ్యనక్రిమంబుమై।
త్రిని దామిృంగిరమేశ! రాగరసనో ♦ ర్మిణ బాధితుంజేసెఁగా।
వున లక్ష్మీనరసింహా! యిమ్మునుగుణ ♦వ్యూహా! కరాలంబముణ్

శా॥ శ్రీకాంతాధవ! పద్మనాభ! హరి! నీ ♦ రేజాతనేత్రా! సురా।
నీకేనా! మధుసూదనా! మురరిపూ! ♦ నిత్యప్రమోదాంతరా!
వైకుంఠేశ్వర! వాసుదేవ! కరుణా ♦ వార్ధీ! జగన్నాయకా!।
నాకారిఘ్న! నృసింహ నాకిపుమనం ♦ తా! నీకరాలంబముల్॥

మ॥ అనుచున్భక్తిని శంకరుండునుతిఁజే ♦ యంగాదయాంభోధియై।
సనృసింహప్రభుసత్కృపేక్షణముచే ♦ నాకిప్రకాండాస్యమం।
తనెశాంతింగనెనంత సంయమియునా ♦ ధాత్రీధరోద్గహ్వరం।
బునరాహ్వాస్యబిలంబునుండితుహినాం ♦ శుండట్లు తావెల్వడెన్

—♦శంకరుఁడగ్నినుండివెడలి మండనునింటికరిగి శారదనోడించుట.♦—

చ॥ చిరతరమౌ వియోగమునఁ ♦ జేసి వివృద్ధినెసంగుపేర్మిచే।
వఱలెడు శిష్యులెల్లరును ♦ వహ్నిముఖంబుననుండి వచ్చుశం।
కరయమిఁజుట్టిరప్పు సన ♦ కప్రదునార్య సనందనాదుల।
ట్లురహినెసంగు నయ్యమియు♦లోఁగనెమండనగేహగేహఁదాన్॥

సీ॥ చిరవియోగమునఁజే ♦ సి వివృద్ధమైన స్నే; హార్ధంబుతోన్గొప్ప♦
నట్టిశిష్యు। లందఱుఁజుట్ట స ♦ నందనాదులచేత; సంవృతుండై
నట్టి ♦ సనకయోగి। యట్టులనలరు సం ♦ యమిచంద్రుఁడగు
శంక; రుండు మండనమిశ్ర ♦ పండితావ। సధమునకునువేగఁ ♦
జననెంచి యాకాశ; పథమును గైకొని ♦ బయలువెడలి।

గీ॥ మునుకనినయా ద్విజావాస ♦ మునకునేగి। గళితకర్మాభిమాని
యు♦ ఘనతరవిష। యవిషవినివృత్తతర్షుండు ♦ నైన మండ। నా
ర్యుధర్మసతీసాహ ♦ చర్యఁగనియె॥

ఉ॥ మండనమిశ్రుఁడు న్గగన♦ మార్గమున న్మహికేగుదెంచు నా।
దండివరేణ్యునింగని ప్ర ♦ ధానసదంగముఁ బ్రశ్రయంబున।
న్నిండుగనొంచి యంజలిని ♦ నిత్యసుభక్తిని బట్టి పూజల।
న్మెండుగఁజేసియుండెనని♦ మేషనిజాక్షులఁ ద్రావువాఁడొనాన్॥

ఉ॥ సత్యవచస్కుఁడంచురు య♦శంబును గాంచిన మండనార్యుఁడా।
యత్యధినాథుపాదముల ♦ యందుఁబడె న్గృహము న్శరీరమో।

మర్త్యమరేశదేశిక! శ ♦ మప్రముఖార్హ్వగుణాకరా! సుధీ|
స్తుత్య! మదీయమంతయును ♦ జూడఁగనీదెయుటంచుఁదానొగిన్॥
గీ॥ మొదటఁ దనవిభుచేఁబూజఁ ♦ బొందియాస| నమున విబుధు
నితోనొప్పు ♦ యమివరేణ్యుఁ| జేరి వినయావనతమూర్తి ♦ యై
రుచిరవ| చనవిశారద, శారద ♦ యనియెనిట్లు॥ 30౨
గీ॥ ఎల్లవిద్యలకునునీవె ♦ వల్లభుఁడవు| సకలదేహులకార్య? శా ♦
సకుఁడవీవె| బ్రహ్మకధిపతియగు పర ♦ బ్రహ్మమీవె| శివము
భక్తులకిను సదా ♦ శివుఁడవీవె॥ 303
కం॥ మనసిజవైరీ! సభలో | ననుగెలువక యేతగమన ♦ నకలనె
ఱుంగ| న్ఘనయత్నంబానరించుట| మనుజకథానుసరణమె సు ♦
మా మహిలోనన్॥ 30౪
ఉ॥ ఈవు మమున్వివాదమున ♦ నిత్తఱిగెల్చుటచేత సిగ్గుమ|
మ్మావసుధాతలంబున య ♦ తీశ్వర! యేగతినావహించు ఛా|
యావిభుచేతనైన మహి ♦ తాభిభవంబెపుడేనినానె? తా|
రావిభు ముఖ్యదివ్య ♦ నికరంబునకున్వపులాపకీర్తికై?॥ 30౫
కం॥ మునునాకుఁగలుగుభామం| బునకుంజన నానతీయు ♦ ము బుధ
వరేణ్యా! | యనిపల్కు నుభయభారతిఁ| గని శంకయమియు
నిట్లు ♦ గానపుడనియెన్॥ 30౬

అవతారముచాలించియేగు శారదను శృంగగిర్యాదులందు శంకరుఁడు నెలకొల్పుట.

చం॥ ఎఱుఁగుదునేన్నునిన్ను జన ♦ నీ! విధికింబ్రియపత్నిఁగా మహే|
శ్వరుని సగర్భ్యఁగాఁగసువ ♦ చః ప్రచయంబునకాద్యయౌనధీ|
శ్వరినిఁగఁ జిత్స్వరూపఁగనె ♦ సంగియు విశ్వముఁబ్రోవనిందిరా
దిరుచిరమూర్తులంగని ను ♦ తింగనుమాతనుగాఁగభారతీ!॥ 30౭
గీ॥ జ్ఞానమాచేతనెలకొల్పఁ ♦ గాఁబడియెదు| శృంగగిరిమున్నుగాఁగల ♦
క్షేత్రములను| శారదాభిధవై కోరు ♦ కోరికలనొ| సంగుచు వ
సింపుము బుధులు ♦ సన్నుతిఁగని॥ 30౮

మ॥ అనుచుం బ్రార్థనచేయు శంకరునితో ♦ సారీతీ నొంగాకయం।
చునుదాఁబల్కి యమీంద్రుపీడ్కొనిపరం ♦ జ్యోతిస్స్వరూపంబునొ।
తనధామంబునకేగెభారతి; తదం ♦ తర్ధానమున్సభ్యులె ।
ల్లను నాకస్మికజాతముంగనుచుఁ జా ♦ లంజెందిరాశ్చర్యముఞ్॥
సీ॥ యతివరేణ్యునిచేత ♦ జితుఁడైన తనపతి; దగుయతిత్వముచేత♦
నైనయట్టి। వైధవ్యశోకంబు ♦ చేధారుణిందాక; నిసతిదానంత
ర్ధ ♦ నింగనుఁగొని। ఘనమోదముఁగనె మం ♦ డనమిశ్రుఁడును
సాధు; వగుదానినింగని ♦ యమివరుండు। సంతుష్టుఁడయ్యెనా♦
సభలోనిబుధులును; బలుతెఱంగుల నాపెఁ ♦ బ్రస్తుతించి।
గీ॥ రంత మండనమిశ్రుండు ♦ నపుడువిధివి। హితముగాఁగఁ బ్రజా
పతీ ♦ యేష్టిఁజేసి। ధనమునంతయునిడి ♦ యాత్మదహనునిల్పి।
యాయమింగొల్చెన స్తమి ♦ తాశుఁడగుచు॥ ౩౦౦

—♦మండనునియతింజేసి శంకరుఁడు సర్వసంశయములు వాపుట.♦—

గీ॥ అంత శంకరగురుఁడు స ♦ న్యాసగృహ్య। విధిని మండనబుధు
నకు ♦ విహితకృత్య। ములనొనర్చి భవధ్వంస ♦ మునకుసూచ
కమగు "తత్త్వమసీ" త్యు క్తిఁ♦ గఱపెఁజెవిని॥ ౩౦౧
గీ॥ బుధుఁడుసవిధిగ సన్న్యాస ♦ పూర్వముగను। భిక్షుగొనెనంతగురు
వరుఁ ♦ డాక్షితిసురు। నకునిగమవాళినిష్ఠమై ♦ నపరమాత్మ।
తత్త్వవాక్యమునకిటు ల ♦ ర్థంబుఁదెలిపె॥ ౩౦౨
ఉ॥ జాతినిరూపముంగని యె ♦ సంగుటచే నగుమేనుభాండపు।
న్రీతిననాత్మయైమఱి శ ♦ రీరమునాడనుమాటలోన నో।
భూతలదేవ! భేదమను ♦ భూతమెయాటనభేదరూపవి।
ఖ్యాతివిపర్యయోద్ధమగుఁ ♦ గావుననీవదికాదునమ్ముమీ॥ ౩౦౩
మ॥ అగుధాతాద్రిదులయట్లు సాధనములై ♦ యక్షంబులోసన్మతీ!।
తగురీతింగన నింద్రియంబులకు నా ♦ త్మత్వంబులేదార్య! నా।
దగునేత్రంబనుచో విభేదమదితా ♦ నొటన్నృషుష్ట్యాదికం।
బగుభావాళిని లేమిఁజేసిఘటసా ♦ ధ్యంబేయగుంజూడఁగఞ్॥

తుండురు కృపఁ బొ । ల్చిన మనమలరఁగ ననియెను । ఘనతర
సంశయము వాయఁ ♦ గానీరీతిన్॥ ౩౨౩

సీ॥ వినుమొక్క సాయాహ్న ♦ మున నొక్క వేషంబు; న నెసంగు
పురుషునిఁ ♦ గనిమఱునటి । దినమున నినజను ♦ దృష్టమందున
నన్య; వేషంబుచేఁ గడు ♦ భూషితుఁడగు । నాపూరుషునె
చూచి ♦ నప్పుడు గుఱుతెఱిం; గిన వాఁడతండితఁ ♦ డనుకొను
గతి । దేశకాలాదుల ♦ తెఱఁగులు మాఱుట; దోసఁగు వాచ్యా
ర్థమం ♦ దెసఁగియున్న ।

గీ॥ ననఘ! లక్ష్యార్థమది బాధఁ ♦ గనదు, గాన । మునుపెకడు
ధృతి నార్జించు ♦ కొనుటఁ జేసి । కర్మశతులకు వీడంగఁ ♦ గష్ట
మైన । దేహముఖమే నె యనెడుబు ♦ ద్ధిని విడువుము॥ ౩౨౪

గీ॥ ఘనవివేకాన నెసఁగు బు ♦ ద్ధిని సతతము । నాత్మభావనమునె
చేయు ♦ మయ్యదాన । భూరిదుఃఖదమైన సం ♦ సారబంధ ।
ములను విడిము క్తభావంబుఁ ♦ బొందెదీవు॥ ౩౨౫

గీ॥ ధ్వాంక్షగోమాయు వహ్నిసా ♦ ధారణమగు । మేన దుఃఖద
మైన పే ♦ ర్మిని విడువుము । విడుమటులె బైటఁగలయట్టి ♦
విషయమమత । ననఘ యవిశంకమతిఁ బర ♦ మాత్మనిడుము ౩౨౬

ఉ॥ తీరముఁనుండి యింకనొక ♦ తీరమునంజరియించు మీనమా ।
తీరముకంటె వేఱయిత ♦ దీయగుణంబుల నందకుండునా ।
తీరున జాగ్రదాదులను ♦ దేహిచరించుచు వానికంటెఁదా ।
వేఱగు వానిధర్మముల ♦ విద్వర ! చెందఁడుసుమ్ము నమ్ముమా ।

మ॥ సుమతీ! త్రాటిని గాంచి భ్రాంతిఁగనుచో ♦ క్షోణీతలచ్ఛిద్రదం ।
డ మహాశీవిషముఖ్యమే గతిని జూ ♦ డంగల్పితంబానో! భ్రాం
త మనస్కుండగు వానికాగతినె ని ♦ ద్రా స్వప్న జాగ్రన్ముఖం ।
బమరుం; గావున బ్రహ్మమైతివిఁక నా ♦ ద్యభ్రాంతినిన్వీడుమీ ॥

గీ॥ ప్రాజ్ఞ! ప్రత్యక్తమంబగు ♦ పరమపదము । బుధునకగుఁ జేరు
వగ దూర ♦ ముగ నదియగు । మూఢునకు లోనవెలిఁజిత్తు ♦
మొనసినను బ । యటవెదకి కానరేరహో! ♦ యాత్మమహిమ॥

గీ॥ పలువురొక్క సీరశాలలోఁ ♦ గలిసియుత్త। రక్షణమునందు భిన్న
మా ♦ ర్గముల నేగు। విధముగాఁ బెక్కుపేరుల ♦ వేశ్మములను।
బెరిఁగి దేహులు మృతినందు ♦ దురు చివరకు॥ ౩౩౦

గీ॥ పవలు రేయిని సుఖమును ♦ బడయఁజేయఁ। బడునది సుఖంబు
సుంతయు ♦ నిడదుదుఃఖ। కరమెయగుఁ గారణము లేక ♦ కలు
గదు సుఖ। మిలను హేతువునకునొండు ♦ హేతువుండు ౩౩౧

ఆ॥వె॥ ఒక్కమాటువినిన ♦ నోదవించుఁ బరిపక్వ। మతికి నాత్మ
మతిని ♦ శ్రుతివచనము। నిరతమందమతికి ♦ గురుపదాంబుజ
సేవ। నల్లనల్లననిడు ♦ నల్లదాని॥ ౩౩౨

కం॥ క్షితిఁబ్రిణ వాభ్యసన సమా। రితకృత్యముఁ జేయుటను
బ♦ రిస్ఫుట వినయా। న్వితమతి గురుఁగొల్చుట ని। ర్గతమగు
హృన్మలము; బోధఁ ♦ గనఁదగునంతన్॥ ౩౩౩

చం॥ పగలును రేయియున్ బరమ♦భక్తిని దేశికునందుఁ జిత్తమా।
నఁగవలయున్ బ్రిసన్నుఁడును ♦ జ్ఞానవిదుండును నైన దేశికుం।
డగ తనయావిభుండెయగు ♦ నాతఁడు తన్నతి భక్తిఁగొల్చురి।
మ్యగుణుని శిష్యునింగనున ♦ మండడ యాకలి తేక్షణంబునన్॥

గీ॥ కల్పలత యట్టులని జేష్ట ♦ కామితము ఫ। లింపఁజేయును గానఁ
బా ♦ లింప వలయు। గురుని యానతి; దానికి ♦ ధరనసాధ్య।
మేదియును లేదు సుమ్ము ప్రి ♦ మోదదమది॥ ౩౩౫

తే॥ గురువు సెప్పిన చొప్పునఁ గొలుచుతటని। దేవతా కృపకల్గమి
దిద్దునతఁడె। గురువెదయతప్ప దిద్దనా ♦ దరువెలేదు। కాన
నాతని నలిగింపఁ ♦ గాదెవండు॥ ౩౩౬

కం. చెడుగుడిగి తగిన నడవడిఁ। బడు జనుఁడు కృతార్థుఁడౌను
మతి బాగోగుల్। విడ వెడఁదగురుఁడెకఅపెడి। నడఁగ ననిష్టం
బునిష్ట♦ మందికకాఁగన్॥ ౩౩౭

తే. హితము గూర్చునుపాస్య దై♦వతమెయైనఁ। గొలువ వలెనెదో
తెల్పఁగా ♦ గురుఁడెవలయుఁ। గాని యెడ నెటనిష్టదుఁ♦డౌనతీంద్రి।
యునిఁ దెలియ నెట్టులజ్ఞున ♦ కొనర దెప్పుడు॥ ౩౩౮

గీ॥ గురుఁడు హార్షింప హార్షించు ♦ సురగణంబు । నతఁడు కోపించు
నెడరుష ♦ నందునదియు । నెపుడును సదాత్మ భావన ♦ నెదఁ
గనియెడు । నొజ్జయున్నను విశ్వమ ♦ యుండకాఁడె॥ ౩౭౯

చం॥ ఇటు పరమాత్మ తత్త్వమున ♦ హీనమనస్కుఁడు శంకరార్యుఁడు
త్కటమగు పేర్మితోఁ దెలుపఁ ♦ గావిని మండన మిశ్రుఁడంతవి।
స్ఫుటదయఁ బొల్చు మీ దయిన ♦ చూపును నా పయి దేశికాగ్ర్య
కొల్పుటఁ గృతినైతి నంచు యతి ♦ భూపతి పాదయుగంబునం
బడెన్॥ ౩౮౦

గీ॥ అతనికి సురేశ్వరాభిఖ్య ♦ నఖిలదిక్ప్ర । తీకృతప్రఖ్యఁ జేసె
య ♦ తిప్రవరుఁడు । జగతిఁ దుచ్ఛీకృత విధాతృ ♦ సౌఖ్యమైన
భాష్యకృన్ముఖ్యశిష్యతఁ ♦ బడసె నతఁడు॥ ౩౮౧

చం॥ ఇటుల సురేశ్వరాఖ్యను మ ♦ హింగని నిర్మముఁడౌచు నర్మదా
తటమున నొప్పునట్టిమగ ♦ ధ ప్రథితంబగు దేశమందు వి।
స్ఫుట సకలాగమాంతచయ ♦ మున్నతతంబును జింత సేయుచుం।
తట విధిలోక సౌఖ్యమునె ♦ దంగణుతింపకయుండె నాతఁడున్॥

మండనుని సురేశ్వరాచార్యుఁడు మగధనునిచి శంకరుఁడు వెడలుట.

సీ॥ ప్రణతబుధ త్రిక ♦ రణముల దండించి; చెలువుగ వర్తింపఁ
జేయువాఁడు । మణిపాళినెసఁగు భూ ♦ షణమట్లు సుగుణసం;
చయము చే సతతమొ ♦ సంగువాఁడు । కుమతంబులను వర ♦ న్యా
ములను క్తి కుఠార; ఖండితంబులఁ జేయు ♦ చుండువాఁడు ।
వరగుణ తచ్ఛిష్య ♦ పరివృతుండై యిట్లు; జితమండనుండయి ♦
చెలఁగువాఁడు।

తే॥ నగుచు శంకరయమివర్యుఁ ♦ డలరులగుమి । వఱలు మోదుగు
చెట్లపైఁ ♦ దిరుగు నళుల । మధురగీతంబుతో నొప్పు ♦ మహిత
వనముఁ। గనుచు వెడలెను దక్షిణ ♦ కాష్ఠగుఱిచి॥ ౩౮౩

తే॥ సనకసన్నిభుఁడైన యా ♦ శంకరయమి । పతి, మహారాష్ట్ర
దేశమం ♦ దతులకోశ । ములఁ బ్రచారముఁ జేయుచు ♦ నలరి
శమిత । కుమతుఁడై యంతనరిగె శ్రీ ♦ కుధరమునకు॥ ౩౮౪

మ॥ వికసత్కుందవన ప్రసంగలసదు ♦ ర్వీజాత సంగప్రశ।
స్తకనద్రమ్య సుగంధ గంధవహధూ ♦ తత్పోజసంఘుంబు మ
త్తకరి వ్రాతవధాతి శూరమృగనా ♦ థస్తోమమున్ సర్పరా।
ట్ప్రకరాచ్ఛాభరణప్రియంబునగుశ్రీ ♦ గ్రావంబుఁదాఁగన్గొనెన్
తే॥ కలికలుషభంగయు, గిరిస ♦ కాశచలత। రంగయును నధరీకృత
తుంగయునగు। ఘనరసాతలగామిగం ♦ గనువినేయ। వరుల
తోడుతమునై శం ♦ కరగురుండు॥ ౩౮౬
సీ॥ ప్రణతజనానీక ♦ పటుతరమోహాంధ; కారంబుఁబాపి యొ♦
ప్పారునదియు। నాదిత్యవర్త్మనా♦స్వాదించుచుండెడు; తుంగ
శృంగాళిఁజె ♦ లంగునదియుఁ। జూచెడుమనుజుల ♦ పాచితంబుల
నెల్ల; నిర్మూలములఁజేసి ♦ నెగడునదియు। స్ఫుటగతినుత్కట
రటనంబొనర్పుభృం; గములఁ బక్షులఁగడుఁ ♦ గ్రాలునదియుఁ।
గీ॥ కూలయుగరమ్యమైన పా ♦ తాళగంగ। చే ఘనమాశ్లిష్టమై
ప్రశ ♦ స్తిఁ గనినదియు। నైన యాశ్రీనగంబున ♦ యత్యతివ
రేణ్యుఁ। డెక్కి శివలింగముంగని ♦ యెనతిభక్తి॥ ౩౮౭

శంకరాచార్యుఁడు శ్రీశైలమున విడియుట.

మ॥ ఘనపాదంబునఁగాంచెశంకరుఁడు మో♦క్షప్రఖ్యసత్సంపదా
ర్జనుఁ బాదాబ్జనతార్జునుం బ్రణత సం ♦ సారాఖ్యదుర్బీజభ
ర్జనుఁగా మాది విరోధి షట్కఘనతా ♦ సంతర్జనున్మల్లికా।
ర్జును శ్రీభ్రమరాంబికాసచివుఁగా♦రుణ్యాబ్ధినార్యాధవున్॥
కం॥ తృష్ణాపహితయుఁ దట భూ। జోష్ణవినాశకయుఁ గార్ష్ణ్య
యోగాంతకయా। కృష్ణాధునిఘాతటమున। నిష్ణాతుండత్యు
నతఁడ ♦ నేకాశ్రిపుఁడై॥ ౩౮౯
మ॥ అతిచిత్రిచ్చరితుఁడంచితయశో ♦ వ్యాప్తాఖిలాశాంతుఁడా
శ్రితవిద్వ ద్విపులార్థదుండునగు నా ♦ శ్రీశంకరాచార్య స।
ద్యతివర్యుండటఁ దావసించి యతిర ♦ మ్యాంచత్పదానీకభా
సిత కోశాళిన సద్గ్రిహాంతమునకై ♦ చెప్పె నృధీరాజికిన్॥
చం॥ గురువరుఁడా సదాశ్రిపులఁ♦కుంజర శాస్త్రయయశ స్థిరస్ఫురితిం

దిరముగఁ జేయునానిగమ ♦ దివ్యశిఖావర భాష్యజాతము।
న్వరదయఁదెల్పఁబాశుపత ♦ వైష్ణవశైవులు గెల్వరాసురే।
శ్వరముఖులైన యాశ్రిపులు ♦ వారిజయించిరి వాదమందునన్।
ఉ॥ అందులఁగొంద ఱాత్మ్యమగు ♦ నట్టిమతంబుఁ బరిత్యజించియా
నందము తోడుతన్గ తస ♦ నాతనమత్సర మానదోషులై।
చెందిరి శంకరార్యునకు ♦ శిష్యతఁగొందఱు కోపవశ్యతన్।
బొందితదంతకాములయి♦పుచ్చిరికాలముఁగల్మషాత్ములై ॥ 3౫౨
సీ॥ కలుషాత్ములైన నీ ♦ చులు పల్కుపల్కుల, నిగమాంతములె
యని ♦ నిక్కుచుండి। తాముకల్పించిన ♦ నీమంబులనెవేద;
ముల నీమములుగాఁ ♦ దలఁచుచుండి। శ్రుతిశిఖా ప్రతిపాద్యు♦
నతిశుద్ధుఁ బరమాత్ము;నామ్నాయమార్గంబు ♦ నకట!తఱచు।
గాదహించుచును సా ♦ తాద్బ్రహ్మమై యొప్పు; శంకరునందు
నీ ♦ ర్ష్యా విశిష్ట ॥
గీ॥ బుద్ధిఁజేసెదు ఖలులెల్ల ♦ మున్నుకృష్ణు। నందుశత్రుత్వమతి
నూని ♦ నట్టిపౌండ్ర। కాభిధుఁడుఁ బోలెనీధాత్రి ♦ యందుఁ
జరమ। గతిని బొందకయేల సు ♦ స్థితులగుదురు ? ॥ 3౫3
మ॥ యతిలోకేశ్వర సూక్తి సక్తుల లర ♦ న్వ్యాధింగనెన్ గాణభు।
క్మత మెచ్చోటనొడాఁగెఁగా పిలము శ♦ ర్మంబు న్విడెన్ శైవమ
ర్మాత ముంగర్మపదంబు నందెఁగనె డా ♦ ర్గంబెన్నఁగాదుర్గతిన్।
క్షితిలో వైష్ణవమున్ సమర్థులయి ఘో♦షింౘ తెవ్వరంచద్దయన్॥

—♦ఒక కాపాలికుఁడు శంకరుని శిరమును దనకీయ నొప్పించికొనుట♦—

మ॥ ధృతిఁగాపాలికుఁడొక్కనాఁడుకననే♦తెంచెన్ స్వకీయోరుదో
• షతతిండాచియు సాధువేషమున భా ♦ స్వదీప్తి మందోదరీ।
పతియట్లొప్పఁగఁ దాల్చివేగముగనా ♦ పాతాళగంగాతట।
స్థితునిన్ సంయమి సార్వభౌమునమలున్♦శ్రీశంకరాచార్యునిన్
సీ॥ వశ్యేంద్రియాశ్వులా ♦ వరసంయములచేత; ననిశంబును విమృ
గ్యుఁ ♦ డైనవాని। గామోరు రోషాది ♦ కామితసంతతి;
కత్రాంతమునవశ్యుఁ ♦ డైనవాని। సిద్ధాంతసూక్తిప్ర ♦ సిద్ధం

బును బ్రిశస్య; మును నైన సద్భాష్య ♦ మును సుధీని! ధాను
తాశిష్యుల ♦ కానందమలరార; నుపదేశ మొనరించి ♦ యోగ
మూని॥

గీ॥ యమలపాతాళగంగా త ♦ టమున నేక। తమున నాసీనుఁడగు
వానిఁ ♦ గుమతవిపిన। నికరశాత కుఠారవా ♦ క్చయునియతి।
పతిని శంకరుఁగనిమోఁగా ♦ పాలికుండు॥ ౩౫౬

గీ॥ కనిముదంబంది చిరకాల ♦ మున కభీష్ట। మమరుసటులోన
నిర్ధార♦ ణమును జేసి। శిష్టు నిజలాభమునను సం ♦ తుష్టునియతి।
పతి గుఱిచి కృత్య శేషంబుఁ ♦ బలికెనిట్లు॥ ౩౫౭

చం॥ యమివర!సర్వవి త్త్వముద♦యాళుతయున్ ఘనశమా సుశీలభా।
వము మొదలైన యట్టియన ♦ వద్యములై తగుమీగుణంబుల।
న్విమలమతు ల్వచింపవిని ♦ వేడుకఁగూడిన మానసంబుతో।
మిముఁగననేగు దెంచితిన♦మేయమతీ!విదితప్రవృత్తినై॥ ౩౫౮

ఉ॥ ఈమహిలోన నీవొకఁడ♦వేసుమి మోహముఁదుంచిద్వైతవా।
క్యోనమము ధిక్కరించి కడు ♦ దూరముగాఁగశరీరమానము।
స్థిమహితా! యొనర్చి యతి ♦ నిర్మలమైన సదద్వయంబు నం।
దే మహిత ప్రమాణముల ♦ నెల్లను గూర్చినవాఁడ వెన్నఁగన్॥

చం॥ ఒరులకు మేలుచేయుకొఱ ♦ కూనితివీమెయి నెల్ల వేల్పులుం
దిరముగ నీయశంబునె ను ♦ తింతురు సంతతముందివంబునన్।
గరుణఁగటాక్ష వీక్షణము ♦ నందొలఁగించెదు సజ్జనార్తుల।
న్ధర నెవరీడు నీకు సత ♦ త ప్రియభాషణ! దీనపోషణా॥ ౩౬౦

కం॥ సుగుణాల యుండవగుటను। జగదేకేద్యుఁడవు సర్వ ♦ సంవే
దివిగా। నగళిత మానుఁడవు విజయు। వగుటంగళ హస్తితారి♦
వాత్మజ్ఞవరా! ॥ ౩౬౧

గీ॥ అఖిల శుభగుణ నిలయులు ♦ నైపరావ। రజ్ఞులగుమిమ్ముబోఁటి
వా ♦ రలను జేరి। పొందఁగారాని కామిత ♦ ములనయినను
బొందకూరక కార్యార్థు ♦ లెందుఁజనరు॥ ౩౬౨

ఆ॥వె॥ అనఘ! సర్వవిదుఁడ ♦ వైన నీవొనరించి। నఘనకార్యమును

గ ♦ ని ఘనకరుణు। డగు కపాలిఁదృప్తు ♦ నిఁ గఁ జేయయత్నించు।
నను గృతార్థుఁ జేసి ♦ కొనఁదలంతు॥ 323

సీ॥ ఈమేనితోఁ రాప్య ♦ భూమీధరముఁ జేరి యీశుతో విహరింప ♦
నెదనుగోరి। శతవత్సరములు దు ♦ ష్కర తీవ్రతపముల; శివుఁ
గూర్చి నేఁ జేయ ♦ శివుఁడువిపుల। మగుతుష్టిఁ గని యిట్టు ♦
లనియె నాతోఁ డుత; నామెప్పనకు సార్వ ♦ భౌముశిరము। నేని
సర్వజ్ఞుని ♦ డైనమూర్ధముఁ గాని; హుతవహునందు వే ♦ ల్చితివ యేని॥

గీ॥ సమరు నీకోరుకొని నపు ♦ మర్థమనుచు। నభవుఁ డంతర్హితుం
డయ్యె ♦ నంతనుండి। తాదృశశిరంబులంగొను ♦ తలఁపుగలిగి।
తిరుగుచుంటిని నాకవి ♦ దొరకవయ్యె॥ 324

గీ॥ లోకహితమునఁ దిరుగు ♦ దయాకరునినుఁ। గంటి సఖలజ్ఞ
దైవయో ♦ గమునవిప్పు। డింకనాయనుబంధ మ ♦ య్యెడు
నిజముగ। దర్శనాంతంబుగాదె బం ♦ ధము జనులకు॥ 325

గీ॥ సార్వభౌముని శిరమైన ♦ సర్వవిద్య। తివరుశిరమైననాదు సి ♦
ద్ధికి సుహేతు। వందు మొదటిది నామది ♦ కందరాదు। నీవె
యింకఁ బ్రమాణంబు ♦ కోవిదవర!॥ 466

చం॥ స్థిరమగుకీర్తి నీకెసఁగు ♦ శీర్షమొసంగినచోఁ ధరిత్రిను।
ద్ధురమగు సిద్ధిలాభమునఁ ♦ దుష్టియునాకగు మేనికున్నన।
శ్వరత గుణించి లోఁగడు వి ♦ చారముసుంబొనరించి యంతవి।
ద్వరనుత! యిచ్చవచ్చిన వి ♦ ధంబునఁ జేయుము చెప్ప నేటికిన్॥

గీ॥ స్వేష్ట దాయకమామెయి ♦ నెవరువీడ। రనుచు నేనెప్డుశీర్షంబు ♦
నడుగనొల్ల। నీరస విరాగయుతుల శ ♦ రీరమాను। లితరులకు
మేలుఁ జేయనూ ♦ నితిరిమేని॥ 327

గీ॥ ఆత్మఁ జిత్తంబు స్వార్థంబు ♦ నందుఁ గూర్చి। కొనినవాఁ డౌటని
తరార్తిఁ ♦ గనరు జనులు। వైరిఁ బరిమార్పనింద్రుండు ♦ వజ్రము
కొఱ। కై దధీచిది వెన్నెముఁ ♦ గైకొనఁడొకో?॥ 328

చం॥ ధరను దధీచిముఖ్యులగు ♦ ధన్యులు నిత్యముగాని మేనినిన్।
బరులనిమిత్తమైవిడిచి ♦ భవ్యము సర్వగతంబు సంతత।

స్థిరమును నౌయశ స్తనువుఁ ♦ జెంది జగంబులకెల్లనోయతీ।
శ్వర! పరితృప్తిఁగూర్చిర ని ♦ శంబునమూల్యలసద్గుణంబులన్॥

కం॥ పసులకు ముదమొనరుపఁ గొం । దఱు శాంతులు కరుణ
వఱలఁ♦దాల్తురు మేని। స్థిరనాబోఁటులునుందురు । కరుణా విరహి
తులు స్వార్థ ♦ కాంక్షులునగుచున్॥ ౩౭౧

గీ॥ ఈషణంబులఁ బాసి మ ♦ హిం జరించు । చుండు మీకుండ
దొండు ప్ర ♦ యోజనముష । రోప కృతితక్క నా
బోఁటు । లుర్విఁగామ ♦ పరత యుక్తమయుక్తంబు ♦ నెఱుఁగ
రకట॥ ౩౭౨

మ॥ తనదాజీవమునర్థికిచ్చెమును ను ♦ ద్యద్భక్తిజీమూతవా।
హనుఁడశ్లేయొసఁగెన్దధీచియనుము ♦ న్యగ్ర్యుండు వెన్నెమ్మునిం।
దుర్నకు స్వైరలపాయశూన్యయశముం♦దూర్ణంబుగానావిధూ।
డునళిన్యాస్తముఁ గాంచిరంచు విబుధే♦డ్యుల్ మీరలాలింపరే?॥

గీ॥ మేనుతాల్చిన బుధులకు ♦ నేనడిగిన। దతివినింద్యమున ప్రదే♦
యంబునగును। నైనవిజ్ఞాత పరమార్థు ♦ లగు విరాగ । యుతు
లకు నొసంగరాని దీ ♦ క్షితినిగలదె? ॥ ౩౭౪

చం॥ సకల సుధీవరేణ్యులును ♦ సంయమివర్య! వచించి రెల్లసా।
ధకులకు సిద్ధిఁగూర్పవసు ♦ ధాస్థలి నస్థలి తోర్థపీర్యమ।
స్తకమె పరిశస్తమంచును వి ♦ చారమొనర్చిన మీరెకాకనా।
కొకరును గానుపింపరు మ ♦ హోదధివేష్టిత భూతలంబునన్॥

ఉ॥ భూరికృపార్ద్రదృష్టినను ♦ బ్రోవుము శీర్షమొసంగుమీనమ।
స్కారమిదేయటంచుఁబద ♦ కంజములంబడినట్టివాని వి।
స్తారదయంగనుంగొని య ♦ తంద్రుఁడు శంకరమస్కరీంద్రుఁడీ
తీరుగఁ బల్కెవానిదగు♦దీనతఁజేతములాఁగఁగాఁబడన్॥ ౩౭౬

ఉ॥ హేయగమైన నీనుడిక ♦ సూయనుబొందను లేశమైననో
ధీయుత! తుష్టితోడుత మ ♦ దీయశిరంబు నొసంగుదున్మహా।
పాయవిశిష్టమీమనుజ ♦ పాళిశరీరమటంచెఱుంగు వి।
ద్యాయుతుఁడర్థ్యధీనముగ ♦ నంగమునుంగడు తుష్టిఁజేయఁడే?॥

గీ॥ మహితయత్నంబునను రక్ష్య ♦ మాణుఁడయ్యు। హానిఁగాలసమా
కృష్ట ♦ మైకనుమెయిఁ గానసీమేనను బరార్థ ♦ మైన యెడల।
నదియెనరునకుఁ బరమార్థ ♦ మగు నిజముగ॥ ౩౭౮

గీ॥ కానవోసిద్ధ విదుఁడ! యే ♦ కాంతమునస।
మాధినుండెదరమ్మ నీ ♦ మతముఁ జేయు।
దును బ్రకాశంబుగను శిరం ♦ బునిడనుత్స।
హింపనటుగాన విజనత ♦ నేకొనుమిఁక॥ ౩౭౯

చ॥ అనఘమదేక సంశ్రియులె ♦ యాటమదాశ్రవు లెల్లనిప్పుడెం।
చిన కృతి సుంతయేనిఁ దమ ♦ చేతములందు నెఱింగిరేనిహా।
నినిబొనరింతుఁరింతయును ♦ నిక్కవమీతనదైన మేనిఁబా।
యను నిజదేశికోత్తముని ♦ దాతనుహానికి నోర్తురేరిలన్॥

గీ॥ అనుచునిటువారు సంకేత♦మును బొనర్చి। రంతఁగాపాలికుండు
హృ ♦ ష్టాత్ముఁడగుచు। నరిగె శంకరుఁడును దన ♦ దైనధామ
మునకుఁజనిచెప్పఁడయ్యెలోఁ ♦ దనరుదాని॥ ౩౮౦

క॥ వైదికులగు శిష్యులు స్నా। నాదికములకొఱకు దూర ♦ మరు
గఁగఁ గరుణా। మేదురుఁడౌగురుఁ డంబుజ। పాదునిభీతిని వివిక్త
పదముననుండన్॥ ౩౮౧

సమాధినున్న యాచార్యశిరము ఖండింపఁ గాపాలికుఁడు తలపడుట.

ఉ॥ కేలఁద్రిశూలమున్ గొనుచుఁ ♦ గీకటుఁడై భసిత త్రిపుండ్రము
న్ఫాలమునందు దిద్దినృక ♦ పాలమయంబగు మాలఁదాల్చికం।
కాలచయంబుచేఁ దనదు ♦ కాయము నెల్లనలంకరించి కా।
పాలికుఁడంతవచ్చె యతి ♦ వర్యుని చెంతకుముందుచూచుచున్

మ॥ కరము న్భైరవమూర్తియై పరఁగునా ♦ కాపాలికుంగాంచిశం।
కరుఁడంతందనదైన మేనిని విడం ♦ గాలోనఁగాంక్షించితాఁ।
గరుణానీకమును న్సమాహితమనః ♦ కంజుండునై సంహరిం।
చిరహింసాత్మఁబరాత్మయందునను గూ♦ర్చెందాఁబరార్థార్థియై

సీ॥ జతుప్రదేశమునందు ♦ నత్రస్తుఁడైచుబు; కంబును నిల్పి ముఖ;♦
ఖంబు నెత్తి। జానుదేశముల ను♦ త్తానంబులగు హస్త; ముల

నుంచి సగముక♦న్నులను దెఱచి। నాసికాగ్ర నిరీక్ష♦ణ మొనర్చు
వానిని; సిద్ధాసనమున శే ♦ షిత విబోధ। మాత్రుఁడై యుంచి
చి ♦ న్మాత్రంబున హృషీక; వర్గంబునుంచి వి ♦ శ్వంపు సర్గ।
సీ॥ మునుసమాధిని మఱచి య ♦ మూల్యసౌఖ్య। మునదివంబునం
నిరసించు ♦ బుధసమర్చ్య। యోగివర్యుని సనకాది యోగిస
ముని। శంకర యమీంద్రునిం గనెఁ ♦ బంకిలుండు॥ ౩౮౭
గీ॥ స్వమతి పూర్వార్జితోరుదో ♦ షసము పేతుఁ। డైన యానీచుఁ
డును శంక ♦ నవలఁద్రోసి। ఖడ్గముంగొని శంకరుఁ♦ గని వధింప।
దగ్గఱకు వచ్చునపుడె ప ♦ ద్మ పదుఁడెఱిఁగె॥ ౩౮౮
చం॥ అమలుఁడు పద్మపాదుఁడు య ♦ తాత్మని శంకరదేశికుం
డిరిశూ। లముఁ బయి కెత్తి చంపఁగఁద ♦ లంచెడు పాతకినా
కపాలిఁగాం। చి మిగులదేశిక ప్రియముఁ ♦ జేయఁదలంచెడు
వాఁడు గానఁగో। పముఁ గడునందితా నచట ♦ భాసిల్లెఁబ్రే
జ్వల దగ్నికల్పుఁడై॥ ౩౮౯

పద్మపాదునుండి నృసింహాకృతి వెడలి కాపాలికుంగడతేర్చుట.

మ॥ పరమంబౌ నృహరదా ర్ఢి భంజకమునుం ♦ బ్రహ్లాదవశ్యంబునౌ
నరహార్యత్వు నిద్రైన సన్మహిమ దూ ♦ర్ణంబౌగతి న్వారిరు।
ట్స్ఫురణుండా వర మంత్రసిద్ధిఁ గనుట ♦ న్సద్భక్తి నంతస్స్థాదం।
బురుహాంబందుఁదలంచిమానవహరిం ♦ద్రుండయ్యెఁదాన త్తఱిన్
చ॥ తనదుసటాచయంబుజల ♦ దప్రభయాంబున్నుగమ్ముచుండఁబూ
తనిచయమెల్లఁ దీవ్రనిన ♦ దంబునభీతిఁగనంగనుద్రియం।
బున సకల ప్రజాప్రతతి ♦ మూర్ఛనుగాంచఁగనేమొకోయిదం
చును సురలాకులాత్ములయి ♦చూడఁగనెంతయుదుర్నిరీక్ష్యుఁడై॥
గీ॥ అతివివృద్ధస్వమన్యు వి♦ స్మృతమనుష్య। భావుఁడును దత్క్షణత్యు
బ్ధ ♦ పటునిజస్వ। భావుఁడును నత్యుదగ్రన్మ ♦ పంచవక్త్రి।
భావుఁడును నొంచు నుఱికెఁగా ♦ పాలికుపయి॥ ౩౯౦
శా॥ అంభోధుల్కడుక్షోభముంగవఁగరౌ ♦ ద్రాకారమొప్పారఁగా।
నంభోదాధ్వముఙారనద్రినిచయం ♦ బాకంపముం జెందఁగం।

గుంభిన్యగ్రముసంచలింపఁగ జనా ♦ క్షుల్బ్రంశముంజెందఁగ
స్సంభీతిక్షణదాచరాదులఱవ ♦ న్సర్వాశలున్మ్రోండఁగన్॥

మ॥ ఉరువేగంబునఁబైకిదూఁకి శతకో ♦ ట్యుగ్రంబునా నైజస।
త్కరజాగ్రక్షిప్తత్రిశూలుఁడగునా ♦ కాపాలికుంబట్టిభీ।
కరుఁడైవానియురంబుప్రచ్చె మునుర ♦ క్షస్సంచయాధీశువి।
స్తరవక్షంబును వచ్చినట్లు సురసంతానస్తుతుల్పర్వఁగన్॥ ౩౯౨

గీ॥ అబ్జపదుసందు నావిష్ణుఁ ♦ డైన నృహరి। యట్లు భయదోగ్రసిం
హుఁడై♦యాదురీహు। దేహమును దంష్ట్రలనుగ్రుచ్చి♦దివిజపట్టి।
ణాట్టములఁగూలఁజేసెఁదా ♦ నతిహసితము॥ ౩౯౩

ఉ॥ ప్రాకటమైన యాధ్వనిని ♦ బాహ్యగతుల్విని యందఱన్గడున్
వ్యాకులచిత్తవృత్తులయి ♦ యాతురతంజను దెంచి కాంచిర।
వ్యాకులచిత్తుఁడైన గురు♦ వర్యుని దత్సవిధంబునన్మృతుం।
డైకనిపించు భైరవుని ♦ నాత్తనృసింహరయున్ననందనున్॥

గీ॥ అంత నామర్త్య సింహుఁడ ♦ జాండభాండ। మును దనదుభూరి
తేజంబు ♦ ననువిదళిత। ముగ నొనర్చుచు గర్జించె ♦ భూరిగతిని।
బ్రతిరవంబెల్ల దిక్కుల ♦ బ్రబలు నటుల॥ ౩౯౪

ఉ॥ పాటిలు స్వాత్మబోధనుద్యుప్ర♦సాధులను న్మధియించి శాత్రవో
చ్చాటనఁజేసి యొప్పెసఁగు♦శంకరసంయమివర్యుఁడుందదా।
ర్భాటచలత్సమాధియయి ♦ పద్మదళంబులఁబోలు కన్నులం।
గాటపువేడుకందెఱచి ♦ కాంచెఁగరాళముఖు న్నృసింహునిన్॥

సీ॥ చంద్రాంశు సమసటా ♦ జాలజటాలు భాస్వన్నయనాంబుజ♦
వన్నిటాలు। నుద్యదర్కి సహస్ర ♦ సుద్యుతిభాసు వి; ధ్యండ
విస్ఫోటకృ♦దట్టహాసు। కరజనిర్భిన్న భీ ♦ కర భైరవోరస్థ; లో
చ్ఛలద్రుధిరసి ♦ క్తోచ్చరీరు। గళవైజయంతీసు ♦ కౌస్తుభ
సంస్పర్ధి; కాపాలికాంత్ర మా ♦ లాపరివృతు।

గీ॥ సురదితి తనూజవిత్రాస ♦ కరసుఘోరతర నిజాకారవివ్యధి♦
తజగ దండు। నిరత దంష్ట్రాకరాళాస్య ♦ నిర్యదగ్ని। కీల సం
లీఢగగను యో ♦ గి వరనుతుని॥ ౩౯౫

సీ॥ నిజరోమ కూపవి♦నిర్గత విస్ఫులిం; గముల దీపించు లో♦కముల
వాని। జృంభిత జంభారి ♦ శంభుదంభ స్తంభ; నారంభరద వేషుఁ
డైన వాని। లయమునకిద్ది కా ♦ లముగాదు కోపంబు; నుపసం
హరింపుమీ ♦ వో మహాత్మ। యనుచు ససాధ్వసు ♦ లును
గృతాంజలులును; నతను కంపులునైన ♦ శతధృతిముఖు॥
గీ॥ లైన దివిజులచే నర్ఘ్య ♦ మానుఁడైన। ఘనుని విద్యుచ్ఛలోగ్ర
జి ♦ హ్వు; నరసింహుఁ గాంచి మోదాశ్రులఁబినద్ధ ♦ కంఠుఁ
డగుచు। యతినరుఁడు చెంతగత భయుం♦డై నుతించె॥ ౧౯౮

శంకరాచార్య కృతనృసింహస్తవము

ఉ॥ ఓనృహరీ! యనర్థదము ♦ నుగ్రముసౌరుష సంహరింపుమీ।
ఘూనికతోడఁ దావక రి♦పుండు హతుండయి ధాత్రినున్నవాఁ
డీ నిఖిల ప్రపంచమున ♦ హీనభవదుగ్రషనయ్యె భీతమై।
కానసనాతనంబునధి♦కంబునుసౌదయఁగొల్పునాథయీ ౧౯౯
చ॥ నరహరి నీదు మేనిసుమ ♦ నస్కులు సత్త్వగుణాఢ్యమంచుఁజె।
ప్పిరి కద కోపమించుకయుఁ ♦ బృథ్విని నీకుచితంబుగాదుగా।
న రుచిరశాంతిఁ బొందుము ఘ♦నంబగు శర్మములోకమందఁగా।
హరివగునీవునాహరుని♦దాగుణమున్వహియించితెట్లుగన్ ౨౦౦
గీ॥ సకలభయముల యందు ని ♦ న్నకలుషమతిఁ। దలఁచు పురు
షుండు భయములఁ ♦ దొలఁగి సుఖియగునన నేమందు ? మీ
దు ద♦ర్శనమగునెడఁ గానదుర్లభమే మిముఁ♦గనుటదేవ॥ ౨౦౧
కం॥ మనమున మీపదకంజం। బును దలఁచినవాఁడు మృతిని ♦
బొంది విముక్తిన్। గనుననిన మీకరాభిహ। తిని మృతుఁడగు
నితఁడు భవముఁ ♦ దిరిగియుఁ గనునే॥ ౨౦౨
ఆ॥వె॥ అత్యుదార గుణుఁడ ♦ వై నీవు వ్యసనార్తి। తుని హిరణ్య
కశిపు ♦తనయుఁబోచి। త్రివి, సమస్తగతను♦ దితిజుండువలుకఁగ।
స్ఫుట ముదానిజేయ ♦ ముందెసఁగితి॥ ౨౦౩
సీ॥ అజ!రజోవృతుఁడవై♦ సృజియింతువని శంబుసకలమౌనీప్రపం♦
చంబు దేవ। స్థితి విధియందున్ను ♦ ద్యత మహాయుధుఁడవై

పోఁ్రిచెదు సత్త్వంబుఁ ♦ బూనిదాని। సంహారమునఁదు ♦ సం
ఙ్ఞుండవై తమో; గుణమున నఖిలంబు ♦ నణఁచెదీవు। జగదను
గ్రహణార్థ ♦ మగు జన్మగుణములు।గాని; నీకవియుని ♦
కృ మగు లేవు।

గీ॥ దేవనీయు పదంబు పా ♦ గ్యావములకు। నతిశయించి చెలంగు
దా ♦ ననవరతముఁ। బాఁ్రిజదువులెల్లనో యోగి ♦పూజితపద।
చకితములయి నినుందెల్ప ♦ జగములోన॥ ౪౦౪

శా॥ నీచేతన్విగతాసుఁడయ్యెఁగద యా ♦ నీచుండు తాఁగాననో।
వాచాగోచర! సంహరింపుము రుష ♦న్వర్ణ్యాభయంబుంగృపా।
శ్రీచెన్నారఁగనిమ్ము విశ్వమునకు ♦ న్బృందారకుల్వీరెనీ।
డాచెల్వొంగని భీతులై శమముఁదా ♦ రక్షించుచున్నారిటన్॥

ఉ॥ హీనజనాళికి న్భవద ♦ హీనదయంగనఁ గా నశక్యమాఁ।
గాననెకోటి శంపలను ♦ గాదనిపొల్చెదు నీదుమూర్తినో।
మానవ పంచవక్త్రి! పర ♦ మ ప్రథితా! యుపసంహరింపుమ।
న్యాన! యతీతసీమయయి♦యొప్పతి్రిలోకిని బ్రోవుమి త్తతిన్॥

శా॥ కల్పాంత ప్రవిజృంభితాంబుధర సం ♦ ఘాతస్థదంభోళిజా।
నల్పారావగ గర్వనాశక మహా ♦ ర్యుత్క్రీడ దుర్ఘోణిపా।
నల్పఘూర్ణపుటోరు రంధ్రయుగని ♦ ర్యద్ఘోరఘూర్జారవా।
నల్పంబౌభవదట్ట హాసము నృహా ♦ర్యత్యామమముం బ్రోఁచుతన్॥

సీ॥ ప్రళయ కాలమునందు ♦ గళితకారుణ్యుఁడై; జృంభించి నటి
యించు ♦ శంభునిదగు। ఫాలాక్షమండలి ♦పావకజ్వాలల; నా
లీఢమైనట్టి ♦ యఖిలలోకములఁ బుట్టినట్టి య ♦ ద్భుతమహా
భయారావ;మును ధిక్కరించుచు ♦ప్పొగనినదియు! బ్రహ్మాండ
భాండోద♦రకుహరమధ్యమం;దలియనేకాంత్యదు♦స్థమగునునికి

గీ॥ కగ్నిరూపమౌచు ♦ ననవరతంబొప్పు।
నట్టి శ్రీనృసింహు ♦ నట్టహాస।
మిదివినుత్యమగుచు ♦ నేనొనర్చినయట్టి।
దురితములను దొలఁగఁ ♦ ద్రోంచుఁగాత॥ ౪౦౫

చ॥ నియతుఁడనౌచు నుండఁగవ ♦ నేచరబాలుఁడొకండువచ్చియే।
లయమివ కేణ్యదేనినో త ♦ లంచుచునొంటరివౌచునిచ్చట।
న్భయమును వీడియుండెదవు ♦ బాగుగఁదెల్పుమటన్నవానిడా।
నయమునుగాంచి విస్మితమ ♦ నస్కుఁడనైయిటులంటివానితోన్

కం॥ కంఠమువఱకు నరత్వముఁ। గంఠీరవరూపమవలఁ ♦ గల మృగ
మును నుత్కంఠమున నివ్వనమునన। కుంఠితగతివెదకెద దొర♦
కొనదదినాకున్॥ ౪౧౫

మ॥ అనినేఁబల్కుచునుండ నవ్వనచరుం ♦ డాకాననాంతంబునం।
దునఁదాఁజొచ్చి నృకేసరిన్ దృఢలతా ♦ స్తోమంబునంగట్టివెం।
టనగణ్యంబగుపుణ్యసంచయముచే ♦ నామ్రోలికుందెచ్చియుం
చిననేనానరసింహదేవుఁగడుఁ దుష్టిన్భక్తి సేవించితిన్॥ ౪౧౬

గీ॥ దేవదేవ మహర్షుల ♦ భావములకు। నైనఁదోఁపనినీవెట్లు ♦ కానన
చరు। నకు వశుఁడవైతి వనుచు వి ♦ నయమెసఁగఁగ। నేనడుగ
నిట్లుచెప్పెనా ♦ నృహరినాకు॥ ౪౧౭

మ॥ ధరనేకాగ్రమనస్కతన్వఱలి యు ♦ ద్యద్భక్తితో నీవనే।
చరబాలుంబలెఁ బూర్వులైన జలసం ♦ జాత ప్రభూతాదిని।
ర్జరులెవ్వారును బూర్వమెన్నఁడునువ ♦ త్సా నన్నుధ్యానింపరై।
రరహింగాన నుపాలభింపకుము ని ♦ ర్విణ్ణాత్ముఁడవై వినిన్॥

క॥ అనియిట్లుతెల్పిభూరిద।యనునాపైఁబఱపెనృహరి♦యంతర్ధానం।
బునుగనెననిజలజపదుం।డనవినిమోదరసమగ్న♦లైరందఱటన్॥

ఆశ్వాసాంతము.

కం॥ యక్షేశమిత్ర! దితిజజ। నక్షయకర! భక్తరక్ష ♦ ణప్రియ! ఘన
మే। రుక్షితి ధరకార్ముక! నిట। లాక్ష! మహాయోగిమాన ♦ సా
వాస! శివా! ౪౨౦

స్రగ్విణి॥ భూరికారుణ్య వి ♦ స్ఫూర్జితాపాంగ! సు। స్మేరరమ్యాస్య
రా ♦ జీవ! జీవస్వరూ। పా! రమేశాంబకా! ♦ పర్వతాపత్య
హృ।త్సారసానందకా! ♦సర్వలోకాధికా!॥ ౪౨౧

శా॥ సర్వామ్నాయశిఖావిమృగ్యపదకం ♦ జా! కంజసంజాతదు
ర్గర్వాధిక్యతిరస్క్రియాకరణ ద ♦ క్షా! దక్షిణామూర్తిరూ
పోర్వీదేశికవర్య! వర్యమునిరా ♦ ట్పూర్యధాశ్రీమోదంచదం
తర్వీద్యావసథా! సదాశివ! శివేం ♦ ద్రా! మోహినీపూర్ధవా!॥

గద్య॥ ఇది శ్రీమద్భమిడిపాట్యన్వయ… … … వేంకట
సుబ్రహ్మణ్య శర్మాభిధేయాంధ్రీకృతంబైన
శ్రీశంకర విజయమందు సప్తమాశ్వాసము



# శ్రీ శంకర విజయము

## అష్టమాశ్వాసము.





ఫలదళార్చ్య! నిగమశి।
ఖాఫణిత విమృగ్యపాద కంజ! సమర్చా।
సాఫల్యద! గజదితిజా।
రీ! ఫణిభూషణ! మహేశ! శ్రీసకలేశా!॥

ఆ॥ వె॥ అవధరింపుమంత ♦ నయ్యతి సార్వభౌ। ముండు సకలతీర్థ♦
ములవినేయ। సంచయంబు వెంటఁ ♦ జనుదేరఁ జరియించెఁ।
గరము వేడ్కమదిని ♦ గడలుకొనఁగ॥ ౧

శంకరాచార్యుఁడు గోకర్ణేశుని దర్శించుట.

సీ॥ ఘోరకలినుండి కాపాడు ♦ కొనఁగఁబడిన। ధర్మమార్గంబు చేఁ
గడుఁ ♦ దనరు నదియు। నంతికచలత్పయోధిర♦ యము కలదియు।
నైన గోకర్ణమున కంత ♦ యతిపతిచనె॥ ౩

చం॥ అనిశము విశ్వనాట్యమున ♦ కద్భుతసూత్రధరుండు నంబుజా।
సన జలజాక్షముఖ్యసుర ♦ సంచయవంద్యుఁడు నర్ధవామభా।
గనియత కామినీకుఁడును ♦ గామముఖార్యవలేపభంజకుం।
డునగు మహేశునింగని యి ♦ ట్లువినుతించెఁ గృతప్రణాముఁడై॥

సీ॥ వాదిదముతోడ నొకటన ♦ ద్వైతవాద। పుం జెలువుఁగాంచి
వేఁడొక్క ♦ టంజపల ల। తా సుసాధిత జలదైక్య♦ తా సమర్థ।
నా గురుత నొప్పు శివుమేని ♦ నేగణింతు॥ ౪

చం॥ సుమహిత వామదేహమను ♦ క్షోణిజనించిన యంశుహాసనం।

ఘమునఁ జెలంగుచుండెడు మృ♦గంబుననొప్పెడుదక్షిణాంపుహ।
స్తమున నెసంగి, దక్షిణాల ♦ సత్తనుభాకలమాగ్ర భక్షణో।
త్కమగుశుకంబునన్యకర ♦ కంజమునంగొను తేజమే నెకా॥ ౭
కం॥ మలపట్టి యఱుతఁగలమం। గళసూత్రమెవని గళస్థ ♦ గతమున
కుంతా। తులశక్తిఁగఁజేసెనో, యా। విలసన్మహామేనె తైవ♦
విధమునన్ తిరిగ్॥ ౮
మ॥ అని యీరీతిగుణత్రయాతిగ సుధీ ♦ శావాప్య, గోకర్ణనా।
ధుని నాకూన్ప్రచయంబుచేతనపుడెం ♦ తో భక్తినర్చించిమూఁ।
డునిశ ల్తాఁదిజగత్పవిత్రమయి దీ♦టుంగాంచకున్నట్టి యా।
ఘనపుణ్యస్థలినుండె శంకరయతి ♦ తన్మోభక్తశిష్యాళితోన్॥ ౯
గీ॥ అంతఁదీర్ఘప్రవాసియౌ♦ నాయతీందుఁ। డరిగె వైకుంఠ కైలాస♦
వరసురూప। వహమును నతాఘహారము నై ♦ నహరిశంకరాఖ్య
దివ్యస్థలంబున ♦ కచిరగతిని॥ ౯
గీ॥ భేదవాదుల భ్రాంత్య ప ♦ నోదము కొఱ। కద్వయపు ముద్ర
నిలలోననగ♦ పఱచెడు। హరిహరుల భక్తిఁగొల్చి శం ♦ కరుఁడు
ద్వ్యర్థ। లగు వచనముల నవ్వారిఁ ♦ బొగడెనిట్లు॥ ౧౦

ఆచార్యకృత హరిహరస్తుతి.

ఉ॥ సోమకలావిలాసమును ♦ శుద్ధముఁ బాపవినాశకంబునా।
నాముని సంచయేక్ష్యమున ♦ నాదియు వంద్యము నైననైనవి।
ఖ్యామిత తేజముంగొని ను ♦ హోద్యుతిగోకలనంబొనర్చుని।
ష్కామవిమృగ్యుఁడౌవిభుఁడ♦ఖండసుఖంబులమాకొసంగుతన్
గీ॥ మంథరాగంబునూని య ♦ మర్త్యులనమృ। తాదులనొసర్చెఁ
దా నవి ♦ షాదియగుచు। నెవఁడు భూధరలీలోఁచి. తవిమలతను।
నైనయవ్వేల్పు స్వదయనా ♦ నైననిడుత॥ ౧౨
కం॥ క్షితి హృదయోల్లాసకమా । ప్రితిభందీపింపఁజేయ ♦ భద్ర
వరాహిా। శితృవిగ్రహుఁడగు విభునకు। సత మస్తమయాబ్జ
సామ్య ♦ శయుఁడనగుదు నేన్॥ ౧౩
శా॥ ఏదేవుండు స్ఫురద్విషద్గజవధ ♦ న్నైలాగతింజేసెని।

త్యోదంచత్కరుణారసాకరుఁడునై ♦ యుత్కసరిత్కుండునై।
యాఁడీవ్యర్ధనకేశునింబరము స ♦ ర్వారాధ్యుఁ బ్రాచీనుఁ బ్ర।
హ్లాదోల్లాసకు సంస్తుతించెదము పం ♦ చాస్యన్లసద్భక్తితోన్॥

గీ॥ ధాత్రిబల్యాహరణరతిఁ ♦ దానవామ। నతఁగొనివహించె నెవఁడ
జి ♦ నంబును, దప। ములను గాంతారహితుఁడయి ♦ పొనరి
చె నెవఁ। డాశ్రములకాద్యుఁ డతఁడో ము ♦ నవిశముమము॥

మ॥ అధికోద్యత్తర వారిమైన యెవఁడు ♦ ద్యత్సంగరంబందుఁదాఁ।
బ్రఖితాస్త్రజ్ఞవరేణ్యు నర్జునునిఁ దూ ♦ ర్ణంబాగతిం గెల్చెనో?।
విధువిభ్రాజితుఁడున్నరేద్యుఁడునుసం ♦ విద్రూపుఁడౌనాదయా।
నిధిచేనిఫ్రుసనాథభావమును గం ♦ టిన్ముక్తబంధుండనై॥

మ॥ కననాళీకభవంబునై వెలయుద ♦ క్షంబైన ధామంబుచే।
తను వేగన్దశవక్త్రుఁ గాముకువిరో ♦ ధగ్రస్తునిన్సంహరిం।
చిన దేవుండు ధరాత్మజాకుచములం ♦ జెన్నారు నుష్ణంపుసా
క్షినితాంతాత్మ సుఖానుభూతినిడుతం ♦ జెల్వొదయన్మాకిలన్

ఉ॥ హాలహలంబుఁగైకొనియు ♦ నగ్ర్యగళంబున నొప్పువాఁడును।
త్రాఱ సుకేతుఁడుంబరమ ♦ ధర్మమయుండును రోహిణీశు చే।
నోలివిచుంబ్యమానమయి ♦ యొప్పెడుమౌళినెసంగు నాదయా
శీలుఁడు మమ్మునోముతన ♦ శేషసుధీనుతుఁడెల్లకాలమున్॥

ఉ॥ ఆకలితాహితాపుఁడయి ♦ యంకమునందు వినాయకుండు దాఁ
బాకటభంగిఁగూర్పఁగ శి ♦ రస్థలమందుఁ గలాపభూషయొ।
ప్పైకడువేడ్కఁగూర్పఁగఁ ♦ బ్రహర్షమునొందుచునెప్డుఁబూతనా
మాకలనైహికప్రియము ♦ మాయుతభూమమునుమమ్మునోముతన్

గీ॥ విదితసర్వజ్ఞ భావంబు ♦ మదనజయియుఁ। దఱచుగఁ గ్రతుద్వి
షత్కృతా ♦ దరముఁ జేర్మి। కేకసీమంబుఁ బరమ బో ♦ ధైకధామ।
మునగు భూమంబుఁగనఁ జిత్త ♦ మునఁదలంతు॥ ౧౦

గీ॥ సకల జనముల చిత్త వి ♦ షయము దాఁటి। వెలుఁగునదియుఁ ద
మంబును ♦ దొలఁగఁజేయు। నదియు సద్వాసకృత హృద ♦ యం
బునునగు। భూమమునకేనమశ్శత ♦ ముంబొనర్తు॥ ౧

ర్వాది దీప్తుల రవిచంద్ర వహ్నులను దూ ♦ ర్ణంబొగతింజొచ్చికొ।
ల్పుదివారాత్రుల నందులోకముల కా ♦ లోకంబు నెక్కాలమున్॥

గీ॥ దేవి! యావాహనాసనా ♦ దికము లైన। యఱువదియునాల్గుభేద
ము ♦ ల రహిమీఱు। నట్టి యుపచారముల చేత ♦ ననిశమంత।ర
మున నీసేవఁ గావింతు ♦ రు మహితులిల॥ 30

శా॥ అంబా నీకు ముదంబొనర్పఁగ విశు ♦ ద్ధాజ్ఞాను చక్రంబులం।
దుంబత్రింబుల వేయిటం జెలఁగున ♦ ర్ణోజంబునన్ధన్యవా।
రంబాయర్వదినాల్గు సేవల నహో ♦ రాత్రుల్మహాభ క్తితో।
డంబూజించును వేఱువేఱుగ నిరా ♦ టంకంబుగా నెప్పుడున్॥

ఉ॥ ప్రాకృతుఁడంబ! తావక స ♦ పర్యనొనర్చెడుఁదా బహిస్థనలి।
స్థికలితుండు మధ్యముఁడు ♦ నింగొలుచున్బహిరంతరంబులం।
బ్రాకటభంగిను త్తముఁడ ♦ నారతమున్నినుఁ గొల్చులోననీ।
యేకతయందె సక్తులయి ♦ యేమియుఁ జేయరిలన్మహో త్తముల్

గీ॥ కలవు ముప్పదియెనిమిది ♦ కలలువాని। లోనబోధినీముఖ్యంబు ♦
లైన యైదు।నగు నివృ త్తి ప్రధానంబు ♦ లంబ! బంధులువాని
పై నొప్పునీపదా ♦ బ్జముభజింతు॥ 33

చం॥ జగముల నన్నిటన్లయక్రి ♦ శానునిరూపమున న్గ్రహించి పొ।
ల్పుగ నమృతాకృతిం దడిపి ♦ భూధరరాట్తనయా! సృజింతువీ
జగములనా సుధాకృతినె ♦ సత్కృపఁ బ్రోచెదవట్టినిన్ను హే
చ్చుగనుతిఁ జేయువారగుదు ♦ రంబ! సృజించెదునట్టివారలై॥

ఉ॥ హైమవతీ! గురూత్తముని ♦ దానుడిచేమును జ్ఞాతవైనని।
న్నామెయెయైతి నేననుచు ♦ వంచితమైన సమాధియోగవి।
ద్యామతిఁ బ్రత్యభిజ్ఞకు మ ♦ హావిషయంబుగఁ జేయు ప్రత్యభి।
జ్ఞామతసారవేదులని ♦ శంబు కృతార్థతఁగాంతురిమ్మహిన్॥

శా॥ అంబా! హైమమునుంజతుర్దళమునా ♦ నాధారచక్రంబునం
దుంబొల్పారెడు షడ్దళంబులను నెం ♦ తోవిద్రుమాభంబ్రకా।
శింబూర్ణంబుగనంది యొప్పెసఁగుస్వా ♦ ధిష్ఠానమందైహికా।
ఘంబుం బొందఁగఁ గోరువారుకొలువుం ♦ గావింతు రీకుండగన్

గీ॥ దశదళంబులనొప్పి యో ♦ తల్లి! ధూమ్రి। వర్ణమా మణిపూరక
వరరథాంగ। మున నిను సతంబు భజియించు ♦ జనులకెపుడు।
నీపురబహిస్థ నెలంబునఁ ♦ గాపురమగు॥ 32

చం॥ సతతము పింగళాకృతిని ♦ సంగి ద్విషట్కదళాఢ్యమానవా।
హతమను చక్రిమందు నిను ♦ నంబ! భజించెడువారికిన్ భవ।
ద్వితతపురంబులోపల ని ♦ వేశమెసంగెడు; వారలందు సు।
స్థితులయిభూరిసౌఖ్య విత ♦ తింగనుచుందురు తుష్టినెప్పుడున్

గీ॥ తొమ్మిదియు నేడు దళముల ♦ తోడ ధూమ్రి। శోభనలరారు
చుండు వి ♦ శుద్ధచక్రి। మునినిను భజించువారికా ♦ మోదద
మగు। నీదుసాన్నిధ్యమో జన ♦ నీ! కననగు॥ 38

గీ॥ ఘనసహస్రదళంబునై ♦ కప్పురంపు। ఛాయనలరారునాజ్ఞాసు ♦
చక్రిమందు। భక్తినినుఁగొల్చునట్టి స ♦ ద్భక్తవరుల। కంబ!
త్వద్భోగతుల్యభో ♦ గంబొదవును ॥ 40

సీ॥ మున్నగశ్రీచక్రి♦ మునకు షట్చక్రింబు;నకుఁ జింతిత్రైక్యంబు ♦
నకలుషమతి। నెఱుఁగుటయును ననం ♦ తరము శ్రీచక్రంబు;
నకును దన్మంత్రంబు♦నకునభేద। మును గుర్తెఱుంగుట♦యును
నంతఁ జక్రింబు; నకు మంత్రిమున కభి ♦ న్నత నెఱుఁగుట।
యును నంతటఁ ద్వైదైక్య ♦ మును దలంచుటయును; ననన్గా
విధములై ♦యలరునేక।

గీ॥ తానుభవములఁ దనరు మో ♦ హంబుఁదుంచి। యంబ! ధ్రువ
మండలాఖ్య స ♦ హస్రపత్రి।కమలమున నిన్ను నిల్పిధ్యా ♦
నము నొనర్చు। చుండుసాధకవరుఁడు సా♦ యుజ్యముఁగను॥ 41

శా॥ ఆమూకాంబిక నిట్లు శంకరుఁడు స ♦ ద్వ్యాహారసూనాళిచే
నామోదంబునఁ గొల్చిసాధకని కా ♦యంబెల్లఁ గీర్తింపఁ భి
క్షామాత్రోదనతృప్తుఁడౌచునుగడు♦న్యాంతాత్మఁడై కామము
ఖ్యామిత్రౌఘముద్రుంచికొంతసమయం♦బచ్చోటబుచ్చెన్ధృతిన్

సీ॥ నిజకర్మనిష్ఠులై ♦ నిత్యంబును నిషిద్ధ; మును దూరముగ విస♦
ర్జనముఁజేసి। యప్రమత్తతనొప్పు ♦ నవనీసురులఁ గాంచి; కల

దేశములనెల్లఁ గలియఁదిరిగి । యును బ్రదేశంబును నగ
రేమి యుషమృత్యు వెటబైటినుండియే యేగుమరల । శ్రుతి
పాఠకులు నునా హిత వహ్నులునునైన; ద్విసహస్ర విప్రు
లు వెలయుదురెట ।

గీ॥ మధ్యమణిహార ముండ్రియా నూపతి గగనాధిరూఢుండు
నైరాత్రి నట్లుదేని నగజతో మధ్య గేశ్వరుం డలరఁజేయు
బ్రితి గృహాహుతాగ్ని వరగంధ భవ్యమెద్ది ॥ ౪౩

గీ॥ అట్టి శ్రీబలిసంజ్ఞమా నగ్రహార। మునకుఁ దనశిష్య సంచ
యము వెనువెంటఁ । గొలిచిరా నేగె శంకర గురువరుండు।
సకల విబుధులు మిగుల సం స్తవ మొనర్ప ॥ ౪౪

ప్రభాకరుఁడు తనమూగకొడుకు నాచార్యునకుఁ జూపి యంగలార్చుట.

ఉ॥ ప్రాకటసన్మనస్కుఁడుప్ర భాకరనాముకుఁడుం బ్రవృత్తిశా।
స్త్రైకరతుండునుంగ్రతుచయప్రవిజృంభిత కీర్తియున్బుధా ।
నీకనుతుండు శాస్త్రవిద నీకపుఁడుంబ్రథితాను భావుఁడున్
శ్రీకలితుండు నానాకధరిత్రిమరాగ్రణియుం డెనచ్చటన్ ॥ ౪౫

ఉ॥ ఆతనికి హిరణ్యమును దగ్రధరిత్రియును న్సుబాంధవు ।
జ్ఞాతులు గోవులున్మొదలు గాఁగల సంపదలెన్ని యున్నఁడ।
చ్చేతమునందు సుంతవిల సిల్లదు సంతసమెన్నఁడుందనూ;
జాతుఁడుముగ్ధచేష్టుఁడయి సన్నిధినుండెడుకారణంబునన్ ॥ ౪౬

ఉ॥ మారునిమీఱు రూపమున మందమరీచి సమాన తేజము।
ధారుణిఁబోలు తాల్మియును ధానిధితుల్య ముఖంబుగల్గి యొ।
ప్పారియుఁ బల్కఁడించుకయు నాదృతిమై వినఁడేవియున్మన।
స్సారసమందు దేనినొవిచారము బాలుఁడు సేయుమందుఁడై ॥ ౪౭

మ॥ గ్రహమే దేనియుఁబట్టబాలుఁడిటుమూకత్వంబునుంగాంచెనో
మహితంబౌతొలిసేఁత చేతఁగనెనో తుత్తూనుఁడిమ్మాన్మడ్కినం
చహము న్నాత్రియునా ప్రభాకరుఁడులో నాలోచనం జేయుచు।
న్బహువిద్యాపటులౌబుధోత్తములసం ప్రశ్నింపఁగాఁగోరెఁ
దాన్ ॥ ౪౮

చం॥ బహువరకోశ భారులగు ♦ పల్వురు శిష్యులునుం బ్రశిష్యులు।
న్సహితసుభక్తిఁ గొల్చుచు స ♦ మంజసమాగతిఁ దోడరా
మహా। మహుఁడొక సంయమీశ్వరుఁడ ♦ మానుషుఁడాపురిఁ
జేర వచ్చెనం। చు హితవరుల్వచింప విని ♦ సూనునిఁదోఁగొని
యాద్విజాగ్రుఁడున్॥

గీ॥ ఱేనిగురు నిష్టదైవంబు ♦ రిక్తహస్తుఁ। డగుచుఁ గనఁ జనరాదంచె♦
ఱుఁగునుగాన। ఫలములంగొని యాయమి ♦ పరివరుఁ జేరి।
వానిముందిడి తత్పదా ♦ బ్జముల కెఱఁగె॥ ౫౦

ఉ॥ భస్మనిగూఢవహ్నిఁబలెఁ ♦ బైకి జడాకృతినున్న పుత్త్రినా।
ర్యస్మరణీయ నాముఁడగు ♦ నయ్యమివర్యునికాలిదమ్మికి।
శస్మృతితో నమస్కృతిని ♦ ఫల్పఁగఁ జేసె ద్విజుండు; బాలుఁడు।
న్విస్మృతగాత్రుఁడై పడి పరి♦విస్మృతజాడ్యుఁడునయ్యె లేవమిన్॥

కం॥ దయశంకరుఁడును ద్విజుని తనయునినవాఙ్ముఖుని హస్త♦నళి
నంబులనె। త్తియతని నేకనుచుండ వినయమెసఁగఁ బ్రభాకరుం
డు♦నతినిడియనియెన్॥ ౫౨

గీ॥ అరిగనితనికిఁ బదుమూఁడు ♦ హాయనములు। లేదు సుంతయు
నవబోధ ♦ వేదములఁ బ। ఠింపలేదక్కరముల లి ♦ ఖింపలేద।
యిన నొనర్చితి సదుపన ♦ యనము నెట్లొ॥ ౫౩

కం॥ పలువురు బాలురు వీనిం। బిలిచెద రాడుకొనన్నై న♦వీఁడరుగ
డు, శుంఠలు వారలెల్లరప్పుడు। కలిసి తనుంగొట్టుచున్నఁ♦గనఁ
డొడఁదరుషన్॥ ౫౪

కం॥ తినునొక్కప్పు,డొకప్పుడు। తినఁడు, నిజేచ్ఛానుగతిని♦ దిరుగు
నితఁడుసె। ప్పినఁజేయఁడై నరుషఁగొ। ట్టను; బెరిఁగెడి నిత్యము
త్క♦టమగు నిజకృతిన్॥ ౫౫

కం॥ యమివర! వీనికిఁ గలజా। డ్యమునకుఁ గతమెద్ది? తెల్పు ♦
మనివిప్రుఁడు పరి। శ్నము చేసి యూరకున్న। న్యమివరుఁడా
బాలు నప్పు ♦ డడిగెనిటులటన్॥ ౫౬

కం॥ బాలక! తెల్పఁడవీవిటు। లేల జడునిభంగి నుంతె ♦ వింతయు

నాకుం బోలవచియింపు మనవుడు । బాలకతనువౌ మహి
తుఁడు ♦ పలికెగురునితోన్॥ ౫౮

ప్రభాకరపుత్రుని తత్త్వవేత్తృత బయల్పడుట

గీ॥ జడుఁడనేఁగాను; జడము మ ♦ తన్నిధాన। మునఁ బ్రవర్తించు
సంశయ ♦ ముంగననిట। గురువర ! షడూర్మి షడ్భావ ♦ విర
హితమును। బరమసుఖతానమైనత ♦ త్పదమె యేను॥ ౫౯

ఉ॥ భూమిని నాకెసంగునను ♦ భూతియి దేవిబుధా! ముముక్షువి।
త్తోమముచే నెఱుంగఁబడు ♦ చు న్విలసిల్లుత మంచుబాలక ।
గ్రామణిద్వాదశామలత ♦ రంబులఁ బద్యములం జిదాత్మతా।
త్త్వామలరూపముం దెలిపె ♦ నార్యులు మెచ్చ ధుత ప్రపంచమున్॥

గీ॥ రవిజగచ్చేష్టలకును గా ♦ రణమగునటు। చిత్తనేత్రాతివృత్తిని ♦
మిత్తమగుచు। దూరితోపాధియైన భ ♦ స్తుల్యమైన। యట్టి
నిత్యోపలబ్ధిరూ ♦ పాత్మ నేనె॥ ౬౦

గీ॥ ఉష్ణమనలంబుఁ జేరితా ♦ నొప్పుపగిది। నిత్యబోధ స్వరూపత ♦
నెగడు నెవని। నద్వయు నబోధరూపేంద్రి ♦ యములు చేరి।
యలరు నిత్యోపలబ్ధిరూ ♦ పాత్మ నేనె॥ ౬౧

గీ॥ ఆననాభాసకంబె యౌరా ♦ నద్దమందుఁ । గాంచఁబడునట్టి దా
స్యత ♦ కన్న వేఱు। గాఁగ నెద్దియు లేదట్టి ♦ కరణి జీవుఁ। డుండు
మతులఁ జిదాభాస. ♦ కుండగుచును। నట్టినిత్యోపలబ్ధిరూ ♦
పాత్మ నేనె॥ (పంచపాది) ౬౨

గీ॥ ముఖమొకఁడు కల్పనాహీన ♦ ముగఁదలిర్పు। నద్దమది లేమి
నాభాస ♦ హాని నట్లు। మతిలయింపని రాభాస ♦ కతనగు నెవఁ।
డట్టి నిత్యోపలబ్ధిరూ ♦ పాత్మ నేనె॥ ౬౩

గీ॥ చిత్తనేత్రాదికవియుక్తిఁ ♦ జెలఁగి యెవఁడు । చిత్తనేత్రముఖ
మునకుఁ ♦ జిత్తచక్షు । రాదియై చిత్తముఖముల ♦ కనవగమ్యుఁ
డట్టి నిత్యోపలబ్ధిరూ ♦ పాత్మ నేనె॥ ౬౪

గీ॥ ఎవ్వఁడు స్వతః ప్రకాశత ♦ నెంతయును వి । శుద్ధచిత్తుండు

నయ్యును ♦ బుద్ధుల బహు। భంగిగాఁదోఁచునీరస్థ ♦ భాను
పగిది। నట్టి నిత్యోపలబ్ధి రూ ♦ పాత్మనేనె॥ ౬౫
గీ॥ స్థిరములఁ జరంబులను నొక్క ♦ తిగ్మకరుఁడె। పలు తెఱంగులఁ
దోఁచెడు ♦ పగిది నెవఁడు। చలములుఁ బ్రిభిన్నములు నాధి♦షణ
లనొకఁడె। యలరు? నిత్యోపలబ్ధి రూ ♦ పాత్మనేనె॥ ౬౬
గీ॥ అంబుదచ్ఛన్నదృష్టి క ♦ జ్ఞాప్తుఁడబ్జ। పిహితుఁడుగ నిష్ప్రి
భుండుగఁ ♦ బ్రథ్విఁదోఁచు। పగిదినతిమూఢదృష్టికి ♦ బద్ధుపగిది
నలరు నిత్యోపలబ్ధి రూ ♦ పాత్మనేనె ॥ ౬౭
గీ॥ సకలవస్తువులందు నె ♦ సంగియున్న। నెవని నద్వయునిఖిలవ ♦
స్తువులు దాఁక। వెవఁడు నభమట్లలచ్ఛందు ♦ ను విమలతను।
వట్టినిత్యోపలబ్ధిరూ ♦ పాత్మనేనె॥ ౬౮
గీ॥ మణులకును పాధులందునే ♦ మాడ్కి భేద। భావమగు విష్ణుఁ
డా భేద ♦ భావమట్లె। నీకుఁ భేదములనగు ♦ నీటఁ జంద్రి।
కలకుఁబలెనీకునగును జం ♦ చలతయెన్న॥ ౬౯
గీ॥ పాశియందుండు నుసిరిక ♦ పండు పగిదిఁ। బరమగు పరాత్మ
తత్త్వంబు ♦ వఱలఁజేయు। కతన హస్తామలక సంజ్ఞ ♦ గలిగి
శ్లోక। ములు చెలఁగెఁ దత్కవికిఁబేరు ♦ వెలసెనదియె॥ ౭౦
చం॥ ద్విజనరుపట్టికి న్నదుప ♦ దేశమెలేక పరాత్మతత్త్వమా।
ద్యజననమందె సంగు సుకృ ♦ తాతిశయంబునఁ గల్గెనంచున।
క్కజమును సంయమీశ్వరుఁడు ♦ గాంచి స్వకీయ కరాంబు
జంబునా। ద్విజవరుబాలునొదల న♦వేల దయామతితోడ
నుంచెఁదాన్॥ ౭౧
మ॥ ఇటులా బాలుఁడు వల్కి యావలకుఁ దా ♦ నేగ న్యమీం
ద్రుండు తా। నిటులాబాలుని తండ్రితోఁ బలికెనీ ♦ కీ పట్టి
తోడాచునుం। డుటకున్యోగ్యుఁడుగాఁడు విప్ర! జడిమా ♦ ధ్యాం
ధ్యైన యాబాలుతో। నిటనీకయ్యెడు లాభమెద్దియనులే ♦ దిం
కేల నీకీతఁడుౕ॥ ౭౨
గీ॥ పూర్వజన్మ భవాభ్యాస ♦ మున నఖిలము। నెఱుఁగుఁ జెప్పఁ

డితండు తా ♦ నించుకయును| నట్లుగాకున్న నకట! ని ♦ రక్షు
రుండు| స్వానుభవముఖ్యతత్త్వ ప ♦ ద్యముల ననునె?॥ ౭౩
గీ॥ లేదితనికించుకేని గృ ♦ హాదివిషయ| సక్తి; స్వశరీరమందునె ♦
సంగడు భ్రమము| కతనం దాదాత్మ్యత; యదిస్వాం ♦ గమునం
గల్గ| దన్నం జెప్పంగ నేల బా ♦ హ్యాములయందు?॥ ౭౪
తత్త్వజ్ఞహస్తామలకు న్వెంటంగొని శంకరుండు శృంగగిరికిం జేరుట.
చం॥ అనివచియించి యయ్యమి వ ♦ రాగ్రణి విప్రితనూజు వెంటం
గై| కొని తనయిచ్చవచ్చునెడ ♦ కుంజనెనంతట నాప్రిభాకరుం|
డును నొక కొంత దూరముగ ♦ డు న్వినయంబున నయ్యె
మీాందుతో| డ నరిగియింటికిం జనెది ♦ టంబగు బుద్ధిని
బూని యెట్టులో॥ ౭౫
సీ॥ ఆత్మభృదంతరుం ♦ డగు ఋశ్యశృంగుండి; ప్పటికిం దపంబు
నె ♦ చ్చట నొనర్చు| నెటం బ్రివహించుందాం ♦ కుటనె సందా
పిత; భద్రదీవ్యత్తుంగ ♦ భద్రయలరి| సాంగవేదాధ్యేత ♦ ల
భ్యాగతార్చాల్పి;తసురభూజులు మహా ♦ ధ్వరకరులును|
శాంతాంతరాధ్యుల ♦ శ్రాంతశాంతులువిజ్ఞు; లెటం దుష్టితో
వసి ♦ యింతురెలమి|
గీ॥ నట్టిశృంగ గిరికినిసం ♦ యమివరుండు| జలజపదముఖ్య శిష్యులు ♦
గొలువనంబు| జాక్షువిబుధేంద్ర ముఖులచే ♦ నభినుతింపం| బడు
చుసమవాప్తకాముండై ♦ పయనమయ్యె॥ ౭౬
గీ॥ శృంగగిరిం జేరియచట వ ♦ సించుచు విను| టనెపుమర్థంబుల
నొసంగు ♦ టకు సముచిత| ములగు నిజభాష్యముఖకోశ ♦
ముల మనీషి| వరులం బఠియింపంజేసె శం ♦ కరగురుండు॥ ౭౭
గీ॥ శేషులజ్జావినమ్రింగాం ♦ జేయుచుజన| దురితములమీాఱకుండం
బోం ♦ ద్రోయుచుగురు| నిర్విశేషముగా జీవ ♦ శర్వులకెపు|
డగు నిరస్త విశేషంబు ♦ యమివచించె॥ ౭౮
చం॥ యమివరుండా నగంబున సు ♦ రాధిపరమ్యవిమానకల్పహా|
ర్మ్యమును సమస్తశిల్పముల ♦ రంజిలం గల్పనం జేసివిష్ణుధా|

తృముఖ సురేడ్యమైన పర ♦ దేవతకున్నతతంబు పూజఁదా
నమిత వినీతితో జరుగు ♦ నట్లుగ యోజనచేసెన త్తటిన్॥

ఉ॥ తీరుగఁదా నొనర్చిన ప్ర ♦ తిజ్ఞను బ్రోవఁగ శారదాంబయు।
స్వైరను బూనిభక్తుల క ♦ భీష్టవరంబుల నిచ్చుచుండి శృం।
గేరి పురంబునందఖిల ♦ కిల్బిషహారిణి యై చునిప్పు నొ।
ప్పారెడు దేవిఁగొల్చుటకు ♦ న త్తటినుంచె సురేశ్వరార్యునిన్॥

క౦॥ చిత్తానుసారియున్నై । జో త్తమ ధర్మానుచారి♦యును భూత
దయా। యుత్తుఁడు మితవచనుఁడునై । స త్తముఁడొక శిష్యుఁ
డుండె ♦ శంకరయమికిన్॥ ౮౧

సీ॥ వెలికేగుగురునకు♦సలిలాదికము నిచ్చుఁ దనుమార్జవస్త్రమి ♦
చ్చును గురునకు। బాగుగాఁగని దంత ♦ పరిశోధనమునకుఁ
దగుకాష్ట మొసఁగును ♦ దమివరునకు। ముందుగనే స్నాన ♦
ముంజేసి నిత్యంబుఁ గంబళ ముఖ్యవ♦స్త్రంబులఁ దగ। సమ
ముగ మృదుమహా♦సనమును గల్పించు గురునకు సంతుష్టి ♦
వలలునట్లు।

గీ॥ శ్రీయుతయమీంద్ర పాదవా ♦ రి జయుగళము। నొత్తునేర్పు
గ నీడయ ♦ ట్లుద్వినీతి। ననుసరించుచు నన్వహం ♦ బును
ప్రబమోద। భరితుఁ డానంద గిర్యాఖ్య ♦ వలలునతఁడు॥ ౮౨

గీ॥ తావిజృంభింపఁ డొజ్జచెం ♦ తను నెపుడును। గూరుచుండఁడు
కాలాన్ఁచి ♦ గురునియెదుటఁ జెప్పఁదగుదాని నను పే ♦ క్షిం
పఁ డెక్కుడు। గఁ బలుకఁ డొజ్జకుం బ్రుష్ట♦మగపలుకఁడు॥ ౮౩

చం॥ గురుఁడొకచోటఁ దావిడియ♦గొబ్బున నాగెడు నేగి నేగునా।
దరమున నాలకించు విత ♦ తంపుఁగృపం గురుఁడానతిచ్చుదా।
ని, రహీనను క్తుఁడైయు నవి ♦ నీతుఁడునై హితముంబొనర్చునా।
గ్గురున కనిష్టమౌపనిని♦గూళతనంబునఁ జేయఁడెన్నఁడున్॥ ౮౪

గీ॥ శిష్యవరుఁడాతఁ డొకనాఁడు ♦ స్వీయశాటి। కాళిమదుకఘునిం
గూర్చి ♦ యరుగవాని। రాకకై వేచుచును శంక♦ర యమి, భక్త
వత్సలతఁ జాతముల విలం ♦ బము నొనర్చె॥

గీ॥ శాంతిఁ బాఠముఁ జేయన ♦ సంఖ్యులైన । ఛాత్రులుద్యుక్తు
లగుచుండ ♦ శంకరార్యుఁ। డుండెఁడు క్షణంబులో గిరి♦ యును
సమాగ। తుండగు నటంచుఁ బలికె న ♦ ఖండదయను॥ ౮౬

చం॥ గురువరుఁడాడినట్టి పలు♦కున్విని శాస్త్రమునందనర్హుఁడున్।
గరమును మందబుద్ధియు న♦నందగు వాని నిమిత్తమేటికో।
గురువర! వేచియుంటయని ♦ కూడనిభీతిని జూపెన త్తతి।
న్నరసి జపాదమానియను♦ఛాత్రుఁడు దేశికవర్యముంగటన్ ౮౭

గీ॥ అతనిగురుతర గర్వంబు ♦ నపనయింప । స్వాశ్రితుల యందె
నంగు ద ♦ యన్యతివరుఁ। డోసఁగె నానందగిర్యాఖ్య♦నెసఁగు
శిష్యు। నకుఁ బదియునాల్గు విద్యల ♦ నకలుషమతి॥ ౮౮

ప్రియశిష్యుఁడైన యానందగిరిని శంకరుఁడు సర్వజ్ఞుఁ జేయుట.

ఉ॥ ఆతఁడు తత్క్షణంబున నె♦యగ్రిగురూత్కరుణా న్వహించివి ।
జ్ఞాత సమస్తవిద్యుఁడయి ♦ సత్వరతత్త్వముఁ దెల్పుతోటక।
ఖ్యాతసుసాధు వృత్తముల ♦ న త్తఱిభక్తి వరాత్ముఁడౌచునీ।
రీతిని దేశికోత్తము బ♦రిస్ఫుటమానుతిఁ జేయుచున్వెసన్॥ ౮౯

తోటక॥ జనిమృత్యు జలంబును ♦ సౌఖ్యవిప। ద్ఝవ మీనము నైన
యు ♦ గాధ భవా। బ్ధిని పాతితుఖిన్నుఁ ద్వ♦ దీయపదం। బును
జేరననుంగృపఁ ♦ బ్రోవుగురూ! ॥ ౯౦

తోటక॥ కరమున్విషయంబునఁ ♦ గష్టమునా । తఱిని స్మరలించి
స ♦ తంబుఁదను। స్థిరబుద్ధినివీడి సు♦ధీక ! పరా। త్మరతింగను;
మోహముఁ ♦ దాల్పకుమీ ॥ ౯౧

తోటక॥ విదితాన్నమయాదుల ♦ వీడుము నా । యది యిద్దదనే
నను ♦ నెట్టిమతి। న్హృదయస్థునజుంగుణ ♦ హీనుఁబరా । త్మఁ
దలంపుము నేనని ♦ ధన్య ! సదా ॥ ౯౨

తోటక॥ జలభేదముచేత వె♦సర్క న్రివికిం । బలెనే ఘటికాదిన♦
భంబునకుం । బలె బుద్ధి విభేదము ♦ నం గలదీ । యిల నీకు
బహుత్వ మ ♦ హీనునకుర్ ॥ ౯౩

తోటక॥ దినకృత్ప్రిథమా స్వచి ♦ తిన్సతతం। బును లోకమనో

గత♦మునన్నకలం। బును నీవవికారివి ♦ బుద్ధి నెఱిం। గిన హేతు
వు నన్నద ♦ నిందు్యఁడవే! ॥ ౯౪

సీ॥ శ్రీ శంకరయమిడే ♦ శికపాద నీరజ; యుగమూలమైకడు ♦
నొప్పియంత । శంకర గురువరా ♦ శ్రేయము నంతటఁగాంచి;
తత్ఘన కరుణామృ ♦ తంపుసేక । ఘున నెంతయు వివృద్ధిఁ♦
గనినయయ్యానంద; గిరి మహాభక్తివ♦ ల్లరి వరుసగ। బుధులను
బంభరం♦బులకుఁ జేరందగు;నామోదసుమమున♦ నలరియంత

గీ॥ సకలసత్తమకీర సం ♦ చయము చేత । మాటి మాటికి నాస్వా
ద్య ♦ మానములగు। వ్యాధ్యతోటక వృత్త స♦త్పద్యములను।
లలిత ఫలముల నెంతయు ♦ నలరెనపుడు ॥ ౯౫

చం॥ హితమగునట్టి యున్నతిని ♦ నెవ్వనిచేఁ గని ధాత్రిలోనఁదాఁ।
గృతపదయాచు సుత్పధమె ♦ గింగన నెంచెడువానికభ్రి సం।
గతమగునిచ్చనాచు భువ ♦ నత్రియమెల్ల నధఃకరించు స।
ద్యతివరుసేవయట్టిగిరి ♦ దాతమమున్విరశంబానర్పదే ? ౯౬ ॥

గీ॥ వరసుపరోక్తి నెఱుఁగని ♦ వాఁడునైయు । గురునిదయఁజేసి
యానంద ♦ గిరియు నంత । నమలతోటక వృత్త ప♦ద్యముల
శ్రుతి శి । ఖార్థముందెల్పెఁదాసవ ♦ యస్కులుకన ॥ ౯౭

గీ॥ అమృతరసమాధురీ ధురీ ♦ ణ మగుచు నెసఁ। గునలయానంద
గిరివాక్య ♦ గుంభమువిని। జలజపదముఖ్యశిష్య సం♦చయము
గర్వ । మును విడిచి కాంచి రక్కజం♦బును మనముల॥ ౯౮॥

ఆనందగిరియే తోటకాచార్యుఁడని పేరందుట.

గీ॥ ఘనతరంబగు భక్తి నీ తని వలనను। దోటకాభిధ వృత్తసం ♦
దోహ మిట్లు। లుద్భవించుట శిష్టవం ♦శ్యుఁడగునితని। నార్య
వరులెల్లఁ దోటకా ♦ చార్యుఁడనిరి॥ ౯౯

చం॥ ధర్మనిగమాంత వేద్యపర ♦ తత్త్వనివేదన మాయతీట్వరం।
దరకృత భధ్రితత్త్వకర ♦ ణంబడి నేఁటికి నింజెలంగవి।
ద్వరచయ సంగ్రహీతమ్మయి ♦ వాసినెసంగు పదాళినొప్పిభా।
సురమగు నీలితో నలరు♦చుం బ్రిధితంబయి తత్సునసంజ్ఞతోన్॥

క॥ క్షితిలోన నతఁడు శంకర। యతివలననికంతఁదోట ♦ కాభి
ధఁగనివి। శుశ్రితుఁడమ్యోనజ్ఞపదసద్మ। శత నలరియమీాంద్రి
ముఖ్య ♦ సచ్ఛిష్యుండై ॥ ౧౦౧
చ॥ అలరెడు ధర్మముఖ్యపురు♦షార్థములోకొ్కఋబుగాదికాగమం।
బులో?జలజోద్భవాస్యములో?♦ముక్తివిభేదములో!యటంచువి
జ్ఞులుకరమున్విమర్శనము ♦ నుంబొనరించి యెఱింగిరంతని।
ష్కలుషులఁ దోటకాదులను ♦ శంకరశిష్యులఁగామనంబులన్॥
శా॥ స్ఫారద్వారల సత్త్వఘూర్ణగ మహా ♦ భవాత్రితగండస్థలీ।
వారోల్లోలమదప్రవాహమధులి ♦ డ్వారోరుసంగీతభం।
గీరావధ్వనితాశ సంపదను నిం♦ దింతెప్పుడున్లోననా।
త్మారామార్యపదస్థిరోక్తి పరసం ♦ పత్సౌఖ్యలాభోత్సుకుల్॥
మ॥ ఉరుమంథానకులాచలోన్మథిత సిం ♦ ధూద్భూతపీయూషఫే।
నరుచింబోలెడు కీర్తినొప్పుచునస ♦ న్మార్గానరోధంబుని।
ద్ధరణింజేయుచు నప్రధృష్యమతులౌ ♦ ధన్యోద్భగంతేవస।
ద్వరులంగూడిరహించెశంకరయమీా♦ద్వర్యుండుసన్నుత్యుఁడై
ఉ॥ ధీరుఁడునా సురేశ్వర సు♦ ధీవరుఁడంతట నొక్కనాఁడువి।
స్తారపుభక్తి నాత్మద బు ♦ ధప్రవరుంగురుఁజేరి మ్రొక్కిగం
భీరతరార్ద్రభావమయి ♦ పృథ్వినారతముంజెలంగుశా।
రీరకసూత్రభాష్యమున ♦ వృత్తినొనర్పఁదలంచి యిట్లనున్॥

శంకరభాష్యమున వార్త్తికమొనర్ప సురేశ్వరుఁడనుజ్ఞనొందుట.

గీ॥ గురువర! భవత్ప్రమోదంబు ♦ కొఱకు నాకుఁ। జేయఁదగు
దాని నిపుడు శా ♦ సింపుఁడు దయ। నొజ్జయెడ భక్తిమంతుఁ
డై ♦ యొప్పనెవ్వఁ!డతని జీవితమే ధాత్రి ♦నంచితమగు॥
చ॥ అనుచు సురేశ్వరుండడుగ ♦ నార్యపదుండెదఁదాఁబ్రమోద
మున్। గనివచియించెనిట్టులవ ♦ ఘా! ముదముందగ నాకొన
ర్పనీ। మనమున నెంచెదేని మహి ♦ మామకభాష్యమునందు
వార్త్తికం। బనెడునిబంధనంబునుబు ♦ ధావళిమెచ్చఁగఁజేయు
మిమ్ముగన్॥ ౧౦౭

చ॥ ఇటు భగవత్పదుండన సు ♦ రేశ్వరుఁడగ్గురుమూర్తి కంతను।
త్కటమగు భక్తి మ్రొక్కియనుఁ ♦ దర్కయుతాతిగభీరవాక్యసం।
ఘటిత భవత్సుభాష్యమును ♦ గాంచనశక్తుఁడనైనమీకృప।
న్నిటముగ నాదు శక్తికొలఁ ♦ దిగ్గమకింతు నిబంధనార్థమై॥ ౧౦౮

గీ॥ అని సురేశ్వరుఁడల్లె యా ♦ నవెడు నార్య। పాదుని సదభ్యను
జ్ఞఁదా ♦ నాదలఁగొని। యరిగె; నేకతమున నంబు ♦ జాంఘ్రి
హితులు। చిత్సుఖాదులు గురునంతఁ జేరియనిరి॥ ౧౦౯

సీ॥ గురువర్య! తానొసం ♦ గును గర్మమే నాక; నరకాది కంబుల ♦
నరుల కెపుడు। గాని ఫలప్రదుం ♦ డైన జగత్ప్రభుం; డన్న
మజ్ఞోక్కుండు ♦ సున్నయనుచు। సార్వకాలికుఁడైన ♦ సర్వేశ్వ
రునిఁ గూడ; యుక్తిచయంబుచే ♦ నుత్తరజ్ఞఁ। డై కర్మతత్పరుం
డై బోద్ధయై యెవ్వఁ; డెంతయు నిరసించె ♦ నిర్ధరిత్రి।

గీ॥ నట్టిమండనుచే నిప్పు ♦ డఖిలలోక। హితముకొఱకీరు సేయుంట
నెంచు యత్న। మది హితంబునకై కాక ♦ యొదవఁజేయుఁ।
బటుతరానర్థ రూపమా ♦ ఫలముఁ జెందు॥ ౧౧౦

గీ॥ లయముఁ బ్రత్యేకముగ నఖి ♦ లంబునకుఁ బు। రాణవార్తతి
యనె, బాద ♦ రాయణుండు। దానికింగర్త; జైమిని ♦ మాని
వ్యాస। పక్షుఁడుల యావలంబిత ♦ చ్ఛ క్షితుండు॥ ౧౧౧

గీ॥ పృథ్వి గురు శిష్యులకుఁ బక్ష ♦ భేదమొదవు। నెడల గురుశిష్య
తయు వారి ♦ కెట్లుపొసఁగుఁ? బొసఁగినను నాశ్రివోక్తంబు ♦
పూర్వపక్షు। మగు గురూక్తంబె సిద్ధాంత ♦ మగు నిజముగ॥ ౧౧౨

సురేశ్వరుని నమ్మరాదని యితరశిష్యులు పట్టుపట్టుట.

మ॥ జననంబందిన దాదినేఁటివఱ క ♦ శ్రాంతంబుఁ గర్మంబున।
న్మనముం గూర్చి యొనర్చుఁ గర్మమును గ ♦ ర్మంబుం గడున్నక్తి
మీఱ మను జేయుండు కడుం బ్రయత్నమున నా ♦ ర్యుల్స్వర్గ
ముఖ్యోత్సుఖం। బును జెందుండని యాతఁడన్యులకుఁదా ♦
బోధంచు చుండుంగదుర॥ ౧౧౩

సీ॥ మునుకర్మసక్తుఁడై ♦ యును నేఁడు సన్యాసి; మును కెందు

కారణం ♦ బున నివృత్తి। తత్పరుండగునంచుఁ ♦ దలఁపఁ బోల
దదెట్టు; లనిన సన్యాసంబు ♦ నైనవాఁడ। మున నీతఁడో డితాఁ ♦
బూనెను గానిస్వ; బుద్ధిపూర్వకముగాఁ ♦ బూనెనొ కా ?
కానసీతఁడు నమ్మ ♦ కమున కనస్పుఁడం; చును మాదునెద
లఁదో ♦ చును సతతము॥

గీ॥ నట్లగుటవీని చేత భా ♦ ష్యంబునను ని। బంధనంబును జేయించి ♦
భవ్యసూత్ర। నిష్ఠపరమార్థమునకు హా ♦ నినిబొనర్ప। కుఁడు
పరి వ్రాజకాగ్రణ్య ♦ గురువరేణ్య!॥ ౧౧౪

చం॥ యమివర! యిట్టివాఁడు భవ ♦ దాజ్ఞనుబూనినిబంధనంబు భా।
ష్యమునసొనర్చెనేని యని ♦ శంబును గర్మపరంబుగాఁగ భా।
ష్యము నొనరించుఁ గానఁదద ♦ జ స్రవివృద్ధిని గోరుమీరుమూ।
లమునను గూడ విచ్యుతి నిలంబొనరింపక యుండుటొప్పగున్

చం॥ కరము నభీష్టమైయలరు ♦ కర్మము నెవ్వఁడొనర్ప నోపునో।
నరుఁడతఁ డెప్డుఁ గర్మమను ♦ నామము నున్విడఁగాఁదగండు మ
స్కరవిధియందు నాగ్రహమె ♦ సంగినచో జనుపాంథమూకభూ
సురులుతదాశ్రమార్ష్టల ను ♦ చున్వచియింతురు భాట్టసంస్థితుల్।

గీ॥ ఇతఁడు తద్భట్టమత పక్ష ♦ రతుఁడుగాన। మీకుసమ్మతుఁడైన
సు ♦ ధీకలితు వి। ధి పుఁడీ సూత్రభాష్య వా ♦ ర్తికమొనర్ప।
మాదు నిర్బంధ లవమును ♦ లేదిటఁజుడి॥ ౧౧౭

మ॥ గురువర్యా! మును మేము వేదకదివిష ♦ త్కూలంకషాగ్రణ్యదా।
పరతీరంబున సంచరింపఁగను మా ♦ భక్తిప్రకారంబుస।
త్వరమేలోఁ దెలియంగ నాఁగఁగరుణా ♦ ధామాత్మలొమీకుసా।
దరులైపిల్చిరి కాదె రండనుచు ను ♦ ద్యత్ప్రీతి మమ్మందఱన్

గీ॥ అప్పుడాపల్కునువిని మే ♦ మందఱమును। దరణికౌఱకాకులుల
మాచుఁ ♦ దిరుగుచుండ। సీసనందనుఁడ మఱ ఫా ♦ హిని దగు
రయ। మునకు నెదురుగ వెడలెఁదాఁ ♦ బూర్ణధృతిని॥ ౧౧౯

గీ॥ ధాత్రి నాచార్యవర్యులౌ ♦ తమ యెదఁగల। యసూయమును
జాతపాళ్యసా ♦ మాన్యమైన। యితని భావంబుఁగని తుష్టి ♦

నెనసిగంగ। బంగరుందమ్ములు సృజించె♦బ్రితిపదమున॥ ౧౨౦

చం॥ అడుగుల నాజలేజముల ♦ యందుననుంచి సనందనుండు,దాఁ
గడురయ మొప్పఁదావకస ♦ కాశముఁజేరుటచేత బద్మ పా।
దుఁడనెడు పేరునీరు ఓబు ♦ ధుల్వినుతింపఁగ వానికిచ్చి రా।
తఁడె తగుసూత్ర భాష్యమునఁ ♦ దద్జులు మెచ్చఁగవృత్తిఁ
జేయఁగన్॥ ౧౨౧

గీ॥ ఎపుడు మీకాలిదమ్ము ల ♦ నే కొలుచుట। నెల్లభేదంబులం
దోర్చి ♦ యుల్లసిలుటఁ। జెలఁగెడు స్వభావమున నెతా ♦ సిద్ధుఁ
డగుట। నతఁడె తగునంచుఁ బల్కిరి ♦ మార్యవర్య!॥ ౧౨౨

ఉ॥ ఎందును దీటులేకెసఁగు ♦ నెవ్వని కుగ్రతపంబుచే శతా। నం
దుని ధర్మపత్ని కరు ♦ ణామతితోడఁ బ్రసన్నయౌచుని।
చ్చెం దమవౌప్రబంధములఁ ♦ జెల్వుగవాఖ్యలఁజేయుశక్తి। నా
నందగిరి ప్రిథుండుబుధ♦నమ్రుఁడతండును దీనికిందగున్॥ ౧౨౩

గీ॥ క్షితిని సతతంబుఁ గర్మైకరతుని విశ్వ। రూపు నమ్మకుమయ్య
గు ♦ రువర! పద్మ। పాదుఁడే చేయుఁగావృత ♦ భాష్యమునకుఁ।
డీకనని పల్కిరి వినేయ ♦ లేకతమున॥ ౧౨౪

చం॥ సరసి జపాదుఁడంతట వె ♦ సంజను దెంచి వచించునిట్లుశం।
కరగురుతోడ హ స్తమునఁ ♦ గల్గిన యామలకంబుఁబోలెనో।
గురువర! యద్వయంబు నెఱుఁ ♦ గుంగడుఁగావున వేగమీ రలే।
కరుణమెయిన్ గరామలకుఁ ♦ గాననిరెవ్వని నాతఁడుందగున్॥

కం॥ అనిపల్కినట్టిపద్మ పాదునిఁ గనుఁగొనిలేఁ తనవ్వ♦ తోముఖ
మెసఁగన్। దన శిష్యులెల్ల వినఁగాఁ నశంకరసంయమీంద్రుఁ
డతికృపనిట్లుల్॥ ౧౨౬

మ॥ వినుమోపద్మపదా! కరామలకుస ♦ ద్వైతత్వమన్యాదృశం।
బననైన సమాహితుండగుటశా♦స్యంబయ్యె బాహ్యప్రవృ।
త్తినరానీకమునందు నాతనికి ♦ సద్బీమంతుఁడైనట్టితం।
డ్రినియోగింపఁగనొక్కయక్కరమునే♦నిందాఁబఠింపండహో॥

కం॥ ఉపనీతుఁడైయు నీతం। డెపుడును బరమార్థసక్తి ♦ నెసఁగు

టచేవే। దపఠనము గురుని కడ ధీ। సుపరిణతిని జేయఁడయ్యె
సుంతయునేని॥ ౧౨౯

ఉ॥ ఆతఁడు బాలురంగలిసి ♦ యన్నమునుందినఁ గాఁదలంపఁడే।
నాఁడునునైన సాధువచ ♦ నంబునొకండును నోటినుండిరా।
నీఁడితఁడట్టి పీనినవ ♦ నీస్థలిభూతనిపీడితాత్ముఁగాఁ।
బాడిగనిశ్చయించికొని ♦ వచ్చిరి మాకడకుందదీయులుఁ॥

కం॥ మముఁగాంచి బాలుఁడాతం। డమితంబగు భక్తిఁ బల్మ ♦ రా
నతులంజే। సిముకుళిత హస్తుఁడగుచు జానముతానక్కజముఁగ
నెఘు ♦ నంబుగ నపుడే॥ ౧౩౦

ఉ॥ అత్తఱిమేము పీనిఁగని ♦ యర్భక! యెవ్వఁడపీవు? నీకునే।
సత్తముఁడయ్యెఁ దండ్రిగ?ఔ ♦ సన్భవదాగమమేడనుండి?నీ
విత్తఱిఁ జెప్పుమంచన న ♦ హీనసుపద్యమయోక్తులస్సధీ।
సత్తముఁడుంబ్రమోదఘన ♦సత్త్వనిఁగామునుతన్నుఁజెప్పఁడే॥

కం॥ తనపీనులనేనాఁడును। వినఁబడని తనూజవచన ♦విభవంబును
నీ। తని తండ్రియపుడు విని తుష్టిని జెంది వినయమెసఁగ వ ♦
చించెనిటులఁదాఁ॥ ౧౩౨

గీ॥ జడుఁడని జనంబుచేనెంచఁ ♦ బడియునీతఁ। డుర్వి బ్రజ్ఞోన్న
తులనైన ♦ దుర్విభావ్య। మైన పరమాత్మతత్త్వంబు ♦ నెఁద
మకడ।నననఘ!మీపఁ్రభావమే ♦ మనఁగవచ్చు॥ ౧౩౩

చం॥ యతివర! జన్మముంగనిన ♦ దాదిగ సంసృతి పాశముక్తుఁడా।
నితఁడునజద్గురుండవయి ♦ యెంతయు నొప్పెడునీకశిష్యుఁడై।
సతతమెసంగుఁగాతవిక ♦ సజ్జలజాతవనంబునందు సం।
తతముఁజరించు హంసయెటు ♦ తాఁబురకాటవిలోరమించెడిఁ

గీ॥ అనుచునీరీతి విన్నప ♦ మును బొనర్చి। యతఁడరుగనీతఁడిట
నుండె♦నది మొదలుగ। శైశవమునుండిపరమాత్మ♦ నక్తచిత్తుఁ।
డటుప్రవర్తించెడుఁ బ్రబంధ ♦ ఘటనమునను?॥ ౧౩౫

మ॥ అనుచు న్శంకరదేశికుండనఁగఁదా ♦ మాలించి శిష్యల్లడు
న్వినయంబొప్పఁగఁ బృచ్ఛచేసిరిటులు ♦ రిద్దేశికాగ్రిణ్య!తా।

ఘనవిజ్ఞానము నీతఁడున్శ్రవణము ♦ ఖ్య ప్రస్ఫుటోపాయరా।
జనౌకం డేనియు లేక యేగతిని గాం♦చెం దెల్పుఁడీ బాగుగన్।

కం॥ అనవుడు వారలఁ గనుఁగొని। యనఘుఁడు యమిసార్వభౌముఁ♦
డర్హాకృపంబా। ల్చినమన మలరఁగ వినుఁడీ। వినిచెదనని చెప్పె
నిటుస ♦ విస్తరఫణితిన్। ౧౩౭

చం॥ అమలతరంగయున్బహువి ♦ ధాఘవిపాటనపాటవప్రసి।
ద్ధమహితసుప్రవాహయు బు ♦ ధప్రకర స్తవనీయతోయయున్।
గమలహిత ప్రభూతయును ♦ గంసనిషూదనపాదకంజచి।
హ్నామ హితసుప్రభావయును ♦ నౌయమునాధుని యొప్పు
ధాత్రిలోన్॥ ౧౩౮

చం॥ యమివర వాసయోగ్యమగు ♦ నయ్యమునా తటమందు
సాధువృ। త్తమునసంగువాఁడును స ♦ దాశివ వేదియునంగ
యోగవి। త్ప్రముఖుఁడును న్బుధేద్య గుణ ♦ భవ్యుఁడుసంస్మృతి
సన్నివృత్తుఁడు। న్శమకలితుండునైన యొక ♦ సంయమివర్యుఁ
డసంగుసిద్ధుఁడై॥ ౧౩౯

మ॥ ఒకనాఁడాకృష్ణధరాసువర్వసతియ ♦ యోగీంద్రమూర్ధన్యునం।
తికమందుం ద్రిశరద్వయస్కుఁడగునా ♦ త్మీయాత్మజుం డించియు।
ర్భకునిన్నీవని నిమేషమాత్రము ద్విజా ♦ గ్రణ్యా! ప్రతీక్షింపుమం।
తకు నేవచ్చెదనంచు నెచ్చెలులతో ♦ స్నానార్థమైయేగెఁదాన్॥

ఉ॥ యోగివరుండు నట్లయని ♦ యోగముఁబూనుచుఁ గన్మొగు
డ్చుచో। నాగరయంతలోపల నె ♦ యల్లనల్లనఁబోయి బాలుఁడా।
సాగరగామినింబడి వె ♦ సన్విడెఁ బ్రాణముల న్దదీయుల।
య్యోగికి ముందుపట్టెమెయి ♦ నుంచికడు న్విలపించిరందఱున్॥

కం॥ అమ్మునివారల యాక్రో। శమ్మును వినిఖిన్నుఁడై వె ♦ సం దనదా
యో। గమ్మున నాబాలుశరీ। రమ్మునఁ దాఁజొచ్చెనంత ♦ రాణాద
లిర్వన్॥ ౧౪౦

ఉ॥ ఆయనయేకరామలకుఁ ♦ డయ్యెను గాన నెచెప్పకుండనా।
మ్నాయనికాయముల్ స్మృతి స ♦ మాజము శాస్త్రతతిన్బుధా

ఘుమా। రాయనఁదా నెఱుంగఁను డి ♦ రంబుగ నింతవచింప
నేల? యో। శ్రీయుతులార! లేదితని ♦ చే నెఱుఁగంబడనట్టి
దుర్వ్యలోక॥ ౧౪౩

ఉ॥ కాన బహిఃప్రవృత్తి యయి ♦ కాదిలెదు భాష్య ప్రవృత్తి
యందు నుం।బూనికతో నియోగమును ♦ బొందఁ దగండిలఁ
దాదృశాత్మకుం। డైన యితండు; ధాతృహరి ♦ ణాక్ష్యురు
సాక్షిక సర్వవిత్త్వుఁడౌ। ధీనిధిమండ నుండొ జగ ♦ తిందగు
బుద్ధ సుతత్త్వుఁడౌటచేః॥ ౧౪౪

గీ॥ సకల శాస్త్రాంబునిధి పార ♦ సమవలోకి। యును సముజ్జ్వల
సత్కీర్తి ♦ యుతుఁడు నమల। ధర్మరతుఁడును నైన యీ ♦
తఁడె యనర్హుఁ। డైనయెడ వేఱొకండు జ♦గానఁగలఁడె?॥ ౧౪౫

గీ॥ నేను బలువుర కిష్టంబు ♦ కానిచేఁత। నీప్రబంధంబు నందుఁ
జే ♦ యింపను సుఁడి। యేక కార్యము నందున ♦ నేకవిఘ్న।
ములు జనించుట సంశయ ♦ ము కలుగునిట॥ ౧౪౬

పద్మపాదుఁ డింకొక నిబంధనమువ్రాయ ననుజ్ఞాతుఁడగుట.

చం॥ అనవిని యావినేయులిటు ♦ లాడిరి దేశికుతోడఁ దావకా।
జ్ఞనుగొని యీసనందనుఁడె♦సల్పెడు భాష్యమునందువార్తికం
బును గురువర్య! యిమ్మహితు♦బుద్ధిబలంబు నెఱుంగులోకమిా
యనఘుడు బ్రహ్మచర్యమునినం దెయుమిప్రవరాశ్రమంబుదాః

మ॥ అననాచార్యుఁడు వల్కుసజ్జనచయం ♦ బానందమందనస్నినం।
దనుఁడీ భాష్యములోన వేఱొక నిబం♦ధంబుందగంగూర్పుఁగా।
తనితాంతంబుఁ బఠప్రతిజ్ఞమగు ను♦ద్యద్వార్తికంబెన్నఁదా।
నినొనర్పంగ సురేశ్వరుండతఁడు పూ♦నెందీక్షుఁడాఁగ్రొత్తగః

కం॥ శ్రీశంకరార్యుఁ డిటులా। దేశంబును శిష్యసంత ♦ తికినొసఁగి
రహాో। దేశంబుఁ జేరి యంతసు। రేశుని గనుఁగొని వచించె ♦
నీతిరుగఁదాః॥ ౧౪౭

ఆ॥ వె॥ ఓవినేయ వర్య! ♦ యొనరింప కీవుభా। ష్యంబు నందువార్తి
కంబు నీకను। మిగుల దుర్విదగ్ధ ♦ లగుచు పీకెల్లరు। నీవాన

ర్పుటకు న ♦ హీంపరైరి॥ ౧౫౦

సురేశ్వరాచార్యునదిమాని సతీర్థులు విశ్వసించుకోళము వ్రాయుమనుట.

చం॥ అనిశముగేహి ధర్మముల ♦ యందున నీదగుభావమున్ గనుం।
గొనుటఁ దదీయసంస్కృతిని ♦ గూర్చితిరంబగు శంకనంది తీ।
కని రిటువార్తికంబును ద్వి♦దాజ్ఞను భాష్యమునందొనర్చి కూ
ర్చుని తఁడు స్వీయధర్మమగు ♦ చుందగ భాష్యమునార్య!
యంచొగిన్॥ ౧౫౧

సీ॥ వేదప్రసిద్ధంబు ♦ కాదు యత్యాశ్రమ; మనుమాట నీదు సి ♦
ద్ధాంతమనియు। వాకిట మెలఁగెదు ♦ వారిచే వారింపఁ; బడి
నీగృహంబులో ♦ పలికిఁ జేర। లేరైరినిగమాంత ♦ సారవిద్వరు
లైన; భిక్షాటకులు దామ ♦ పేక్షలోడ। కనియు నిదాదిగా♦
నగువాడు కనువిని; విశ్వసింపరు నిన్ను ♦ వీరలనఘ!॥

గీ॥ కానఁ బొత్తముఁగాంచుమా♦త్రానవమ్మి। కంబు వీరల కెల్లను♦
గలుగునట్లు। నియతినధ్యాత్మ నిష్ఠమై ♦ నెగడు కోశ। మును
ధృతి రచించి వాకుఁజూ ♦ పుము వినేయ!॥ ౧౫౨

ఉ॥ అయ్యెడ శిష్యవాక్యిధిలి ♦ తాత్మ మనోరథుఁడై సురేశ్వరుం
డయ్యునఁ దాస్వతంత్రి కృతి ♦ సల్పఁగనిట్లు నియుక్తుఁ జేసి లే।
దయ్యెనుసూత్రిభాష్యమున♦నక్కట! వార్తికమంచుదుఃఖతుం
డయ్యె నొకింతకాలమెద ♦ నా భగవత్పదుఁ డేకతంబునన్॥

గీ॥ అంతట సురేశ్వరుండాజ్ఞ ♦ యానతిఁదన। శిరమునంబూని
నైష్కర్మ్య ♦ సిద్ధియనెడు। గ్రంథమునువేగఁ జేసి శం ♦ కరు
న కొసఁగి। కని సురేశ్వర దేశికా ♦ ఖ్యను వసుమతి॥

సీ॥ అవనినిష్కర్మత ♦ త్త్వవిషయబోధ ప్ర; ధానమై సతతంబుఁ♦
దనరునదియుఁ। బూర్వపక్షాలాప♦ములనెల్ల నొంచెదు; నిరవద్య
యుక్తుల ♦ నెగడునదియుఁ। గడు హృద్యములయి యొ♦ప్పె
దుఁ బదంబులడంబు; చేఁదుదివటికును ♦ జెలఁగునదియు।
ఘనతర దీక్షను ♦ గొని పఠించెడువారి; కురుతరానందంబు ♦
నొసఁగు నదియు॥

గీ॥ నైన నైష్కర్మ్యసిద్ధ్యభి ♦ ధానకోశ । మును మొదటినుండి
తుదిదనుకఁ ♦ గని ప్రహర్ష । భరిత చేతస్కుఁడౌచు శం ♦
కర గురుండు । చూపె నద్దానిఁ దనదు శి♦ ష్యులకునెల్ల ౧౫౫॥

కం॥ అమ్మొయివారల కెల్లను । నమ్మకము సురేశునందు ♦ నంగలి
గెనుత । త్వమ్ము నెఱింగినవారౌరు । లిమ్మహిలే రేరుననుచు♦
నెడఁదలలోనన్ ॥ ౧౫౬॥

శా॥ నిష్కర్మాత్మము నేఁడు నెచ్చటను దం ♦ డిశ్రేష్ఠులాలింతురో
నైష్కర్మ్యంబదిదేని నెప్పుఁగనుట ♦ ద్ధన్యాళికింబొందనా ।
నిష్కాముండగు నా సురేశ్వరుఁడుదే ♦ నింజేసెనా కోశమా।
నైష్కర్మ్యజ్ఞవరోత్కృపంబరఁగెఁదా♦నైష్కర్మ్యసిద్ధ్యాఖ్యచేన్

సురేశ్వరుఁడు తా రచించిన నైష్కర్మ్యసిద్ధికి శాపమిడుట.

గీ॥ దేశికానుజ్ఞచేత వా ♦ ర్తికముఁజేయఁ । గడఁగవిఘ్నంబునిత
రులు ♦ కలుగఁజేయు । కతనబుధ రచితంబయ్యు ♦ క్షితిఁజె
లంగ । దిదియనుచు శాప మొసఁగె సు♦రేశ్వరుండు ॥ ౧౫౮॥

గీ॥ ఇట్లు నైష్కర్మ్య సిద్ధినా ♦ నెసఁగుకోశ । మును దగరచించి
యాచార్యపా ♦ దునకుభక్తి । తో సమర్పించియపుడు వి ♦ శ్వా
సముఁగని । మరలనిటులాజ్ఞతో సురే ♦ శ్వరుఁడువల్కె॥ ౧౫౯॥

శా॥ గుర్వాదేశము మీఱరాని దనియు ♦ న్గుర్వాజ్ఞ నున్నీములు చో ।
నుర్విన్దేశిక శిష్యభావమదితా ♦ నొప్పారదం చెంచియో ।
సర్వజ్ఞా ! భవదాజ్ఞఁ జేసితిని గో ♦ శంబింతయేకాని యీ
యుర్విన్నా భయశోర్చనంబులకుఁ గా ♦ నూహించి
శాదేమియున్ ॥ ౧౬౦॥

చం॥ యమికులవర్య ! పూర్వము గృ ♦ హస్థుఁడనైయును నేఁడు
తత్స్వభా ।
వముగలవాఁడఁగాను సుమి ♦ వంజుల యౌవననిష్ఠనెప్పు డా ।
ల్యమనుసరించునే ? మునలి ♦ యౌనకుఁజేరు నెయౌవనంబుకిన్ ।
గుమనుజుఁడల్లెవీడి యరు ♦ గుందవపూర్వపురీతినిమ్మహిన్ ।

గీ॥ నేనుగృహినంచు యమివర్య ! ♦ మానసమున నఁ । దలఁపఁగా

రాదువారుమా ♦ త్రంబుమున్న । కారె? బంధంబుననుము క్తి ♦
గారణంబు । మనమె గృహిరాయైన యతిరాయైన ♦ మస్కరివర ।
గీ॥ శ్రుతులందుర్వాశ్రమము లేని ♦ చో మనలకు । గురువర! తదా
ప్తివినివృత్తి ♦ పరశపథము। లల్ప సమయంబులో నెట్టు ♦ లగుఁ
బ్రతిజ్ఞ । నెటు నిరోధింపకుండు న ♦ నిష్టమైన?॥ ౧౬౩
గీ॥ భిక్షమాణులు నాదగు ♦ వేశ్మపుంబ్రి । వేశముంబొందకున్న
నో ♦ దేశికవర! యెట్లుమీరందితిరి?భిక్ష ♦ నెట్లు నేనొ । నర్చితిని?
మాయలో కాన ♦ నము నెవఁడిల॥ ౧౬౪
గీ॥ దేశికవరేణ్య! తత్త్వోప ♦ దేశమునఁబ। రాత్మతత్త్వంబు నెఱిఁగి
స ♦ న్యాసమునిల । నూనితి విరాగమునఁగాని ♦ తోడికాదు।
తత్త్వనిర్ణయమునకు వా ♦ దంబగుఁగద॥ ౧౬౫
మ॥ మునుగేహస్థుఁడనై చుఁగర్మముల సం ♦ బోధింపనైయాయి తా
దిని భూర్యర్థములతో ప్రబంధముల బు ♦ ద్ధి ప్రాభవంబొప్పఁగా
త్రినినేఁజేసితినైన నిత్తతి భవ ♦ ద్దివ్యాంఘ్రినీరేజసే ।
వనముం బాసి యమీంద్ర! నాముననమొన ♦ ర్పంగోరదెద్దానిని ॥
సీ॥ అద్వైతవస్తు బ ♦ ద్ధాదరులైనట్టి; విబుధులబుద్ధుల ♦ వెలయు
చుండు। దుర్వాది సంచయ ♦ గర్వవైశ్వానర; జ్వాల మాలా
సమా ♦ స్వాదితమగు। భూరితరశ్రద్ధ ♦ గూరిమితోడ సూ;క్తా
మృతసుప్రవా ♦ హమునఁ దడిపి । నీ వహాయపుడెయు ♦
జీవింపఁజేసెద; వానవంబునఁ బరి ♦ తోసమలరఁ॥
గీ॥ గాన సంసారమనియెడు ♦ కడలిఁగడవ । సాధకంబైన నీవరి ♦
చర్యఁ జేయు। నెవఁడెదఁదలంపకుండునో ♦ యెవెలుంగఁగోవి
దచయాగ్రిగణ్య! స ♦ ద్గురువరేణ్య! ౧౬౬
ఆచార్యుఁడు సురేశ్వరుచే శ్రుతిభాష్య భాష్యవృత్తు లొనర్పించుట.
చం॥ ఇటులని యూరకుండెను సు ♦ రేశ్వరుఁడ త్తతిశంకరార్యుఁడ
క్కట! తగువార్తికంబిచట ♦ గాదుగవాయనువట్టిలోనియు ।
త్కటమగు శోకశుమ్మఘ్నను ♦ జ్ఞాలజలంబు వవార్చి తొంచెన
తట శ్రుతిభాష్యవృత్తుల నొకరృను రేశునియుక్తుఁజేయఁగ

సీ॥ భావానుగుణ మృదు ♦ భవ్యవాక్యంబుల; విలసదర్థంబును
దెలుపునదియు। హృదయంగ మాత్మీయ ♦ పదముల గుమి
తోడఁ; బూర్వపక్షముఁదోఁసి ♦ పఱచునదియు। సిద్ధాంతయుక్తు
ల ♦ చేఁ జొన్పఁబడినట్టి; సిద్ధాంతరూపమై ♦ చెలఁగునదియు।
ఘనతరాసక్తి తో ♦ డను గాంచువారల; కానందదాయకం ♦
బైనదియును।

గీ॥ నైననైష్కర్మ్య సిద్ధ్యభి ♦ ధానకోశ। మునపుడాశంకరార్యుండు
మొదటినుండి। తుదివఱకుఁ గాంచి మిగుల సం ♦ తుష్టినంది।
చిఱునగవెసంగనిటుసురే ♦ శ్వరుని కనియె॥ ౧౬౭

సీ॥ ఓవినేయవరేణ్య! ♦ నీవిప్పుడాడిన; యట్టిపల్కు నిజంబె ♦ య
గునుగాన। యాజుషామ్నాయశా ♦ ఖాంత స్థితంబైన; మత్కృ
తభాష్యనా ♦ మకనిబంధ। మునకీవు వార్తిక ♦ మును నాదు
కోఱికవే; గ రచింపుము బుధనం♦ ఘమునుతింప। నట్టులె భవ
దీయ ♦ యగు కాణ్వశాఖయం; దును నోప్పుమద్భాష్య♦ము
నకంవేగ।

గీ॥ బుధవరులుమెచ్చ వార్తికం ♦ బును రచించి। ప్రిమదమును
నాకుఁ గూర్పు మా ♦ పరహితైక। ఫలమగునుగాదె సజ్జనా ♦
వళికృతంబు। క్షితితలంబున మతిఁ బరి ♦ కించిచూడ॥

ఉ॥ అర్థులఁబాపువార్తికము ♦ నాయుగళంబున వేగఁజేయుమా।
వార్తిక చంద్రికాభనధి ♦ కంబగునున్నతిచే జయించు న।
తీక్కర్తి గడింపుమా। మొదటి ♦ తీరుగదుశ్శ్రతవాక్యరోధము।
వ్వర్తిల్లునంచు నెంచకుము ♦ నావచనంబు నెనమ్ముమాశ్రివా!॥

తం॥ అని భగవత్పదుండు తన ♦ కాజ్ఞనొసంగఁగ నాసురేశ్వరుం।
డును దనశేముషీగత ప♦ టుత్వమునార్యచయుంబుమెచ్చఁగా।
ఘనతరభాష్యయుగ్మమునఁ ♦ గల్పనఁజేసెను వార్తికద్వయం।
బును; గురులిచ్చునానయది ♦ భూస్థలిలోనవిచార్యమాఁగదా॥

చం॥ అనుచరులాత్మదేశికుని ♦ యానతిమీఱఁగరాదటంచు నెం।
చినిగమశేఖరద్వయికిఁ ♦ జెల్వుగవార్తికయుగ్మముందగం।

బూనరిచి నిస్తులంబయిన ♦ బుద్ధినెసంగు సురేశ్వరుండొసం।
గెను దనదేశికాగ్ర్యునకొ ♦ గిందగు కానుకగాఁగన త్తఱిన్ ॥

గీ॥ పంచపాదికనాఁబూర్వ ♦ భాగముప్పు। వృత్తినాఁదద్విశిష్టం
బు ♦ విశ్రుతింగనఁ। జేసె భాష్యంబునకుఁడీక ♦ నాసనంద।
నాభిధుఁడుదేశికుని దైన ♦ యానఁజేసి॥ ౧౭౪

గీ॥ ఆసరోజాత పాదుండు ♦ వ్యాససూత్ర। చయ వివేచనమునకు
నై ♦ స్వయశమునకు। విజయడిండిమ మనుటీక ♦ విపులయుక్తి
కలితకౌజ్ఞకు దక్షిణఁ ♦ గా నొనర్చె॥ ౧౭౫

గీ॥ దినకరాదిగ్రహాళిగ ♦ తిని మతిఁదగ। నంతయోఁజించి వేగనే♦
కాంతమున సు। రేశ్వరునిఁజేరి యామస్క ♦ రీశ్వరుండు। పలికె
విపులతర ప్రేమ ♦ మలరనిట్లు॥ ౧౭౬

మ॥ వినువత్సా! చరణాంబుజైదె చట ♦ న్విఖ్యాతినింగాంచుసం।
దనుసూత్రిద్వయయుగ్మ మేవసుధయం♦దున్భూరివిఖ్యాతిగాం।
చును నీవుందొలిసేత దాపరిణతి ♦ న్శోధించి మద్భాష్యటీ।
కను వాచస్పతివై యొనర్తువది సం ♦ కాశించు నెల్లప్పుడున్॥

ఆచార్యుఁడు శిష్యులందఱిని భాష్యముల నిబంధములువ్రాయుమనుట

మ॥అనుచున్నంకరసంయమీంద్రుఁడుసురే♦శాభిఖ్యుతోఁబల్కిమీ
రును నద్వైతపరంబులౌ నటుల నా ♦ ర్యుల్సంస్తుతింపంగఁబె।
క్కునిబంధమ్ములఁజేయుఁడిమ్మహిని మీ♦కూలంకషప్రజ్ఞచే।
ననిహస్తామలకాది శిష్యులకుఁదా♦నస్థానతిచ్చెందగన్॥ ౧౭౭

గీ॥ వారలెల్లరునగ్గురు ♦ వర్యునానఁ। జేసి చేసిరి వసుమతి ♦ వాసి
మీఱ। నాత్మతత్త్వాబ్జమునకు సూ ♦ ర్యాభములగు। విశద
బహుకోశములనుగొ ♦ విదులుమెచ్చ॥ ౧౭౮

గీ॥ పద్మపదుఁడంత సత్తీర్థ ♦ పర్యటనముఁ। జేయఁగాలోఁదలం
చిదే ♦ శికునకెఱఁగి। పలికె బహుతీర్థయుతదేశ♦ములనుజూడ।
నెంచెద ననుజ్ఞ [illegible]
[illegible]
[illegible]వినిమే। ణాంకసమాన మునస్మితి। మంకురితమెతంగా [illegible]

నతివయునిట్టులన్॥ ౧౮౧

చం॥ గురువరు చెంతనుంటమె యఁ ♦ గుంజమిక్షేత్రనివాసమెన్నన
గ్గురుపద కంజతోయమెంతు ♦ గున్మహితంబగు తీర్థమాసుధీ।
వరుని మహోచదేశమున ♦ వాసినెసంగు పరాత్మదృష్టియే।
ధరణిఁ బ్రశస్తమానిఖల ♦ దైవత దృష్టియగున్నదాత్రవా!॥

గీ॥ ఒజ్జచెంగటనే శిష్యుఁ ♦ డుండవలయుఁ గాని వేఱొక్కయెడ
కరు ♦ గంగరాదు। వితతమార్గ శ్రీమాతిక ♦ శ్రితున కెపుడు।
విద్రికర్మమ్ముటచేఁ జింత ♦ నీయమున్న?॥ ౧౮౩

శా॥ సన్యాసంబది రెండు తీరులుగ వి♦శ్వంబందుఁ జెన్నారు వి।
త్సన్యాసంబును నట్టులేవి విదిషా♦సన్యాసమున్నిష్యమూ।
ర్ధన్యా! వీనిని బూనునిర్వరకునుం ♦ దత్త్వంపదార్థైక్యమే।
యనన్యానంబగునట్టియత్నమునఁజిం♦త్యంబౌఁజుమీయెప్పుడున్

చం॥ కనఁబడునొక్కచోటనుద♦కంబు; మఱొక్కటఁగానుపింపదిం।
కనొకటఁగాననౌను శయ ♦ నస్థలమొక్కటఁగానరాదుగా।
వునఁగనఁజాలఁడధ్వమునఁ♦బోయెడుమర్త్యుఁడుశర్మమున్ధరి।
త్రిని శయనస్థలీజలగ ♦ తృష్ణను దాఁగలుషీకృతాత్ముఁడై॥

మ॥ అతిసారజ్వరముఖ్యరోగచయమ ♦ త్యంతంబు బాధించుచో।
ధృతివారించు నుపాయమెద్దియును నం♦తేవాసివర్యా! యసం।
గతమాఁదోవజరించు వానికిఁ జనం♦గానిల్వఁగా లేఁడువాఁ।
డతని న్వేగ సహాయుఁడైననుబరి ♦ త్యాగంబుగావించెడున్॥

ఉ॥ వేకువఁ గ్రుంకులేడను ల♦భింపదు; దేవసమర్చనంబు శి।
ష్యా! కడుదుర్లభంబగును ♦ శాస్త్రసమీరితశౌచమేమియు।
న్లేకమెపోవు; మిత్రతతి ♦ నింగనరాదు; సమాధిశూన్యమా।
నాఁకలిగొన్న పాంథునకు♦ నక్కట! కూరయు దుర్లభంబగున్॥

కం॥ అని శంకరసంయమిపాం। థునకున్మార్గంబునడుమఁ♦దోఁచెడు
కష్టా। ళిని దెల్పఁబద్మపాదుఁడు। వినిగురుఁగనిఖల్కెనిట్లు♦ విన
యమెసంగన్॥ ౧౮౪

పద్మపాదుఁడు తీర్థయాత్రల కనుజ్ఞఁబడయుట.

చం॥ గురువరులాడువాక్యముల ♦ కుంబ్రితి లేదిల నైనఁ జెల్పుదుం।
బరమసుఖంబుఁ గూర్చుగురు ♦ పార్శ్వనివాసమటన్న మీఁదువా।
క్స్వరణియె నిక్కమౌనయిన ♦ సంయమిశేఖర! దేశరాజిఁదా।
నరయక నామనంబకట! ♦ వ్యాకులత న్విడదేమి చేయుదున్?॥

గీ॥ ఉండదుదకంబదంతట ♦ నొక్కటియును। వెనుకముందువి
దిక్కులఁ ♦ దనర దెపుడు। త్రోవయును సువ్యవస్థమై ♦ తోఁప
దనఘ!। పుణ్యమెపుడేని సుఖమునఁ ♦ బొందనగునె?॥ ౧౯౦

చం॥ యమివర! పూర్వజన్మమున ♦ నార్జితమైన యఘంబె ధాత్రిజ।
న్మముఁగను వ్యాధియౌచును ఘ ♦ టంబగువట్టి ఫలంబొసంగన
న్నమహిని వాదముండదు, స ♦ నాతన కర్మమభుక్తమై స్వదే।
శమునఁ బరస్థలంబునను ♦ జంతువునంటి చరించుచుండెడిన్॥

గీ॥ ఇటవసించిన నింక నొ ♦ క్కటవసించి। ననువిడఁడు మర్త్యుఁ
గాలుండు ♦ తన సమయము। వచ్చునెడల మృతుండయ్యె ♦
వాఁడిచటికి। నరుగుటనటంట జనులమో ♦ హంబుననగు॥

కం॥ మనుముఖ్యమునులు శౌచం। బును గ్లప్తముగాఁ బ్రివృద్ధ ♦
ముగ దేశాదిం। గని చేయుఁడనిరి శాస్త్రం। బునఁ దద్గతిఁ
బోవుమమ్మఁ ♦ బొందవఘంబుల్॥ ౧౯౩

గీ॥ పడయునీశుని దయయున్న ♦ యెడల నడవి। నున్నను నరుండు
కోరిన ♦ యన్నముఁదగఁ। గోలుపోవును విధిప్రీతి ♦ కూలుఁడైన
యెడ నెదుటనున్న దాని మ ♦ ర్త్యుఁడు రయమున॥ ౧౯౪

గీ॥ తన గృహముఁబాసి తీర్థద ♦ ర్శనమొనర్పఁ। గా విదేశగుఁడై
యు సౌ ♦ ఖ్యముగ నరుగు। దెంచు, గేహగతుండును
గాంచు మృతిని। నిట్లగుటకు గురువర్య! హేతువెద్ది?॥ ౧౯౫

గీ॥ దేశకాలస్థితంబైయు ♦ దేశకాల। ముక్తమై యొప్పు బ్రహ్మ
ప్రమోదమునట। నటుఁగనెదు వారికంతరై ♦ కాగ్ర్యమున్న
యెడ సమాధి పొసంగునె ♦ ల్లెడల ననఘ! ౧౯౬

గీ॥ చిత్తమునుదేర్చు సత్తీర్థ ♦ సేవ, దేశ। ముఁగనుటఁగుతూహ

లము చిత్త ♦ మునకునగును । సుజనసంఘము నర్థాళిఁ ♦ జూర
గొనును । గాన భ్రమణ మభీష్టంబు ♦ గాదెవసుధ॥ ౧౯౭

శా॥ విద్వాంసుఁడు విదేశ సంతతినని ♦ ర్వేదుండునై యుండితా।
విద్వన్ముఖ్యునిదైన సంగతినె కా ♦ వించుం జుఁడీ ! విజ్ఞుఁ డే।
విద్వత్సంతతికెల్ల మిత్రుఁడగు ను ♦ ద్వందుష్టుతో మైత్రి; యో
యద్వైతజ్ఞ! చిరంబు నిల్వదు వెస ♦ న్సా నింగనుంజుమ్మిలన్॥

గీ॥ తావిదేశగతుండైయు ♦ భావమునను। గురు నిలుపుకొంటయే
గురు♦వరసమీపవాసమగు; భక్తిలేమి భా ♦ వమున నొజ్జఁ।
జేరఁడే నంతికగుఁడైయు ♦ దూరగుఁడగు ॥ ౧౯౯

చం॥ తనదగు బుద్ధిదేర్చువసు♦ ధన్బుధుతోడ బుధుండుకూడిబు।
ద్ధిని దగఁదేర్చుకొన్న యెడ ♦ దివ్యవివేకముఁ గాంచు మెల్లఁగా
ఘనతరమౌ వివేకమును ♦ గాంచినచో విదుఁ జుండి యల్లన।
ల్లనఁదన హేంతువౌగుణము♦లౌల్యముఁ బాయును దేశికోత్తమా॥

కం॥ ఉరునయమున నిటులో యజ। చరణుండు వచించువాక్య ♦
చయమును వినియు। ధ్దురమగు దయఁ బొల్చెడుశం। కర యమి
వరుఁడనియెనిట్లు ♦ కంజపదునితోన్ ॥ ౨౦౧

చం॥ అమలమనస్క! నీకిటుల నాగ్రహమేటికిఁ? దీర్ఘసేవనా।
ఖ్యసుహితపూర్వపార్థమునఁ ♦ గైతవమున్వహించినీకు వి।
ఘ్నము నొసరింపలేదెడఁదఁ ♦ గల్గిన దార్ఢ్యమెఱుంగఁగానిషే
ధమున నినాఁడఁ బోకుము వె♦ తంగలిగించెదునంత దూరముౕ॥

మ॥ నలినాంక్షీ! యొకతెన్నెకాదు సుమి నా♦నా క్షేత్రతీర్థప్రియా।
తలకుం గావునఁ జోరమార్గముఁ బరిత్యాగంబుఁ గావింపుని।
స్తులసౌఖ్యంబున నొండుతోవఁ జనుమా! క్షోణీసురాగారము
ల్కలవేన్నిలు; లేనిచో హితులతో ♦ గమ్యస్థలింజేరుమా॥

సీ॥ సలుపంగవలయు స ♦ జ్జనులతోడుత మైత్రి; సుఖతలినదియె
కూర్పునుసతతము। ఘటితోరు రసములై ♦ క్రాలుధ్యాత్మైక్య
కథలు ప్రశాంతసం♦ఘంబు చేత। శ్రావ్యమ్మాణమ్ములైవ♦
క్లేశంబు...ఆనందు రించి మిగాలనో... ష్నున్నంజగాటి...గాన దే

యాశతల్లన భవభయవారకములను శ్రాంత సంఘ
మున కెల్ల॥

గీ॥ విశ్రమ మహీజములును జిత్రశ్రవఃప్రమోదకరములుం
దృష్ణాపనోదకములుక్షుత్క్లాంతకాంతకములును జుమ్ము దేశి!
కాంఘ్రిసేవోత్కటామోద! యబ్జపాద!॥ ౨౦౮

శా॥ తోరివంజాల దినంబులం జనుచుఁ బాంథోమాత్రముంగూడ
నం! తేవాసిప్రవరా! గ్రహింపఁ దగదా తీరెన్నఁగాదోషమా!
నావిఘ్నంబభిగమ్యదోష తతిక ప్లాటన్మనోద్దిష్టదే!
శావాప్తింగనియుండుసౌఖ్యముగఁగార్యప్రాప్తియానంతరుణ్ ॥

ఉ॥ చేరఁగనౌస్థలంబుఁదగఁ జేరక మార్గమునందె యున్నఁచోఁ!
గారియనందునబ్జపద! కర్జము; సిద్ధికి మూలహానియౌఁ
గోరినయట్టిస్థానమునకుం జన కుంటయు నౌనుగావున!
న్దారినయుండ కేగఁ దగు స్థానముఁ బాంథుఁడువేగఁజేరనౌ॥

మ॥ తమదోషంబుల సాధువేషములచే తంగప్పి వెన్వెంటమా!
ర్గమునం జోరులు దైవమున్వసనముౕ గ్రంథంబునుందస్కరిం
చుమతిందాము చరింతురిగాన గుణసందోహంబు చేతంబ్రియ
త్నమునన్సోధ్యులుసుమ్మీఱుంగనిదరుఃన్నమ్మంగరాదెన్నఁడున్॥

ఆ॥వె॥ త్రోవనడుమనైనఁ దోరివకునామడ । లోననైనభిక్షులు
వెలయునెడఁ। జేరికొలుముచారి దిరాఁటితి వేనిఁ ద్వ। తాఁర్య
ములమ జెరుపఁ గాఁదగుదురు॥ ౨౦౯

మ॥ క్షితిలో నెద్దియనాపదంబగుచుఁ దాఁజెన్నారునో?దానిదా
మతముంజేరి భజింపు మెన్నఁడును దుర్మార్గస్థులైనట్టికు ।
త్సితులన్లోనఁ దలంపఁ బోకుము ధరిత్రిం గల్మష స్వాంత వి!
కృతిచేత న్సుఖివై చరింపుము సఖ స్థంబాఁజుమీాతుష్టియున్॥

చం॥ అనఘగురూత్తమాననమహాప్రభవంబగువాఙ్మయామృతం
బునిటులఁ గ్రోలియెంతయుఁ బ్రమోదమయాంతరుఁడై ప్ర
యాణ మారమ్యనలినపాదుఁడంతట సురేశ్వరముఖ్యులతోఁ వ
సించ కృం। గనగమునందుఁ గొంత దను కన్గురువర్యుఁడు

వానిఁ బంపితాఁ॥ ౨౧౦

శంకరుఁడు యోగదృష్టిం దెలిసి మాతృసందర్శన మొనర్చుట.

ఆ॥ వె॥ అప్పుడాత్మశక్తి ♦ దగునను భావంబు। చేతఁ దనదుతల్లి ♦
రీతి నెఱిఁగి। ఛాత్రతతికిఁ దెల్పి ♦ చదలు తెన్నునుబూని।
జననికడకుఁ జేరె ♦ శంకరుండు॥ ౨౧౧

ఉ॥ ఆతురయైనమాతఁ గని ♦ యార్యపదుండుఁ దదీయపాదకం।
జాతసమీపమందపుడు ♦ సాఁగిలి మ్రొక్కెసుభక్తితోడన।
న్నాతియుసన్నిధింజెలఁగు ♦ నందనుఁగాంచి శరీరబాధఁదా।
నాతతిఁబాసె గ్రీష్మసమ ♦ యార్దితుఁడబ్దముచేత నట్లటుల్॥

మ॥ అవనిన్నంగ విహీనుఁడై యును విమో ♦ హధ్వాంతముం
బాపు యో। గివరేణ్యుండు నిజాంబపై నలరుభ ♦ క్తిం జెం
తకుం జేరి యి। ట్లువచించె న్జననిత్రితో; జననీ! యా ♦ లో
కింపుమీ నన్ను; వే। గ విసర్జింపుము ఖేదముం దెలుపుమేఁ
గావింపఁగా నావనిన్। ౨౧౩

చం॥ అనవిని చాలకాలమున ♦ కంతికముం గుశలంబుతోడఁ జే।
రిన సుతు నాపెతాఁగని ప ♦ రిస్ఫుట హర్షమయాంతరంగయై।
కనుఁగవసమ్మదాశ్రువులు ♦ గారమెయిం బుల కల్బెలంగఁబు।
త్త్రునిక నెమందమౌ నెలుఁగు♦తో నిటుల త్తతినార్తితోఁ బఁగన్

మ॥ సుత! నీవీ దశయందునుంగుశలివై ♦ చున్నాకిటుల్గానిపిం।
చితి,పిం కెయ్యదియింత కెక్కుడయివా♦సింబాల్పుకృత్యంబు?వృ
ద్ధతచే జీర్ణతఁగన్న యీమెయిని నే ♦ న్ధాత్రిన్భరింపంగ లే।
ద; తగం దీని దహించి చేర్పుమికఁ జే ♦రంబుణ్యలోకంబునన్॥

సీ॥ అనియిట్టులనుతన ♦ జననిదౌ వచనంబు; నాలించి యాశంక♦
రార్యుఁడంతఁ। బరమసుఖ స్వరూ♦పమును మాయామయా;
శేషవిశేష దు ♦ ర్దోషరహిత। మును బ్రమాణాతిగం ♦ బును
నేకమును స్వప్ర; భంబునున ప్రమే ♦యంబునగుచు। దనరు
నెయ్యది సదా ♦ తనమూౌమ, నెటహ స్త్ర; పదముఖ భాగక ♦
ల్పనము లేదో।

గీ॥ మిన్నుఁబలెలోన వెలినద్ది ♦ సన్నిహితము। గానెపుడు దాన
నాద్యంత ♦ మైనిరామ। యంబునై యొప్పఁ బరమగు ♦ నట్టి
బ్రహ్మ। మును జననికి నెఱుకపఱ ♦ చెను బ్రియముగ॥ ౨౧౬

మ॥ తన యుండిట్లుపదేశమున్నలుప నం ♦ తన్నాధ్వయానావృ
త్త్రినితోనిట్లను; సౌమ్య! నిర్గుణమునం ♦దున్నిల్వఁగా లేదునా।
మనమట్లాట గుణాఢ్య నీశుని వచిం ♦ పంబూనుమస్థూలమా।
చునసూక్ష్మంబు నగోత్రిమాచు నెటుని♦ ల్చుంద త్త్వమాత్రం
బెదఁ॥ ౨౧౭

గీ॥ ఇట్లుపల్కెడు తన జన ♦ యిత్రివచన। మును గృపంబొల్చు
నయ్యతి ♦ ముఖ్యుఁడువిని। యాత్రిసంచయహారు నష్ట♦మూర్తి
నపుడు। భక్తివిలసిల్లనిట్లని ♦ ప్రస్తుతించె॥ ౨౧౮

ఆచార్యకృత శివస్తవము.

మ॥ పరతత్త్వార్థమునై చిదాకృతియునై ♦ బ్రహ్మేంద్రి రేశాదిని।
ర్జరమృగ్యంబునునైతురీయమునునై ♦ స్వాంతోక్త్యతీతంబునై
పరమాద్యంబున నాదిహానియుఁ బర ♦ బ్రహ్మస్వరూపంబునై
కర మొప్పారెడు శైవమామహమును♦త్కంఠంబునంగొల్చెదన్

మ॥ నిరతంబుంగడుభక్తిఁ గొల్చెద భవా ♦ నీనాథ సంసారసా।
గరపోతంబును సేవనాగత మహా ♦ తత్కంఠాఢ్యబృందారకా
సురసంతాన వినమ్రిశీర్ష విలస♦చ్చోభాఢ్యమందారసుం।
దర సూనప్రచయాభిషిక్తమునునా ♦ త్వత్పాదరాజీవముఁ॥

శా॥ గారీశాన! జగత్త్రయాధిప! విరా ♦ గప్రోల్లసద్యోగిరా।
డ్వారాంతస్థలవాస! సంశ్రిత జన ♦ వ్యాప్తోరుకారుణ్య! సం।
సారాపద్వినివారకా! విపులతే ♦ జఃపుంజమూర్తీ! నమ।
స్కారమొప్పనకల్గెళ బాంధవ! తగం ♦ గావింతు నీకిప్పుడుఁ॥

శా॥ దేవాధీశ్వర! యాదిదేవ। మదన ♦ ద్వేషీ! పురారీ మహా।
దేవా! బాలసుధాంశు శేఖర! యమి♦ధ్యేయస్వరూపా!యమా।
రివిశ్వేశ! హరాయటంచు నిను న ♦ ర్థిన్లోన నెల్లపుడు।
న్భావింతుం గృపనింపు మట్లగుట నా ♦ పై సత్కృపావారిధీ॥

మ॥ ప్రమథాధీశ్వర! దానకాల మిది; పా ♦ త్రంబెన్న నే; నీవెదా
నమునుం బాత్రునకిచ్చు దాత; వటుగా ♦ నన్నిన్నె యాచించినాఁ
డ; మఱేవారిని వేఁడఁ బోవను దయా ♦ ఢ్యా! సుస్థిరంబౌ భవ
త్పుమహద్భక్తిని నాకొసంగుమిల నా ♦ దుస్థన్యుం డెక్కుడై

మ॥ పశువుంగా నను నెంచెదేనియదియే ♦ భవ్యాశ్వమాఁగాదె నీ
కుశివా! నన్నుఁ గళంకిఁ గాననని నభ ♦ క్తున్నాస్నేహఁగాఁ దాల్చెదీ
వు శిరంబందున వానినే; నను ద్వి ♦ జహ్వుంగాఁ గ భాషించెదే
ని శుభగ్రీవము కాదె? యెల్లరు నెహో నీవొప్పినస్థన్యులే॥

మ॥ మృడ! నీకన్న మహిం బ్రపన్ననకు నా ♦ ర్తింబాపఁగా నౌశర
ణ్యుఁడు లేఁడంచుఁ దలంచు మమ్ములఁ గృపా ♦ యుక్తుండవై
యోము; మిప్పుడ మాదైన్యముఁ బాపుమయ్య; దివిష ♦ త్పూ
జ్యాత్మకా లేనిచోఁ జెడు నిక్కంబుగ భక్తవత్సలతల ♦ క్ష్మిం
పంగ నీకియ్యెడన్॥ ౨౩౫

మ॥ శివ! నేనొడ్లకు ద్రోహలేశమయినన్ ♦ జేయంగ లేనైతి నె
ట్టి విధిం బ్రీతుఁడవయ్యెదో? యెఱుఁగఁ దం ♦ డ్రీ! స్త్రీస్వపిత్రాత్మ
సంభవవిద్రోహులకైన నీవు దయచే ♦ ష్పంగాఁ బ్రసన్నుండవై
తివి; నాకేటికిఁ గావు? తెల్పుము యమి ♦ ధ్యేయప్రభావాదయా॥

శా॥ ధ్యానంబున్నుతి నర్చనంబును యథా ♦ న్యాయంబుగా సల్పనీ
శానా! నాకెఱుఁగంగరా దయినను ♦ త్సాహంబునం గొల్తుని
త్మానుస్మృతియుతుంబు రక్షితు నిమా ♦ ర్కండేమునిం బ్రోవదు
ర్మానాథ్యాంతక భంజకంబయిన యు ♦ ష్మత్పాదరాజీవమున్

మ॥ గళమందంకము మేనునందున భుజం ♦ గవ్రాతముం జేతిలో
పల వేధస్సు కపాలమున్, న్నుదుటిపై ♦ భవ్యానలాక్షుంబు, నౌ
దల బాలేందుని; వామభాగమునఁ గాం ♦ తారత్నముం దాల్చి శో
భిలుదేవోత్తముఁ దక్క వేల్పునొరు నే ♦ వేడంగఁ బో నెన్నఁడున్॥

ఉ॥ శంకరసంయమీంద్రుఁడిటు ♦ సంస్తుతిఁ జేయఁగఁ దుష్టినందియే
ణాంకవిభూషుఁడంత వికృ ♦ తాస్యుల శూల పినాకపాణులం
గింకరులన్వకీయులన ♦ నింద్యుల నాసతి చెంతకంపెనా

శంకరుమాత వారిఁగని ♦ చాల భయంబునఁ బుత్త్రితో ననున్

క॥ తనయా! వీరలఁ గనినం । తనె భీతి జనించె నా వె ♦ దం
గంపిత మ । య్యెను మేనుగాన వీరల । మునుకొని చనఁజాలఁ
దెల్పు ♦ తు మతియొకగతిన్ ॥ ౨౩౦॥

క॥ అనుచుం గడుభీతిని దన । జనయిత్రి వచింపనంత ♦ శంకరయజ్వ
భూ । ర్యనునయమున నాశివదూ । తనిచయముం బంపియుంతఁ
దల్లికొఱకునై ॥ ౨౩౧॥

ఆచార్యకృత విష్ణుస్తుతి.

సీ॥ భోగిరాట్పర్యంక ♦ మున లచ్చి తొడలపైఁ; గొమరారు పాద
కంజ ♦ ములవానిఁ । గరములభక్తిఁ జా ♦ మరములఁబూని
భూ ♦ నీళలు వీవఁగా ♦ నెగడువానిఁ । బటుభక్తినంజలి ♦
ఘటియించి యెదుటఁబొ; ల్చెడు తార్క్ష్యుచేఁ గొల్వఁ ♦ బడెడు
వాని । ధృతమూర్తులగు నస్త్ర ♦ దేవతలేవురుఁ; జుట్టఁగానడు
మఁ జూ♦పట్టువాని।

గీ॥ ఘనతమాలాభకోమల♦తనువువాని। మహితరత్నప్రభాస్ఫుర♦
న్మకుటుఁడగుట । బాల భానుమద గేంద్ర ♦ నీలనగముఁ ।
బరిహసించు హరిస్వభక్తిఁ ♦ బ్రస్తుతించె ॥ ౨౩౨॥

చం॥ తన తనయుండు దెల్పిన వి ♦ ధంబున నొప్పెడు నంబుజాక్షునీ।
శుని నపుడాసతీమణి వి ♦ శుద్ధ మనంబునఁ దాధరించి భ ।
క్తిని మృతికాలమైనను మ ♦ తి న్హరినంబుజనేత్రు నెంచుచుం।
దనయుని మ్రోలయోగులవి♦ధంబున స్వామల దేహమున్విడెన్ ॥

గీ॥ అంత శరదైందవమరీచి ♦ కాంతిదై వి । చిత్రవిచలద్ధ్వజాఢ్య
మై ♦ చెలఁగుచుసుమ । నోజ్జ్వలా వ్యోమయానంబు ♦ నుం
గొని తగ। విష్ణుదూతలు. ప్రాదుర్భవించిరపుడు ॥ ౨౩౪।

చం॥ కనుఁగవకింపుఁగొల్పుచును♦గ్రాలెడునాహరిదూతలంగనుం।
గొని పరితుష్టయైసతిత ♦ నూజుఁబ్రశంసనొనర్చె నంత వా ।
పెను బహుమానపూర్వముగ ♦ విష్ణునిదేశగులావిమాన మం ।
దున నుపవిష్టఁజేసివెసఁ ♦ దోడ్కొనిపోవఁ దొడంగిర త్తఱిన్ ॥

గీ॥ అగ్నిదినశుక్లపక్షోద ♦ గయనమూన । వత్సరదినేశవిధుతటి ♦
ద్వరుణ జిష్ణు । కమల సంభవముఖ్యులో ♦ కములనాపె । వసు
నగా దాఁటి తానందెఁ ♦ బరమపదము ॥ ౨౩౬॥

శంకరుఁడు తల్లి కినుత్తరక్రియలఁజేయుట.

మ॥ యమివర్యుండునిజాంబకంతఁజరమం ♦ బౌ సేఁతఁదానేయున।
ర్చు మతిన్బంధులనెల్లరంబిలిచె, వా ♦ రున్శంకరుంగాంచి సం।
యమి వౌనీకధికారమీజనని దే ♦ హంబుందహింపంగనో।
కుమతీ!యున్నదె?యంచుదూరిరికడు ♦ న్గోపంబుదీపింపఁగన్
గీ॥ తనను బంధుగులెంత దూ ♦ రినను గోప । మును రవంతయుఁ
జెందక ♦ యనలమునిడఁగోరి। సంయమితనబంధు ♦ గులనునెమ్మొ
నెంత వేఁడిన వహ్నిఁదా ♦ మీయరైరి ॥ ౨౩౭॥
గీ॥ దానఁబటురోష సంవృతాం ♦ తరుఁడగుచును। మిగులనెండిన
కట్టెలఁ ♦ దగఁగడించి । చేతఁగరకంబుఁగొనియింటి ♦ చెంత
మాతృ। దక్షిణ కరంబునను వహ్నిఁ ♦ దామథించె॥ ౨౩౮
కం॥ ఆదహనంబునఁ దనజన । నీదేహంబును దహించె ♦ నిర్మమి
వర్యుం। డాదీపించెడు భగవ। త్పాదుఁడు దివిజులు నుతింప ♦
బంధుగులు కనన్॥ ౨౪౦

శంకరుఁడు స్వజనులకు శాపమిచ్చుట

చం॥ అడిగిన వగ్నినీయమిని ♦ సార్యపదుండు సరోషుఁడౌచున।
ప్పుడు శపియించె బాంధవస ♦ మూహమునీగతి; నింతనుండియ
య్యెడుజడులార! సచ్ఛ్రుతిబ ♦ హిష్కృతిమీకు; భవద్గృహంబులం
దుడుగును భిక్షుసంయముల ♦ కుండెడు నిండ్లకడ శ్మశానముల్॥
గీ॥ అనుచు సంయమిశాపమి ♦ చ్చిన కతమునఁ। జదువరచ్చటి ద్వి
జులుపాసిఁ ♦ జదువునిండ్ల। యతులు భిక్షులుగొనరు; గృ ♦ హం
బుల కడఁ। గట! శ్మశానంబులయ్యె ని ♦ ప్పటికి నచట॥ ౨౪౨
గీ॥ కలిగెఁ గాలటినున్న వి ♦ ప్రులకు నెల్ల; నిట్టి కష్టంబు శంకరు ♦
నెడలఁ దామొ। నర్చిన మహాపరాధము ♦ నను। మహితుల!
మొదలఁజేసిన యపరాధ ♦ మిదునె శుభము? ॥ ౨౪౩

మ॥ కడుశాంతుండని బాధసద్బుధునకుం ♦ గావింపఁగారాదు; శాం
తుఁడు దానయ్యును బాధనందు నెడఁ బూ ♦ నుగ్రోషముం
జల్లనై! కడుసౌఖ్యంబునొసంగుచందనపు వృక్షంబైనసంఘృ
ష్టమై! యిడు నత్యుగ్రకృశానుకీలలను గా ♦ దే! భూతలం
బందునన్ ॥ ౨౮౪

శా॥ తేజోవంతులొనర్చు కార్యములశా ♦ స్త్రీయంబులైలోఁచినన్।
భ్రాజత్తత్కృత కార్య సంచయముదూ ♦ ర నాఁదు; నింద్యం
బనం। గాఁ జిత్తంబులఁ దోఁచు భార్గవుని దా ♦ కర్మంబు;
స్వీయప్రజా। రాజిన్మానులు కొందఱీయరొకో కూరి ♦ రంబా
వృకాస్యాళికిన్ ॥ ౨౮౫

సీ॥ కరుణాళుఁడైన శం ♦ కరసంయమీంద్రుండు; మునిజనులును
గోరు ♦ కొనెడు నదియుఁ। బెంపైన సౌఖ్యప ♦ రంపర చేనొప్పి;
వితమున్కమై పునః ♦ పతన రహిత। మగు నదియునునగు ♦ సు
గతికిఁ దనతల్లి; నిం జేర్చి దుర్మత ♦ పుంజమునుమ। హీతలం
బున నంత ♦ శాతనంబునొనర్చి; స్వమతంబు నిల్పఁ జి ♦ త్త
మునఁ దలఁచి।

గీ॥ దానికిందోడుగా నర్హుఁ ♦ డైన వాఁడు। దనకు శిష్యుండునగు
సనం ♦ దను సమాగ। మనమునకునై నిరీక్షించు ♦ చునుమతిని
ద। లంచిన సుకార్యమున నాల ♦ సించెనచట॥ ౨౮౬

పద్మపాదుఁడు దక్షిణదేశయాత్ర చేయుచుఁ గాళహస్తి కరుగుట.

చ॥ అనఘుఁడు పద్మపాదుఁడును ♦ నంతగురు ప్రవరాజ్ఞ చేనుదీ।
చ్యనిఖలతీర్థసేవనము ♦ సల్పపదంపడిఁ జేరెఁ గుంభమం।
దున జనియించి వార్ధినొక ♦ తోయకణం బుగఁ గ్రోలికట్టిన।
మ్మునివరుఁడుండు దిక్కునకు ♦ మోదమొదవ్విలసిల్లనల్లనన్ ॥

ఉ॥ ఆదిశరాప్య భూమిధర ♦ సైకనువారికనారతంబు స।
మ్మోదదమై సమాశ్రితస ♦ మూహ విమోహనివారకంబునా।
నాదురితేంధనాగ్నియుఁబ ♦ నాకినివాసముఁ గాళహస్తినా।
గాఁదనరారుక్షేత్రమును ♦ గాంచె సరోరుహపాదుఁడంతటన్ ॥

చం॥ కమలపదుండు దేవధుని ♦ కన్నను గన్నఁగ మిన్నయౌ సువ
ర్ణముఖియనం జెలంగుధుని ♦ స్నానమునుం బొనరించి చొచ్చె దే
వమునిజనార్తిహారియగు శి ♦ వాధవుద్దె తగు కాళహస్తినా
థుమహితమౌ గుడింబ్రవప ♦ ధూతకళంకు నుమేశునింగనెన్॥

మ॥ కనిసద్భక్తిని సంస్తుతించెను భుజం ♦ గ వ్రాతసంకాశితాం
గుని; బాలేందుకలా విభాసిత శిర ♦ స్కున్ స్ఫారికారుణ్యతో
యని తాంతార్ద్రమనస్కు బాహ నగజచే ♦ నాలింగితుం గ్రైనవా
ని నమర్త్యస్తుతులింగ సన్నిహితునిన్ ♦ శ్రీకాళహస్తీశ్వరున్॥

చం॥ పలుమఱుభక్తి మ్రొక్కుచును ♦ భావసుమంబులచే భవానితో
నలరెడు కాళహస్తిపతి ♦ నర్చితునింబొనరించి యంతనా
జలజపదుండు వేడ్కవిల ♦ సత్పృథుభక్తిని దీర్ఘయాత్రల
న్నలుపఁగ వేడియందుఁ గొనె ♦ శంకరదేవుని యానఁ దానొగిన్॥

సీ॥ పార్వతియనుపేరఁ ♦ బరఁగెడునాదిమ; ప్రకృతి కడుంబ్రహా
ర్షమునఁ జూడ; నవిరతంబును సదా ♦ శివుఁడు సాయంతనంబున
నటించెను నెట ♦ ఘనులు నమల; హృదయులునైన మా ♦
నీంద్రులు దివ్యదృష్టిని శివుతాండవం ♦ బు నెటఁగనెదరో?
జన్మమృతి ముఖో ♦ రు తర భీతిని బాపి; యెదకుఁగంటికిఁ దుష్టి ♦
నెద్ది సేయు।

గీ॥ నట్టి యురుతర మహిమచే ♦ నలరుపుండ; రీకపురమున కాపుండ ♦
రీక పాదుఁ దరిగియిటఁగల తీర్థపు టభిధ మెద్ది। టంచు నటఁ
గలవారిఁ బ్ర ♦ శ్నించె వేడ్క॥ ౨౫౨

ఉ॥ వారలలోన శంభుపద ♦ వారిజభక్తుఁ డొకండు వల్కెనీ
తీరుగ; నోయతీశ్వర! సు ♦ ధీవరులెల్లను మున్ను వేడఁగా
వారలపై నెసంగెడు కృ ♦ పన్శివుఁ డిచ్చట సుస్మరించె బ్రం
దారక వాహినిన్దనియుఁ ♦ దానిటఁ గూరిచె భవ్యతీర్థముల్॥

గీ॥ శివుని యాజ్ఞను నీతీర్థ ♦ ము వఱలెనను; కతన దీనిబుధుల్
శివ ♦ గంగయందు; రిందుఁ గూర్కిన వారల ♦ యిందుధరుని
తాండవముఁ గాంతురఘములఁ ♦ జెందుదురిల॥ ౨౫౪

క॥ భువినాట్య క్రాంతుండగు। శివునకు శ్రీమముఖమపలోనఁ ♦ జిం
తించుచు నా। శివ; గంగనాఁగనిటన। య్యె; వెలసెవశ్క్రతన
క్షేత్రి ♦ మిద్దితదాఖ్యన॥ ౨౫౫

సీ॥ సాయంతనమున ధూ ♦ ర్జటి నాట్యమును దివ్య; సంతతి వినుతింప ♦ సలుపుచుండ। నటనంబొనర్చెడు ♦ తటముచే నిహతమై; చలియించుచుండెడు ♦ జలగతిఁదగి। స్వనికేతనంబునై ♦ వఱలు చంచజ్జటా; వలినుండి యిరుపార్శ్వ ♦ ముల వినోద। వశమునఁ ద్రిపథగా♦వారి, పర్యాపత;ద్బిందుకం బయిజారి; నందువలన।
గీ॥ సారసంవేద్యులైన స ♦ జ్జనులుకొంద। ఱిమ్మహాతీర్థమును వచి ♦ యింతురు; శివ। గంగయని; దీనఁగ్రుంకి శం ♦ కరపదాబ్జ। ములఁ గని విశుద్ధమతి నాట్య ♦ ముఁగనుబుధుఁడు॥ ౨౫౬

మ॥ కడుభక్తిన్శివగంగమున్గిహిమ వ ♦ త్కన్యా మనోనాథుఁగాం।
చెడుమర్త్యోత్తముఁ డందుపుణ్య గరిమం♦జెప్పంగ నీశుండుఁజా।
లఁడన న్విశ్వములోనఁ దద్విభవ మె ♦ ల్లన్సంస్తుతింపంగ నె।
వ్వఁడు శక్తుండగు? నార్యపాదజల జ♦ద్వంద్వద్విరేఫోత్తమా।
చం॥ అని తనతోడ నిట్లటను ♦ మాధిప భక్తులలో నొకండు తె।
ల్పిన ముదితాంతరుండయి చ ♦ లింపని చిత్తము నీశునందుఁజే।
ర్చి నలినపాదుఁడంత విధు ♦ శేఖరజాహ్నవిలోనఁ గ్రుంకిలో।
కనిచయగోప్యమైన శితి ♦ కంఠుపదాబ్జముల న్భజించెఁ దాన్॥
గీ॥ తామరసపాదుఁ డంతట ♦ రామసేతు। వునకు నేగఁగఁదల
చిత్త ♦ మునఁదలంచి। పలువురు వినేయులెంతయుఁ ♦ గొలిచి
రాఁగఁ। బ్రయతమానసుఁడౌచుఁ దా ♦ బయలు వెడలె।

సీ॥ క్షీరాబ్ధివాస ర ♦ సికుఁడు, హేమాంబరుం; డు నిఖలవ్యాప కుం ♦ డునగు పద్మ। నాభ ముఖ్యాభిధా ♦ నవిరాజితునకిలఁ; బూతమై తగుదేని ♦ పులినతలము। కరము సమ్మతమౌచుఁ గ్రాలెనో? యట్టికా; వేరి నాఁ బూతమై ♦ వెలయుధుని। ఁజనుచు మార్గంబునఁ ♦ గని దానిలోఁ గ్రుంకి; తత్పుజలాభిషి ♦ క్తంబునైన।

గీ॥ కమల నాభు పదాబ్జయు ♦ గ్మమును భక్తి। నెదను ధ్యానించి
యంభోజ ♦ పదుఁడు విమల। మతిఁ యుతవినేయనిచయసం ♦
యుతుఁడగుచును। వెడలె నుచితస్థలిఁ గూర్చి ♦ వేడ్కతోడ॥

పద్మపదుఁడు మేనమామ యూరవిడియుట.

గీ॥ అంబుజపదుండు మార్గమ ♦ ధ్యంబునందు। వఱలు మాతుల
నింటికి ♦ నరిగెఁ జనుచు। ధీయుతుఁడు మాతులుండు నా ♦ తో
యజపదు। సాశ్రిపుని జాగుగాఁ గని ♦ యలరెను గడు॥ ౨౬౧

కం॥ కలబంధుగు లెల్లను మా। తుల గేహగతునిగాఁగ ♦ దోయ
జపదునిం। దెలిసి చనుదెంచి కనుఁగొని। యలరిరి కనుఁగవల
సమ్మ ♦ దాశ్రులుగారన్॥ ౨౬౨

ఉ॥ ఒక్కఁడు మోదముంగనె మ ♦ ఱొక్కఁడు రోదనముం బొన
ర్చెనిం। కొక్కఁడు లేఁతనవ్వొలయ ♦ నొక్క మెయింగనె
వేఱొకండు తానెక్కుడు పేర్మి ముద్దు చరి ♦ యించినతీరు
వచించె, వేఱొకం। డెక్కుడు తుష్టితోడ వచి ♦ యించె; స్థల
ద్గతి క్రమొక్కనొక్కఁడున్॥ ౨౬౩

కం॥ అంబుజపాదునిఁ జిరకా। లంబున కగపడిన నిర్మ ♦ లమన
స్కుఁ బ్రబమో। దంబలరఁ జూచి బంధుజ। నంబెల్ల వచించె నిట్టు
ఘ ♦ నంబగు వేడ్కన్॥ ౨౬౪

కం॥ చిరకాలమునకు మాకను। తెఱఁగును జేరితివి; నిన్నుఁ ♦ దిల
కింపఁ దలం। తురు; మైత్రి నెల్లబంధులు। కరుణాకర! మైనఁ
జూడఁ ♦ గారావుగదా!॥ ౨౬౫

కం॥ తనయులుఁ జుట్టలు నెచ్చెలు। లును లేరు మహీసుబాధ ♦
లోపించును। జోరనిచయ భయముండదు కా। పున ధన్యత్వా
స్పదంబ ♦ వు న్యతితమహిన్॥ ౨౬౬

ఆ॥ వె॥ పూలబండ్లగుమిని ♦ బాడుగు కొమ్మలనొప్పు। పెద్దతరువుఁ
జేరి ♦ పీడసేయు। రీతి; ధనికు దరు ద ♦ రిద్రులు బాధింతు।
రను దినంబు సద్బుధాగ్రగణ్య!॥ ౨౬౭

చం॥ అమితకుటుంబ పాలనప ♦ రాత్మతనుండెడు మానవప్రశ
స్త్యము సంగ దక్కె నిద్దురయుఁ ♦ గల్గదు; దేవసమర్చనంబు నె
ట్లమరును? తీర్థయాత్రయెటు ♦ లయ్యెడు? సంయమివర్య!
మిమ్ముఁబోలు మహాత్ములైనవారి నిల ♦ లోనెటు గాల్చెదు
భాగ్య మబ్బెడిన్॥ ౨౬౯

కం॥ అంచితుఁడవీవు యతితం। గాంచుట నెఱిఁగితిమి మాదు ♦
గ్రామంబునకే। తెంచిన యొక పాంథునిచేఁ। బంచెనుయాత్రా
చ్ఛలమున ♦ బ్రహ్మమిటకునిన్॥ ౨౭౦

సీ॥ పరవివర్ధితములౌ ♦ తరువులపైఁ జేరి; సుఖమిడువానిఁ బ♦ క్షులు
విడుగతి। నన్యప్రక్లృప్తంబు ♦ లగు మఠదేవాల; యంబులఁ జేరి
సం ♦ యమి వరుండు। నిజముగాపి డు వా ♦ నిని దేటులెల్లఁ
బు; వ్వంబులఁ జేరి సా ♦ రంబనఁ దగు। రసమునే కోరులు
క ♦ రణిని సంయమియు సౌ; ఖ్యమునంది యింటింట ♦ నన్న
మెకొనుఁ॥

గీ॥ గాయమే దేహమగు నాత్మ ♦ గలికళత్ర। మగును; సంయ
తమే సౌఖ్య ♦ ముగరహించు। ఘనవిరాగయుతాశ్రవ ♦ ర్తన
యులట్టి। యమివరునికున్నె? యింకఁ గా♦మ్యము మహాత్మ॥

చం॥ మనుజ మనోరథాళికి స ♦ మాప్తియొసంగదొకండుగల్గఁగో
రును మఱియొందుకామ్యమున♦రుండు దివానిశలంబ్రియత్నముం
బొనరుచు భార్యఁగైకొనఁగ ♦ముద్దియచేకుతనేనిఁగోరుఁదాఁ।
దనయులనట్టి కామిని క♦తంబునఁగాంచఁదలంచునొందుదాన్॥

ఉ॥ కోరిన వాంఛితంబులోన ♦ గూడకయున్న యెడన్నరుండు వి
స్తారపుదుఃఖముంగనును♦ తామఱియిష్టవియోగమందు;లో।
నారసిచూడఁగామవశు ♦ డందును దుఃఖమునెట్లు కావున।
న్సారవిరాగము న్సతత♦ముంబురుషుండు వహింపఁగావలెన్॥

గీ॥ శ్రాతః హృదయ విశుద్ధి వి♦రాగమునకు। మూలమై; దానికిని।
మూల♦ముబుధసేవ। యని ఘనులు తెల్పి; రనఘ నీ।యట్టివార♦
లొరుల మేలునకై దాన♦దిరిగదరిల॥ ౨౭౩

చం॥ తిరిగెద రార్యలీవసు మ♦తీస్థలి నెల్లెడ స్వీయగోత్రముం
బరులకుఁ దాచుచు న్జడుల♦ భంగిని లోకపుఁజూడ్కికిం దోఁచుచు
న్గురుకృపభూతకోటిశయిఁ♦గొల్చుచు నోయనఘా! యథేచ్ఛఁ జే
కుఱిన పదార్థముం గొను చ♦కుంఠితమౌగతి జ్ఞానతత్త్వులై॥

మ॥ అమలంబై తగు నాత్మవిద్యను మహా♦హాస్యం హాతిం గాల్చి శు
ద్ధమతుల్ కాలఁ జరింతు రీలోకతతిం ది♦ ద్ధవాత్రిమున్ సంగ్రహిం
ప మహాత్ముల్యతి సంచయప్రవర!త♦ద్భవ్యాత్మ సంజుష్టతో
యమునే తీర్థముగాఁగఁ దెల్పుదురు వి♦ద్యావంతు లెక్కాలము॥

చం॥ ముద మొనగూర్చె భవ్యమయి♦ పొల్చెడు నీదగు దర్శనంబు; కొ
న్ని దినములుండు నీవిటమ♦ నీషివరాగ్రణి! యింక నెప్డొ యే
గుదువని యీజనవ్రతతి♦ కుందెడు నన్ను ననంగి వైననీ
వు దయను వీడి యేగు నెడఁ♦ బొందెడు దుఃఖముఁ జెప్పశక్యమే?

సీ॥ అలజడి గుమియను♦ మలమునకుం గోశ; మతిసాహసంబున♦
కాలయంబుః బరదోషసూచక♦ త్వమునకు నాధార; మనృత
భాషావిశే♦ షాశ్రియంబు; లమితహింసా మాంస♦ లము
దుష్టసాంగత్య; యుక్తంబును ద్యజంప♦ నుచితమునయి యతి
నింద్యమగు గేహ♦ మాశ్రియించుటఁ జేసి; ఘనధనాశంసఁ
గూర్చి♦ రనియతులము॥

గీ॥ దురితయుక్తుల మట్టి మ♦మ్ము రుతరదయ నెసఁగెడు నపాంగ
ములఁ జూచి♦ వెసవిశుద్ధ మతులఁ గావింపుమిట నుండి♦
నుతులఁ బెక్కు లాచరింతుము యతిసంచ♦యాగ్రిగణ్య!॥ ౨౭౭

కం॥ అని దైన్యమంది బాంధవ జనమెల్ల వచించినట్టి♦ సద్వాక్య
ములన్ విని యలరి పద్మపాదుండను వారలతోడ నిట్టు♦ లధిక
కరుణతోన్॥ ౨౭౮

బంధువులకుఁ బద్మపాదుఁడు ధర్మోపదేశ మొనర్చుట.

గీ॥ వరహృదయులార! వినుఁడు దై♦వమె నిఖిలముఁ గూర్చు విడఁ
జేయుఁగా నవి♦జ్ఞులకు నిష్ట సంగతి నివృత్తులొందవిన♦ సమ
యములను నిర్వికార మనస్కత♦ నెగడుటొప్పు॥ ౨౭౯

గీ॥ మిట్టమధ్యాహ్న మప్పుడు ♦ బెట్టెదంపు। టాఁకలిని దప్పికందూలి నాకు నెవ్వ। రోగిరముఁ బెట్టెదురొ? యంచు ♦ నేగుదెంచు। మనుజుఁ దేర్చిన గృహిపుణ్య ♦ మన నలవియె॥ ౨౮౦

చం॥ అనుదినము న్ధునీజలము ♦ నందునఁ గ్రుంకుచుఁ గేలదండముం। గొని హరిణాజినంబు మెయిఁ♦గూరిచి మాపును రేపు వహ్నియం దునఁ దగ వేల్చుచున్న యతి ♦ తో శ్రుతి వాక్యములం బఠించుచే చిన క్షుధతోడఁ దావసుగు ♦ సేరురయంబున గేస్తునింటికిన్॥

కం॥ అధ్యాత్మ వేదియై పరి। నాధ్యయనముఁ జేయుచును య ♦ తాత్ముండగు చు। న్మధ్యాహ్నమునకు గృహి గృహ। మధ్యమునకుఁ జేరు నెపుడు ♦ మస్కరియు నొకన్॥ ౨౮౨

గీ॥ జడలతాలుపు నింటిజేఁ ♦ డి డినయోగి। రమున మెయిఁ బెంచి కొనుచుఁ దీ ♦ వ్రమగు తపముఁ। జేయుటను దత్ఫలం బెన్నఁ♦ జెందునిర్వు। రనని సత్స్మృతి ఘోషించు♦ననఘులార! ౨౮౩

గీ॥ తెలిసినలరెడు నిల్లుజేఁ ♦ డలయ కుండ। దెంకినుండియె తీర్థ యా ♦ త్రికులఁ గొల్చి। పడయనగుఁ జుండు పుణ్యంబు ♦ బహుళకష్ట। సాధ్యయాఁ దీర్థముఖసేవ ♦ జగములందు॥ ౨౮౪

మ॥ ధనికుండో నిలుజేఁడె యెల్లరకు నుం ♦ దానెక్కుడం చేఁదలం। తును దాస్యంబున నొక్కఁడింకొకఁడు బం♦ధుత్వంబున న్వేఱొకం డును జౌర్యంబున నింకొకండుఁ బ్రణయా♦ధ్యుండై మఱొకండు నై। త్రిని నన్యుండు బలంబుచే నతని దా ♦ శ్రీనంది జీవించుటన్॥

మ॥ నిగమజ్ఞుండగు విప్రునందెది విజా ♦ నీకంబులొ ప్పారు నం। చుఁ గడుం స్వేదమె తెల్పుఁగాన నిగమ ♦ జ్ఞుండైన భూదేవు నె। చ్చుగు భక్తిన్ భజియించి హార్దకలితుం ♦ డౌనట్టిగా నల్పు భ వ్య గుణుండెల్ల సురాళిఁ దన్పి నఘనుం ♦ డౌఁ జుండు ధాత్రీస్థలిన్॥

సీ॥ నియతాత్ములు స్వకర్మ ♦ నిష్ఠులు నిఖిలార్థ; విదులు, జితేంద్రియ వితతులు; నని। శము నొష్టకుపకృతి ♦ సలుపుటయే ఘన; వ్రతముగాఁ గొనినట్టి ♦ వారలైన। మహితులెల్లరును ని ♦ ర్మములై గృహస్థుని; తెంకిఁ గూర్చియె యెల్ల ♦ తీర్థములను। దగఁ

గొల్చియే తెంచె ♦ దరు; వారిఁ దన్నెడు; గృహియింటనున్నన♦
కిల్బిషుఁడయి।

గీ॥ కమనఖిల తీర్థనంసేవఁ ♦ గలుగు ఫలము। గాన నతనికిఁ దీర్థ
మె ♦ క్కండె తీర్థ। మని వచించిరి బుధులు; ధ ♦ నాఢ్యుఁడైన।
యిల్లు తేఁ డొండెడకు నెప్డు ♦ నేగరాదు॥ ౨౮౭

కం॥ ఎలుకలు మొదలగునవి; లో। పల మెలఁగుచు బ్రిదుకు; ధే
ను ♦ పక్షిమృగముఖం।బులు బ్రిదుకు బయటఁగావున। నిల
యిమెఘనుఁడెల్లరకు న ♦ ని తలంచెద నేఁ॥ ౨౮౮

మ॥ పురుషార్థంబుల కెల్లమూలమయి గొ♦ప్పౌ న్మోనుసూ; దానికో
గిరమేమూల మటంచు వేదముల ల ♦ క్షింపంగనౌ; నద్దియు।
న్వలు నేస్తుహితంబునందె; యటుగా ♦ నన్నుత్ఫలంబెల్లసా।
దరగేహాధిప భూరుహాశ్రియమె యా♦దర్శంబుగానిస్మృహీ॥

చం॥ మఱియువచింతు నాదరము♦మైవినుఁడీరలు సుక్రి–మీాదుమం।
దిరములఁ జేరినట్టి యతి ♦ ధింగోలువుండు; సముద్ధరించు వి।
స్ఫురితభవత్కులంబును సు♦ పూజితుఁడైన; నతండుఁదానిరా
కరణమునందె నేనియగు ♦ కష్టముఁ జెప్పను దెల్పరామి చేఁ॥

గీ॥ చేయుఁడు ఫలాభిసంధివ ♦ ర్జించి శ్రుతిస। మీారితంబగు కర్మం
బు ♦ మీారలెపుడు। జగదధీశుఁడు సంతుష్టుఁ ♦ డగుతమంచు।
దానమీామానస విశుద్ధి ♦ దనరెడునొగి॥ ౨౯౧

చం॥ చెవులకునింపుగాఁ బలుకు ♦ చేడెలనక్కునఁ జేర్పవారిచ।
న్గవలపయిన్విరాజిలు సు ♦ గంధమహాగరుపంకయుక్తిమా।
దు విమలచిత్తకంజమతి ♦ దూషితమైనను సంయమీంద్రపా।
దవనజసేవఁ బాసెదురి ♦ తంబులు ధన్యతఁగంటి మీా మొడన్॥

గీ॥ బంధుగులకిట్లు బోధించి ♦ పద్మపదుఁడు। సలిపె భిక్షను మా
తులు ♦ సదనమునను। యడిగె భుజియించు యమిని శి ♦ష్య
కరమందు నలరుకబ్బమిదేమటం ♦ చపుడు మామ॥ ౨౯౩

స్వయంకృత శంకర భాష్య టీకను పద్మపదుఁడు మేనమామకిచ్చుట

మ॥ ఇది భాష్యంబునకైన టీకనుమిసూ ♦ రీశాన! యుంచంబురు।

ఉ॥ వానికినైసుతాదులగు ♦ వారలు శ్రాద్ధముఖార్హకృత్యసం।
తానమొనర్చఁ గావలయు♦దారుణమై తగుప్రేతతన్విదం।
గానురుపుణ్యలోకములఁ ♦ గాంచఁగఁబిండములగ్గయాదిని।
ర్వాణమునందనీఁదగుఁ బు♦రాణములందిటు తెల్పఁగాఁబడెన్॥
గీ॥ అక్కతంబునఁ బదునేడు ♦ నంశములనె। సంగలింగతనువ్రతో
వి ♦ హంగమట్లు। చనును జీవుఁడు పరలోక ♦ మునకటంచు।
రూఢిగాఁదెల్పఁబడెఁగాన ♦ మూఢ! చనుము॥ ౪౧౫

చం॥ యమివరుఁడిట్టులాడవిని ♦ యాతఁడు వేసముబాసనంతవే।
గముగఁ బరిత్యజించి యవి ♦ ఖండదయాంతరుఁడైన యగ్గురూ।
త్తమునిపదద్వయంబునకుఁ♦దానురుభక్తిని మ్రొక్కితత్సుకో।
శముల భరమ్ము మోసెడుల ♦ సన్మతి రాజిలెనంతనుండియున్॥

సౌగతునితోడి వాగ్వాదము.

గీ॥ అంత బలిసిన మేనితో♦వింతదోఁప। సౌగతుండొక్కఁడయ్యతి
సత్తముకడ। కగుగుదెంచి ప్రణామమ్ము ♦ లాచరించి। పలికె
నెల్లరు వినఁగని ♦ ప్పగిది నపుడు॥ ౪౧౬

చం॥ యమివర! మూఢభావమున ♦ నక్కట!యీజనమెల్లఁగర్మశీ।
లమగుచు నుండెఁ జూడఁగఁజె ♦ లంగదుభౌతికమైనయీశరీ।
రమునకు స్నానదానముఖ ♦ రంబులచేత విశుద్ధియెప్పుడు।
న్విమలుఁడుజీవుఁడౌ మెయిభు♦వింబడుమాత్రనెముక్తుఁడౌఁజుడీ॥
చం॥ తనువుఁదొలంగిపెండియును ♦ ధారుణిజీవుఁడుపుట్టు దారుణం।
బున ననికొందఱందు రతి ♦ మూఢులు వారు ధనంబనంగమే
దినిఁ దనుముఖ్యజంబగున ♦ దృష్టముచే నొగిలభ్యమౌనుగా।
వునఋణభీతిఁజెందమునఁ ♦ బొందఁగనక్కర లేద యేరికిన్॥
కం॥ తనుహానికలుగనవల। క్షణమైననులేమి ఋణము ♦ సలిపియు
నాజ్యం।బునుగ్రోలవలయున నెడువ। చనమేమానమగుఁజుమ్ము
సంయమివర్యా!॥ ౪౨౦

ఉ॥ కావునమేనిఁ బెంచికొనఁ ♦ గావలయుంజమిసంతతమ్ము మే।
ధావికిలన్ ఋణంబున సు ♦ తారముగా నఖిలాదనోత్సుకుం।

డా విమలాత్ముఁడే సుఖము ♦ నందుసుఖాప్తియె సూవిముక్తి నా
గావిలసిల్లుఁ గావున సు ♦ ఖంబును బొందునరుండె ముక్తుఁడా॥
మ॥ అనుచుం బల్కెడు సౌగతుం గని యతీ ♦ శాగ్రేణ్యుఁ డీరీతిఁ బ
ల్కెను నీవాడినదెల్ల వ్యర్థము నున ♦ శ్లీలంబు నా ధాత్రిఁ జే
సినదా కర్మఫలంబునంద నిగమ ♦ స్మృత్యాదులం బ్రోక్తమ
య్యె నిరూఢింబరలోకయానముఖమా ♦ యీదేహభృత్పాళికిన్॥
గీ॥ తాన ఋణముఖ్యములఁ జేయు ♦ వానికి జన । నము మరల ధాత్రినగుట ని ♦ క్కము దురిత పిహితమయినయట్టి యజ్ఞాన ♦ మతిని గివిడి నిలుము సత్పథముననఁ ♦ బలుకునతఁడు॥ ౨౨౩
సీ॥ మునుసుగతుండను ♦ మునివర్యుఁడిల నెల్లఁ; గనుఁగొని మిగుల న ♦ క్కజమునంది జగమునకెల్లలో ♦ న త్త్వంబుఁ జింతించి; ప్రాణిసేవాతత్ప ♦ రత్వమూని ధర్మంబులందు ను ♦ త్తమ ధర్మమన నొప్పుఁ; జిమ్ము ప్రాణ్యవిహింస ♦ నమ్మనంగ నట్టి ధర్మంబుఁ జే ♦ పట్టి కపాలవి; వర్తనంబునఁ దగ ♦ వఱలెడేని।
గీ॥ నోగి విముక్తుఁడవగుదంచు ♦ నురుకృపనుప దేశ । మొనరించె నాకు న ♦ ది మొదలుగను నమ్మహాత్ముని యానతి ♦ రమ్మునగాని దేహులందెల్లఁ గరుణ వ ♦ ర్తింతు నెపుడు॥ ౨౨౪
చం॥ అరయ నహింసకన్న ఘన ♦ మైతగు ధర్మము లేమిఁ జేసి యీ ధరణిని నెల్లవారికి స ♦ తమ్మును నాదగు నీమతంబె సా దరముగ నూనఁగాఁదగుఁ ది ♦ దం డివరేణ్య! యటాట నీవు స త్వరముగ దీని నూని కడు ♦ ధన్యత నందుము శిష్యపాళితోన్॥ ౨౨౫
కం॥ ఇటులా సౌగతుఁడు వచిం । చుట విని సంయమివరుండు ♦ చోద్యంబుగ నం తట నాస్యమెఱుపుఁ గన పి స్ఫుటముగ వచియించె నిటులు ♦ బుద్ధవిడంగన్॥ ౨౨౬
ఉ॥ పేర్మిలకు మూఢ! సౌగత! ధ ♦ రిత్రిని ధర్మమొకానహింసకే దాలివచించె "జన్నముల ♦ నౌపశుహింస సుధర్మ" మంచు నెం చ్చొలలి శ్రోతుముఖ్య సవ ♦ నావళిలోఁ బశుహింస నాకరం బీలలి వేదవాగ్గతుల ♦ కేయగు నొడ్డన వేద్యులిమ్మహిన్॥ ౨౨౭

మ॥ శ్రుతినిందాపరులై సదాచరణ సం♦శూన్యాత్ములై వారలీ।
క్షితిఁ బాషండులనంబరంగెదరు ల ♦ క్షింపంగ వారెల్ల స।
త్రి(స్క)తిదేవోద్భవులయ్యు నన్నరకముం ♦ జెందంగలా రబ్జజా।
క్షితిదాకన్వసియింతురందని మను ♦ ష్యోన్మత్తమున్నాఁడె?॥

గీ॥ తాన బ్రాహ్మణ ముఖ్యంబు ♦ లైన వర్ణ। ములకు నెల్లను నా
మ్నాయ ♦ ముఖ్యములని। రూపితంబగు నాచార ♦ మే పరమ
ను। మానమధముండగునునది ♦ లేనినరుఁడు॥ ౪౨౯

కం॥ యతివరునుడివిని యాసా। గతుఁడభిమానముఁ దొలంగి♦ కడు
భక్తియతీ। శితకేలఁగికరముఁదచ్చి। ష్యతతి సేవించుచుండె ♦
నదిమొదలుగఁదాన్॥ ౪౩౦

క్షపణకునితోడి జైనమత ఖండనము.

గీ॥ గోచి మాత్రంబు దాలిచి ♦ గోల యంత్ర। మొక్క కేలను
బూని వే ♦ ఱొక్క చేతి। చేఁ దురీయంత్రముఁ గొనియ ♦ చ్చెరు
వుగ నొక। క్షపణకుండంతవచ్చి శం ♦ కరయమికనె॥ ౪౩౧

సీ॥ యమివర్య! వినుము చి♦త్రమ్మునై పరమశోభ; నమ్మునై యెసం
గెడు ♦ నాదుమతముఁ। బూర్ణసమయనామ ♦ మున నొప్పునే
నీసు; యంత్రంబులను సమ ♦ య ప్రవర్త।కుండయి గ్రాలుమా♦
ర్తాండుని బంధించి; కాలమెఱిఁగి ముజ్జ♦గంబువందు। శుభము
నశుభము విస్ఫుటముగాఁ దెల్పెదఁ; గాలంబు దైవమై ♦ క్రాలు
నాకుఁ।

గీ॥ జాలఁడీశుండు నాదు ప ♦ క్షంబు నొంప। ననవుడు యతీంద్రుఁ
డాతనిఁ♦గని తగ వచి।యించితి వహైననినుఁ బరీ ♦క్షింపవలయు।
నంతవఱకిట నుండుమి ♦ వనివచించె॥ ౪౩౨

కం॥ దానికి క్షపణకుఁడునునటు। లేనిలిచెదనిచట సంయ♦ మీశ్వ
ర!మీదా। నానతినని యంగీకృతి। నూని యతీశాంతికమున ♦
నుండెనయమునన్॥

సీ॥ మెయినెల్లఁ గడుమల ♦ మయమౌచుఁ దోఁపఁగా; పీనమాత్ర
ముఁదాల్చి♦జైనుఁడంత। శూన్యలాంఛనుఁడును ♦ శూన్యపుండ్ర

కుఁడునై; బిందుపుండ్రము నాస్య ◆ మందుఁబూని। చూచు నెల్ల
రకుఁబి ◆ శాచమట్లురుభీతి; గొలుపుచు శిష్యులఁ ◆ గలిసి సతత।
గర్హితకర్ముఁడై ◆ "యర్హాన్నమ" యటంచు; బిగ్గరగాఁగడు ◆
మగ్గడించు॥

గీ॥ చునుయతీశ్వరునంతి క ◆ మునకువచ్చి। యెదుటనిలఁబడి ప్రణ
తుల ◆ బొదలఁ జేసి। యతికులవరేణ్య! వినుము మా ◆ మత విధంబు।
ననుచు నీరీతి నెల్లరు ◆ వినఁగఁ బలికె॥ ౪౩౪

సీ॥ జీవాత్మతనుజన ◆ దేవుండె సకలదే; హంబులయందము లయందు ◆
నొప్పు ముక్తి। మండయి యతఁడు ము ◆ క్తుండగు జ్ఞానమా; త్రి
ము చేత దేహపా ◆ తమగు పిదప। జీవుండు శుద్ధుఁడై ◆ చెలఁగు
నెప్పుడు దేహ; మనమలపిండమా ◆ నట్టిమేను। స్నానాది
కృత్యసం ◆ తానంబు చే నెప్పు; డును విశుద్ధినిగాంచ ◆ దునిజ
ముగను।

గీ॥ గాన స్నానాదికముఁ జేయఁ ◆ గాఁదగదిల। నించుకయు సార్థకత
లేమి నేరికేని। ననుచు నాజైనుఁడు వచింప ◆ నాలకించి। పలికె
శంకరసంయమి ◆ పరివరుఁడిట్లు॥ ౪౩౫

మ॥ కుమతీ జైన! యసంగతంబులు త్వదుప ◆ క్తుల్ సుమ్ము స్థూలంబుసూ
క్ష్మమునుం గారణ నామకంబును నసం ◆ గానంగములు మ్మఁడుని।
క్కమౌ గా జీవునకుం డెడి స్త్రిమముగాఁ ◆ గాంచుస్థ యం బెప్డుదే।
హముల్ మూఁడును నష్టై జీవుఁడగు ని ◆ త్యానంద చిద్రూపుఁడై॥

గీ॥ ఈశ్వరునికంటె భిన్నుఁడ ◆ నేననుమతి। యేయవిద్యయగు
న్బద్ధుఁ ◆ జేయునదియె। యదితొలఁగ ముక్తి యొదవు శ్రీ ◆
యమిటు దుర్లభమగుఁ గావునఁ దీరదం ◆ గము పడుట నె॥ ౪౩౬

మ॥ యమివర్యుండిటు వల్కనానుడుఁ డా ◆ నాలించి వేశిష్యసం।
ఘముతో బాసను వేసముం దొలఁగిరా ◆ గత్యాగముం జేసిని।
త్యమునుం దేశికపంచయంబునకు భా ◆ న్యాకర్షణంబు బ్జపా।
దముఖానుజ్ఞఁ దదాదిజైనుఁడు ఫణి ◆ గ్ధర్ముండునై చేసెదుగా।

శబలుండను బౌద్ధునితోడి వాదము.

కం॥ అంతట నయ్యమివర్యుని। చెంతకు శబలుఁడను పేరఁ ♦ జెలఁగెడు బౌద్ధుం। డంతే వాసియుతుండయి। యొంతయు వేగముగవచ్చి ♦ యీగతిఁ బలికెన్॥

సీ॥ యమివర్య! నీదుబో ♦ ధము నిరర్థం బగు; మనుజశృంగముతోడ ♦ మహిని భేద। మెన్నఁగా సామ్యంబు ♦ నెనయును సగోత్త్ర; ముఁడ వేటికిట్టు పరివృ ♦ త్తుఁడవయితివి?। చూడఁబడు ఫలంబు ♦ వీడి కానఁగరాని; ఫలముఁగోరెదవు నీ ♦ విలనుదృష్టా। విద్రోహి వై కట! ♦ వెలయదు సూపరో; క్షమున ఫలంబు లే ♦ శము నీకు।

ఆ॥ వె॥ నరయశూన్యమైన ♦ యట్టి పరోక్షంబు। ఫలముకొఱకుఁ గాదు ♦ తలఁపనీదు। మతమి దెన్న జీవ ♦ యుతముగా మినిరర్థకమ్మె యగు నిది యెని ♦ జమ్ము సుమ్ము॥ ౨౨౦

ఉ॥ నాదుమతంబునందున స ♦ నాతనుఁడే కుఁడునయ్యు నాత్మచిత్తాదుల కెల్లఁ జేరికత ♦ నందు ననేకుఁడుఁ జేతనుండునై। తాఁ దనరారు, ద్వైతరహి ♦ తత్త్వమున న్సుఖరూపియుం బరా। మోదుఁడు శాశ్వతుండుఁ బరి ♦ పూర్ణుఁడునై కడు నిత్యముక్తుఁడై॥

గీ॥ నేనె కర్తను భోక్తను ♦ నేనె; నేనె। గాపరానందమయుఁడనై ♦ కాలుదు; నని। తలఁచుచు నభీష్టమొసఁగునం ♦ తకుఁ దనుపుల। నాడుచు విముక్తుఁడగును దే ♦ హంబుఁదొఱఁగి॥ ౨౨౨

కం॥ అనుచా శబలాఖ్యుఁడువ। ల్కిన విని సంయమివరుండు ♦ లేనగవున నా। ననమలరఁ బలికె నపుడా। తనితో నీతీరుగాను ♦ తంబగు ఫణితిన్॥ ౨౨౩

గీ॥ సత్యశౌచపరుండునై ♦ నిత్యమెవఁడు। దేవతాతిథిపూజ భ ♦ క్తి మెయిసల్పు। నతఁడు విధిలోకమున కేగి ♦ యటవసించు। బదునలుగు రింద్రులుండెడు ♦ వఱకుఁ జుమ్ము॥ ౨౨౪

శా॥ దేవప్రీతిదమై శతుం జెలఁగు జ్యో ♦ తిష్టోమముం జేయు భూ। దేవుం డందును నాకలోకమును దృ ♦ ప్తిన్ బొండరీకంబు నా।

గావిశ్వంబున ఖ్యాతినింగనినయా ♦ గమ్ముందగం జేయుచోఁ।
దావిభ్రాజిత సత్యలోకమునకు ♦ దవ్వుద్దీతిగా నేగనా॥ ౭౭౫

కం॥ స్ఫుటదురుభక్తిని ధరలో। నరుఁడే యే వేల్పుఁగొల్చు ♦ నయము మెయిందా। దురితములఁ దొలఁగి యాయా। సురవర్యునిలోకమునకు ♦ సొంపుగనరుగున్॥ ౭౭౬

శా॥ ఏయేభక్తుఁడు శ్రద్ధతో నెసఁగియే ♦ యే వేల్పునర్చింప నెం। తో యుక్తంబుగఁ గోరు నిర్మలహృద ♦ ర్జోజంబు నంజూడనే। నాయాభక్తునకుంబొనర్తునచలం ♦ బై శ్రద్ధగా శ్రద్ధఁజూ। మ్మాయా వేలుపునందు నిక్కముగ జా ♦ డ్యంబెల్లహోనింగనన్

కం॥ ఇవిమున్నుగ నెసఁగెడు వచ। నవితతినిం జేసి జీవు ♦ నకుఁ బర లోకా। ప్తి వలఁగావున రాదు త। నువువడుట నె మోక్షమగు జ ♦ నుమ్మ త్తతికిన్ ౭౭౭

సీ॥ తనయందునఖిల భూ ♦ తములఁదన్నఖిలభూ; తములయందున నారతంబుఁగనుట। నేపరబ్రహ్మంబు ♦ నొప్పుఁబొందనరుండు; గాని యొంకొక్క మా ♦ ర్గమునఁజెందఁ। గానోపఁడనుటాది ♦ గానొప్పశ్రుతివచో; నీకంబుజ్ఞానంబు ♦ లేకము క్తిఁ। గాంచ రాదంచువ ♦ చించెఁగావునఁగల్పి; తమగుజీవత నుస ♦ త్వరమెవీడి।

గీ॥ తన్నుఁబరమాత్మఁగ నెఱింగి ♦ ధాత్రిలోన। సచ్చిదానందతఁ గడు నె ♦ సఁగుట ముక్తి। యగుచు గావునమూఢత ♦ నొగిఁ దొలంగి। నిత్యముక్తుండవగుచును ♦ నీ వెసఁగుము॥ ౭౭౮

కం॥ తగసంయమివరుఁడిటు వ। ల్కఁగ నాశబలాఖ్యుఁడువిశ ♦ కడు భక్తిమెల। ర్పఁగగురున కెఱఁగితద్యశ। ముగణించెదువంది వేమ ♦ ముంబూనె వెసన్॥ ౭౭౯

మల్లపురంబున మల్లారిభక్తుల మర్దించుట

మ॥ యమివరుఁడంత శిష్యయుతుఁ ♦ డైచనిమల్లపురంబుఁజేరివా। సమునటనిర్వదొక్క దివ ♦ సంబుల దాఁక నొనర్చియందువా। సముగలపాఱులంగని ప్ర ♦ శస్తపు వేదువనీరొనర్చుకృ। త్యముఁదగఁదెల్పుఁడంచడుగ ♦ నందఱుమ్రొక్కి వచించిరిక్కతిన్॥

ఖ్యులు పలుమంది రౌద్రిమయి యొప్పెడు నంశమునందుఁ బుట్టినా
రలు మహిఁ వారినందఱిఁ దిరంబగు రీతి నెఱుంగ ముక్తి తాఁ
జెలఁగెడు నంచనం జనదు జీవశివైక్యమె ముక్తి యౌటచేన్ ౭౫౭

సీ॥ శ్వానవాహారూఢుఁ డైన మల్లారి నాఁ; బడు వేల్పు రుద్రాంశ
భవుఁడు శ్రుతిస; మీరితుండౌటచే ధారుణిఁ దన్మతః; బూన
నౌననెడు మీ దైన నుడియు; మంచిది గాఁ దోఁప దెంచ
నేకాదశ; రుద్రిసంస్తుతి నాన స్ఫుటకు పక్ర; మించెడు నమ
కము దెంచెనా మల్లారి; "శ్వపతిభ్య" యను నెడ వఱలు బహుత

గీ॥ రుద్రిబాహుళ్యతం జేసి ప్రోక్తమయ్యెఁ; బూర్వవాక్యంబు
నందునఁ బర్వ "శ్వభ్య"; యనెడు నుడియందుఁ దద్వ్యాప
నతికలన; టన్ననద్ధియునైన గ్రాహ్యంబు గాదు॥

సీ॥ రుద్రిలకెల్ల ని రూఢంబుగా జగ; ద్వ్యాపకత్వంబు తా
వఱలుకొఱకు; గ్రాలెనా వేదవా క్యముసుండ దెట్లుతాఁ; ననిన
"నమశ్శ్వభ్య" యనఁగ శ్వాంత; రగతు లైయొప్పారు ద్రి
ప్రష్యులకు నమ; స్కారమటంచును శ్వపతులనఁగ; శ్వామ
శబలముఖ్యు లైన వైవస్వత; వంశసంభవులును శ్వానవిక్ర

గీ॥ మాత్తమాంసాదులును శ్వమాంసాశనులగు; నట్టి చండా
లురగు నట్టివారి; దెందముల నొప్పారు రుద్రుల కందఱకు
న; మస్కృతి యటంచు నర్థమామ్నాయమునకు॥

కం॥ వేసిందాఁకి నచోమ్నాతామ్నాన ముని ప్రిలకు నీరి తంబయ్యెనో
యూ; శ్వానముల వేషముఖములు; నూనుటచే మిగులదోఁప
మురశ్వరఁ గాదే? ॥ ౭౬౦

చం॥ ఇటులఁ గుల ప్రవృత్తిని మహీతలమందు శ్వవేషముఖ్యమూ
నుటయును నిత్యముఖ్యముల నుత్యసుకృత్యములందొఱంగియుం
డుటయును మూఁడు వేళలఁగ మంగడు నాట్యసుశక్తితోఁ మెలం
గుటయును నెల్ల మీఁకతలఁ గుంజుఁడి బ్రాహ్మణ ఘాతుకంబులై

ఆ॥ వె॥ కానన ట్టి మీముఖంబులఁ గాంచుచో; భానుఁ గనుట సెప్పఁ
బడియె శాస్త్ర; మందు జగతిమాస మందు నీ కర్తవ్య; మగు

బుధులకు నిక్క ♦ ముగనుజుండు॥ ౪౬౨

మ॥ యమివర్యుండిటుపల్క నానుడులఁదా♦మాలించి వేశ్ళృత్తమూ।
లములౌవృక్షములట్లు భూధవుని మో్రో ♦ లందప్పఁగావించిన।
ట్టి మనుష్యావళిపోల్కి నమ్మహితదం ♦ డిశ్రేష్ఠపాదాబ్జమూ।
లము నందుంబడిరెల్లరుం గరుణఁగా♦లన్ప్రొప్పుఁడంచాడుచున్॥

కం॥ కరుణాయుతుఁడై శంకర । గురుఁడవ్వారిఁగని 'నిలుఁడు♦ కుం
దకుఁ'డని వే। పరిశుద్ధులఁ జేయుటకిడె। సరసిజపాదాది శిష్య♦
చయమునకానన్॥ ౪౬౪

సీ॥ అంతటఁబద్మపా♦దాది శిష్యులు దేశి; కాజ్ఞచేవారల♦కంఠఅకుశి।
రోముండనము నబ్ధి ♦ గామినియందయు; తస్నానములును
నం♦తనొగిమృత్స్న। చేముండనము మృత్తు♦ చేవెండియునుశత;
స్నానమ్ములునిఁక నా♦మ్నాయవిహిత। మగునట్టిరీతిఁ బ్రా ♦
యశ్చిత్తముఁదగఁజే; యించి బ్రాహ్మణ్యాద్య ♦ నెనయఁజేసి।

గీ॥ రంతగురునకుఁ గడువిన ♦ యమునవారు। నెఱఁగి సచ్ఛిష్య
భావంబు ♦ నెనసిశౌచ। ముఖనిరతిఁ బంచపూజాభి ♦ ముఖత
వేడ। సక్తి గురుదయ ముక్తిభా ♦ జనతగనిరి ॥ ౪౬౫

మరుంధాపురముసేరి విష్వక్సేన భక్తులకు సద్బోధ కావించుట

గీ॥ అంతనటనుండి పశ్చిమా♦ధ్వానుగామి। యై యతీంద్రుండుసేరె
ఘ♦క్కాద్యవాద్య। కలితకరులును జితప్రవా♦ గ్లలితపద్య।లైన
శిష్యులతో మరుం♦ధాఖ్యపురము॥ ౪౬౬

సీ॥ ఆపురినున్న తం♦బైన విష్వక్సేన; గోపుర మొకఁడె సం♦గులలి
తమయి। దానికి ముంగలఁ♦దనరు నెంతయునువి; శాలమహాచును
బ్రపా♦శాలయందు।యతివరుండంతర్గృ♦ హాదికల్పనమునొ;నర్చి
సద్దర్భాస ♦ నస్థుఁడై మ। నోన్మనీ నామకాం♦ గుష్ఠమాత్రసు
లక్ష్యుఁ; బూర్ణమండల సుమహా♦ప్రఁబరమాత్మఁ ।

గీ॥ గాంచిపీయూషబిందుసం♦ఘాతపాన। తృప్తమతియాచు వెండి
యు♦దివ్యకుండ।లినొగి నాధారమును జేర్చి ♦ ఘనుఁదదీశు।
గణపతినుతించి యుండెసు ♦ ఖంబుగనట॥ ౪౬౭

మ॥ శమిలోకేశ్వరుఁజేరి పల్కెనిటు విష్వక్సేనభక్తుల్భళా।
గ్రములన్నంఖరథాంగచిహ్నములెసం గన్నోమ్ములందూర్ధ్వపుం।
డ్రములొప్పన్గరపాళిఁదోత్రమును దండంబున్విరాజిల్లవా।
సమునాయూరనొనర్చువారలునమస్సంఘంబుముందొప్పఁగన్ ॥

మ॥ వసుధన్మాదుమతంబెమంచిదగు విష్వక్సేనుఁడేదైవమా।
టసతమ్మాతఁడు విష్ణులోకమున దండస్వామియౌనట్టివే।
ల్పు సమీచీనపుభక్తిఁగొల్చుమమున ల్పుండౌయముండించుకే
నిసెదంబెట్టఁగజాలఁడెప్పుడును దండిశ్రీశిర్షోన్మణీ!॥

కం॥ మేనువడమమ్మువిష్వక్సేనుఁడు వైకుంఠమునకుఁ జేర్పఁగఘట
సం। తానమున కానవిడుదం। డీనా! చేర్చెదరువారు నెంతయుఁ
గరుణన్॥

కం॥ కానన్మీరనువిష్వక్సేనునిచిహ్నములనిఁకనో గిన్భక్తిమెయిం।
బూనిభజింపుఁడుమోక్షమ్మానిజముగఁ గరతలస్థి తామలక
మటుల్॥ ౪౭౧

సీ॥ అననిట్లుపల్కన య్యతినేతవారిఁజూచి; మహిమీఁదునుకులస
మంజసముతెలియగు నేకతంబున ననినవిష్వక్సేనుఁ; దనమాధ
వుని భక్తుఁడంచునుడువఁబడెనటె శ్రీహరి భక్తులుఁగలరువై;
కుంఠంబునందుఁబెక్కురుతలంపఁ దద్భక్తులును మహిఁదద్భ
క్తులకుఁబూజ్యులను ననుజ్ఞామాత్రమున నెవారి।

గీ॥ కెల్లస్వాతంత్ర్యముగ మాన మెసఁగమునిబా। నఁగునెటులఁ
బూజ్యభావంబుసగుణుఁడగుట। హరిమెతల్లోకజిగమిషు లగు
జనులకు। పాస్యుఁడు విముక్తిదుఁడుఁబరం పరతనతఁడు! ౪౭౨

ఉ॥ పాయనిభక్తిడెందమునఁ బ్రిత్యగభిన్నునిఁగాన తమ్మునా।
రాయణునొక్కనింబరుఁదిరంబుగ ధ్యానమొనర్చునట్టి స।
ద్ధీయుతుఁడందుముక్తిసుద తీపరిరంభణకార్యమందునా।
రాయణుఁడే యతండయికరమ్మురహించునసంశయమ్ముగన్॥

గీ॥ కానమీరలువేగ మోక్షంబునందఁదలఁతు రేనివఖండున ద్వ
యునినద్గురువరశాస్త్రోపదేశంబు న విపులముగ। నెదనుధ్యా

నింపుఁడొగిముక్తి♦ నెనయఁగలరు॥ ౪౭౪

మ॥ అనుచుంబల్కినసంయమీశ్వరునివ్యా♦ హారంబునాలించి వెం।
టనె వారెల్లరుఁజిన్నెలందొలఁగిగా♦ఢంబైన భక్తిన్యతీ ।
శునకున్మ్రొక్కి తదీయమైన దయ సం♦శుద్ధాత్మవిజ్ఞానముం।
గనియొప్పారిరిసాధువృత్తినిగమో♦క్తస్వచ్ఛకర్మచ్ఛిదై॥

కాళ్రించాదిమన్మథభక్తులఁ బంచపూజనపరుల సౌనర్చుట.

కం॥ అంతట నాసంయమివరు। చెంతకు మదనునెడభక్తిఁ ♦ జెలఁ
గెడువార।ల్వంతమునవచ్చి వందన। సంతతిఁగావించిముదమె♦
సంగ ననిరిటుల్॥ ౪౭౬

చం॥ యతివర! మామతంబువినుఁ♦డద్భుతమానిది సర్వచిత్తసం।
గతుఁడును సర్గవృద్ధిలయ♦కర్తయుఁగామితదుండు సర్వస।
మ్మతుఁడునునాటి నెల్లరకు ♦ మన్మథుఁడేయనిశమ్ముసేవనీ।
యతముఁడుఁజుండతం జెపర♦మాత్ముఁడు మోక్షమొసంగునాతఁడే॥

గీ॥ హృదయసంస్థితవర్తులా ♦ కృతివిభూష। ణద్వయముచేతనొగిన
ధీ♦నముగజగముఁ।జేసికొనఁగ సుదతులద♦ర్శించుటను స్పృ।
శించుటనుసౌఖ్యమొదవుల♦భించుముక్తి॥ ౪౭౮

కం॥ కావున నీరునుమదనుని। దావిపులోత్సవమునందు ♦ నంచిత
తచ్చి। హ్నవళిఁదాలిచి సౌఖ్యము। తో వెలసివిముక్తిఁగనుఁడు♦
తోడఁగడంకన్॥ ౪౭౯

చం॥ అనవుడుఁబల్కెనయ్యతికు♦లాగ్రణియిట్లిటులపవ్రిమాణరీ।
తినుడువఁబోకుఁడీఁకను ♦ తింపబడెన్జగదాఘసృష్టిపా ।
లనలయకార్యరాజికి జ ♦ లప్రభవోద్భవవిష్ణురుద్రులే।
యనిశముఁగర్తలంచు నెటు♦ లాజనురాదులకర్తకాముఁడౌ? ॥

చం॥ సుమశరుఁడన్న విష్ణునకు♦సూనుఁడె కావునఁ బాలనాధికా ।
రము సతతమ్మునాతనికి ♦ రాజిలునంచువచింపఁజెల్లద।
ర్యమునిమహాత్తరప్రభత ♦ దాత్మజుఁడౌశనియుందెసంగునే?
సమధికమైనతండ్రిదగు♦శక్తితనూజునకున్నె?చూడఁగన్॥ ౪౮౧

మ॥ అవనీమండలిఁగామినీప్రకర♦వశ్యంబుండగన్నల్పుఁజా।

లువసంతోత్సవకాలసంభృతఘనా♦లోకాఢ్యభూపాళిఁదా।
ల్పవలెంజుమ్మనఁజెల్లదంగనలలో ♦ లత్వంబుతత్సంగిమా।
నవసంగంబునుగూడ దూరముగసం♦త్యాజ్యంబులౌనంట చేన్॥
సీ॥ శివఫాలవహ్నిభ♦స్మీభూతుఁడైనట్టి; యతనుఁడేగతినిని♦ర్వృతిని
గూర్చుఁద్రిపురాంతకునిరతి♦దేవివేఁడఁగఁదద్వ; రంబుననొకమా
ద్రి♦రాణనంది।నట్టిప్రద్యుమ్నున♦కమరునే తెలుఁగున; సృష్ట్యా
దిక ర్తృత♦చేఁజెలఁగుట। మీదుమతంబెన్నఁ ♦ గాదుష్టమగును
బ్రత్యక్షాదికివిరుద్ధ♦మగుటఁజేసి।
గీ॥ యనుచుయమివర్యుఁడు వచింప♦నాలకించి। క్రౌంచవిన్ముఖ్యు
లొగిఁజిహ్మ♦రాజివీడి। నిగమవిహిత సదాచార ♦ నిరతిఁబంచ।
పూజనాస క్తినింబొంది♦రాజిలిరిల॥ ౪౬౪

మాగధపురమునఁ గుబేర భక్తుల నద్వైత సక్తుల నొనర్చుట.

గీ॥ అంతనటనుండి శిష్య చ ♦ యంబుతోడ। నుత్తరపు మార్గ
మున యతి ♦ సత్తముండు। వెడలి మాగధ సంజ్ఞచే ♦ వెల
యు పురముఁ। జేరిగుడినుండె శిష్యసం ♦ సేవితుఁడయి॥ ౪౬౩
మ॥ నవనిధ్యాత్మక హేమతత్పదక సం ♦ తానంబు కంఠంబులం।
దువిరాజిల్లఁ గుబేర ముఖ్యులగు శ్రీ♦దుంగొల్చునేతత్పురీ।
నివసద్బ్రాహ్మణులయ్యమి ప్రవరుసా ♦ న్నిధ్యప్రదేశంబుఁజే।
రివెసన్వందనములొనర్చి యనిరీ ♦ రీతి న్స్వకోత్కర్షమున్॥
చం॥ నిధులనుఁ దొమ్మిదింటికిని ♦ నేతకుబేరుఁడెయాటఁజేసిన।
ర్వధనివరేణ్యులందును గ ♦ రమ్మును నాతఁడెమేటి యట్టివా।
నిధర భజించుమాకొదవ ♦ నేరదురిక్తతయెప్డుఁగాననో।
బుధవరబ్రహ్మరూపమగు♦పూర్ణసుమోదముమాకెసంగెడున్
ఉ॥ కర్మములర్థమూలములు ♦ గావున నర్థపుఁడొకుబేరునే।
కర్మకులెల్లరుంగొలువఁ ♦ గావలయున్సుఁడి ముక్తికాముతా।
నిర్మముఁడన్నతమ్మునత ♦ నిన్భజియించుట మంచిదాతఁడే।
శర్మదమాధనమ్మిడుట ♦ సర్వజగద్విభుఁడున్మహేంద్రుఁడున్॥
కం॥ నిరతముఁ గుబేరసేవా। పరయాయక్షిణియొకర్తు ♦ భాసిల్లు

సురసుం దరియనఁగ నాపెఁగొల్చిన । నురుసంపల్లబ్ధికల్గు ♦ నుర్వి
జనులకుఁ గా ॥ ౪౮౩

ఉ॥ వారలు మందభాగ్యులు ధ్రు ♦ వంబుగ నర్థపుఁడౌ కుబేరునే।
వ్వారు భజింపరీశ్వసుర ♦ వారముఁగొల్చుచుముక్తినందఁగాఁ।
గోరెదరో యనారతము ♦ క్షోణిని గావున మోక్షకాంక్షులౌ।
మీరుఁ గుబేరసేవనమె ♦ మేలని సల్పుఁడనన్యచిత్తులై॥

మ॥ అనుచున్వారలు వల్కసంయమివరుం ♦ డాలించి తానిట్లు ప।
ల్కెను మీదౌమత మప్రమాణమగున ♦ క్షీణంబు నానాధనం।
బునకున్నేతకుబేరుఁడౌతనరుఁడో ♦ వ్వాంగాత నెవ్వాఁడుత్స్రా।
ప్తిని దానంగనెడి న్నిధిస్థధనరీ ♦ తిన్గల్గుమోదమ్మొటుల్ ॥

శా॥ హెచ్చౌగర్వమునూనియుండునెపుడు ♦ న్నెచ్చైధనమ్మున్నవాఁ
డుచ్చంబౌనధికారమన్యమనుజ ♦ వ్యూహంబుపైఁజూపుచు।
న్వచ్చున్లోఁదలఁపందుమేలుదోసఁగు ♦ న్సంపాదనంబందెతా।
నిచ్చున్జ్ఞాన్పు నౌసంగఁడర్హులకు సుం ♦ తేనింగడున్లోభియై॥

శా॥ ఖర్వంజేయు సదీహఁబాపభయముం ♦ గాంచంగనీదెప్డు నా
శర్వప్రీతిదమైన భక్తిలవము ♦ న్సల్పంగనీదర్హులై।
యూర్విన్ప్రాలెడు పెద్దలంగనఁగ నీ ♦ దూనంగనీదీవిని।
న్సర్వజ్ఞేయదకార్య కార్యమతి న ♦ ప్రఖ్యాతిదార్థంబహో॥

శా॥ కామంబుంగలిగించు రోషమునెసం ♦ గంజేయు లోభంబును।
న్వ్యామోహంబునుగల్గఁజేయుమదము ♦ న్వైశంబ చేకూర్చునెం।
తోమాత్సర్యముఁగూర్చెడిన్ధనమదెం ♦ దుంగాన సౌఖ్యంబులే।
దేమాత్రంబునునిందనర్థమగుఁజూ ♦ మ్మెన్నం ధనంబిమ్మహిన్॥

గీ॥ ధనమునకు ముక్తికిని జాల ♦ దవ్వుగలదు। గావునఁ బ్రియత్న
మున విమో ♦ క్షమతులకున । నర్థరూపమనందగు ♦ నర్థ
ముందొలఁగఁదగు వియోగహీనముగ ♦ నఁగఁదగునొగి॥

చం॥ తలఁపఁదగు స్థనమ్మనుస ♦ తమ్మనసర్థముగా నెదస్థన।
మ్మలవడినట్టి మానవున ♦ కాత్మజునుండియునున్భయమ్మఁదాఁ ।
గలుగుటఁజేసి సుంతయుసు ♦ ఖమ్మునిజమ్ముగదానలేమిని।

స్తులమగునీసునీతియెవ♦సుంధర నెల్లవచింపఁగాఁబడెన్॥ ౪౯౫

గీ॥ ధర్మమైనను నర్థసా♦ధ్యమగుననిన। యెడలనగుఁగాత ధనముఁ
గో♦రెడునరునకు। సేవ్యుఁడుకుబేరుఁడే కాఁడు♦భవ్యపూర్వ। పు
ణ్యమునమర్త్యులకు ధనం♦బుఁగఁదగుట॥ ౪౯౬

సీ॥ గణ్యుఁడౌ బ్రహ్మహి♦రణ్యగర్భుండనఁ; గేశవుండెసఁగుల♦క్ష్మీ
శుఁడనఁగ। నార్యాపతిహిరణ్య ♦ వీర్యుఁడైయొప్పునిం; దుఁడు
హేమశైలగ♦తుఁడయిశ్రీలు। నిట్టివారాయక్ష♦రాట్టుదాధనము
న; నెసఁగెదరనుట సా ♦హసమగుఁగదు। నీఁకమీఁదమీకుఁబ ♦
లుకఁగాఁజనదుమహా; న్నిందార్థకోక్తుల♦ నెందు నేని।

గీ॥ నంకముల నెల్లఁదోఁగిమీ♦రింకనుండి। స్నానసంధ్యాదితత్పరు♦
లైనిరతముఁ। బంచపూజానిరతులరై ♦ యంచితమగు। నట్టియ
ద్వైతవిద్యఁజే♦పట్టిమనుఁడు॥ ౪౯౭

కం॥ అనవినినారగ్గురువర్యునిపాదాంబుపరిభూత♦యుగళమునకుభ।
క్తినెఱఁగిచిహ్నంబులవిడి। తనరిరిపంచార్చనాది♦తత్పరులగుచున్॥

ఇంద్రప్రస్థమున నింద్రి మతస్థుల సత్పథస్థులఁజేయుట.

ఆ॥ వె॥ అంత శిష్యయుక్తుఁ♦డగుచునింద్రప్రస్థ। మనఁగఁదనరు పు
రికి♦యమివరేణ్యుఁ। డేగనచటనుండు ♦ నింద్రిమతస్థుల। య్యన
ఘుఁజేరిమ్రొక్కి♦యనిరిటులరాగి॥ ౪౯౯

శా॥ ఓ సంయమ్యధినాథ! యెల్లరకుసే♦వ్యుండింద్రుఁడేసుమ్మతం।
డేస్వర్గాదివిధాతధాతయునుల♦ క్ష్మీశుండు రుద్రుండునాఁ।
దాసంకాశిలునెప్పునొక్కరుఁడెత♦ త్రచ్ఛబ్దసంవాచ్యుఁడై।
యాసద్వేదమెచెప్పెసర్వదతస♦ర్వాధీశతన్వీనికిన్॥ ౫౦౦

ఉ॥ ఈతనితేమ్ముఁడేసుమియ♦మీశ్వర! వామనుఁడాసుధాదిపి।
ఖ్యాతసమస్తవస్తునిచ♦యంబునునీతనియింటనెప్పు నీ।
నేతనెవేల్పులెల్లరుపి ♦ నీతిభజింతురు నిర్వశేషుఁడా।
నీతఁడెయాత్మసర్వమున♦కీతఁడధీశుఁడతీతుఁడంతకున్॥ ౫౦౧

సీ॥ ముక్కధికమైనరుషనరు♦న్ముఖ్యులైన। యతుల సాలావృకంబుల♦
కైయొసంగె। యతులకెల్లను శిక్షకుం ♦ డగుటనితఁడె। శ్రేయ

ముంగోరుమీఁకు సం♦ సేవ్యుఁడుసుఁడీ॥ ౫౦౨

కం॥ అనుచుం బల్కెడునయ్యం। ద్రుని భక్తులనుడులయతివి ♦ ధుఁడు
వినియాస్యం। బున లేనగవలరఁగని। ట్లని యెన్వారలగుటెంచి ♦
యంచితరీతిన్॥ ౫౦౩

సీ॥ ఇంద్రశబ్దంబుర♦హించెఁ దానింతయు; బ్రహ్మాదిశబ్దాంత♦రస్థమ
గుచుఁ। గానసౌజగముపా♦దానకారణమింద్రుఁ; డే'యనుమీను
డి♦ యెన్ననప్రి। మాణంబగుటనస ♦ మంజసంబగునదే; వేతా్య
డివాక్యాళి♦ నెద్దిసెప్పఁ। బడియెనోయాపర ♦ బ్రహ్మంబుసత్య
మా; నదియెజగద్ధేతు♦ వదెపరాత్ముఁ।

గీ॥ డాతఁడిచ్ఛనుజగముఁ జే ♦ యంగఁ జేసెఁ। బ్రకృతినానొప్పునది
మహ♦త్ప్రముఖతత్త్వ। పూర్వకంబుగజగముఁ బొ♦ల్పుగనొనర్చె।
నందుఁ ద్రిగుణాత్మకంబౌన♦ హంకృతితగు॥ ౫౦౪

గీ॥ ఆయహంకారమందు బ్రి♦హ్మహరిరుద్రు। లేర్పడిరివారిలో సృష్టి ♦
నేర్పరించు। బ్రిహ్మవలనఁ గలిగెనింద్ర ♦ పావకాది। సకలనా
కౌకసులవైన ♦ సంభవంబు॥ ౫౦౫

ఉ॥ సృష్టికిఁ గర్త యింద్రుఁడని ♦ చెప్పినఁ దక్కినలోక పాలురున్।
స్రిష్టలిఁ కేల కారితని ♦ సర్వదభావము నట్టిదా విని।
దృష్టసుధాసుపానమునఁ♦ దోఁచెను బ్రహ్మతయన్న బ్రహ్మలున్।
వృష్టిననేకులౌదురిఁక ♦ వ్యర్థమెయా నొకఁడన్న వేదమున్॥

సీ॥ కృతమాడిగానెసం ♦ గెడు నాల్గుయుగములు; నొకమహాయు
గమునా ♦ నొప్పునమ్మ। హాయుగంబులు వేయి ♦ యగునెడఁ
జతురాస్యుఁ; డగు బ్రహ్మకొకపగ ♦ లనఁగఁబరఁగు। నట్టిపగ
టిలోని ♦ దగు పదునాల్గవ; పాలుకాలముదాఁక ♦ బ్రిదుకు
నింద్రుఁ। డట్టివాఁడెన్నఁడా♦ నెట్టులనశ్వరుం; డగుపరమేశ్వ
రుం♦ డనరహించుఁ॥

గీ॥ గాన పర్వంబులయమందఁ ♦ గామిగులుచు। సర్వమునకును
నాదినాఁ ♦ బర్వ విశ్వ। హేతువైనట్టి బ్రహ్మంబు♦ నేభజింప।
వలయు వేదప్రమాణంబు ♦ వలులుకతన॥ ౫౦౭

మ॥ అని సంయమ్యధినేత సెప్పవినితా ♦ మాహీర భద్రాదులో
య్యనఁజిహ్నంబులవీడి యగ్గురువరే♦ణ్యాంఘ్రి యుగ్మాభివం।
దనమున్భక్తినొనర్చి తత్కరుణస్మా ♦ ర్తప్రక్రియాసక్తిఁ బా।
వన పంచార్చనముఖ్య రక్తిఁగనిభా ♦ స్వచ్ఛిష్యులైరెల్లరున్॥

యమిశేఖరుండు యమప్రస్థంబునకేగి యమభక్తుల మఱలించుట.

గీ॥ అంతనటనుండి శిష్యచ ♦ యంబువెంట। రావెడలిదండి పతి।
యమ ♦ ప్రస్థమనను। సంగుపురమున కరిగియ ♦ చ్చటవసించె।
మాసమితకాల మనిత స ♦ మ్మదమెసంగ॥ ౫౦౯

గీ॥ అత్తతిభుజాగ్రముల మహి ♦ పాత్మతప్త। లోహచిహ్నంబు
లూని పో♦ల్పుగనటించు। చయ్యతిపుచెంత కుంగింక ♦ రాఖ్య
ముఖ్యు। లు యమభక్తులువచ్చి మ్రొ ♦ క్కియనిరిట్లు॥ ౫౧౦

కం॥ యమిశేఖర! యముఁడేవిల। యమునకు హేతువగుఁగాన ♦
నాతఁడెసృష్టి। ప్రముఖములకుఁ గర్తయుని। క్కముగానగు
నతనివారె ♦ శాంతురము క్తిన్॥ ౫౧౧

సీ॥ యమునికై మీరుసో ♦ మముఁగూర్పఁడీ హవి; స్సునువేల్వఁ
డీరుశ ♦ మనునికొఱకు। ననిశంబు యముని పొం ♦ దునునిక్క
ముగను శ్రౌ; తస్మార్తరూపమై ♦ తనరుముఖము। దూతలైయ
యయ్యము ♦ చేతనొనర్పఁగాఁ; బడెఁ జూడ వీతిహో♦త్రుఁడు
సతమ్ము। ననియిట్లు ప్రామిను్క ♦ లందుఁజెప్పంబడె; యజ్ఞ
భోక్తృత్వమ ♦ య్యమునకె తగఁ॥

గీ॥ గానతండె సృష్ట్యాది ♦ కథునహేతు। వౌపరబ్రహ్మమగు
నట్టి ♦ యమునిమూర్తి। శ్వేతకృష్ణ విభేదంబు ♦ చేతమిగుల।
రెండుతెఱఁగుల రాణించు ♦ చుండువినుఁడు॥ ౫౧౨

గీ॥ ఎద్ది శుక్లంబగుచు నొప్పు ♦ నద్దినిక్క। ముగఁ బరబ్రహ్మమని
యెడు ♦ నిగమవాక్య। బలమునంజేసి శుక్లమై♦చెలఁగుమూర్తి।
యాఁబరబ్రహ్మ మదెనిర్గు ♦ ణాఖ్యయముఁడు॥ ౫౧౩

సీ॥ నిర్గుణరూపమై ♦ నెగడెడు యమునుండి; మహదాదితత్త్వసం♦
భవ ముఖముగఁ। దగఁబుట్టెరుద్రాభి ♦ ధానయమావతా;

రము దానఁగృష్ణవ ♦ ర్ణయుతుఁడగుచు। జనియించెఁదావిష్ణు♦
సంజ్ఞుఁడై యవ్విష్ణు; నాభికంజమున ర♦క్తాభుఁడగుచు। బ్రహ్మ
నాఁబుట్టెనా ♦ బ్రహ్మనుండిజనించి; రష్టవికృతులు గ్రి ♦ హ
ప్రకరము॥

గీ॥ వ్యక్తమయ్యె జనించె స్థా ♦ వరచరాత్మ। కముగు జగమెల్ల
నిట్లు త ♦ గంబొనర్చి। దండపాణియు మహిమని♦ష్ఠుండునగుచు
దక్షిణదిగీశుఁడయ్యెఁదా ♦ శిక్షకొఱకు॥ ౫౧౪

ఉ॥ ఆరయసాంఖ్యశాస్త్రరిహ ♦ యాదులమధ్యను భస్మమధ్యనం।
గారముఁబోలెవాయువునఁ♦గ్రాలుచుఁదాశనుమాడ్కినంబుభృ।
ద్వారసమావృతుండగు ది ♦ వాకరుపోలిక సృష్టిముఖ్యస।
త్కారణమయ్యె దానవవ ♦ గమ్యతనుండు యముండతండిలన్

సీ॥ కావుననిఖిలజ♦గత్కారణసువాక్య; తాత్పర్యరూపమైతత్పదార్థ
మైశుద్ధబుద్ధము ♦ క్తాది రూపంబునౌ; బ్రహ్మంబునాగుణ ♦
రహితయముఁడె। యగు సంయమీశ! త♦దంశుఁడౌసగుణుండు;
నిర్గుణుండౌయము ♦ నిన్భజింపఁ। గాశక్తులేరును ♦ గామిమే
మనిశంబు; నీలాభుఁడౌయము ♦ నింగొలుతుము॥

గీ॥ దానవేగహాని ♦ నూనుమూలాజ్ఞాన। ముంతయముఁడౌసర్వ ♦
మనెడుబోధ। మెసఁగు శుక్లయముని ♦ యెఱుకయశా పిమ్మట
మోక్షమొదవు నిక్క ♦ ముగను బదప॥ ౫౧౬

గీ॥ కాన మోక్షార్థులగుట నిం♦కనొగిమీర। లెల్లరు ననన్యచిత్తులై
యెసఁగుభక్తి। నయ్యమోహాస్తి సలుపుఁడీ ♦ యముని నెఱుకను।
పొందెదరు మోక్షసామ్రాజ్య ♦ మును నిజముగ॥ ౫౧౭

కం॥ అనుచుంగింకరముఖ్యుల। మనమతనిష్ఠులు వచింప ♦ మస్కరి
పతితా। వినిపల్కెనిట్టు లత్తఱి। ఘనతరసద్యుక్తు లెసఁగఁగావా
రలతోన్॥ ౫౧౮

కం॥ మీదనుడు లియ్యవెల్లను। వేదవిరుద్ధంబులగుట♦ విజ్ఞావళికా।
మోదంబెపుడునుగూర్పం। గాదక్షుంబులిలలోనఁ♦గావెన్నంగన్

నాచికేతోపాఖ్యానము

సీ॥ మునునాచికేతాఖ్యుఁ ♦ డనఁ బరఁగు విప్రుండు; జనకప్రదత్తమ హా♦
శాపమునను । యమునిపురంబున ♦ కరిగి యయ్యమునింట;
నశనశూన్యతమూఁడు ♦ నిశలవఱకు। వసియించెఁ గడుబ్రహ్మ♦
వర్చస్సుదీపింప; నట్టి యతిథివర్యు♦ యముఁడు సూచి। తానెంత
యును వేప ♦ మానుఁడై యద్ధరా; మరుఁజేరి మిగుల స ♦
మ్రత్వమెసఁగఁ।

గీ॥ బలికెనిటు తీవ్రమూఁడు రా♦త్రులు నిరశనుఁ। డవయియుచ్చట
నిష్కృపుఁ♦డవగు చతిథి। వైవసించినకతనభూ♦ దేవ! ప్రముక్క।
దనువరత్రయమును గోరు ♦ కొనుమటంచు॥ ౧౨౦

కం॥ నతిపూర్వకముగ శమనుఁడ♦కితవతనిటు వల్క నాచి ♦ కేతుఁడు
వినిము। దన్వితుఁడయి మనోహారంబగు ♦ గతినయ్యముననాగ్రి
జాతుఁ ♦ గనియిట్లనియెన్॥ ౧౨౧

ఉ॥ అల్పముగాని మీఁదగు ద ♦ యన్విలసిల్లుత నింక శాంతసం।
కల్పుఁడుపీత భీతియు వి ♦ నాశితమన్యుఁడు సన్మనస్కతా।
నల్పుఁడు నొచుమజ్జనకుఁ♦డై తగు గౌతముఁడిద్ధరిత్రిలోఁ।
బొల్పగు ఖ్యాతితోడ సత ♦ ముందాలి యశావరమాతనిద్దియే॥

ఉ॥ నావుడుఁబల్కనిట్లు యము♦నాథునిసోదరుఁడార్యవంద్య! మీ।
దావిమల ప్రభావమున ♦ నార్యుఁడు మీజనకుండు నిర్భయుం
డై విగతస్వమన్యుఁడయి ♦ యంచితచిత్తుఁడునై యనీహుఁడై
దేవచయేష్యుఁడై మహిన♦తి ప్రమదంబున నొప్పునెప్పుడున్

కం॥ కావున రెండవ వరమును । వేవరియింపుమికనీవు♦ విజ్ఞోత్తమ!
యం। చావేలుపుతగఁ బలుకం। గావినియిటుపలికె ద్విజుఁడుఁ♦
గడువినయమునన్॥ ౧౨౪

గీ॥ నీవెఱుంగుదు స్వర్గ్యవ ♦ హ్నినిగరంబుఁ। దద్విధముఁదెల్పు
మొగిశ్రద్ధ ♦ ధానుఁడనగు। నాకొఱకుఁ బేర్మితో; స్వర్గ ♦
లోకమునను। నమృతతనుదానఁగనెదరు ♦ శమన! బుధులు॥

మ॥ అనుచుంగోరెను నాచికేతునకుఁ దా♦ నగ్నిస్వరూపంబుఁ బే

ర్మని గాలుండువచించె నంతట ధరి ♦ త్రీదేవుఁడాధర్మజే|
వునితో దేవ! పరేతుఁడౌనరునకు ♦ న్బొల్పొందుఁజూడన్గి కి|
త్న నితాంతమ్మని కొందఱాడెదరు స♦త్యంబందురింకొాక్షిలన్

క|| ఈవిద్య నాకుఁగూరిమి♦ దైవాఱఁగఁ దెల్పినన్ను ♦ ధన్యుఁగఁ
జేయం| గావేఁడెనిద్దె మూఁడవ | డావరమగుఁగాత మనుచు ♦
నర్థితఁబలుకన్|| ౫౨౭

చ|| వినియయముఁడవ్వరంబుఁ బృథి♦విన్గడుగోప్యముగాఁదలంచియా|
తనికి ధనాధులన్నువిత♦తంబగులోభముఁగల్గఁజేయఁజా|
లునుడులఁబల్కి యాతనిని ♦ లోభవిముక్తుఁగ విద్యఁగోరువా|
నినిగ నెఱింగియర్హుఁడని♦నెమ్మదినెంచివచించె గోప్యమున్||

ఉ|| అనిశము నెల్లవేదముల ♦ నారసి దేనిఁదలంచు సంతతం|
బనువచియించు నెల్లతప♦ముల్గడు దేనిని బ్రహ్మచర్యము|
న్ఘనులొనరింత్రు దేనిఁగనఁ♦గాననయంబును నప్పదంబు నా|
కొనియెద సంగ్రహమ్ముగను♦గోప్యమునీకు ధరామరాగ్రణీ!||

సీ|| బ్రహ్మమును క్షత్త్రమును నజ♦స్రంబునోద| నముగు నెవనికి
నుపసేచ♦నంబుమృత్యు| వెవనికౌనట్టి విభునిన ♦ హీనువతను|
సర్వతనుగతు నాత్మ నెం♦చనగుము క్తి|| ౫౩౦

క|| ఇవిమున్నగఁగలనుడుల| నవితనయుఁడు సెప్పనర్థ♦ రాదేవత
నూ|భవుఁడు వినిధన్యుఁడగుచుని| జవసతికిం జనియెఁదా వె♦సన్ప
ద్విదుఁడై|| ౫౩౧

మ|| ఘనుఁడైనట్టియముండువిప్రునకువ♦క్కాణించె “బ్రహ్మోపసే|
చనమామృత్యువటంచునిట్లుశ్రుతిఁగాం♦చంగానగుంజమ్ము, తాఁ
దనకున్భక్ష్యముగాఁగఁజెల్లమిని ప♦త్యంబౌపరబ్రహ్మమే|
యనిశంబున్సకలాది హేతువుఁబరం♦బౌఁగాలుకంటెన్గడున్||

చ|| అనిశమునట్టి బ్రహ్మమె ప్ర♦యత్నమునన్విధివిష్ణుశర్వము|
ఖ్యనిఖలరూపతంగొలువఁ♦గాఁదగు నెల్లరకైననోపనే|
చనికము లైనచిహ్నముల♦సంతతముద్ధరియింపము క్తిక|
ల్గుననుట సాహసంబనన♦గున్గడుఁగాతపబోధ లేశమున్||

కం॥ వినుఁడీమార్కండేయుం। బనెడు పురాణమున నుక్త ♦ మగు కత
భక్తావనుఁడైన మహేశ్వరుఁడు యముని దండించి నిజభక్త♦
పోషణుఁడయ్యెన్॥

సీ॥ సుందరుండనఁగ వ ♦ సుంధరఁగలఁడతి; దురితాత్ముఁడైనమ♦
ర్త్యుండొకండు। ధనవాంఛఁజేసి యా♦ తఁడు జాగరణమొక్క;
శివరాత్రియందొన♦ర్చెం దెలియక। కొంతకాలంబున ♦ కుంగృ
తాంతుని దూతలరుదెంచి మెయినుండి ♦ యతనిలాగి। పాశ
బద్ధుఁగఁజేసి♦ వేశమనుని ప్రోలికిం గొనిపోవుచుం♦డంగ నంత।

గీ॥ శివునికింకరులరుగుదెం♦చి వెసవారి। నెల్లరను బారఁద్రోలి మ♦హే
శులోక। మునకు నాసుందరాఖ్యుఁగొం♦పోయి రతఁడు। క్రాలె శివ
భక్తులందున♦ గరిమ గనచట॥ ౫౩౫

చం॥ మఱియు నజామిళాఖ్యుఁడను♦ మంజసమైతగు విప్రకృత్యము।
న్దొఱఁగి యునీచజాతియగు♦ తొయ్యలితోడుత సంచరించి యే।
పురఁడను జన్మలం గనిక ♦ వుంగిట వారలఁ బేర్మిఁ జేర్చుచు।
న్నిరతముఁ దన్మనస్కతన♦ నేహము నెంతయుఁ బుచ్చెనీచుఁడై॥

ఉ॥ ఆయఘమూర్తియున్మరణ♦ మాతఱిఁ దాఁ గడసారిపట్టినా।
రాయణ! యంచుఁ బిల్చుచును ప్రాణములన్విడ యామ్యులా భటు
ల్భీయుతు వానిఁ బట్టికడుఁ♦ బీడితుఁ జేయుచునుండ నంత నా।
రాయణు దూతలచ్చటికి♦ నాగతులైరి రయంబు మీఱఁగన్॥

గీ॥ వచ్చి యమకింకరులనునా♦వలకుఁ దోసి। కూర్మి నవ్విప్రు వారువై♦
కుంఠమునకుఁ। దోడుకొని పోయిరయ్యమ♦దూత చయము। భగ్న
సంకల్పమై యేగె♦ భవనమునకు॥ ౫౩౬

శా॥ కానన్మీరికఁ బూర్వచిహ్నములవే♦ గన్విడియద్వైతవి।
ద్యానిష్ణాతులరైయనారతము వే♦ దప్రోక్తసత్కర్మసం।
తానంబుం బొనరించి శుద్ధులయి యం♦తస్సైశికోద్యత్కృపా।
జ్ఞానంబూని సుశాంతులై కనుఁడు మో♦క్షంబున్సుధీయుక్తులై॥

చం॥ యమివరుఁడిట్లు తెల్పఁగర♦యంబునవారలు భక్తితోఁ బ్రణా
మములనొనర్చి చిహ్నధృతి♦ మానియతి ప్రవరోక్తమైన మా।

ర్గమునఁ జరించుచున్విగత ♦ కల్మషులైసతమయ్యమీాట్పుదా।
బ్జముల నెదందలంచుచుల ♦ సన్మతులై విలసిల్లిరెల్లరున్॥

సంయమీాంద్రుండు ప్రయాగలో వరుణభక్తుల నద్వైతులఁగావించుట.

చం॥ యమివరుఁడంతశిష్యనిచ ♦ యంబొగిఁదోనరు దేవగంగకు।
న్యమునకును న్సరస్వతికి ♦ నారయసంగమదేశమాప్రియా।
గమ నెడిపుణ్యదంబగుచుఁ ♦ గ్రాలెడుక్షేత్రముఁ జేరి యందువా।
సమునొనరించెశిష్యచయ ♦ సంయుతుఁడై ప్రమథేశుఁడోయనన్॥

ఉ॥ అంతటఁ బాశచిహ్నధరు ♦ లౌవరుణ ప్రియులుధ్వజాంకులౌ
చెంతయుమీారు వాయుభజ ♦ నేప్సితులు న్నృతపూర్ణచిహ్నులై
వింతగనొప్పునట్టి పృథి ♦ వీభజనేహులు బిందుచిహ్నసం।
క్రాంతశరీరులైనయుద ♦ కప్రియులు న్జనుదెంచిరొయ్యనన్॥

ఉ॥ వారలలోపల న్వరుణ ♦ భక్తులఁ బెద్దవచించెనయ్యమీా।
డ్వారవరేణ్యతోడ యమి ♦ వర్య! విచిత్రముఁ బుణ్యదంబునై
మీాఱెడు మామతంబె పుడ ♦ మిన్వరుణుండఖిలోత్తముండుబ్రం
దారక ముఖ్యవంద్యుఁడు స ♦ తమ్మును జీవనదేశుఁడౌటచేన్

ఆ॥వె॥ అంతఁ బ్రాణనాథుఁ ♦ డను వాయుభక్తుండు। నతులసంయ
మీాశు ♦ నకుఁ బొనర్చి। పలికె నఖిలమునకుఁ ♦ బ్రాణమైయె
సఁగు స। మీారుఁగొలువఁ గలుగు ♦ మేలటంచు॥ ౫౭౪

కం॥ అంతట భూమ్యర్చాని ర। తాంతరుఁడై తగుననంతుఁ ♦ డను
వాఁడు నమ। స్సంతతి యతిపతి కొనరిచి। సంతత మఖిలోత్త
మేల ♦ సంసేవ్య యనెన్॥ ౫౭౫

ఉ॥ జీవనదాభిధుండు యమి ♦ శేఖరుతోనిటుపల్కె మ్రొక్కియో
దేవ! భజింపఁగావలయుఁ ♦ దీర్థమునెప్డు సుఖంబుఁగోరు మ।
ర్త్యావళికి న్త్రివేణిగత ♦ మైతగు తీర్థముబిందు మాత్రము।
హాని తతి న్వెసన్గను నుమ ♦ నోపును భక్తిమెయిన్భజించినన్॥

ఉ॥ చూచినమాత్రఁ దీర్థమది ♦ శోషణముంగనఁ జేయుసర్వమా।
పాచితమున్దలంచి యని ♦ పల్కుచు రాత్ములుకొంద అంబ! నిం
జూచిననే విముక్తియగు ♦ చోఁ బరిశుద్ధమతి న్మనుంగఁగాఁ।

దోఁచు ఫలం బెఱుంగనని ♦ తొల్లి వచించెను నారదుండు తాన్॥
సీ॥ తనరు "నాపోవా ఇ ♦ దం సర్వ"మనునట్టి; వేదోక్తిఁ జేసి భా ♦
వింపజలమె। సర్వాత్మకంబై యు♦ జస్రంబుఁ గావున; బ్రహ్మత్వ
మొనఁగుఁ దీ♦ర్థమున కెపుడు। నట్టితీర్థంబు నే ♦మని శంబు సేవింతు;
మిటఁ బరంబునను లే♦ దించుకయు వి। చారంబు మదిని మో♦
క్షంబు మాకమరు హ। స్తామలక ప్రాయ ♦ స్వైరయముగ॥
గీ॥ గావున ననారతము మోక్ష ♦ కాంక్షులైన। మీర లెల్లరు నిఁక
భక్తి ♦ మెయి నిదీర్థ। సేవన మొనల్పుఁడీ దానఁ ♦ జెలఁగు మీకు
మోక్షసామ్రాజ్య వైభవం ♦ బు తిరమగుచు॥ ౧౪౮
కం॥ అనుచిట్లు వారునలువురు । ననశంకర సంయమీంద్రుఁ ♦
దాలించి రయంబున వారి నెల్లరఁ గనుంగొని యుక్తి మెలర్పఁ
బలికెఁ ♦ గోవిదులలరన్॥ ౧౪౯
సీ॥ వినుఁడు నానుడు లీరు ♦ విశ్వహేతూక్తి వి ♦ రుద్ధంబులగుటని ♦
రూఢముగను। మీ మతంబు లివెన్నఁ ♦ గా మానములు గావు;
తవకు జగద్ధేతు ♦ త వెలయమిని। మొదలవ్వరుణు నెసం ♦ పూ
జింపఁ గారాదు క్షరమైన భూతపం ♦ చకములోనఁ। జేరుటఁ జేసి స ♦
మీరునకుఁ బరమ; త్వేము లేదు జన్య భా ♦ వముగ లుగుట॥
గీ॥ నల్లెధరకును జన్యమా ♦ నదియనిత్య। మనెడు ననుమానమునఁ
దీర్థ♦మును ననిత్య। మగునిఁ కేమన భూతచ ♦ యంబునదుమఁ।
దీర్థముత్తమమను చాస్త్రు♦తి వచియించె॥ ౧౫౦
మ॥ క్షరవిజ్ఞానము చేతనక్షరవిరా ♦ జద్బ్రహ్మసంప్రాప్తి లే।
మిరహింజెందెడి మోక్షమబ్బదుసుఁడీ ♦ మీకెప్డునే నైహికా।
ద్ధరలాభంబున నిత్యసేవనముచేఁ ♦ దోఁపంగఁ బోదట్లుగా।
నరయంబోగతి మోహముద్రో ♦ అఁగి యూ ♦ నంగోరుఁ
డద్వైతము౯॥ ౧౫౧
కం॥ విశ్వసుఖాతిక్రాంతము। నశ్వరమున మేయమునయు ♦ యల
రెడు బ్రహ్మం। బోవ్వ శ్రేయస మొనఁగుట। శశ్వన్నతి నూని
ముక్త♦సంగులరగుఁడీ॥ ౧౫౨

కం॥ అని శంకర సంయమి తె। ల్పినవిని వారెల్లహర్షమ్మ॥ లినత విశా
రయంబున నెన్నం దొడంగికడు। న్దనరిరి శుద్ధాద్వయపర॥ శం
దనాశ్రితవృత్తులై॥ ౧౫౩

ఆచార్యుండు శూన్యవాదితో వాదించుట.

ఆ॥ వె॥ అంత నయ్యతీంద్రు॥ చెంతకు శూన్యవా। దియరుదెంచి
మ్రొక్కి॥ దేవ! త్రోవ। యందుఁగంటి నొక్క॥ యక్కజమద్దానిఁ
దెలియ మంచు నిట్లు॥ పలుకఁ దొడఁగె॥ ౧౫౪

మ॥ మృగతృష్ణన్విలసిల్లు శుద్ధమగు వా॥ రిస్నానమున్ జేసి వే।
గగనోద్భూత సుమాళి శీర్షమున సం॥ కాశింపఁగాఁ జేసి వం।
ధ్యగఁ గేలన్నశశృంగమూని ధనువం॥ ధ్యాపుత్త్రుఁడిదె దేవబు।
ద్ధిఁగడున్భక్తి భజించివచ్చితినొగి॥ స్థి వర్య! మీచెంతకున్॥

ఉ॥ సంబరమొప్పనిప్పగిది॥ శంకఁదొలంగి వచించువానివా।
క్యంబులనాలకించి విబు॥ ధాగ్రణి నీకుఁగలట్టి నామధే।
యంబెటువంటి దంచడిగె॥ నయ్యతినేతయతండు నేనిరా।
లంబనసంజ్ఞతోడుతఁజె॥ లంగుదు మత్పితకల్ప్తనామఁడా॥

కం॥ కడుఁగీర్తిఁ జెలఁగునా। తఁడె చెప్పె యతీంద్ర! మన్మ॥ తంబును
వినలనా। వుడు నవ్వియయ్యమీశా। నుఁడువల్కెను వానిఁదాఁగ॥
నుంగొనియిట్టుల్॥ ౧౫౭

ఉ॥ నీదుమతంబిదెన్నఁగడు॥ నింద్యము శూన్యముగాన శూన్యమా।
నేదది కాదు బ్రహ్మము మ॥ హీస్థలిలోనదశివభారతే।
త్యాదిక వేదమానమున॥ నక్కటతన్నిదు మూఢతన్సుఖా।
పాదకమైన యద్వయవి॥ భాస్వరవిద్యనెయానుమిత్తతిన్॥

సీ॥ అనియమీంద్రుఁడు వల్క॥ విని వెండియునతండు; యమివరేణ్య
నిత్యోడ॥ వనివెనిట్టు। లాకాశమునకు బ్ర॥ హ్మత సెప్పఁగాఁదగు;
వ్యాపకమాట సం॥ యమివరేణ్య!। కడుఁబెద్దయన్నిటి॥ కన్న
నాకాశంబె; యాకాశమేవరా॥ యణముసతము। నాకాశము నె
చొచ్చు॥ నఖిలంబునను శ్రుతిఁ; గ్రాలు బ్రహ్మత్వమా॥ కాశమున కె॥

ఆ॥ వె॥ కాననీమతంబె ♦ యూనంగఁదగు నెల్ల। రకును ముక్తినందు ♦
టకుఁదలంపు। కలుగునెడలననుచుఁ ♦ బలుకంగనయ్యామి। ప్రి
వరుఁడంతనగుచుఁ ♦ బలికెనిట్లు॥ ౫౫౯

శా॥ ఓయీ నీవిటులాడకింకగుణసం ♦ యుక్తంబగునన్యంతత।
మ్మాయాకాశము కానదానికిని బ్ర ♦ హ్మాత్వంబు లేదెన్నఁగా।
వాయూత్పత్తికి హేతువయ్యుజనిభా ♦ వంబద్ధియూనంబర।
మ్మైయొప్పారునుమిన్ను నాఁగఁజనున ♦ య్యాకాశశబ్దంబిలన్॥

చం॥ నిగమములెల్ల లెస్సగ గ ♦ ణించెడు ఖాదులకన్న దేనిఁబె।
ద్దఁగనెది ద్వైతవర్జితముఁ ♦ దత్పదరూప మనాదిహానికం।
బగణిత భూరిహర్షమయ ♦ మైతగు బ్రహ్మముదాకసంబునాఁ
గఁగరముఁ గ్రాలునద్దియగుఁ ♦ గాదెనభస్సిటనాకసంబునన్॥

మ॥ అనుచు న్నంయమినేత తెల్పఁగనతం ♦ డాలించి సంతుష్టుఁడై
యనునాదేశికవర్యుఁ గాంచి యధికం ♦ బౌభక్తితోనిట్లు పా।
వనతంగాంటిని మంటిఁదొంటిదగుదు ♦ ర్వార్యాఘముం గెంటికొం।
టినిమిమ్మింగనుఁగొంటముక్తిఁగనఁదు ♦ ష్టిద్దెల్పుఁడీబ్రహ్మమున్

ఉ॥ పేశలమైన పేర్మిభవ ♦ భీతిని బాపియపాపుఁ జేయుమో।
దేశికవర్య నన్ననయ ♦ తిప్రవరుండను నిట్టులెప్పునా।
కాశసమాఖ్యునద్వయు న ♦ ఖండునిభక్తి భజింపు మీవునీ।
కాశివమోసుధీ! యనుడు ♦ నయ్యమిశిష్యత నందెనాతఁడున్

లక్ష్మణుండను వరాహభక్తునికి విదేహముక్తిఁ గలుగుట

శా॥ అంతన్లక్ష్మణ సంజ్ఞకుం ♦ డగు వరా ♦ హస్వామిభక్తుండనే।
కాంతేవాసియుతు న్యతీంద్రుఁగని సా ♦ ష్టాంగంబుగా మ్రొక్కియ
త్యంతంబు న్ప్రణతీయమాసుఁడి మదీ ♦ యంబౌమతంబిద్దవి।
న్వింతు స్మీకు యతీంద్ర! విన్మనుచుఁ జె ♦ ప్పెన్దానుదత్సన్నిధిన్

చం॥ ప్రళయజలప్రతీనను ధ ♦ రన్మను దక్షత నుద్ధరించెని।
ర్మల కృపనెవ్వఁడా దిమవ ♦ రాహుని సర్వవిభుభక్తితో భుజా।
బులనొగిదంష్ట్రచిహ్నములఁ ♦ బూనిభజింపుఁడుముక్తిఁ జెందమీ
రలు తగనెల్లరు న్బరుఁగ ♦ రంబును నింక సమాహితాత్ములై॥

చం॥ అనవుడుసంయమీంద్రుఁడిటు♦లాతనితోనను, లక్ష్మణాఖ్య!నీ
వునుడివినట్టి పల్కెదియ ♦ వుం గడు నింద్యము విప్రవర్యచే
తనొక తపంబెసేయఁగ స ♦ దాతగుఁ జిహ్నధృతి బ్రమాణతే
చ్ఛనెగడెనేని మేనను ఝ ♦ షచ్రిముఖాంక ములన్ధరింపుమీ॥
మ॥ వినుమీ లేదు ప్రయోజనంబులవము ♦ న్వేదోక్తకర్మంబుకం
టెనునన్యంబగుదానిచే సగుణత ♦ న్దీపించు బ్రహ్మంబుఁగో
ల్వనగుంజుమ్మనెదేనిఁజిహ్నముల న్నె ♦ ల్ల న్వీడిసేవింపు తు
ష్టిని శ్రీవిష్ణుశివాది రూపమగుచుం♦ జెన్నారు నాబ్రహ్మమున్
ఉ॥ మేదినిదండ మందఁదగు ♦ మిక్కిలి భూదివిజుండుఁద్యక్తసం
ధ్యాదికకర్ముఁడైన యెడ ♦ నట్లగుట న్వెసమూఢబుద్ధి నీ
వాదె షఁడోర్ధ్వలిచిహ్నముల ♦ నన్నిఁకివీడి కులార్హకర్మమే
యాదృతి సల్పశుద్ధిఁగని ♦ యందెదుభవ్యముమోక్షలబ్ధిచేన్॥
కం॥ అనియతివర్యుఁడు దెల్పఁగ । వినిదేశిక ముఖ్యువలన ♦ విమల
జ్ఞానం । బును గనియతఁడు దదాశ్రివ । తనెగడె నిరతంబుఁ
బరమ ♦ తాపసుఁడగుటన్॥ ౧౬౯
సీ॥ అంతటఁగామక ♦ ర్మాభిఖ్యుఁడగులోక; సేవకుండరుగుదెం ♦ చి
యమివర్య। నకుమ్రొక్కి యనియెన ♦ నారతంబు నెసంగుఁ;
గడుఁ బరేశుండు లో ♦ కములగుమి నె। కానమోక్షాసక్తు ♦ లైన
మీరలనన్య; మతులౌచుదానినే♦సతముఁ గొల్వఁ। డగుముక్తి
సత్యలో ♦ కాత్మక తత్సేవ; నమునవేకానియ♦న్యముఁగాదు।
గీ॥ నావుడున్దండి నేతయో ♦ ధీవిహీన। సత్యరూపవిముక్తి యు ♦
నిత్యసేవ। వలనఁ గలుగదటంచన ♦ వాఁడు గురున। కెఱఁగి
యద్వైతవృత్తిర ♦ హించెఁగరము॥ ౧౭౦
సీ॥ అంతటగుణసేవ ♦ నాసక్తులయ్యతీ; శ్వరునకు మ్రొక్కి ప♦ల్కిరి
టు లపుడు। సంయమీశ్వర! యెవ్వి ♦జగములకెల్ల హే; తువు
లెవ్వికర్తలు ♦ ద్రుహిణముఖుల। కట్టిగుణంబుల ♦ వనిశంబు
సేవింపఁ। దలఁచెడుమేమతి♦ ధన్యులమిల।సర్వమయము♦లై యె
సంగుట నవియెమోక్షముఁ గోరుమీకు సే♦వ్యములు సతము।

సి మొనయు వేద మేయిటన ♦ చింత్యమరూపమనంతమవ్యయం।
బుమహదభిఖ్యత త్త్వపర ♦ మునప్రసహీనమగంధ్యనాది వ్య।
క్తమనఁగరాని ద్వైతగుప♦దంబు నెఱింగితొ అంగు మృత్యువుఁన్॥

మ॥ అనుచున్వేదమునం బ్రధానమిటులే ♦ యవ్యక్తశబ్దంబుచే।
తను జెప్పంబడెనంచు నాతఁడనచా ♦ దండేంద్రుఁడాలించి తా।
ననునవ్వానికి నీగతి న్ప్రకరణా ♦ వ్యవ్యక్త శబ్దంబుచే।
తను బ్రాజ్ఞుండెవచింపఁగాఁబడియెనూ♦తథ్యంబుగా వెండియున్॥

మ॥ ధరలోన న్గుణసామ్య సేవనముచే♦ తన్న త్త్వవిస్తారభా।
స్వరరూపంబగు జ్ఞానమెప్పుడును నెం ♦ చంగల్గదక్లాటఁ బా।
మరబుద్ధీ! యొగినీమతంబు విడి ని ♦ ర్మాలిన్యమై క్రాలునీ।
పరమాద్వైత సువిద్యనూని సుఖివై♦ భాసిల్లు మీ వెంతయున్॥

కం॥ అనియమివరుఁడాదరయ।బున సాంఖ్యుండతఁడుఁ దనదు ♦
పూర్వమతముపేఁ। డి నెగడెనద్వైతాస। క్తినియమి పాశ్రవత
చేసు ♦ ధీకలితుండై॥ గీ౭౨

కాపిలాఖ్య యోగితో వాదించి కర్ణిమ్మతించుట.

ఆ॥ వె॥ అంతఁగాపిలాఖ్యుఁ ♦ డగు యోగవిత్తముం। డయ్య
మీందుఁ జెంత♦ కరుగుదెంచి। వినయమెసఁగ నెఱఁగి ♦ విజ్ఞావ
ళికి వింతఁ। గొలుపు విధముదోఁపఁ ♦బలికెనిట్లు॥ గీ౭౩

కం॥ యమివర! యోగముననె మో। క్షము సేకుఱు సాధకులకు ♦
సత్యంబుగనం। చునుదీయ ప్రామాణిక। విమల మతంబు
సుమిదాని ♦ విధముఁదెలిపెదన్॥ గీ౭౪

సీ॥ విమలమై చెలఁగు వి ♦ విక్తదేశమునందు; శుచియైసుఖాసన♦
స్ముండునగుచు। సమకంఠశీర్షదే ♦ హమహితుండై యాశ్రి; మా
తిగుండైయింద్రి♦యములనెల్లఁదగనిరోధించి యెం♦తయుభక్తిఁ
దనగురు;ముఖ్యునకెఱఁగిహృ♦త్పుండరీక। మునురజోవిరహితం♦
బుగవిశుద్ధముగభా;వించి తన్మధ్యను♦విశదునివిభు।

గీ॥ శాంతునవ్యక్తునాదిమ♦ ధ్వాంతరహితు। నమృతునినచింత్యు
శివునేకు♦నఖిలభూతు। యోనివఖిలేక్షితను బ్రహ్మ♦ యోనినద్భు।

తునిఁజదానందునిత్రిణయ♦మునినరూపు ॥ ౫౮౭

గీ॥ మహితుఁబరమేశునభవును♦ మానసహాయు। నీలకంఠునశోకు
ధ్యా♦నించిమునివ।రుఁడుఁదమఃపారమునొగిఁజే♦రుననుటాది!య
గునిగమవాక్తతిఁబ్రిమాణ♦మగుమతమిది॥ ౫౮౮

చం॥ మఱియుయమీంద్రి!యోగపుస♦మాజమునందజపాఖ్యవిద్య
వి। స్తరముగఁజెప్పఁగాఁ బడియె ♦ దానవిధానమునన్బుధాళికిం।
గరమును జక్రషట్కముఁద ♦ గన్మహిభేదనముంబొనర్చుచో।
వఱలు విముక్తిము క్తిరతి♦ భాసిలు మీకిదెయానఁగాఁదగుక॥

చం॥ అనవుడు సంయమిప్రివరుఁ♦డాతనితోనను నిట్టులోయి!నీ।
దునుడియిడప్రిమాణమయి♦తోఁచుఁజామీదహరాభిధానవి।
ద్యనెవచియించెనా శ్రుితివి♦తానము ముక్తిదమద్వికానినీ!
వనిశముఁబల్కుయోగమెద♦నారయహేతువుకాదు ముక్తికిక॥

మ॥ అజపాభావుకమూలమంత్రమునకో♦యప్రాజ్ఞ!"సోహా"మ్మటం
చుజగన్మండలి నర్థమొప్పెసఁగుటం♦జూడండజీవేశభే ।
దజమాగంధలవమ్ములేదుగద పం♦తంబొప్పఁగానెట్టుల।
య్యజపావిద్యయెయోగమంచనఁగశ♦క్యంబయ్యెడిన్దెల్పుమీ ॥

సీ॥ సక్రమంబుగఁజక్రి♦ షట్కంబునుంగుండ; లినిచేతభేదించు♦ట
నెవిముక్తి। యగుననునుడియను♦నప్రమాణంబగుఁ; దగఁదన్ను
సర్వభూ♦తములయందుఁ। దనయందు సర్వభూ♦తములనీక్షించు
నేఁర్పరియెచేరునుబర♦బ్రహ్మమునొగిఁ।గానియన్యంబగు♦ కార
ణంబునఁగాద;టన్న యామ్నాయవా♦క్యమునఁజేసి ।

ఆ॥ శాంతిదాంత్యుపరతితితి♦క్షులనెసంగు। శుద్ధమతియైనయధికారి♦
చూడవలయు।నాత్మయందాత్మఁగేవల♦మనుశ్రుతివచ। నములఁ
దావకమతముపే ♦ క్ష్యమిఁకసుమ్ము॥ ౫౯౦

కం॥ అనుచుంబల్కెడుయతివ। ర్యునకాపిలసమాఖ్య♦ యోగమ
తస్థుం। డనె"నపరిజ్ఞానవశం। బునఁబల్కెదుదండి!నిక్క♦ ముగ
విను''మనుచుక॥ ౫౯౧

సీ॥ పుడమినిఖేచరీ♦ముద్రినెఱుంగక;యునుధునీత్రితయసం♦యోగ

ముంది। కూటంబటంచెదఁ బాటింపకయు నుశ్రృం; గాటకంబును
లోఁదగఁ దెలియకయుఁ। బూర్ణమండలమార్గ మానమనోన్మని
దాస్వ; రూపంబు నెఱుఁగు నేర్పుం గనకయు। నంగుష్ఠమాత్రుఁడై
యలరెడు పురుషుని; యునికి గుర్తెఱుఁగకయు నవిరతము।

గీ॥ నెవఁడు "బ్రహ్మాహమస్మి" యంచెప్పుగనను। నతని నాల్కను
వేగఁ గోయంగవలయు। నిలనవస్థాత్రికస్థాన మెఱుఁగకే నె బ్రహ్మ
మనువాని శిరము ధరంబడు వెస॥ గీ. ౨

మ॥ లయయోగజ్ఞుఁడుఁ దాఁ బరంబనఁగఁ జెల్వొంబంద బ్రహ్మాంబు నెం
తయు వేగంబుగఁ జేరెడిన్మాత్మనం గానోప్పు యోగంబు బు।
ద్ధియుతుం డెవ్వఁ డెఱుంగునో యతఁడుఁ దా దీవ్యద్గతిం జేసు న।
వ్యయమై శ్రాలు సనాతనంబయిన బ్రహ్మంబున్ స్వరంబు స్వసర్॥

కం॥ అనునివి మొదలగునట్టివ। చనముల బలమునను జేసి సంయమివర
మో। క్షనిరతులగు మీకి దేసై। కానఁదగు యత్నమున యోగి
కోటినుతింపన్॥ గీ. ౪

మ॥ యతివర్యుండిటులంతవానికను "నీ వయ్యారెయజ్ఞానమో।
హితచేతస్కుఁడ నౌచు వ్యర్థముగ నే హెచ్చొంగతినా వాగదీ।
క్షితినష్టాంగిక యోగమెన్నఁగవిము క్తింగూర్పదెప్పున్వెశు।
ద్ధతనై శాంగ్రిము శౌత్రిత మార్గమిదు శుద్ధం బోక్క వేదం బెయా॥

సీ॥ ఆమ్నాయ మెవ్రుడు బ్రహ్మజ్ఞానమునము క్తిః కలుగునటంచును
బలుకుచుండ। మోక్షంబు ఖేచరీ ముఖ్యవిజ్ఞానఁబు; లేనిమానవు
లకు లేదటంచు। ననుటయత్యంత సాహసమున నేకాని; కాదుమ
ఱొక్కఁడో కారణమునఁ। గాన వేదప్రోక్త కర్మనిష్ఠుండవై;
చిత్తశుద్ధిని నెన సిసువివేకి।

గీ॥ వైవిర క్తినిగనిశమాద్యములనొప్పి। యొగిముముక్షుండవగుచు
నంత గురుముఖము। వలనఁ దత్త్వమసియనుసద్వాక్యమువిని।
యాత్మగతిని విచారింపు మధికముగను॥ గీ. ౬

ఆ॥ వె॥ అంతనీవు సచ్చిదానందమయపర। మాత్ముఁ డద్వితీయుఁ డ
తఁ డె యేన। టంచు నెఱిఁగి యపునరావృత్తికంబగు। ముక్తిఁగ

నెదునిక్క♦ముగనుసుమ్ము॥ ౫౯౭

కం॥ అనియత్యుత్తంసుఁడు పేర్మినిదెల్పఁగ వినియతండు♦మిగులఁ జెలఁ
గుభ। క్తినిదత్పదాబ్జయుగ్మం।బున కెఱఁగి తదాశ్రవత్వ♦ ముం
బొందె వెసన్॥

### పరమాణువాదులతోడి వివాదము

సీ॥ అంతఁ బరమాణువాదస♦మాశ్రితులగు। ధీరశివనామకాదులే♦
తెంచి పంయ। మీందుపదకంజయుగమున♦ కెఱఁగి వేగ। స్వీయ
మతరీతిఁ గడఁగిరి♦ చెప్పనిట్లు॥ ౫౯౯

ఉ॥ ఎన్నఁగఁగర్తనాఁ బడుప♦రేశుఁడు సర్గమునందు నిత్యతం।
జెన్నగు భూముఖాణువులఁ♦ జేర్చు లయంబున వాని వేఱు సే।
యున్నిపుణత్వమొప్పఁగ♦ నోయమి! లోకగురుండు లోకముల్।
చెన్నుగఁ జేసి జీవులసృ♦జించి చెలంగును సాక్షియట్లు తాన్॥

చం॥ అనవుడు వారికయ్యతి చ♦య ప్రవరుండిటు పల్కెనన్నమీ।
దునుడు లివప్రమాణతను ♦ దోఁచెడు వేదవిరుద్ధరీతిచే।
వినుఁడీక ఖాదిసర్గమొద ♦ వెన్పరమాత్మని వల్లనంచు వా।
కొనె నిగమంబటన్న నొన♦ గూడెడు నిత్యతఖాదులందెటుల్

మ॥ అగునిత్యుండు పరేశుఁడొక్కరుఁడె జ♦న్యంబైన యీవిశ్వమొ।
ల్లఁగనుంగొన్న ననిత్యమేయగును వా ♦ లాయంబ జన్యత్వమా
జగదీశానునికంటెఁ గొన్నిట విరా ♦ జద్రీతిమై నున్నఁజె।
ప్పఁగ రాదెప్పుడు నంతకు న్జనకత ♦ న్బాసిల్లమి న్వానికిన్॥

కం॥ గౌతమశాస్త్రముఁ జదివిన। యాతఁడు సాగ్రాలయోని ♦ నం
దున నెడు వి। ఖ్యాతవచనమున మీరొగి। నా తెఱఁగుం దొఱఁగి
యూనుఁ ♦ డద్వైతంబున్॥ ౬౦౩

గీ॥ అంతగురుభక్తి సంజాత ♦ మై యొసఁగెడు। ఘనవిశుద్ధాత్మ
విజ్ఞాన ♦ మున విముక్తు। లగుఁడనుచుఁ దెల్ప ధీరశి ♦ వాదు
లార్య। పాదునకు మ్రొక్కి శిష్యులై ♦ పరఁగిరపుడు॥ ౬౦౪

### యమివరుండు కాశిఁ జేరి కర్మవాదులకుఁ గలుపర్మముం దెల్పుట.

చం॥ యమివరుఁడంత వేకువఁ బ్ర ♦ హర్షమెసంగఁ ద్రివేణిలోనస్నా

నము నొనరించి యాశ్రమజ♦నంబులతో నటనుండి ప్రాక్సమా|
ర్గమునను విశ్వనాయక చ ♦ కాసికిఁగాశికిఁ బక్షమాత్రది |
ష్టమునకు శిష్యసంస్తుతులై ♦ సంగఁగనేగి యటన్వసించెఁదాన్

గీ॥ మూఁడుమాసంబులవఱకు ♦ నాడశిష్య| సేవితుండౌచు సం
యమి♦ శేఖరుఁడు వ| సింపఁ గొందఱు కర్మసం ♦ సేవకులరు|
దెంచి యతిపతి కెఱఁగి వ ♦ చించిరిట్లు॥ ౬౦౬

సీ॥ యమికులవర్య! క♦ ర్మమున నేకలుగు లో; కములకు సర్గము ♦
ఖ్యము నిజముగ| రమ్యమై యెసఁగు క♦ర్మము చేత రమ్యమౌ;
విప్రాది యోని భు ♦ వింగనెదరు| పాపకర్మంబునఁ ♦ బాప
రూతంబగు; శూద్రాది యోనులఁ ♦ జొరనగుదురు| జనక
ముఖ్యులు కర్మ♦మునసె సంసిద్ధిని; గనిరనుటాదిగాఁ ♦ గలుగు
నుడులఁ|

గీ॥ జేసి యనిశంబుఁ గర్మమే ♦ సేవ్యమగుము| ముముక్షువులకెల్లఁ
గడుయత్న ♦ మున విమోక్ష| మనఁబడు సుఖాప్తియే కాన ♦
ననిశముఁదగు| కర్మమునొనర్చి కనుఁడు మో♦క్షంబునీరు॥ ౬౦౭

చం॥ అనియిటు కర్మవాదులన♦నార్యపదుండు వచించె వారితోఁ|
డనిటు, భవద్వచస్తతి శ♦టా! కడుఁజూడఁగన ప్రమాణతఁ|
గను; నిగమంబువాకొనె జ♦గంబఖిలంబును బ్రహ్మకార్యమం|
చనిశమునట్టి కారణమె♦యార్యులకున్భజనీయమౌఁగడున్॥

గీ॥ స్థూలమును సూక్ష్మమునయితోఁ♦చు జగమునకు| నెల్లఁగారణ
మైబ్రహ్మ♦ముల్లసిల్లు| నని "ఋతం" చేతిముఖ్యవే ♦ దనిగదితము|
లుఁదగవచియించెడిన్బెక్కు ♦ లుగడు నెపుడు॥ ౬౦౮

ఉ॥ కావునసర్వవిజ్ఞఁడయి♦కాంలుపరేశుఁడొకండె కారణం|
బైవిలసిల్లు విశ్వమున♦కంతకుఁ, గర్మముతా జడంబగుం|
జూవె; యచాటఁగారణత♦నుంగన దెన్నఁడునద్ది; దానిసం |
సేవనమే యొనర్చెదరొ♦ సిద్ధమువారలుమందులిమ్మహిన్॥

కం॥ అనియతి నేతవచింపఁగ| విని వారెల్లరునుదొల్లి ♦ విధముఁదొఱఁ
గివే| గనె పరమాద్వైతసువి| ద్యనుబూని తదాశ్రవాగ్రి♦త్రై

చెలంగిరిలన్ ॥ ౬౧౧

చంద్రసేవాచరణుండగు శివాభరణు సద్వ్యయజ్ఞుఁజేయుట.

ఉ॥ అంతయతీంద్రుచెంతకుశి♦వాభరణాభిధుఁడాశ్రవాళిత।
న్నంతయుఁగొల్చిరాఁగడుర♦హించుచువే చనుదెంచి ధీరశి।
ష్యాంతరభాసమానుఁడగు♦నయ్యతినేతకుభక్తితోనమ।
స్సంతతినాచరించికడుఁ♦జాతురిమీఱఁగఁబల్కెనీగతిన్ ॥

శా॥ దండిశ్రేష్ఠ!సుధామయాంశువులచే♦తన్సర్వవిశ్వంబుఁజం।
ద్రుండాకర్ణించె రహింపఁజేయుసురసా♦దోహాత్మసంతృప్తినా।
తండేకూర్పుస్వగాత్రనిష్ఠసుధచే♦తంగావునన్భక్తిమ।
ర్త్యుండావేలుపుఁబూన్కిమీదిఁగొలువ♦న్మోక్షంబుగాముక్తుఁడౌ।
ఆ॥వె॥ కానవింకమోక్ష♦కాంక్షులౌమీఱలు। సదమలామృతాంశు
సాంద్రిఁజంద్రు।భక్తితోడఁగొల్చి♦ముక్తులరగుఁడన। సాలకించి
పలికె♦యమివరుఁడిటు॥ ౬౧౪

శా॥ ఓపాండిత్యవిహీన!మోక్షమిదని♦త్యోపాసనన్గల్గది।
ష్టాపూర్తాదికకర్మముల్సలిపిన♦క్షుద్రేశలోకంబుఁబు।
ణ్యోపేతుండయిచేరికొంతవఱకా♦ర్యత్మేచ్ఛఁగానుండితా।
నీపృథ్విస్థలికేగుదెంచుమఱల♦న్క్షీణస్వపుణ్యుండునై ॥
గీ॥ ధూమము నిశయునసితమై♦తోఁచునట్టి। పక్షమును నాఱు
మాసము♦ల్దక్షిణాయ। నంబుఁజాంద్రమసముగులో♦కంబు నట
కు। యోగిచనిధాత్రికిని వెండి♦యుమఱలుఁజుమి ॥ ౬౧౬

చం॥ దివిజులకింపుఁడన్న మని♦తెల్పఁబడెన్ శ్రుతియందుఁ గానము।
క్తి వెలయనెప్పునట్టియుడు♦దేవుభజించుటఁజేసి ధాత్రిమా।
నవులకు వానిసేవనము♦నందగునంచితలోకనిష్ఠగా।
నచెనసవిమూఢతన్విడి య♦నశ్వరతంగనుమద్వయజ్ఞతన్ ॥
కం॥ గురువరుఁడిటు తెల్పశివా। భరణాభిధుఁ డాలకించి♦భక్తిం
దదంఘ్ర్యం। బురుహములకెఱఁగియెంతయు। వఱలెఁదదాదిగఁ
దదాశ్రి♦వత్వమున మహిన్ ॥ ౬౧౮

అంగారకాది గ్రహార్చకుల కద్వైత బోధసల్పుట.

సీ॥ అంతభౌమాది గ్ర ♦ హాభజన పరులరు; దెంచివినతులఁగా ♦ వించి గురుకృ। పానిధియగు నార్య ♦ పాదున కనిరిట్లు; యమివర్య! యంగార ♦ కాది కగ్రహోపా స్తి నేమోక్ష ♦ మొదవునంచును వేద; మునఁ జెప్పఁబడియెఁ గా ♦ పునముముక్షుపులగు మీరలిఁకను ♦ బూనికను భజింపుఁ డవ్వానినే భక్తి ♦ యలరఁగఁగడుఁ।

గీ॥ నావుడు విమూఢమతులార! ♦ నరులకు గ్రిహ। పీడ తొలఁగుట కొఱకుఁ జె ♦ ప్పెను గ్రిహార్చ। నంబు వేదంబుగాని మో ♦ క్షంబు కొఱకుఁ। గాదు చైతన్యబోధనే ♦ కలుగుముక్తి॥ ౬౧౯

గీ॥ అది "సదేవేతి" ముఖ్య వా ♦ క్యంబులఁగడు। వేదమునఁ జెప్పఁబడె"నన ♦ వినిసమాద్యు। తి నొగివారెల్లఁ దొల్లిఁటి ♦ తెఱఁగుఁదొఱఁగి। సంయమీంద్రునకెఱఁగి శి ♦ ష్యతనుగనిరి ॥ ౬౨౦

చం॥ క్షపణకుఁడంత వందనము ♦ సంయమివర్యునకుంబొనర్చియి। ట్లుపలికె నోయమీశ్వర! యె ♦ టోనెలఆఱఁటిమిమ్ముఁ జేరియిట్టిపగిది వెళ్లఁజేసితి గ ♦ డింపను సుంతయుఁ గాలమిద్ధియే। యపరిమితంబు బ్రహ్మమగు ♦ నర్భ్యముమీకిఁకవృద్ధినందఁగన్।

గీ॥ అనుడు యతినేతవచియించె ♦ నతనికిట్లు। ధన్య! సంవత్సరో జాయ ♦ త" యనుశ్రుతి వ। చనమునంజేసి కలదు ది ♦ ష్టము నకు జని। సజనియగుదానిఁ గొలువమో ♦ క్షము గలుగదు।

గీ॥ కావునఁ గుబుద్ధిఁ దొఱఁగి యిం ♦ క నొగినీవు। విమలమైయొప్పనద్వైత ♦ విద్య నాశ్ర। యించి ముక్తిఁగను మనవా ♦ లించి యాతఁ। డద్వయబ్రహ్మరతుఁడయ్యె ♦ యతిపుఁగొలిచి॥

సత్యశర్మాదులగు పైతృక వ్రతుల మోక్షగతుల నొసఁగుట.

ఉ॥ అంతట సత్యశర్మముఖు ♦ లా పితృసేవకు లేగుదెంచి భ। క్త్యంతరులై ప్రణామముల ♦ నయ్యతి వర్యునకుంబొనర్చి యి। ట్లెంతయు వింతదోఁపవచి ♦ యించిరి సంయమివర్య! యామినీ కాంతునిమండలంబు పయి ♦ గాఁ బితృదేవతలుందు రెప్పుడున్।

కం॥ ఓదమివర! యగ్నిష్వా। త్తాదులువారేద్వరు సుమి♦యవ్వా
రలలో। నాదిందగు ముగురుం బరమా। మోదులమూర్తులును
నిత్య♦ముక్తులుందలంపన్॥ ౬౨౭

చం॥ మిగిలినయట్టినల్వురును ♦ మేలగుమూర్తులనొప్పుచుంద్రివా।
రింగడుం బ్రపత్తింగొల్చుట ధ ♦ ర్మ్రతినిధర్మముఖోత్ఫలప్రదం।
బగును నజస్రముక్తిదము♦నౌనని వేదములంగడున్వచిం।
పంగంబడెంగానయత్నమున♦మర్త్యులకర్చ్యులుసుమ్మువారిలన్॥

చం॥ జగతిని శ్రాద్ధకర్తయును ♦ సత్యవచస్కుండునైన గేస్తుము।
క్తింగనును జాంద్రమానపుమి♦తింబితృపాళికి మధ్యవాసరం।
బగునమంగాననద్దినము♦నందునందత్ప్రిమదార్థమైయొన।
ర్పంగందగు శ్రాద్ధముఖ్యముతి♦రంబగుభక్తినిమర్త్యపాళికిన్॥

కం॥ అనుచుంబల్కెడువారలం। గనియమివర్యుండుంజిఱున ♦ గవ్వువె
న్నెలనా।ననచంద్రిబింబమెంతయుం।దనరంగవచియించెనిట్లు♦త
ద్జ్ఞులుమెచ్చన్॥ ౬౨౮

మ॥ వినుండీమీనుడులివ్వియుక్తముగ భా♦ వింపన్మదిందోంపవెం।
దును గర్మంబుపిముక్తినందుటకుహే♦తుత్వంబునుంగాంచదం।
చునునాత్మజ్ఞుండె బ్రిహ్మతంగనునటం♦చున్నట్టిగాందావచిం।
చెనునమ్మంగ"నకర్మణా"యనుశ్రుతి♦శ్రేష్ఠంబుసుమ్మెంతయున్

గీ॥ కానంగర్మమువెల్లవే♦గముగందొఱంగి। యకలుషమనస్కుండగు
చుదే♦శికునిమోము।నుండి పరమేశునివినియ♦నూనరీతి।మైవిచా
రించిముక్తుండౌ♦మనుజుండుచుండి॥ ౬౩౦

మ॥ యమివర్యుండిటు తెల్పగాఢముగందా♦ మాలించియాసత్యశ।
ర్మముఖుల్శంకరదేశికేంద్రునకు సా♦రంబైనభక్తిన్నమ।
స్సమితింజేసి తదీయమైనయుపదే♦శప్రోల్లసత్సూక్తిచే।
తమహింగాంచిరి సత్వరంబుగంగృతా♦ర్థత్వంబునెంతేనియున్॥

గరుడానంతభక్తులకు సద్బోధ గావించుట.

శా॥ అభిక్షుప్రవరాంతికంబున కనం♦తార్చెచ్చుండౌశంఖపా।
లాభిఖ్యాకలితుండుసుం గరుడపూ♦జాసక్తుండౌకుబ్జపీ।

డాభిఖ్యుండునునంతవచ్చియొగిసా♦ష్టాంగంబుగా | మొక్కి-యి।
ట్లాభాషించిరి సక్రమంబుగను దా♦మాసంయమీశానుతోన్

క౦॥ యమివర్య! యెవఁడుభూమిత। లము నెల్లవహించునోఁద♦ లన్విష్ణుఁడజ|స్రము సేవనిపంబుఁబరుండెడు। సుమహితుఁడాశేషుఁడొకఁడె♦సుమి సేవ్యుఁడిలన్॥ ౬౩౩

గీ॥ కుక్షిసంగతసర్వలో♦కుఁడయియలరు। నట్టినారాయణునకువా♦హనమయియని।శము నెసంగుటఁజేసినం♦ యమివరేణ్య!।గరుడుఁడే సేవ్యుఁడుసుఁడిమో♦క్షంబునంద॥ ౬౩౪

చం॥ అనవినివారితోఁడనిటు♦లార్యపదుండనుమీఁదుపల్కె-లె।
న్ననవని నప్రిమాణములు♦ నంజను వెన్నునకు నుతల్పవా।
హనతలఁగన్నపన్నగగ♦ణాధిపతార్క్ష్యులఁగొల్చుటన్లభిం।
చునొగివిము_క్తినాననుట♦ చోద్యముగాఁగనిపించె నెంతయున్॥

ఉ॥ ఏయనఘుండు విశ్వమున ♦ కెల్లను గారణమైతనర్చు నిం।
కేయఘలుండు బ్రహ్మమున ♦ కెన్నఁగ నంశతనొప్పునట్టి నా।
రాయణునే భజింపుఁడు ప ♦ రంపరగా నెదశుద్ధినంద వే।
ధీయుతుఁడొగు రూ_త్తముఁడు ♦ తెల్పుగతింజనిము_క్తినందుఁడీ॥

క౦॥ అనుచున్నసూ-రిపతి తె । ల్పిన వినియిర్వురనువారు ♦ పృథుతర మాభ। _క్తిని దత్పదాబ్జ యుగ్మం । బున కెఱఁగి తదాశ్రవత్వ♦ ముంబొందిరొగిన్॥ ౬౩౭

సిద్ధార్చనాసక్తుల మఱల్చుట.

క౦॥ అంతట వయ్యమి వర్యుని । చెంతకుఁ జరకీ_ర్తి ముఖ్య ♦ సిద్ధార్చనస। క్తాంతరు లరుదెంచి నమ । స్సంతతిఁ జేసియనిరిట్లు ♦ చండము వోఁవన్॥ ౬౩౮

సీ॥ సంయమివర్య! శ్రీ ♦ శైలాది గిరులందు; భవ్యమంత్రౌదులఁ ♦ బడసి సత్య। నాథాది సిద్ధులెం ♦ తయుఁ గృతార్థులఁ జిరజీవులునై విరా ♦ జిల్లిరికడు। నమ్మహాత్ములదాఘు ♦ నమ్మగునుపదేశ; మునసట్టి పగిది నే ♦ మునిలమిగులఁ। జెలఁగెదము మఱియుఁ♦జిత్రాంజనాదివిద్యలఁ జేసి యొఱఁగెద♦మఖిలముఁదగఁ।

ఆ॥వె॥ గాన మాహాత్మ్యంబుఁ ♦ గలుఁచుటకేరును। గారు శక్తులెన్నఁ♦
గానెపుడును। గాన మీరలిఁకన ♦ కల్మషమైకా్రిలు। మాదు
మతమునూని ♦ మనుఁడుచిరము॥ ౬౩౯
మ॥ అనుచున్వారలు వల్క మస్కరివరుం♦డాలించి యిట్లాడె "దో।
షనిదానంబు ఘలేప్సు లౌజనులతో♦సంభాషణంబాఁబ్రయో।
జనమావంతయులేదుచిత్రితరవే♦ షస్వీకృతిన్దోషమే ।
కననాఁజుండు పరార్థలాభమున ని ♦ ష్కర్షంబుగా నిమ్మహిన్॥
చం॥ అనిశము మేనుదుఃఖమయ ♦ మౌట మహింజిరకాల జీవనం।
బునలవమైనయట్టి ఘః ♦ యున్నభియింప దొశప్పుడేనిఁ గా।
వుననుసుబుద్ధియూ మనుభ ♦ వుండు శరీరము వీడుటన్విము।
క్తిని గననా నుపాయమునో ♦ గింబొనరింపనలెన్థ్రవంబుగన్॥
ఆ॥ వె॥ యతివరుండు యుక్తి ♦ యుతముగా నిటుపల్క । నాల
కించి వార ♦ లంతనెంత। యేనిభక్తిసం య♦ మీనునకెఱఁగిత
చ్ఛిష్యులగుచుఁ గరముఁ ♦ జెలఁగిరవని॥ ౪౨

గంధర్వార్చన పరులకు బ్రహ్మంబుఁ గఱపుట.

ఆ॥వె॥ అంతనయ్యతీంద్రు ♦ చెంతకు గంధర్వ। భజననిరతమతుల♦
గు జనుఁరుగు। దెంచ యతిపునకు న ♦ తి ప్రతతిం జేసి। యెల్ల
రవుదు పలికి ♦ రివ్విధముగ॥ ౬౪౩
మ॥ వినుఁడో సంయమవర్య! యీవసుమతి ♦ న్విశ్వావసూపాసనం।
బున నాదజ్ఞతచేత బిందుసుకలా ♦ బోధంబునన్థన్యత।
న్గనఁగాఁ జాలితిమేము గావున నిఁక ♦ న్గాంధర్వ విద్యాశ్రిమం।
బునుగావింపుఁడుము క్త్యపేక్షులగుచుం♦బొల్పొందుమీరెప్పుడున్
ఉ॥ నావుడువారికి న్యతిజ ♦ న ప్రవరుండను సప్రమాణమా।
మీవచనంబు దాశ్రుతికి ♦ మెండు విరోధమునందుటన్ఘనం।
బైవిలసిల్లు వేదనిచ ♦ యంబున బ్రహ్మము శబ్దమాదిగా।
నౌవిషయాళికెల్లనన ♦ యంబు నతీతమటంచుఁగాన నౌ ॥
గీ॥ శబ్దముఖ్యంబులకు నగో ♦ చరము నాద। బిందుకళల కతీతమై♦
వెలయుబ్రహ్మ। మెఱుఁగునాతఁడె వేదజ్ఞుఁ ♦ డెన్నననుచు ।

స్మృతిని గడురూఢముగను వ ♦ చింపఁబడియె॥ ౬౮౬

గీ॥ కాన నాదాద్యగోచరం ♦ బైన బ్రహ్మ। మును భజింపుఁడు
మీరును ♦ ముక్తిదానఁ। గను డని యతీశ్వరుఁడు తెల్ప ♦ విని
రయమున। వారలెల్లరు శిష్యభా ♦ వంబుఁ గనిరి॥ ౬౮౭

భూతభేతాళ భక్తులఁ బంచార్చనాసక్తులఁ గావించుట

సీ॥ అంతఁ జితాభసి ♦ తానులిప్తాంగులు; లాక్షాతిలకకజ్జ ♦ లయు
తులస్థి। భూషులౌ భేతాళ ♦ భూతసేవారతు;లయ్యతీంద్రుని చెంత ♦
కరుగుదెంచి। మస్కరీంద్రునకున ♦ మస్కృతులం జేసి; భూత
నేతలు జగం ♦ బునకు నెల్లఁ। బ్రభువులవ్వారల ♦ భక్తితోడ
భజింప; నగు శత్రుజయము స ♦ ర్వార్థసిద్ధి॥

గీ॥ మేము తదుపాసనమున శ ♦ మిపరిశస్త। సర్వలోక వశీకృతి ♦
సలుప దక్షు। లమని వచియింప నాలించి ♦ యమివరుండు।
పలికె వారలతోడ ని ♦ ష్పృగిదినపుడు॥ ౬౮౮

మ॥ వినుఁడీమీఁదు మత బయుక్తమగు నః ♦ ర్వంజూడ భూతాద్యుపా
సనవిప్రాళికిఁ జెప్పఁగాఁ బడమి వే ♦ సర్వంసహానిష్ఠభూ।
తని కాయంబుఁ దొలంగుఁగాత నొగినం ♦ తంబందఁగాతన్నివా।
జ్ఞను విష్ణుపద భూతరాజియను భా ♦ స్వద్వ్యక్తిం జేసియున్

శా॥ కానన్భ్రష్టతఁ గూర్చు నాచరణమిం ♦ కన్వీడి మీరెల్లనెం।
తేనిన్ముద్ధతఁ గ్రాలునవ్వయము భ ♦ వ్యైషాస్యుత్రై చేరి భూ।
ర్యానందంబున సల్పుఁడయ్య నిజవ ♦ ర్ణాశ్రాంబులౌ కర్మము।
ల్కానం డెవ్వఁడు స్వకర్మహీనుఁడు గతిం ♦ గాదేధరామండలిన్॥

మ॥ అనుచు న్సంయమి నేత తాఁ దెలుప వా ♦ రాలించి యాశంకరా।
ర్యుని పాదాంబు భవద్వయంబునకు భ ♦ క్త్యార్ద్రస్వాలంబైనబు।
ద్ధిని నంతం బ్రణమిల్లి పొల్పిరి వెస ♦ న్దివ్యత్స్వకర్మానుర।
క్తిని బంచార్చనసక్తి నెంతయును నం ♦ తేవాసిమూర్ధన్యులై॥

ఆచార్యుండు పశ్చిమాంభోనిధి ప్రాంతముం జేరుట.

శా॥ ఆయాచోటులనుండు భూసురుల న ♦ త్యంతంబుఁ బాషండులన్
ధీయుక్తుం డగు నయ్యతీంద్రుఁ డిటు వా ♦ దివ్రాత దర్పఘ్నుఁడౌ

